ఓమ్

# శ్రీమద్భగవద్గీత

మూలము :

సర్వశాస్త్ర నిష్ణాత, విపశ్చిద్వరేణ్య

## పండిత శ్రీ ముక్తిరామోపాధ్యాయ

విరచిత భాష్యోపేతము



అనుకృతి

## పండిత గోపదేవ

విరచిత టీకా తాత్పర్య వివరణము -

అవతారవాద సంయుతము



ప్రకాశకులు :

## ఆర్యసమాజము-కూచిపూడి

అంబాదర్శన గ్రంథమాల - 10
చతుర్థ సంస్కరణము

వెల - రూ.25.00
ప్రతులు - 2000



శుక్ల - మార్గశిరము
డిసెంబరు 1989
వి.శ. 2046



ప్రతులకు :

1) ఆర్య సమాజము, కూచిపూడి, తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా - 522313
2) మాశెట్టి వేంకటేశ్వర రావు, 3-3-738, కంచరి బజార్, సికింద్రాబాద్.

సర్వస్వామ్యములు -ఆర్యసమాజము, కూచిపూడి,
ముద్రణ : గోల్డెన్ ప్రెస్, గౌలిగుడ, హైదరాబాద్.

# అంబా దర్శన గ్రంథమాల

మహారాజపోషకులు :- రు ౩౦౦౦లు అంతకుమైన నిచ్చువారు

రాజపోషకులు :- రు ౧౫౦౦లు ,, ,,

పోషకులు :- రు ౫౦౦లు ,, ,,

మహారాజపోషకులు :

౧ శ్రీమతి కొత్తపల్లి యామినీదేవి కూచిపూడి

౨ శ్రీ బెల్దె జగదీశ్వరయ్య శ్రేష్ఠి సికిందరాబాద్

౩ శ్రీ మాశెట్టి వేంకటేశ్వరరావు సికిందరాబాద్

౪ శ్రీ కొసరాజు మాధవయ్య తెనాలి

౫ డా. శ్రీ వై. వి. సుబ్బారావు, సరోజనీదేవి గుంటూరు

౬ శ్రీ గ్రంధి కామరాజు విజయవాడ

౭ శ్రీ కావూరి జయచంద్రవర్మ కూచిపూడి

౮ శ్రీ చదలవాడ అచ్చేశ్వరరావు, రాజ్యలక్ష్మి ,,

౯ శ్రీమతి చదలవాడ లక్ష్మమ్మ ,,

౧౦ శ్రీ మల్లారెడ్డి గురవారెడ్డి తూములూరు

౧౧ శ్రీ చంద్రయ్య & సన్సు—అల్వాల సికిందరాబాద్

౧౨ శ్రీ యం. యస్. బాలకృష్ణ, సుధాకర్ ,,

౧౩ శ్రీ ఉప్పల రాజేశ్వరరావు ,,

౧౪ శ్రీ కొసరాజు తిరుమలరావు, సూర్యకుమారి కురుమద్దాలి

౧౫ శ్రీ గట్టె సుబ్బారావుగుప్త, నాంచారమ్మ గుంటూరు

౧౬ శ్రీ జక్కిడి సీతారామరెడ్డి, సీతాఫలమండి సికిందరాబాద్

౧౭ శ్రీ తుమ్మల వల్లభయ్య కూచిపూడి

౧౮ శ్రీ నోముల స్వామిదాస్, శ్రీ శ్రీపతి వెంకటరావు సికిందరాబాద్

౧౯ శ్రీ వాసంశెట్టి రామకృష్ణారావు వలసపాకల

౨౦ శ్రీ జొల్లేపల్లి సత్యనారాయణ గుంటూరు

రాజపోషకులు :-

౧ శ్రీ కావూరి సంగయ్య కూచిపూడి
౨ శ్రీ జె. వెంకటరావు వరంగల్
౩ శ్రీ బి. శంకరలాల్ హైదరాబాద్
౪ శ్రీ యలవర్తి రామకోటయ్య సీతారత్నం కూచిపూడి
౫ శ్రీ కుమ్మరి పోచయ్య సికిందరాబాద్
౬ శ్రీమతి బొర్రా వేంకటరత్నమ్మ కూచిపూడి
౭ శ్రీ యం. భూపతిరావు ప్రజ్ఞాపురం హైదరాబాద్
౮ శ్రీ సరిదె శ్రీనివాసరావు, కనకలక్ష్మి రేలంగి గోదావరి
౯ శ్రీ వి. యస్. గుప్త కొత్తగూడెం

పోషకులు :-

౧ శ్రీ మేకా రామకృష్ణయ్య కూచిపూడి
౨ శ్రీ జాస్తి వెంకటప్పయ్య, తులశమ్మ ,,
౩ శ్రీమతి దాసరి రామకోటమ్మ ,,
౪ శ్రీమతి కన్నెగంటి శైలసుత నవరత్నకుమారి ,,
౫ శ్రీ కోట్ల రమణారెడ్డి సికిందరాబాద్
౬ శ్రీ పోలం వీరయ్య సోదరులు ,,
౭ శ్రీ కోడూరి సుబ్బారావు, సీతాఫలమండి ,,
౮ శ్రీ దుర్గా సత్యనారాయణ, కృష్ణవేణి తణుకు
౯ శ్రీ కావూరి శివరామయ్య మోపిదేవి
౧౦ శ్రీ గడ్డిపాటి వేంకట కృష్ణయ్య అమృతలూరు
౧౧ శ్రీ చుండూరి శ్రీహరిరావు, శాంతకుమారి గుంటూరు
౧౨ శ్రీ మల్లాది సూర్యనారాయణమూర్తి రాజంపేట
(తూ॥గో॥జ)

# విషయ సూచిక

# సంపాదకీయము

ఆర్య సమాజము మత సంస్థకాదు వైదికధర్మములను ప్రజలలో వ్యాపింపజేయుట కేర్పడిన ధర్మ సంస్థ. దీని మూలపురుషులు మహర్షి శ్రీమద్దయానంద సరస్వతీస్వామివారు.

అవిద్యను తొలగించి వైదికధర్మమును మానవ సమాజమున పునరుద్ధరించుటకు ఈ సమాజము క్రీ. శ. 1 40 లో కూచిపూడిలో స్థాపింపబడినది. తదను కూలముగ ప్రాచీన ఆర్షసాహిత్యమును తెలుగున నచ్చొత్తించి పాఠకుల కందజేయుచున్నది. ఈ సమాజమునకు గ్రంథ రచనకు, ప్రచురణమునకు పండిత గోపదేవ్ గారు చేయు సహకార మమూల్యము.

కూచిపూడి సమాజమింతవఱకు 60 గ్రంథములు ముద్రింపగలిగినది. ఇంకను అముద్రితములు 5 కలవు. సుమారు 20 గ్రంథములు పునర్ముద్రితములు కావలసియున్నవి. ఇది చతుర్థ ముద్రణము.

ఈ భగవద్గీత సంస్కృత సాహిత్యమున ప్రసిద్ధిగనిన గ్రంథము. త్రిమతాచార్యులు దీనికి వ్యాఖ్యానములు వ్రాసి ప్రస్థానత్రయమున నొకటిగ దీనిని పరిగణించుచు తమ తమ మతముల కనుకూలముగ ప్రచారమొనర్చిరి. వారి అనుయాయులు ఇప్పటికిని నట్లే ప్రచార మొనర్చుచున్నారు.

పరస్పర విరుద్ధములగు వీరి సిద్ధాన్తముల కనువుగ యోగి రాజైన శ్రీకృష్ణుడెట్లుపదేశించును ? దాని సంపాదకుడైన వేదవిదవతంసుడగు వ్యాసమహర్షి అవైదిక విషయములనెట్లు ప్రతిపాదించునను విమర్శనా బుద్ధితో పండిత శ్రీముక్తిరామోపాధ్యాయులవారు దీనిలో వైష్ణవ సంప్రదాయమునకు సంబంధించిన శ్లోకము లెక్కుడుగ చేర్చబడినట్లు గుర్తించి, "మహాభారత కారుడు మూలమైన వ్యాస రచిత గీతయందు పరివర్తన మేమియు చేయలేదని చెప్పశక్యము కా"దనుచు గీతారహస్యములోని 525 వాక్యము ద్వారా వెల్లడించిరి. అంతియే కాక దార్శనిక దృష్టితో

గీతను ఆద్యంతము పరిశీలించి, ప్రక్షిప్తముల నిరూపించి, వానిని తొలగించి మిగిలిన 362 శ్లోకములను విషయము ననుసరించి పదునెనిమిది అధ్యాయములుగ విభజించి వ్యాఖ్యానించిరి. ఇందు ప్రతిపాద్య విషయము నిష్కామ కర్మాచరణముగా దీనిమూలమున వివరించిరి.

దుష్టశిక్షణ - శిష్టరక్షణరూప క్షత్రియోచిత యుద్ధకర్మ మాచరింపక వెనుకాడిన అర్జునునకు ఆత్మానాత్మ వివేకము మూలమున మోహము తొలగించి కర్తవ్య కర్మాచరణమునకు ఉన్ముఖుని చేయుటకు గీతాబోధ కావింపబడినది. ఫలాపేక్షతో చేసిన కర్మలు వ్యక్తికి బంధన హేతువులనియు, నిష్కామకర్మములు బంధన హేతువులు కానేరవనియు గీతలో ప్రధానముగా బోధింపబడినది. "కుర్వన్నేవేహ కర్మాణి .... ........ అను యజుర్వేదమంత్రము ఈ విషయమునే వెల్లడించుచున్నది.

గీతాశ్రవణమువలన అర్జునునకు మోహము తొలగుటచే సందేహము తీరి, కర్మ స్వభావము గుర్తెఱిగి 'కరిష్యే వచనం తవ' అని యుద్ధమునకు సిద్ధపడెను.

పాఠకులు శ్రద్ధతో శ్రీముక్తి రామోపాధ్యాయుల కృషిని గుర్తించి, పండిత గోపదేవ్‌గారు రచించిన అవతారవాదముతో బాటు తాత్పర్య వివరణములను పఠించి భగవద్గీతలోని సారాంశమును గ్రహించి ప్రయోజనమును పొందుదురని విశ్వసింతును.

— ఆరమండ్ల వెంకయార్య

# విజ్ఞప్తి

శ్రీమద్ భగవద్ గీత సంస్కృత సాహిత్యమున మిక్కిలి ప్రసిద్ధి గనిన గ్రంథము. భారతీయ భాషలలోనేకాక, యితర పాశ్చాత్య,పౌర్వాత్య దేశభాషలలో కూడ నీ గ్రంథము అనువదింపబడియుండుట లోకవిదితము.

భారతీయులలో అద్వైతాది సంప్రదాయ ప్రవర్తకులైన యాచార్యు లీ గ్రంథమునకు భాష్యములు రచియించి, దీని మహత్వమున కవధులు లేనట్లు చేసియున్నారు. అత్యంత ప్రాచీనములై, భారతీయ మహర్షుల దృష్టిలో నీశ్వరీయములై శ్రీ శంకరాద్యాచార్యులకును స్వతః ప్రమాణము లైన వేదశాస్త్రములను కూడ నీ భగవద్గీత సాంప్రదాయకులచే విస్మరింప జేసినది. వారికి భగవద్గీతయే పరమ ప్రమాణమైనది. ఈ గ్రంథమునకు ఉపనిషత్స్థాన మొసంగి, శ్రీ శంకరభగవత్పాదులు దీని మూలమున నద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించి యున్నారు. కర్మ సంన్యాసము మోక్షమునకు సాధన మని నొక్కి చెప్పియున్నారు. ప్రపంచము మిథ్య-సత్తారహితము-ఉనికి లేనిది యనియు భాషించియున్నారు.

శ్రీ రామానుజాచార్యులు గీతకు ప్రతిపాద్య విషయము విశిష్టాద్వైతమేకాని, యద్వైతము కాదని భాష్యము చేసియున్నారు.

శ్రీ మధ్వాచార్యులు గీతకు ప్రతిపాద్య సిద్ధాంతము ద్వైతమేకాని, అద్వైత విశిష్టాద్వైతములు కావని స్పష్టముగా నుడివిరి.

సాంప్రదాయకు లీ యాచార్యుల భాష్యములను పరమప్రమాణములుగ నంగీకరించి, వారు ప్రతిపాదించిన సిద్ధాంతముల నంగీకరించుచు భగవద్గీత నెంతో యాదరించుచున్నారు. నిత్యము పఠించుచున్నారు. అర్థము తెలియకున్నను, సిద్ధాంతము బోధపడకున్నను, భగవద్గీతలో నొక యధ్యాయముకాని, యొక శ్లోకముకాని, కనీసము శ్లోకమున నొక పాదముకాని నోట నుచ్చరించిన మాత్రముననే తరింపగల మనియు, జన్మజన్మాంతరము

లందు జేసిన పాపజాల మంతయు పటాపంచ లగుననియు విశ్వసించు చున్నారు. అందువలననే గీతామాహాత్మ్యమును వర్ణించుచు,

'గీతా సుగీతా కర్తవ్యా,
కిమన్యైః శాస్త్రవిస్తరైః'

'గీత యొక్కటి బాగుగ చదివిన చాలును. ఇతర శాస్త్రజాలముతో నేమి ప్రయోజనము?' అని యెవరో సూత్రించి యున్నారు. ఇట్టి విశ్వాసము భారతీయులలో ప్రబలినకొలది వేదాది తత్త్వబోధక శాస్త్రముల యధ్యయన మడుగంటినది. తత్ఫలితముగా నేటి భారతీయ విద్వాంసులలో తత్త్వదృష్టి లోపించినది.

భారతీయులకు ప్రాచీన కాలమునుండియు వేదములు తత్త్వ ప్రతిపాదక గ్రంథములు; ధర్మజిజ్ఞాసువులకు పరమప్రమాణములు.

'ధర్మం జిజ్ఞాసమానానాం
ప్రమాణం పరమం శ్రుతిః'—మనువు.

వేదచోదిత ధర్మము భారతీయులకు ఆచరణీయము. నిషిద్ధకార్యము అనాచరణీయము. ధర్మప్రతిపాదనముననేమి, తత్త్వమును బోధించుటలో నేమి వేదము స్వతః ప్రమాణము. మహర్షి ప్రణీతములైన యితర మన్వాది స్మృతులు, భారతేతిహాసములు, సాంప్రదాయిక విద్వత్ప్రచితము లైన పురాణాదులు నన్నియు క్రమముగా వేదావిరుద్ధములుగ నున్నంతవఱకు ప్రమాణములు. అందువలన నవి పరతఃప్రమాణములుగా నంగీకరింపబడుచున్నవి.

ఈ దృష్టి బహుకాలము భారతీయ విద్వాంసుల కంగీకృతమై యుండెను. కాని, రానురాను సంస్కృత భాషా ప్రచారము సన్నగిల్లి; కావ్యనాటకములు మాత్రము చదివి, శాస్త్రపఠనము చేయక, భాగవతాది నవీన గ్రంథములకు పురాణ నామకరణమొనర్చి, వానిని చెప్పుకొని యుదర

పోషణము చేసికొనువారే సంఘమున విద్వాంసులయి సమ్మానింపబడసాగిరి నాటి నుండియే భారతము కూడ వేదపద వాచ్యమైనది. 'భారతః పంచమో వేదః-భారతము పంచమ వేదము'అను సూక్తి ప్రజలలో వ్యాప్తిచెందినది. ఇట్లు భారతీయులలో తత్త్వశాస్త్రాధ్యయనము లేకపోవుటయే కాక, శృంగారాది రస భూయిష్ఠ కావ్యనాటక పఠన మెక్కువ యైనందున భోగలాలసతో కూడిన జీవనము ప్రబలిపోయినది. నాటకాలంకారాంత సాహిత్యము నేర్చిన విద్వాంసులు భాగవతాది పురాణములు చెప్పుకొనుచు, వాని మూలముననే తత్త్వములు ప్రజలకు బోధింపదొడగిరి. ఇక మూఢ విశ్వాసములు ప్రజలలో నెలకొనక తాత్త్వికదృష్టి యెట్లు కలుగును ?

ఇట్లంధకార బంధుర జీవనము గడుపుచున్న భారతీయుల పూర్వ పుణ్య ముదయించినట్లు పందొమ్మిదవ శతాబ్దమున గుజరాత్ ప్రాంతమున నౌదీచ్య బ్రాహ్మణకులమున నొక బాలు డుదయించెను. అతడు పందొమ్మిది యేండ్ల ప్రాయముననే సర్వసంపదలతో కూడిన గృహమును, తల్లి దండ్రులను విడచి సంన్యాసియై, యేబదితొమ్మిదియేండ్లు అఖండ బ్రహ్మచర్యమును పాలించి, సర్వశాస్త్ర పారంగతుడై మహర్షి యన నొప్పి భారతీయులకు మరల నొకసారి తత్త్వదృష్టి నొసంగియున్నాడు. అతడే దయానందుడు. విస్మరించిన వేదములను మరల భారతీయుల స్మరణకుదెచ్చి, 'యథార్థమును గుర్తించుటకు వేదాధ్యయనము చేయుడు, కావ్యాలాపములను వర్జించుడు, భాగవతాదులు పురాణములు కావు, అవి నవీనములు. వానిలో తత్త్వమాపంతయే యున్నది. అసత్యము లనల్పములుగా నున్నవి: కావున వానిని జదువకుడు. వేదేతరములైన యుపనిషదాది గ్రంథములన్నియు వేదానుకూలముగ నున్నంతవఱకే ప్రమాణములుగ నంగీకరింపుడు. ఇతర మప్రమాణమని గ్రహింపు' డని యుద్బోధించి యున్నాడు. అనార్ష గ్రంథములను జదువరాదనియు శాసించియున్నాడు.

దయానంద మహర్షి పద చిహ్నములలో నడచి, యాతని యుద్బోధనల నంగీకరించి వేదార్థములను గ్రహించి వైదిక జీవనమును గడపిన

మహా విద్వాంసు లీ శతాబ్దమున ననేకు లుండిరి. వారిలో నగ్రగణ్యులు పండిత ముక్తిరామ ఉపాధ్యాయులు. వీరును యావజ్జీవము నైష్ఠిక బ్రహ్మ చర్యమును పాలించిన మహాధీరులు. వేదవేదాంగముల నధ్యయనము చేసి వారణాసి పండిత పరిషత్తులలో ప్రతిష్ఠం బొందిన మహాధీశాలురు - సర్వ తంత్ర స్వతంత్రులు. ప్రాచీన దర్శనముల నన్వయించుటలో వారి కాలమున వారికి దీటయిన విద్వాంసు లింకొకరు లేకుండిరి. వారి జన్మస్థానము ఉత్తర ప్రదేశమున నొక కుగ్రామము. విద్యాధ్యయన స్థానము వారణాసి. ప్రబోధ ప్రచార స్థానము పంజాబు - హిమాలయ పర్వతప్రాంత భూమి. స్వర్గీయ దర్శనానందస్వామి స్థాపిత [పొటోహార్-రావల్‌పిండికి 40 మైళ్ళ దూరము (పాకిస్తాన్)] గురుకులమునకు ఆచార్యులుగా నుండి, వీరు బహువర్షములు గురుకులమును సర్వము తామే నిర్వహించిరి. వైదిక సిద్ధాంత ప్రబోధకుల నెందఱినో సిద్ధముచేసిరి. తుదకు సర్వసంగ పరిత్యాగమొనర్చి సన్న్యాసులై, ఆత్మానంద సరస్వతీ నామమునం బరగి కొంతకాలము ముముక్షువులకు మార్గదర్శకులై క్రీ. శ. 1960 లో పరమపదము నందియుండిరి.

వీరే ప్రప్రథమమున భగవద్గీతలోని యవైదిక విషయములను బోధించు శ్లోకములను దొలగించి, వైదిక సిద్ధాంతములను మాత్రము బోధించు శ్లోకములే వ్యాసరచితములుగా నెంచి, వాని తత్త్వార్థములను తెలుపుచు నీ భాష్యమును రచియించి ప్రకటించియున్నారు. ఉత్తర భారత మున నీ గ్రంథము పండితుల దృష్టి నెంతగానో యాకర్షించినది. సాంప్ర దాయకులైన విద్వాంసులలో ననేకు లీ గ్రంథమును జూచి హర్షించి, శ్రీ పండిత ముక్తిరామ - ఉపాధ్యాయులకు తమ కృతజ్ఞతను వెల్లడించిన వారును గలరు. అంధ విశ్వాసము కనుల గప్పగా ఉపాధ్యాయుల భాష్య గత రహస్యమును గుర్తింపజాలక, ద్వేషమును వెలిబుచ్చి తమ యంతఃకరణములను మలినము చేసికొనిన మహానుభావులును పెక్కురు లేక పోలేదు. కాని,

"నిందంతు నీతినిపుణా యది వా స్తువంతు
లక్ష్మీః సమావిశతు గచ్ఛతు వా యథేష్టం
అద్యైవ వా మరణమస్తు యుగాంతరే వా
న్యాయ్యాత్పథః ప్రవిచలంతి పదం న ధీరాః."

ధీరులు పరుల రాగద్వేషములకుగురియై సత్యమును బ్రకటింప వెఱవరుగదా!

పాఠకులారా! పండిత ప్రవరులైన శ్రీ ముక్తిరామ - ఉపాధ్యాయులకు అంతేవాసి నగు భాగ్యము నాకు లభించినదని చెప్పుటకు గర్వించుచున్నాడ. వారి పాదసేవ చేసి యొకింత తత్త్వదృష్టి నలవఱచుకొను నవకాశము లభింపజేసిన పరమేశ్వరున కనేక ధన్యవాదములు. గురువులు ఆర్యభాషలో వ్రాసి ప్రకటించిన భగవద్గీతను తెలుగున నా నేర్చినవిధమున ననువదించి మీ కందజేయుచున్నాడ. పుస్తకములోని గుణదోషములను గుఱించి నేనిట వ్రాయదలచనైతి. ఇట్టి పుస్తకము వ్రాయవలసిన యవసరమేల కలిగినదో మూల గ్రంథకర్త వ్రాసిన ప్రస్తావనాదులను జదువుటవలన స్పష్టము కాగలదు.

తెలుగు భాషలో భగవద్గీత యెన్నియో రూపములలో నిదివఱకే ప్రకటింపబడి యున్నది. మూలమును పద్యబద్ధము చేసినవారును పెక్కురున్నారు. శ్లోకముల నట్లేయుంచి వానికి తాత్పర్యమును తెలుగున వ్రాసిన వారును పలువురున్నారు. ఆచార్యుల భాష్యార్థములను తెలుగున వ్రాసి ప్రకటించిన గ్రంథములును మిక్కిలిగ లభించును. ఎన్ని యున్నను, నేను మీ కందజేయు నీ భగవద్గీతలో క్రొత్తదనము జూడగలుగుదురు నేడు ప్రచారములో నున్న భగవద్గీతలో 700 శ్లోకములున్నవి. ఉపాధ్యాయులీ యేడువందల శ్లోకములనుండి 338 శ్లోకములు వ్యాసరచితములు కావని యెంచి, తొలగించియున్నారు. ఆ శ్లోకములు వ్యాసమహర్షికి తరువాతివారు తమ మతములను గీతమూలమున ప్రచారము చేసికొనుట కనువుగ నందు చేర్చియుందురని ఉపాధ్యాయుల యభిప్రాయము. ఆ శ్లోకములకు 'ప్రక్షిప్త

ములు' - చేర్పబడినవి అని పేరిడి, వానిని తొలగించి మిగిలిన శ్లోకము లను విషయానుగుణముగ పదునెనిమిది యధ్యాయములుగ విభజించి యున్నారు. శ్లోకములకు ప్రతిపదార్థము వ్రాసియున్నారు. ఈ శ్లోకములకు తాత్పర్యము వేరుగ వ్రాయలేదు.

మూలగ్రంథకర్త ప్రచలిత గీత నుండి 338 శ్లోకములు ప్రక్షిప్త ములు (ఇతరులు చొప్పించినవి) అని తొలగించియున్నారు. అట్టి శ్లోక ములు ప్రతి యధ్యాయమునందు నున్నవి. ఉపాధ్యాయు లా శ్లోకములు ప్రక్షిప్తములనుటకు తగిన కారణముల జూపుచు, గ్రంథమున నొక భూమిక వ్రాసియున్నారు. చదువరులు దానిని జదువుటయే తడవుగ నీ గ్రంథము ప్రయోజనమును గుర్తింపగలరు. భగవద్గీతను ఆద్యంతము బాగుగ దార్శ నిక దృష్టితో బరిశీలించి, సాంప్రదాయకులు తమతమ సిద్ధాంతముల పోషణ కనువగు శ్లోకముల నే యధ్యాయమున నెన్నింటిని జేర్చిరో వానిని గుర్తిం చుటకు తగిన కారణములను జూపుచు వానిని పుస్తకమునుండి తొలగించి యున్నారు. పాఠకులు హేతుబుద్ధితో నీ పుస్తకమును జదివి, ఉపాధ్యాయుల పరిశ్రమను గుర్తింపగలరని ఆసించుచున్నాడ.

## అవతార వాదము

ప్రపంచమానవులు ఆస్తికులు నాస్తికలు నని ఇరుతెగలుగ వ్యవహ రింప బడుచున్నారు. ఆస్తికు లీ సృష్టికి కర్త దేవుడొకడున్నాడని యంగీక రింతురు. నాస్తికు ల ట్లంగీకరింపరు.

నేటి భారతమున వసించు మానవులలో ననేక మతములకు జెందిన వారున్నారు. అందు వైదిక మతావలంబులు బహు సంఖ్యాకులు. తదుపరి మహమ్మదీయులు, క్రైస్తవులు, జైనులు, బౌద్ధులు క్రమముగా నొకరి కంటె నింకొకరు అల్పసంఖ్యాకులుగా నున్నారు. వీరిలో వైదికులు, మహమ్మదీయులు, క్రైస్తవులు ఆస్తికులు, జైన బౌద్ధులు నాస్తికులు,

ఆస్తికులు దేవుని సృష్టికి కర్తగా, ధర్తగా, సంహర్తగా నంగీక రింతురు. అందు వైదికులు దేవుని నొక పరమ సూక్ష్మ తత్త్వముగా నంగీకరింతురు.

వేదమతము ప్రపంచ మతములలో ప్రప్రథమము; అతిప్రాచీనమును' ఇతర బౌద్ధ జైన క్రైస్తవమ హమ్మదీయాది మతములన్నియు నర్వాచీనములు. మూడువేల సంవత్సరములకు పూర్వ మియ్యవి లేవు.

వేదమత కాలము నిర్ణయింప నలవికాదు. ఎందఱో మతిమంతు లెంతగానో ప్రయత్నించియు వేదకాలమును నిర్ణయింప జాలకపోయిరి. ఇరువదివేల సంవత్సరములకు బూర్వమే వేదసాహిత్యమున్నట్లు చారిత్ర కులు కొంద ఱూహింపగలిగిరి. కాని సృష్టి యేర్పడిననాటినుండియు - దాదాపు రెండువందలకోట్ల సంవత్సరములనుండియు వేదములు మానవ సమాజమున ప్రచారములో నున్నట్లు వైదికులు నుడువుదురు.

ఈ వేదమతము ననుసరించువారు (ప్రస్తుతము హిందువులని పేర్కొనబడువారు) దేవుడనున దొక విశిష్ట పదార్థమనియు, నయ్యది యీ సృష్టికి కర్త - చేతన నిమిత్త కారణము అనియు నంగీకరింతురు. అదియే యీ ప్రపంచమున కాధారముగానుండి దీనిని నడుపుచుండును. ఒకప్పు డీ ప్రపంచమును నశింపజేయును. వేదశాస్త్రములం దీ పదార్థ మిట్లే వర్ణింపబడినది. తత్త్వజ్ఞులు సంగ్రహముగా నీ పరతత్త్వమునిట్లు చెప్పుదురు.

ఈశ్వరుడు (దేవుడు) సచ్చిదానంద స్వరూపుడు. నిరాకారుడు, సర్వశక్తిమంతుడు, న్యాయకారి, దయాలుడు, అజన్ముడు, అనాద్యనంతుడు, నిర్వికారుడు, అనుపముడు, సర్వాధారుడు, సర్వేశ్వరుడు, సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, అజరుడు, అమరుడు. అభయుడు, నిత్యుడు, పవిత్రుడు, సృష్టి స్థితి లయములకు కర్తయునై యున్నాడు. అతడే మానవులకు ఉపాస్య దేవుడు.

ఇట్టి విలక్షణ పదార్థమింకొకటి యీ బ్రహ్మాండమున లేదు. దీనిని శాస్త్రములం దనేక నామములతో బేర్కొని యున్నారు. ఆ నామముల నన్నింటి నొక్కచో గణించుట సుకరము కాదు.

బ్రహ్మము, విష్ణువు, శివుడు, ఈశ్వరుడు, మహాదేవుడు, పరం బ్రహ్మ, పరమాత్మ, ఇంద్రుడు, చంద్రుడు, రుద్రుడు, మిత్రుడు, సూర్యుడు. వరుణుడు, నారాయణుడు, శ్రీ, లక్ష్మి, సరస్వతి, గోవిందుడు, భగవంతుడు మున్నగు నామములన్నియు నా పరతత్త్వమును బోధించునవియే. కావుననే ఋగ్వేదము.

"ఏకం సద్ విప్రా బహుధా వదంతి
ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహుః" రని వర్ణించినది.

కాని, కాలము గతించినకొలది మానవులలో వేదప్రచారము సన్నగిల్లి, వేదార్థములను విస్మరించుటచే వేదమతావలంబులలో శైవ వైష్ణవ శాక్తాది నామములతో నానావిధ సంప్రదాయములు ప్రబలినవి. ఇట్లే అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతము మున్నగు సంప్రదాయములు కూడ శ్రీ శంకరస్వామి మున్నగు నాచార్యులచే నిటీవల నెలకొల్పబడుట ఎల్ల రెఱిగిన విషయమే.

భారతదేశమున నీ సంప్రదాయము లేర్పడిన తదుపరి దేవుని స్వరూప లక్షణములను సరిగా తెలిసికొనజాలక, ఆకారములేని యీ పరమ సూక్ష్మ తత్త్వమునకు పలువిధములయిన మానవాద్యాకారములను గల్పించి వస్తు స్వరూపమును విస్మరించిరి. దేవతత్త్వమునకు గల విభిన్న విష్ణ్వాది నామార్థములను గ్రహింపజాలక యొక్కొక్క నామమున కొక్కొక్క యాకృతిని గల్పించి ప్రజలలో నానావిధ దేవతావాదమును ప్రచారమొనర్చిరి. దేవుని పేరిట శైవ వైష్ణవ శాక్తాది సంప్రదాయములు ప్రబలుటయేకాక, ఒక సంప్రదాయప్రజలు మఱియొక సంప్రదాయ ప్రజలను, వారి దేవతను సహింపక ద్వేషించుచు నిందించి తిరస్కరింపసాగిరి. ఇట్లు పరస్పర కలహములకు

గురియై జనులు నానావిధ దుఃఖములకు లోనై యుండుట చరిత్ర నెఱిగిన వారికి తెలియని విషయము కాదు.

ఇట్లు వేదమతావలంబు లయినవారి యాస్తిక్యము వికృతరూపము ధరించినది. ప్రస్తుత మాస్తికులలో పెక్కుమందికి ఆస్తిక్యమన నేమోకూడ తెలియదు. కావుననే నేటి వైదికమతస్థు లెల్లరు - పండితులు పామరులు- విగ్రహారాధనముచేయుటయే ఆస్తిక్యమనియు, అది చేయకుండుట నాస్తిక్య మనియు నెంచుచున్నారు. వారి దృష్టిలో గుడికి వెళ్ళువాడు ఆస్తికుడు, వెళ్ళనివాడు నాస్తికుడు.

నేడు హిందువులనబడు వారిలో ఆర్యసామాజికులు, ఇతర భౌతిక వాదులు కాక మిగిలిన వారెల్లరు విగ్రహారాధకులే; జడపూజకులే; సంప్ర దాయ ప్రవర్తకులైన శ్రీ శంకరాది మఠాధిపతులు కూడ నిత్యము విగ్రహ ముల నారాధించుట చూడనగును. కావుననే వీరెల్లరు ఆర్యసామాజికులను నాస్తికులందురు. విగ్రహారాధనము వేదవిహితముకాదు; కావున వైదికులు విగ్రహారాధనము చేయరాదని ఆర్యసామాజికు లందురు. శాస్త్రములందు వర్ణింపబడిన ఆస్తిక్య లక్షణము విస్మరించి విగ్రహముల బూజింపకుండు టయే నాస్తిక్యమని యెంచుచున్నారు. వేదము లీశ్వరీయము లని యంగీక రించుట, జీవేశ్వరుల నంగీకరించుట, జీవునకు జన్మజన్మాంతరముల నంగీక రించుటయు ఆస్తిక్య మను మాటయే వీరు మఱచినారు. ఇంతేకాక గుడికి వెళ్ళి విగ్రహముల బూజించుటయే ఆస్తిక్యమని నమ్ముచున్నారు. కావుననే నేటి హిందువులకు బౌద్ధ జైనులు నాస్తికులనియు తెలియదు. వారు గుళ్ళు కట్టి వారి గురువుల బొమ్మలను బూజింతురు. వారు సృష్టికర్త నంగీక రింపరు. అందువలన వారు నాస్తికులని గుర్తించు హిందువు లతి స్వల్ప సంఖ్యలో నుందురు.

వేదప్రచారము మాని, సాంప్రదాయకు లెల్లరు వాని స్థానమున విష్ణ్వాది బురాణములను బ్రచారము చేయుచు, వేదవిషయములనే పురాణ

ములు చెప్పుచున్నవని నుడువుచు జనులను వేదములకు దూరమొనర్చిరి. అవైదికాచారములను వేదవిహితములనుగా జెప్పి జనులచే వాని నాచరింప జేయ దొడంగిరి.

నేటి హిందువులకు దేవాలయములు, అందలి పూజలు లేకున్న హిందూమతమే యుండదను విశ్వాసము ప్రబలమైనది. దేవాలయములే హిందూ సంస్కృతికి పట్టుకొమ్మ లయినవి. వానిని బలపఱచు కొనుటకే దేవున కవతారములు, ఆకారములు కల్పింపబడినవి.

అద్వైతాది సంప్రదాయములను నెలకొల్పిన శ్రీ శంకరాద్యాచార్యులు తమ సాంప్రదాయిక సిద్ధాంతములను బోధించుటకు వ్యాసరచిత మహాభారత భాగమగు భగవద్గీత, ఈశ కేనాది దశైకాదశోపనిషత్తులు, వ్యాసరచిత బ్రహ్మసూత్రములు (వేదాంత దర్శనము) ఆధారములుగా గ్రహించి యుండిరి. ప్రాచీన వేదమతమును బోధించుటకు బదులు వేదమతము నుద్ధరించుచున్నామను నెపముతో నీ యాచార్యులు భగవద్గీత నూతగా గొని అద్వైతాది స్వకల్పిత మతములను ప్రచార మొనర్చి యున్నారు.

పై మూడు గ్రంథములకు ప్రస్థానత్రయమని నామకరణ మొనర్చి వాని మూలమున శ్రీ శంకరులు అద్వైతము (జీవబ్రహ్మైక్యము) ను, శ్రీ రామానుజులు విశిష్టాద్వైతము (చిదచిద్విశిష్టంబ్రహ్మ) ను, శ్రీ మధ్వాచార్యులు ద్వైతము (జీవేశ్వరులు భిన్నులు) ను ప్రస్తావించి యున్నారు. ఈ త్రివిధవాదములకు పైనజెప్పిన భగవద్గీతాది మూడు గ్రంథములే ప్రమాణములు. వేదములు కావు.

ఒకే గ్రంథము పరస్పర విరుద్ధములైన మూడు వాదముల నెట్లు బోధించును ? ఒక్క గ్రంథమున కొక్క ప్రతిపాద్య విషయముండుట యుక్తిసంగతము. పరస్పర విరోధము లేని యనేక విషయములను ఒక్క గ్రంథము బోధించుటలోను దోషముండదు. కాని భిన్న విరుద్ధ మతముల నొక్కగ్రంథ మెట్లు ప్రతిపాదించునో చదువరు లూహింతురు గాక !

భారతమున నీ యద్వైతాది సంప్రదాయములు ప్రబలిన నాటి నుండియు భగవద్ గీతా ప్రచారము మిక్కిలియైనది. ఆచార్యులెల్లరీ గ్రంథమునకు స్వ మతానుకూలముగ వ్యాఖ్యానములు, భాష్యములు వ్రాసి దీనిని ప్రచారము చేసియున్నారు. వేదములను జదువువారు గాని, వాని యర్థములను గ్రహించువారు గాని దేశమున నరుదైరి. ఎవరైన వేదాధ్యయనము చేసినవారున్నను దాని యర్థము నెఱుంగ యత్నింప మానిరి. కలికాలమున వేదార్థము నెఱుగగోరుట పాపముగా నెంచి దాని వంకకు బోరైరి. కావున వేదవిహితకర్మ లెయ్యవియో, నిషిద్ధకర్మ లెయ్యవియో జనులకు దెలుపువా రెవరు? రామాయణ మహాభారత భాగవతాది మహాకావ్యములే వేదములయినవి. వాని పఠనమే వేదపఠన మైనది.

ముఖ్యముగా భగవద్గీత నాధారము చేసికొని సాంప్రదాయకులు వేద విరుద్ధమైన అవతారవాదము నొకదానిని తమ తమ యనుయాయులలో మిక్కిలిగ వ్యాపింపజేసిరి. దేవుడు స్వభావతః నిరాకారుడు, జన్మరహితుడునైనను నత డప్పు డప్పుడు దేహధారియై మత్స్యాది జలచరరూపముననో, వరాహాది జంతురూపముననో, నరసింహాది జంతు మనుష్యోభయ రూపముననో, రామకృష్ణాది మానవ రూపముననో భూమియం దవతరించి శిష్ట రక్షణము దుష్టశిక్షణము చేయునని యీ సాంప్రదాయకులు గట్టిగా నమ్మసాగిరి. తన్మూలమున రామకృష్ణాది రూపములలో జడవిగ్రహములను బూజించుటయు వీరికి ముఖ్య ధర్మమైనది. ఈ విగ్రహారాధకులలో జడచేతన వివేకము కూడ లేదనుట యసత్యముకాదు. చేతనులగు తాము జడములను బూజించుటలో గల న్యూనతను గూడ గుర్తింపకున్నారు. ఆస్తికులు జడముల నుపాసించుట - కొలుచుట - నాస్తికత యనియు తెలియకున్నారు. జడపదార్థములు తమ కుపభోగ్యము లనియు నెఱుగకున్నారు.

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్ భవతి భారత।
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్"

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే."

'ధర్మమునకు హాని, అధర్మమునకు వృద్ధి కలిగిననాడు నన్ను నేను సృష్టించు కొందును. సజ్జనులను రక్షించుటకు, దుర్జనులను శిక్షించుటకు, ధర్మమును నెలకొల్పుటకు అప్పుడప్పుడు నేను పుట్టుదును - జన్మింతును.' అని కృష్ణుడు అర్జునునితో ననినట్లు భగవద్ గీతలోని పై శ్లోకముల కర్థము. ఈ శ్లోకార్థములను గ్రహించి గీతాభక్తు లెల్లరు దేవు దవతరించు నని నమ్ముచున్నారు. ఇవి కృష్ణుడు చెప్పిన మాటలుగా నెఱింగియు దేవు డవతరించు నని యంగీకరించుటలో గల రహస్యము నెఱుగజాలకున్నారు. వీరి దృష్టిలో కృష్ణుడే దేవుడు. అందువలన నట్లు భావించుచున్నారని చెప్ప వలయును. కాని వాస్తవమున దేవునిస్వరూపము వీరికి తెలియదు. గీతలోనే

"జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్ జ్ఞాత్వాఽమృత మశ్నుతే
అనాదిమత్ పరంబ్రహ్మ న సత్తన్నాన దుచ్యతే"

అని వర్ణింపబడిన పరతత్త్వ స్వరూపమును గుర్తింపక దేవుడు సృష్టిస్థితిలయములకు కారణ భూతుడను విషయము విస్మరించి, కృష్ణుడే దేవుడని యెట్లెంచెదరో బోధపడదు. దేవునకు దేహసంబంధ మండదను టయే గుర్తింపరు. సర్వవ్యాపకమైన దేవతత్త్వము దేహధారణ మెట్లు చేయును ? ఎందుకు చేయును ? అవతార పదమున కర్థమేమి ? అవతరింప కున్న దేవుడు దుష్టశిక్షణ శిష్టరక్షణ చేయలేడా ? అవతరించి సాధించిన దేమి ? మున్నగు విషయములను వీరు కారణయుక్తముగా నాలోచింపరు ఈ విషయముల నాలోచింపదలచియే నే నీ పంక్తుల నిట వ్రాయ నారంభించినాడ. విజ్ఞులు తత్త్వదృష్టితో వీనిని జదువుదురు గాక !

అవతారపదము భగవద్గీతలో గల యేడువందల శ్లోకములలో నెక్కడను గనిపింపదు. అవతార వాదమునకు మూలములైన పై రెండు శ్లోకములలో కూడ నీ పదములేదు. ఉన్నపదములు 'ఆత్మానం సృజామి'

'సంభవామి.' ఈరెండు పదములకు నన్ను బుట్టించు కొందును: నేను పుట్టుదును' అని యర్థములు. ఈ పదముల కీ యర్థములు చెప్పక అవతరింతును, ఆవిర్భవింతును అని క్రొత్త యర్థములు చెప్పుదురు. ఏల యీ యర్థములను జెప్పుదురు ? పుట్టుదునని యేల చెప్పరు ?

దేవుడు పుట్టును- దేవుడు జన్మించును- క్రొత్త దేహేంద్రియాదులను గ్రహించును, అని యాస్తికు లంగీకరింపరు అట్లే దేవుడు చచ్చును- మరణించును- ప్రాత దేహేంద్రియములను విడిచిపెట్టును, అనుట వారికిష్టము లేదు. ఈ జన్మ మరణములు జీవునకు గలుగును. అవియు జీవుడొనర్చు శుభాశుభకర్మలు కారణములుగా వాని ఫలముల ననుభవించుటకు గలుగును. దేవుడు శరీరాదులను జీవులకు కర్మఫలము లనుభవింపజేయ వీలగునట్లు సృష్టించునని భావము. కావున నట్టి జన్మమరణములు దేవునకుండవని ఆస్తికులకు తెలియును. అందువలననే 'సంభవామి' అని చెప్పిన కృష్ణుని పదమునకు పుట్టుదునని చెప్పక 'అవతరింతు' నని అర్థము చెప్పదొడగిరి.

అవతరించుట యనగా పైనుండి క్రిందికి దిగుట యని యర్థము. ఎత్తు ప్రదేశమునుండి నిమ్న ప్రదేశమునకు గదలి వచ్చుట యని భావము. కాబట్టి దేవు డవతరించు నన ఎక్కడనో యెత్తు ప్రదేశమునుండి క్రిందికి తాను లేనిచోటుకు వచ్చునని చెప్పవలసి వచ్చును. అదియెట్లు పొసగును ? దేవు డొకచోనుండి మఱియొకచోట లేడా ? దేవు డెల్లయెడల వ్యాపించి యుండు తత్త్వమని యెఱుగని పైదికు లెవ రున్నారు ?

'ఇందుగల డందులేడని సందేహమువలదు చక్రి సర్వోపగతుండు'

అని యెఱుగని వారెవరు ? బాలురుకూడ నెఱుగుదురు కదా ? అట్టియెడ దేవుడె ట్లవతరించును ? అంతట నుండు తత్త్వములో కదలిక, చలనము, గమన మెట్లు గలుగును ? ఇది తత్త్వ స్వభావమునకు విరుద్ధము కాదా ? ఇట్టి చిక్కు ప్రశ్నలనుండి తప్పించుకొనుటకే సాంప్రదాయకులు

దేవుని-వైకుంఠము, కైలాసము, సత్యలోకము నను నుత్తమస్థాన నివాసునిగా పురాణములందు వర్ణించియున్నారు.

పురాణములందును పైన జూపినట్లు దేవు డంతట నున్నాడను వర్ణనలు స్మరియింపజేసి ప్రశ్నించినపుడు సాంప్రదాయకులు బుద్ధిమంతులగు నెడల సమాధానము తోచక ఆకాశమున చుక్కలు లెక్కింప మొదిగుదురు. ధృష్టులయినవారు దేవుడు అఘటనఘటనా సమర్థుడు. అత డేమైన చేయగలడు. అని యేమేమో ప్రలపింతురు. సర్వశక్తిమంతు డేమి చేయలేడు? అని ప్రశ్నింతురు. కావుననే వీరు విష్ణువుచే తన భక్తురాలైన వృంద పాతివ్రత్యమును జెరిపింపజేసి యా విష్ణువును శాపగ్రస్తుని జేసి గండకీనదిలో శాలిగ్రామ రూపమున గవ్వలుగా బడియుండునట్లు చేసియున్నారు విష్ణువు చేసిన యపరాధఫలముగా వృంద మానవ శరీరమును విడిచి వృక్ష శరీరముతో భూలోకమున శాశ్వతముగా తులసియై పడియున్నది, శివుడు తెలివి మాలి. తన భక్తునకు భస్మాసురున కీయరాని వరమునిచ్చి, యతడు వెంటబడగా ప్రాణ భీతితో దశదిశలు పరుపెత్త నలసిన దుర్గతికి వశుడై విష్ణువు ననుగ్రహమునకు పాత్రుడు కావలసివచ్చె. ఇవియేనా దేవుని అఘటన ఘటనా సామర్థ్యములు? వహ్వారే యీ సమాధానముల నే మనవచ్చును?

ఇంక కొందఱు, దేవుడు లీలామానుష విగ్రహుడగును. కాని వాస్తవ దేహధారి కాడనిచెప్పుచు తమ వాగ్విలాసమును బ్రదర్శింపజూతురు. లీలామానుష విగ్రహమన నేమి? ఆ దేహము ప్రాకృతికము కాదా? అయ్యది ప్రాకృతికము లయిన నేత్రములకు గనిపింపదా?

"అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా."

(భ. గీ. 4-6)

'జన్మ మరణములు లేనివాడను, సర్వప్రాణులను పదార్థములను వశమున నుంచుకొనువాడను: అయ్యు, నిజ ప్రకృతిని అధిష్ఠించి ఆత్మ మాయతో బుట్టుదును.'

అని కృష్ణునిచే ననిపించి దేవుడెట్లో పుట్టునని చెప్ప కొందఱు బుద్ధిమంతులు యత్నించి యున్నారు. 'జన్మ మరణములు అల్పజ్ఞుడగు జీవునకే కాని, సర్వజ్ఞుడగు నీశ్వరున కుండవు' అని అజ, అవ్యయాత్మ పదములచే నంగీకరించియు స్వప్రకృతి నధిష్ఠించి జన్మించు ననుటలో గల పరమార్థమేమి ? స్వప్రకృతి యననేమి ? దేవుని ప్రకృతి యొకటి వేఱుగా నుండునా ? జీవుల దేహనిర్మాణ మే ప్రకృతితో నేర్పడినదో యా ప్రకృతి యింకొకటియా ? ఎన్ని ప్రకృతులున్నవి ? దేవుని ప్రకృతి సత్వరజస్త మాత్మకముకాదా ? రామ కృష్ణాదుల దేహము లాప్రకృతితో నేర్పడినవి కాదా ? అట్లు కానిచో నితర మానవ ప్రాకృతి కేంద్రియముల కెట్లు కనిపించి నవి ? రామ కృష్ణాదుల మాతాపుత్రాదులు తమకు జన్మించిన బిడ్డల శరీర ములతో నెట్లు వ్యవహరించిరి ? రామ కృష్ణాదుల నెట్లు ముద్దాడి కౌగిలించి సుఖింపగలిగిరి ? దుష్ట రావణ జరాసంధాది రాక్షస నేత్రములకు వీరెట్లు కనిపించిరి ? వారి బాణాహతులవలన గలిగిన దుఃఖముల నెట్లు రామ కృష్ణాదు లనుభవించిరి ? ఇది యంతయు "మసి బూసి మారేడు కాయను నేరేడు కాయగా జేయుట" యన నగునా ?

దేవు డవతరింపక - రామకృష్ణాదులుగా జన్మింపక పోయిన రావణ కంసాదులు ఎట్లు చత్తురందురా ? రావణాదు లేలచావరు ? వారి దేహములు శాశ్వతము లెట్లగును ? 'జాతస్య హి ధ్రువో మృత్యుః' అను నిత్యసత్యము వారి దేహములకు వర్తింపదా ? కారణమేమి ? రావణాదుల తల్లిదండ్రులు తాతముత్తాతలు నందఱు చావగా వీరెట్లు చావకుందురు ? వారి దేహములు ప్రాకృతిక నియమములకు లోబడవా ? అయిన వారిదేహము లే ప్రకృతితో నేర్పడినవి ? వారి దేహములందు యౌవన కౌమారాద్యవస్థలు చూడబడ లేదా ? ఈ ప్రశ్నల కవతారవాదు లేమి సమాధానము చెప్పుదురు ?

మఱియు రావణాదులకు జన్మల నొసంగిన దెవరు? దేవుడు కాదా? దేవుడే యందురేని అతడు తా నవతరింపకయే వారికి జన్మల నొసగ నేర్చిన

వాడు అవతరింపక మృత్యువుం జేకూర్పలేడా ? సర్వ ప్రపంచమును నవతరింపకయే ప్రళయము చేయగల శక్తిమంతుడగు దేవుడొక వ్యక్తిని జంపుటకు అవతరించి యగచాట్లుపాలు కావలసిన యవసరమేమి ? రావణుని జంప రాముడెన్ని కష్టములకు గురికాలేదు. భార్యను బోగొట్టుకొని, లక్ష్మణుని మూర్ఛకై చింతించి యెన్నిబాధలకు గురికాలేదు. చివరకు విభీషణాదుల సహకారమే లేకున్న రావణుని జంపగలిగి యుండెడివాడేనా ? ఇక కృష్ణుడు కంసాదులను కొందఱ నెట్లో చంపగలిగినను జరాసంధుని దోర్బలమునకు జాలక పలుపర్యాయములు పలాయనము చిత్తగించి, తుదకసమర్థుడై భీమునిచే జంపించుట దేవుని అఘటనఘటనా సామర్థ్యమునకు ప్రమాణమందుమా ? ఇట్టి యెడ అవతారవాదమున గల పటిమ యేమనవలయును ?

పరశురాముడు, బలరాముడు విష్ణువు నవతారములే కదా ? ఆ యవతారము లుండగా నప్పుడే రామకృష్ణుల యవతారములేల ? పరశురాముడేల రావణుని జంపడయ్యె ? అతని సృష్టిలో రావణుడు దుష్టుడుకాడా ? పరమర్షియా ? లేక రావణుడు బ్రాహ్మణుడను పక్షపాత బుద్ధితో విడిచిపుచ్చెనా ? రామ పరశురాము లిరువురు ప్రథమమున నొకరి నింకొకరు గుర్తింపక యుద్ధమున గడంగుటలోగల పరమరహస్యమేమి ? ఈ పరస్పర యుద్ధము దుష్టశిక్షణార్థమా ? శిష్టరక్షణార్థమా ? అవతారవాదుల మనస్సులలో నీ ప్రశ్న లుదయింపవా ? ఉదయింపకున్న నితరు లడిగిన నేమందురు ? దేవుని లీలలందు రేమో ? బాగు బాగు !

రామ కృష్ణాది దేహములు ప్రాకృతికములు కాక దివ్యములై ఆత్మమాయతో నేర్పడినవే యగు నెడల ఆ దేహములతో కర్మఫలము ననుభవింపక యుండవలయునుగదా ? రామునకు రావణుని జంపగా బ్రహ్మహత్య యను పాతక మంటిన దందురా ? లేదా ? వాలిని చెట్టుచాటున నుండి చంపినందువలన తత్పాపఫలముగా కృష్ణావతారమున చెట్టు చాటున బరుండి

వ్యాధబాణమునకు గురియై దేహమును విడిచినట్లు చెప్పుట యసత్యమా? దివ్యదేహముతో నొనర్చిన దుష్టశిక్షణ పాపమెట్లగును? అది జన్మాంతరమున ననుభవించు టెట్లు?

ఆత్మమాయ నధిష్ఠించి యవతరించిన కృష్ణుడు 'బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున!' 'నాకు, నీకును అనేకజన్మలు గడచనినవ'ని యర్జునుని జన్మలతో తన జన్మల సామ్యము నేల చెప్పుకొని యున్నాడు. అట తా నవతరించి నట్లేల చెప్పడు. అవతార పదము కృష్ణుడెఱుగడా? వ్యాసునకపరిచితమా? ఈ సాంప్రదాయకుల కీపద మెటనుండి లభించినదో తెలియదు. వీనితో జనుల నేల మభ్యపెట్టుచున్నారో బోధపడదు. కర్మఫలముల ననుభవించుటకే కదా జన్మ లభించును? దేవుడు కర్మఫలదాతయా? కర్మఫలభోక్తయా? కర్మఫలము ననుభవించువాడు సుఖదుఃఖములకు లోనగును. అట్టివా డీశ్వరుడు కాజాలడు. అందువలననే శంకరాచార్యులు

"కరణవ చ్చేన్న భోగాదిభ్యః" (బ్ర. సూ. 2-2-40)

అను బ్రహ్మసూత్రమునకు భాష్యము వ్రాయుచు, "అథ లోకదర్శనానుసారేణ ఈశ్వరస్యాపి కించిత్ కరణానా మాయతనం కామేన కల్ప్యేత। ఏవమపి నోప పద్యతే। సశరీరత్వే హి సతి సంసారివత్ భోగాదిప్రసంగాత్। ఈశ్వరస్యా ప్యనీశ్వరత్వం ప్రసజ్యేత.' శా. భా.

లోకమున వస్తువులను నిర్మించు కర్తలకు దేహాద్యవయవము లున్నట్లు సృష్టికర్త యగు నీశ్వరునకును హస్తపాదాద్యవయవముల కాశ్రయమగు శరీరమును కోరి యంగీకరించుటయు తగదు. కారణమేమన: ఈశ్వరుడు దేహధారియగు నెడల నితర సాంసారిక జీవులవలె నతడును సుఖదుఃఖములకు లోబడవలసిన వాడగును. అట్లంగీకరించిన నతనిలో నీశ్వరత్వమే యుండదు. అతడీశ్వరుడు కాడు, అని-ఈశ్వరు డెన్నడు దేహధారి కాడని స్పష్టముగా నిషేధించి యున్నారు. అయినను సాంప్రదాయకు లీ యవతారవాదము నేల పట్టుకొని యూగులాడుచున్నారో దురూహ్యము.

దేవు డవతరించి దుష్టశిక్షణ చేసి ధర్మసంస్థాపనచేయుట సత్యమగు నెడల నవతార పురుషులకు పాప మంటకుండుట న్యాయ్యము. అవతార వాదు లవతారపురుషులను పాపములనుండి యైనను దూరముగా నుంచరైరి. ఇక యవతారములవలన దేవుని మహాత్వమేమి బోధపడినట్లు? లీలామానుష విగ్రహమును ధరించియు పాపములనుండి తప్పుకొనలేక పోవుటచేతనే కాబోలు పాపము దేవు డిప్పుడు అవతరించుట మానినట్లున్నది. లేకున్న విచ్చలవిడిగా నధర్మము పెరుగుచున్న యీ రోజులలో దేవుడవతరింపదేల? హిందువుల దేవునకు బుద్ధివచ్చినట్లున్నది.

హిందువుల దేవు డవతరించుటమానిన తదుపరి క్రైస్తవుల దేవుడు 'యెహోవు' ఈమధ్యనే (రెండువేల సంవత్సరము లింకను నిండలేదు) పురుషసాంగత్య మెఱుగని మరియమ్మ కడుపున నవతరించి కొలది సంవత్సరములే భూమిమీద నటించి; పెండ్లికైన నోచుకొనక యహూదీ రాజుల కోపమునకుగురియై దొంగలతోబాటు తానుగూడ రాజద్రోహ నేరముక్రింద కొఱత వేయబడి, 'ఓదేవా యీసంకట సమయమున నాచేతినేల విడిచితివ'ని యలపటించుచు మరణించి యున్నాడు. పాపము! తరువాత మూడు దినముల యనంతరము మరల శిష్యులకు కనిపించి యెవరికి తెలియకుండ మాయమైనాడు. ఒక యవతారముతోనే యతనికి బుద్ధివచ్చినట్లున్నది. మరల భూమిమీదికి తొంగియైన చూడలేదు.

ఏమి యవతారము లీ యవతారములు! దేవుని అవతరింపజేసి వాని పరువు ప్రతిష్ఠలను నాశనము చేయుటయే కాని, యీ యవతారవాదమున గల విశేషమేమియు హేతువాదులకు గనిపింపదు.

'భగవద్గీత- 'భగవానువాచ' అను నీ పదములలోని భగవత్ పదము కూడ పాఠకుల నెంతగానో భ్రమపెట్టుచున్నది. కృష్ణునకై వాడబడిన 'భగవాన్' పదమును జూచి పలువురు కృష్ణుడు దేవుడని యెంచుచున్నారు. భగవంతుడనగా దేవుడని సాధారణముగా నెల్లరు భావింతురు. దేవుడు సృష్టి స్థితి లయములకు కర్తకదా! కృష్ణునిలో నా లక్షణమున్నదా? యని

ప్రశ్నించిన నేమి సమాధానము వచ్చును? కృష్ణుడు సృష్టికర్త కాడు. అతనికి పూర్వమే యీ సృష్టియున్నది. దానిలో నత డితరులవలె నొక పురుషమాత్రుడుగా నటించుట యెల్ల రెఱుగుదురు. అతడీ సృష్టికి ధర్తకాడు: సంహర్తయుకాడు. కావున నతడెట్లు దేవుడగును? కాజాలడు. అయిన భగవంతుడని యెట్లు వ్యాసాదులు వర్ణించిరి? అని ప్రశ్నింతురేమో? తెలుగు చదువరులలో పెక్కురి కీపదము కృష్ణుడు గొప్పవాడని తెలుపుటకు వాడ బడిన దని తెలియదు. సంస్కృతభాష నెఱిగినవారు భగవత్ పదము దేవునకే కాక మానవులలో గొప్పవారైన వారిని దెలుపుటకు వాడబడునని గుర్తింపగలరు. చూడుడు: భగవాన్ రామచంద్రుడు. భగవాన్ కృష్ణుడు. భగవాన్ వ్యాసుడు. భగవాన్ వసిష్ఠుడు. భగవాన్ విశ్వామిత్రుడు. భగవాన్ శంకరాచార్యులు, భగవాన్ దయానందుడు. భగవాన్ బాలగంగాధరతిలక్. ఇట్లెన్నియో ప్రయోగములు సంస్కృతమున జూడనగును. ఈ తావులం దన్నియెడలను నా యావ్యక్తులందు గల గొప్పతనమును దెలుపుట కీ భగవత్పదము ప్రయోగింపబడినది.

కృష్ణుడు నాటి మానవలోకమున గొప్పవాడుగా నెంచబడియున్నాడు. అత డప్పటి మహాపురుషుడు. కావున భగవత్పదముచే వ్యవహరింపబడి యున్నాడు.

భీష్ముడు కృష్ణుని గూర్చి ధర్మరాజుతో నేమని యన్నాదో చూడుడు.

"వేదవేదాంగ తత్త్వజ్ఞం బలం చా ప్యధికం తథా
నృణాం లోకే హి కోఽన్యోస్తి విశిష్టః కేశవాదృతే"

(మ. భా. సభాపర్వ 38 అ)

'వేదవేదాంగ విజ్ఞాని, అధికబలుడునైన కృష్ణునకు మించినవా డీ నరులలో నెవడున్నాడు?' భీష్ముని యీ వచనములవలన కృష్ణుడు గొప్ప మానవుడు మహాపురుష డనియే బోధపడును. కాని సృష్టి కర్తృత్వాది లక్షణములు గల దేవుడని కాదు.

కృష్ణుడు మహాపురుషుడు; కావుననే తాను ధర్మము నుద్ధరించుటకు, అధర్మము నణచుటకు నప్పుడప్పుడు జన్మింతునని చెప్పియున్నాడు. ముక్త జీవులు, మహాపురుషులు ప్రాణులదుఃఖముల బాపుటకు తమశక్తి యుక్తుల నుపయోగింప సంకల్పింతురు. అదియే మహాపురుషత్వము. వీ రొనర్చు నీ పరోపకారాదులనే లోకసంగ్రహ పదముతో శిష్టులు వర్ణింతురు. అందు వలననే 'లోకసంగ్రహార్థ మైనను నీవు కర్తవ్యమును విడువరాదు' అని కృష్ణుడు అర్జునునకు బోధించియున్నాడు.

తానుకూడ నాటి మానవులలో శ్రేష్ఠుడు; కావుననే తన కొఱకు గాక పరులకొఱకై కర్మాచరణము చేయుచున్నట్లు నుడివియున్నాడు కదా!

"నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన

నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి"

'నాకీ ముల్లోకములందు చేయవలసిన దేదియు లేకున్నను- కర్మ నాచరించుచునే యున్నాడ.'

"యద్ యదాచరతి శ్రేష్ఠస్తత్ దేవేతరే జనాః

స యత్ ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే."

'శ్రేష్ఠుడేది చేసిన యితరు లదియే చేయుదురు. అతడేది ప్రమాణ మనిన నితరులు నదియే ప్రమాణముగా నంగీకరింతురు.'

అందువలననే నేను కర్మల నాచరించుచున్నాడ. 'మానవ శ్రేష్ఠుడ నైన నేను కర్మల నాచరింపకున్న నన్ను ప్రమాణముగా గ్రహించి యిత రులుకూడ కర్మల నాచరింపక కర్మ భ్రష్టులై నశింతురు.' తన మహాపురుష త్వమును కృష్ణుడు స్వయముగా నంగీకరించినట్లీ గీతయందే చదువనగును.

ఇన్ని విధముల కృష్ణుడు మానవ దేహధారులలో నొక గొప్పవాడని స్పష్టమగుచుండగా నతని నొక యవతారమని చెప్పి దేవునిగా జేసిన గలుగు లాభమేమి ? లాభము లేకపోగా కృష్ణుడు దేవుడగు నెడల నతడు మానవుల కాదర్శ పురుషుడు కాజాలడు. అతడు గొప్పవాడు కావున

దుష్టశిక్షణాది కార్యములం జేసినాడు- మనము మానవుల మట్లు చేయజాలమని యెంచి మానవు లుత్తమ కార్యములకు గడంగజాలరు. కావున మహాపురుషులను దేవుని అవతారములనుట నష్టమేకాని లాభమొందును లేదు. ఇట్లు భగవత్ పదమును మానవులకై ప్రయోగించినపుడు మహాపురుషుడను నర్థ మొసంగుననని యెంచుట యుక్తము.

రామకృష్ణాదులను మహాపురుషులనుగా నెంచి వారి జీవితమును ఆదర్శముగా నుంచుకొని వారివలె ఇతరులును గొప్పపను లొనర్చి గొప్పవారగుట మిక్కిలి మంచిది. వారిని దేవు నవతారములుగ నెంచి తమ కనుపయుక్తులుగా జేయుట శ్రేయస్కరము కాదు.

ఇట్లవతారవాదము వేదాది శాస్త్రములకును, తత్త్వశాస్త్రములకును విరుద్ధము. కావుననే మా గురువర్యులు పండిత శ్రీ ముక్తి రామోపాధ్యాయులు భగవత్ గీతలోని యవతారవాదమునకు సంబంధించిన శ్లోకము లన్నియు సాంప్రదాయకుల కల్పితములుగా నెంచి తొలగించియున్నారు. ఇట్లే కృష్ణుని దేవునిగా భ్రమింపజేయు విశ్వరూప దర్శనాదులకు సంబంధించిన ప్రకరణములను గూడ తొలగించి యున్నారు. నా యీ యవతారవాద వివేచనముతో చదువరులకు ఆస్తిక్యమున నేమో, అవతారవాదమున గలదోషములేవో కొంతవఱకు బోధపడగలవని యెంచెద.

ఈ భగవద్గీతను **నాల్గవ** పర్యాయము ముద్రించి ఆంధ్ర పాఠకుల కందజేయుట కెంతయు సంతసించుచున్నాను. ఈ **నాల్గవ** సంస్కరణమున తాత్పర్యము, ఆవశ్యకస్థలములలో వివేచనము నధికముగ చేర్చబడినవి. తాత్పర్యవివరణములతో బాటు అవతారవాదమును గూర్చియు నిందు కొంత వివేచించియున్నాడ.

చదువరులు పుస్తకము నామూలాగ్రము చదివి గుణదోషములను వెలువరింపగలరు గాక !

- గోవదేవ్

ఓమ్

# ప్రస్తావన

"యాతం యస్తనిమానమేన మఖిలం
విశ్వాయుషః పర్యయే
తంతుం సృష్టిమయం పునర్వితను తే
యజ్ఞాభిధం కేవలః
కర్మైతత్ ఖలు కామతా విరహితం
తస్యానిశం చింతయన్
ఆచర్తుం ప్రభవేయ మిత్యతితరాం
అభ్యర్థయే తం ప్రభుమ్."

(పం. ము. ఉపాధ్యాయ)

"జగము యుగాతిపాతమున
సర్వము తానవమొంది డిందగన్
మగుడ నెవండు సృష్టిమయ
మంజుల సూత్రము యజ్ఞరూపమున్
నిగుడగ జేయునో యతని
నిర్మల కామవిహీన కర్మమున్
బొగడుచు-దద్విధాచరణముం
గన నాప్రభు నెంతు నిత్యమున్."

(శ్రీ రాఘవరెడ్డి)

శ్రీమద్ భగవద్గీతాభాష్యము లనేకము లున్నవి. ప్రాచీనులు, అర్వాచీనులు నగు విద్వాంసు లనేకులు గీతలోని యభిప్రాయములను వెల్లడించుటలో తమతమ లేఖినీ కౌశలమును జూపించియున్నారు. ఇన్ని భాష్యము లుండ నే నొక సాధారణ వ్యాఖ్యానము నీ గీతకు రచించుట విద్వాంసులకు వాంఛనీయము కాదు: కాని, నా భావములను దాచుకొనుట యుచితము కాదని యెంచి యందులకు బూనుకొంటిని.

భగవద్గీతను స్వాధ్యాయము చేయుచున్నపుడు అందులో నెన్నియో శ్లోకములు ప్రక్షిప్తములుగా దోచుచుండెడివి. అందువలన గీతయం దొక నిర్ణీత సిద్ధాంతము నన్వేషించి ప్రకటించుట సులభము కాదనిపించెడిది. సాంప్రదాయిక భాష్యముల నెన్నింటిని జదివి చూచినను గీతయందలి కొన్ని యంశములను వారి వారి సిద్ధాంతములను బలపఱచుటకు వీలుగ మార్చుట కనేక యత్నములను చేసినట్లు స్పష్టమగును. అంతకంటె వారేమి చేయ గలరు ? ఇప్పుడు మనకు లభించు గీతలో ననేకములగు దార్శనిక సిద్ధాంతములు లభించును. వానిలో నొక సిద్ధాంతమును బోషించుట కితర సిద్ధాంతముల నురితీయక తప్పదు. ఇట్లు పరస్పర విరుద్ధములగు వాద వివాదములు, ఆలోచనలు నెంతో తీవ్రములై యున్నవి. వీనికి కారణ మీ ప్రక్షిప్త శ్లోకములే. అయినను విద్వాంసు లనేకు లీవర్తమానపుగీత నట్లే యథార్థమని యంగీకరించు చున్నారు. ఈ విషయమును గూర్చి సాహసించి వ్రాయ నుంకించియు నట్లు చేయలేక పోయితిని.

ఇది యట్లుండ నొకసారి లోకమాన్య బాలగంగాధర తిలక మహాశయునిచే రచియింపబడిన గీతా రహస్యమున నీ క్రింది వాక్యములు చదువ నవకాశము లభియించినది.

"మహాభారత రచయిత పూర్వపు గ్రంథముల నాధారముగ గ్రహించి వర్తమానపు గీతను రచియించి యున్నాడు. ఇందలి రచన క్రొత్తదికాదు. అయినను మూలగీతయందు మహాభారతకారుడు పరివర్తన మేమియు జేయ లేదని చెప్ప శక్యముకాదు." గీ. ర. 525.

ఈ పంక్తులు నా యాలోచన కొకింత యాశ్రయ మొసంగు చున్నట్లు కనిపించినవి. గీతావిషయమున నొకింత వ్రాయునుత్సాహము కలిగించినవి.

వ్యాసుడు, వైశంపాయనుడు, సౌతియు నను ముప్వురు మహాభారత రచయితలని రావుబహాదుర్ చింతామణిరావు వైద్యులు వ్రాసియున్నాడు. వ్యాసుడు 'జయ' నామక గ్రంథమును మాత్రము రచియించిన ట్లతడభి ప్రాయ పడుచున్నాడు అందలి శ్లోక సంఖ్యను నిర్ణయించుట కాధారము

లభింపనందున నా విషయమున తన యభిప్రాయము నతడు ప్రకటింప డయ్యె. ఆ జయనామక గ్రంథమున కొన్ని శ్లోకములను జేర్చి దానికి భారత మని వైశంపాయనుడు నామకరణ మొసర్చియున్నాడు. వైశంపాయన విరచితమగు నీ భారతమున 2,400 శ్లోకములున్నట్లు చింతామణిరావు వైద్యులు నిర్ణయించిరి. వారి యీ నిర్ణయము ఆదిపర్వమున సౌతిగ్రాసిన యనుక్రమణికపై నాధారపడి యున్నది. ఈ యనుక్రమణికయందు భారత సంహితలోని శ్లోకసంఖ్య యిరువదినాలుగువేలు (24,000) అని యున్నది. మిగిలిన 76 వేల శ్లోకములు ఆఖ్యానములకు చెందియున్నవి ఇట్లు మొత్తము మహాభారతమున నొక లక్ష శ్లోకములు నేడుపలబ్ధమగుచున్నవి. అందువలన నీ 76 వేల శ్లోకములు సౌతిరచన యని వైద్యుల యభిప్రాయము. ఇట్టి గ్రంథము గొప్పది యైనందున మహాభారత మని పిలువబడ నారంభమయ్యెను. మహాభారత పదములలో నిట్టి విభేదము కనిపింప కున్నను విషయ విభాగము ననుసరించి సంహితసంఖ్య వేఱుగను,- ఆఖ్యానములసంఖ్య వేఱుగను లెక్కించినట్లు తోచుచున్నది.

చింతామణిరావు వైద్యులు వైశంపాయనుని సాక్షాత్తుగ వ్యాస శిష్యుడని యంగీకరించి యుండినట్లు లేదు. కారణమేమన : జనమేజయుడు సర్పయాగముచేసిన సమయమున వైశంపాయనుడున్నాడు. వ్యాసుడు మహాభారత కాలమున నున్నాడు. అందువలన వైశంపాయనుడు వ్యాసుని శిష్యపరంపరలో చేరినవాడని యతడభిప్రాయ పడుచున్నాడు. కాని, మహాభారతమున వైశంపాయనుడు వ్యాసునకు సాక్షాచ్ఛిష్యుడనియే యున్నది. సుమంతుడు, 'జైమిని, పైలుడు, శుకుడు, వైశంపాయనుడు నెల్లరు పర్వతముమీద వ్యాసునిదగ్గర వేదమును చదువుచుండిరనియు నందున్నది. ఇంతే కాక వ్యాసునియాజ్ఞ ననుసరించియే వారు వేదములను విస్తరింపజేయుటకై క్రిందికి దిగిరనియు నందు జూడనగును వ్యాసకాలపు వైశంపాయనుని కంటె జనమేజయుని కాలపు వైశంపాయనుడు సాక్షాత్తుగనో లేక పరంపరగానో వ్యాసుని శిష్యకోటిలోని వాడగుట నిశ్చితమే యనవచ్చును.మఱియును

ఆదిపర్వమున నఱువదిమూడవ యధ్యాయపు తొంబదియవ (63-90)శ్లోకము నందు నా యైదుగురు శిష్యులను, వ్యాసమహర్షి నుండి మహాభారతము చదివి యైదు భారతసంహితలు రచియించిన ట్లున్నది. మిగిలిన నాలుగు భారత సంహితలు కాలగర్భమున విలీనమై యుండవచ్చును. ఈ వైశంపాయనుని భారతసంహిత మిగిలియుండవచ్చును. కాని, వైశంపాయనుడు వ్యాసుని శిష్యు డగుటంజేసి యతని భారతమునకు వ్యాసుని భారతమే యాధారమై యుండును. అందువలన వైశంపాయనుని భారతమునకును, వ్యాస భారతమునకును మధ్య మతభేదముండదనియే యెంచవలయును. వైశంపాయనుడు వేదములను జదివినవా డగుటంబట్టి యతని భారతముకూడ వేద సిద్ధాంతములకు, నుపనిషత్తుల సిద్ధాంతములకు నెక్కుడు దూరముగ నుండరాదు. కాని, సౌతి యొక కథకుడు, మహాభారతము నందలి యాఖ్యానము లన్నియు నతడే రచియించెను. కావున నతడు శ్రోతల వినోదార్థము కథల నల్లుటలో సిద్ధాంతముల నంతగా ధ్యానమున నుంచుకొని యుండకపోవుట యసంభవము కాదు శ్రోత లడుగు ప్రశ్నలకు సమాధానము చెప్పుటలో నయితము కొన్ని లోటుపాటులు జరిగి యుండవచ్చును. కాని, సౌతి యొసంగిన సమాధానములందే కాక, యితర స్థలములలోను మహాభారతమున వైరుధ్యములు చూడనగును. అట్టి శాస్త్ర విరుద్ధ విషయములు. పూర్వాపర విరోధములు సౌతివేయని చెప్పుట కవకాశము కనిపింపదు. అందువలన భిన్న భిన్న కాలములందు సాంప్రదాయకులు వారి కిష్టములైనవి మహాభారతమున జోడించియుందు రనియే చెప్పకతప్పదు. వారు తమ కనుకూలమగు విషయముల నందు జేర్చుటయే కాక, తమ కననుకూలమగు విషయములను తొలగించుటకు దగిన యత్న మొనర్చినట్లును దోచుచున్నది. అందు వలననే సౌతికి తరువాత మహాభారతమున శ్లోకసంఖ్య పెంపుకాక యంతే యున్నది. సౌతి మహాభారత శ్లోకసంఖ్య యొక లక్షయని వ్రాసియున్నారు. కాని, నేటి మహాభారతమున కొన్ని ప్రతులలో (కుంభకోణ ముద్రితము) తొంబది

యారువేలు (86000) మాత్రమే యున్నది. కలకత్తా ముద్రిత ప్రతులలో నెనుబదియైదువేలు (85000) శ్లోకములు లభించుచున్నవి. దీనింబట్టి మహాభారతము నుండి తమ కనుకూలముకాని శ్లోకములను దొలగించుచు వచ్చినట్లు కనబడు చున్నది.

మహాభారతములోని ఈ ప్రక్షేపవిక్షేపముల యాధిక్యమును జూచినప్పటి నుండియు గీతలో కూడ నిట్లే యా యా సమయములందు శ్లోకములు చేర్చబడినవను ధారణ నాకు దృఢపడినది. అందువలననే యీ వాక్యములు వ్రాయుటకు సాహసించుచున్నాడ.

మహాభారతము నందలి ప్రక్షేపముల నన్నింటి నీ భూమికయందు వివరించుట సంభవముకాదు. అందువలన శాంతి పర్వములోని 'సృష్టిరచనా క్రమము' అను ప్రకరణమునకు సంబంధించిన ప్రక్షేపములను మాత్ర మిట ప్రదర్శింప యత్నింతును. గీతలోనే కాక మహాభారతమునం దంతటను ప్రక్షేపము లెక్కుడుగా నున్నవని పాఠకులకు దెలియుటకే యిదియు నిట ప్రదర్శించుచున్నాడ.

తదుపరి గీతలో నున్న ప్రక్షేపములను స్పష్టము సేయుదును. ప్రక్షిప్త (చేర్చబడిన) శ్లోకములను వేరుచేసి మిగిలిన శ్లోకముల కర్థము కూడ వ్రాయుమను. ప్రక్షిప్త శ్లోకముల మూలమున గీతలోని యధ్యాయముల విభాగము కూడ సంకీర్ణమైనది. రెండవ యధ్యాయమునకు విషయము సాంఖ్యయోగమైనను నందు కర్మయోగముకూడ వ్రాయబడియుండుట జూడనగుచున్నది. అందువలన ప్రక్షిప్త శ్లోకములనుతీసివేసి, మిగిలిన శ్లోకముల విషయ విభాగమననుసరించి పదునెనిమిదియధ్యాయములుగ భాగింపబడినవి.

గీతనుపదేశించిన యోగిరాజగు కృష్ణుని యెడలను, గీతా సంపాదకులు, వేదవిదవతంసులు, మహర్షులు నగు వేదవ్యాసుల యెడలను నా హృదయమున నగాధ శ్రద్ధాసక్తులున్నవి. యోగిరాజు శ్రీ కృష్ణుని వంటి ప్రౌఢ వక్తల యుపదేశమునందు పునరుక్తులు, పూర్వాపర విరోధములు

మున్నగు దోషములు కంచు కాగడాలు వేసి వెదకినను దొరకకూడదని నా యభిప్రాయము. అంతేకాక యట్టి మహానుభావుని యుపదేశములకు వ్యాసులవంటి మహర్షులు సంపాదకు లయినపుడు సువర్ణమునకు సుగంధ మబ్బవలసియుండెను. కాని ప్రస్తుతము మనకు లభించు గీతలో ననేక దోషములు లభించుచుండుట శోచనీయము. ఈ దోషములనుండి భగవద్గీతను దూరముగ నుంచవలయుననినచో నందలి ప్రక్షిప్త శ్లోకములను తీసి వేయుటకంటె మఱియొకటి చేయగలిగిన దేమున్నది? కావున నట్లుచేయుట సాహసమైనను భక్తిభావనచే ప్రేరితుడనై ప్రక్షిప్త శ్లోకములని యెంచిన వానిని గీతనుండి తీసివేసితిని. నా యీ వివేచనలో నాకు తెలియని దోషము లేవైన నుండవచ్చును. అట్టి దోషములను దయతో నాకు తెలుపుదురుగాక! అని విద్వాంసులను నతమస్తకుడనై ప్రార్థించుచున్నాడ. వానిని ముందు రాబోవు సంస్కరణలో దిద్దుకొనగలను. నేను వ్రాసినదానికి తర్కమే యాధారము. నేను ప్రక్షిప్తములని నిర్ణయించిన శ్లోకములే కాక వేరు శ్లోకములు ప్రక్షిప్తములు కావని చెప్ప సాధ్యముకాదు. నేను ప్రక్షిప్తము లని తీసివేసిన శ్లోకములన్నియు ప్రక్షిప్తములే యనియు గట్టిగ జెప్ప వలనుపడదు. గీతలో నెప్పుడు నిపుడున్న పదునెనిమిది యధ్యాయములే కలవనియు నిశ్చయింపను సనువుకాదు. కారణ మేమన, వైష్ణవ సంప్రదాయమునకు సంబంధించిన ప్రక్షిప్త శ్లోకములు గీతలో నెక్కుడుగానున్నవి. ఆ సంప్రదాయము మహాభారతకాలమున లేనేలేదు. మఱియు వైష్ణవ సంప్రదాయము ద్వారమున ప్రక్షేపములు తీసివేసినపుడు గీతలో పదునెనిమిది యధ్యాయము లుండనేరవు. మేము విషయ విభాగము ననుసరించి చేసిన పదునెనిమిది యధ్యాయములు ప్రక్షిప్తములు లేక ముందున్న గీతలో నట్లే యుండియుండుననియు నిశ్చయముగ నేను చెప్పజాలను.

— ముక్తిరామ్ ఉపాధ్యాయ్

# భూమిక

వేదవ్యాసుడు, వైశంపాయనుడు, సౌతి యను మువ్వురు విద్వాంసులు భారతమును వ్రాసిన ట్లంగీకరింపబడినది. భగవద్గీత మహాభారతమున కంగమనుటయు నిశ్చితమే. గీతోపదేశకుడు యోగిరాజు శ్రీకృష్ణు డనియు, నా యుపదేశములకు గ్రంథరూప మొసంగినవాడు వేదవ్యాసు డనియు నిర్ణయింపబడినది. నేటి మహాభారతము కాని, భగవద్గీత కాని వ్యాసమహర్షి ప్రప్రథమమున రచించిన రూపములో లేవనియే మా యభిప్రాయము. వానిలో నెన్నియో శ్లోకములు చేర్పబడినవి. ఎన్నియో తీసివేయబడినవి. ఇదియంతయు మధ్యకాలములో జరిగియుండును. ఏ విషయమునకు సంబంధించిన శ్లోకము లెన్ని మహాభారతమునుండి తొలగింపబడినవో నిర్ణయించుట సంభవము కాదు. కాని చేర్పబడిన శ్లోకములను దెలిసికొన ప్రస్తుత గ్రంథమునుండియే ప్రమాణములు లభింపగలవు. గీతలోని ప్రక్షిప్తములను యుక్తి యుక్తముగా నిర్ణయించుటకుగాను మహాభారతములోని ప్రక్షేపములను యుక్తి ప్రమాణముల మూలమున సిద్ధము సేయుట యావశ్యకము. కారణమేమన, గీత భారతమున కంగము. భారతమున గల ప్రక్షిప్తములనుజూపి తదుపరి గీతలోని ప్రక్షిప్తములను జూపవచ్చును. అందువలన ముందుగా, మహాభారతపు శాంతిపర్వములోని సృష్టిరచనాక్రమము నుట్టంకించి యందలి ప్రక్షిప్త భాగములను స్పష్టపఱుప యత్నింతుము.

శాంతిపర్వమున భిన్నభిన్న స్థానములలో తొమ్మిదిమాఱులు సృష్టిరచనాక్రమము వర్ణింపబడినది. పాఠకులు సులభముగ గ్రహింపననువగునట్లు ముందుగా నా ప్రసంగములను మహాభారతమునుండి యుల్లేఖింతుము. ప్రతి ప్రసంగము నుద్ధరించి, దానితోబాటు విశేషములను వివరించుచు, నందు ప్రసంగముల పూర్వాపర విరోధము, ఉపక్రమోపసంహారములందు గల దోషములు కూడ నుద్ధరించి చూపుదుము. చివరకు సామాన్య వివేచనమూలమున నా తొమ్మిది ప్రసంగములలో నే యే ప్రసంగములు ప్రక్షిప్తములో నేది మహాభారతపు మౌలిక ప్రసంగమో నిర్ణయించి చూప యత్నింతుము.

# మహాభారతము - ప్రక్షేపములు

# సృష్టిరచనాప్రకారము - 1

[భృగుమహర్షి భరద్వాజునకు చేసిన ఉపదేశము]

(మ. భా. శాం. ప. 180 అ.)

"ప్రకృతికంటె పరుడైన నిర్లిప్త వ్యాపక పరమాత్ముడు సృష్టిని రచించు కోరిక కలిగినమీదట తనలోని సహస్రాంశముతో పురుషు నుత్పన్న మొనర్చెను. ఋషు లీ పురుషు నాదిమానసపురుషు డనిరి. ఆ యనాది. అవినాశి. అజరుడు, అమరుడు నగు దేవుడు మొదట మహత్తు నుత్పన్న మొనర్చెను. మహత్తునుండి యహంకారమును, దానినుండి యాకాశమును, దానినుండి జలమును, దానినుండి యగ్నిని, అట్లే వాయువును నుత్పన్నముచేసెను. అటుపై నగ్నివాయువుల సంయోగమున పృథివి యుత్పన్నమైనది. తదుపరి స్వయంభువు దివ్యతేజోమయపద్మము నుత్పన్న మొనర్చెను. ఆ పద్మమునుండి వేదకోశమగు బ్రహ్మ జనించెను. అతని కహంకారమని నామము. అత డన్ని భూతముల నుత్పన్నము చేయువాడు. పంచధాతువులే బ్రహ్మ. అతని యెముకలు పర్వతములు. మేదోమాంసములు పృథివి. రక్తము సముద్రము. పొట్ట ఆకాశము. నిశ్వాసము వాయువు. నాడు లగ్ని. నేత్రములు సూర్యచంద్రులు. శిరస్సు ఉపర్యాకాశము, పాదములు పృథివి. భుజములు దిక్కులు. ఇత డే యహంకారమును, సర్వ భూతములను సృష్టించెను."

**విశేష వక్తవ్యము :**

సృష్టి రచనా క్రమమునకు సంబంధించిన యీ మొదటి ప్రక్రియ యందు భగవంతుడు తన సహస్రాంశముతో సృష్టించిన పురుషుడెవడు ? ఇతని సంగతి యేమియును తెలియదు. ఇతడు మహత్తుమొదలు పృథివి వఱకు గల తత్త్వములను రచించినట్లు తరువాత జెప్పబడినది. ఇట్లు

సృష్టికర్త యగుటవలన నీతడు బ్రహ్మ కావలసియున్నాడు. కాని తరువాత పద్మమునుండి బ్రహ్మ యుత్పన్నమైనట్లు వర్ణింపబడినది. కాబట్టి మొదటి పురుషుడు బ్రహ్మ కాజాలడు. ఇతనిని విష్ణువనియు చెప్ప వలనుకాదు. విష్ణువువలన విష్ణువెట్లు జనింపగలడు ?

పద్మమునుండి యుత్పన్నమైన బ్రహ్మకు అహంకారనామ మొసంగ బడినది. ఈ యంశమున రచనాప్రకారము 327 వ అధ్యాయమునందలి రచనా ప్రకారముతో పోలియున్నది. కాని, దీనిలోని ఇతర భాగములు దానితోకాని, అన్య ప్రక్రియతోకాని కలియవు. ఆ ప్రక్రియయందు అహంకారమునుండి పంచభూతము లుత్పన్నములైన ట్లంగీకరింపబడినది. ఇక్కడ నీప్రక్రియలో కేవల మాకాశము జనించినట్లున్నది. ఈప్రక్రియలో ఆకాశమునుండి జలము, దానినుండి యగ్ని, వాయువులు పుట్టినవనియు, నా యగ్ని వాయువుల సంయోగమువలన పృథ్వి యుత్పన్నమైనదనియు చెప్పబడినది. కాని తైత్తిరీయోపనిషత్తునం దాకాశము, వాయువు, అగ్ని జలము, పృథ్వియు క్రమముగా నొకదానినుండి యొకటి యుత్పన్నమైనట్లు వర్ణింపబడినది. కాబట్టి యీ రచనాక్రమము ఉపనిషద్విరుద్ధమగుచున్నది.

ఉపర్యుక్త క్రమములో తరువాత పంచధాతువుల సముదాయము బ్రహ్మయని చెప్పబడినది. కాని యెముకలు, మేదస్సు, మాంసము, రక్తము నని నాలుగు ధాతువులే లెక్కింపబడినవి.

అటుతరువాత బ్రహ్మకు సూర్యచంద్రులు నేత్రములనియు, ఉపర్యాకాశము శిరస్సనియు, పృథివి పాదములనియు, దిక్కులు భుజములనియు జెప్పబడినది. ఈ విరాట్‌రూపము ఎముకలు మాంసము మున్నగు ధాతువులతో నిర్మింపబడినదై బ్రహ్మకు సంబంధించిన దెట్లగును ?

ఈ రచనాక్రమమున మొదట బ్రహ్మను వర్ణింప నారంభించి తుదిని నుపసంహార మొనర్చుచు 'ఇట్టీయనంత భగవంతుడు విష్ణువు'అనియున్నది. ఈ వర్ణనలో నుపక్రమోపసంహారముల కేమియు సంబంధము కనిపింపదు.

# సృష్టిరచనాప్రకారము - 2

[మేరుపర్వతముపై భృగువునకు బ్రహ్మోపదేశము]

(మ. భా. శాం. ప. 181 అ.)

"మొదటనాకాశము శబ్దరహితమై నిశ్చలముగాను, సూర్యచంద్రులు, వాయువులేనిదై నిద్రించుచున్నట్లును ఉండెను. దానినుండి జల ముత్పన్న మయ్యెను. ఒక యంధకారమున మఱియొక యంధకారము ప్రవేశించిన ట్లీ దృశ్యముండెను. ఆ జలపుంజము నుండియే వాయువు జనించెను. ఆ జలవాయువుల సంమర్షమువలన నంధకారమును దూర మొనర్చుచు, ప్రకాశించుచున్న యగ్ని యుత్పన్న మయ్యెను. అగ్నితో మిశితమైయున్న వాయువు ఆకాశమునుండి జలమును బడవేయ నారంభింపగా, ఆకాశము నుండి పడుచున్నపు డా జలమునగల స్నేహ మొకచో నిలబడిపోయెను. అయ్యదియే కఠినమై పృథివియైనది. సర్వరసములను, గంధములను, స్నేహములను, ప్రాణులను ఉత్పన్నము చేయునది యీ పృథివియే."

**విశేష వక్తవ్యము :**

1. ఈ ప్రక్రియలో మహదహంకారక్రమమున సృష్టి యుత్పన్న మైనట్లు చెప్పలేదు. అందులకు ఇది సృష్టిరచనకు చెందిన ఆంశికవర్ణన మని సమాధానము చెప్పవచ్చును. అనేకస్థలములలో నాంశిక సృష్టివర్ణనలు చూడనగును. తైత్తిరీయమున బ్రహ్మానందవల్లిలో మొదట నాకాశో త్పత్తిని చెప్పి యటనుండి సృష్టిరచన వర్ణింపబడినది.

2. ఈప్రక్రియలో ప్రళయమున నాకాశసంహార మంగీకరించి యుండలేదు. ఆకాశతత్త్వము చివరకు మిగిలిన ట్లున్నది. ఈ క్రమము వేదములకు, ఉపనిషత్తులకు విరుద్ధము. చూడుడు.

"నో వ్యోమా పరో యత్" ఋ. 10. 129. 1.

'అప్పు డాకాశముకూడ లేకుండెను.'

"తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః" తై. బ్ర. వ. 1
'ఆ యాత్మవలన నాకాశము ఉత్పన్నమైనది.'

ఈ ప్రమాణములవలన వేదోపనిషత్తులు ప్రళయ సమయమున నాకాశముండదని యంగీకరించునట్లు తెలియుచున్నది. కాబట్టి మహా భారతపు రచనా ప్రకారము వేదోపనిషత్తులకు విరుద్ధమనక తప్పదు.

3. ఈ ప్రక్రియయందు ఆకాశమునుండి జలము, జలమునుండి వాయువు జనించినట్లున్నది. కాని తైత్తిరీయ ఉపనిషత్తునందు ఆకాశము నుండి వాయువు, వాయువునుండి అగ్ని, దానినుండి జలము నుత్పన్న మైనట్లు చూడనగును. కాబట్టి యిదియు నుపనిషద్విరుద్ధ మగుచున్నది.

# సృష్టిరచనాప్రకారము - 3

[రామ, పరశురామ, నారద, వ్యాసాసితదేవల వాల్మీకుల
సంవాదమును భీష్ముడు యుధిష్ఠిరునకు వినిపించుట]

(మ. భా. శాం. ప. 206 అ.)

"పురుషోత్తముడు వాయువు, అగ్ని, జలము, ఆకాశము, పృథివి యను మహాభూతముల నుత్పన్న మొనర్చెను. పృథివిని సృష్టించినమీదట నా భగవంతుడు జలమునందు శయనించెను. అతడు మనస్సుతో సర్వ భూతములలో శ్రేష్ఠుడగు సంకర్షణుని స్మరించెను. ఆ స్మరణకు తదుపరి దానివలన సర్వతేజస్సులకు ప్రకాశకుడగు ప్రద్యుమ్ను డుద్భవించెను. జలమున యోగనిద్రయందున్న ఆ పురుషోత్తముడు జగదుత్పత్తిస్థితిలయము లొనర్చుటకొఱకు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లను త్రిదేవుల నుత్పన్న మొనర్చెను. ఆ మహాపురుషుని నాభియందు సూర్యునివంటి విచిత్రమైన కమల ముద్భవించెను. ఆ కమలమునుండి దిక్కులను బ్రకాశింపజేయుచు బ్రహ్మ యుద్భవించెను. అతని తరువాత తమోగుణమహిమవలన మధు

నామకుడగు నసురుడు జనించెను. ఉత్పన్నుడుకాగానే యతనిని పురుషోత్తముడు సంహరించెను. అందువలననే దేవతలు, రాక్షసులు, మనుజులు, నెల్లరు భగవంతుని మధుసూదను డనసాగిరి.

బ్రహ్మకు దక్షుడు, మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు నని యేడుగురుపుత్రు లుద్భవించిరి. మరీచికి కశ్యపుడు, దక్షునకు పదముగ్గురు కన్యలు కలిగిరి. ఆ కన్యలలో నందఱికంటె పెద్దది అదితి. కశ్యపు డీ కన్యల కందఱకు పతియయ్యెను. దక్షుడు మఱి పదిమంది కన్యలను చిన్నవారిని కని వారిని ధర్మునకిచ్చెను. ఆ ధర్మునకు నెనిమిది మంది పుత్రులు, రుద్రులు, విశ్వేదేవతలు, సాధ్యులు, మరుత్వంతుడు నుత్పన్నులైరి. దక్షుడు పూర్వకన్యలకంటె చిన్నవారి నిరువది యేడుగురిని జనింపజేసి, వారిని సోమున కిచ్చెను. వారివలన గంధర్వులు, గుహ్యములు, పక్షులు, గోవులు, కింపురుషులు, మత్స్యములు, వృక్షములు, వనస్పతులు నన్నియు జనించెను. ఆదిత్యు లను పేరుగల శ్రేష్ఠ దేవతలను అదితి కనెను, వారిలో వామనుడు, గోవిందుడు నను పేర్లుగల విష్ణువు ప్రధానుడయ్యెను. ఆ విష్ణుపరాక్రమమువలన దేవతల లక్ష్మి వర్ధిల్లెను. దానవులకు, దితికి సంబంధించిన యాసురీ ప్రజకును పరాభవము కలిగెను. దనువు దానవులను, దితి యసురులను కనెను. తదనంతరమున మధుసూదనుడు మృత్యువును, దినరాత్రులను, దినముయొక్క ప్రథమభాగమును, రెండవభాగమును, ఋతువులను, కాలమును నుత్పన్నము చేసెను. ఆ భగవంతుడే జలమునుండి మేఘములను, స్థావరజంగమములను నుత్పన్న మొనర్చెను. మఱియు కృష్ణుడు ముఖమునుండి వందమంది బ్రాహ్మణులను, భుజములనుండి నూరుమంది క్షత్రియులను, జంఘలనుండి వైశ్యులను నూర్గురను, పాదములనుండి శత శూద్రులను జనింపజేసెను. వీరి కందఱకు బ్రహ్మ నధిష్ఠాతగ జేసెను. అతడు భూతములకు, మాతృగణమునకు స్వామియగు విరూపాక్షుని, కుబేరుని, వరుణుని, ఇంద్రుని జనింపజేసెను. వీరిలో

నింద్రుని రాజుగ నొనర్చెను. ఆ సమయమున లోకులు శరీరము నుంచు కొన గోరిక గలిగినంతకాలము జీవించుచుండెడివారు. మృత్యుభయముండె డిదికాదు. సత్యయుగమునందును, త్రేతాయుగమునందును మైథునధర్మము లేదు. సత్యయుగమున సంకల్పమువలనను, త్రేతయందు స్పృశించుట వలనను మాత్రమే సంతానము కలిగెడిది. ద్వాపరయుగమున మైథునధర్మ మారంభమయ్యెను."

## విశేష వక్తవ్యము :

1. ఈ సృష్టిరచనా క్రమమున భూతసృష్టికి తరువాత మహదహంకారములను సృష్టించినట్లున్నది. ఇయ్యది వేదములయు, నుపనిషత్తులయు, స్మృతులయు రచనాక్రమమునకు విరుద్ధము.

2. ఇందు విష్ణువు జలమున నిద్రించి యుండెననియు, నతనినుండి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు జనించిరనియు నున్నది. విష్ణువునుండియే విష్ణువు మరల జనించుటెట్లు ? ఇది యుక్తిసంగతము కాదు. తరువాత మరల రెండవసారి యదితినుండియు విష్ణువు జనించినట్లున్నది. విష్ణువు రెండుమార్లేల యుత్పన్నమయ్యెను ?

3. దనువు దానవుల నుత్పన్నము చేసినట్లున్నది. కాని యాదను వెటనుండి వచ్చెనో వ్రాయలేదు.

4. దక్షుడు తన కన్యల నిచ్చిన ధర్ముడు, సోముడు నెటనుండి వచ్చిరో తెలియదు.

5. ఇందు కాలోత్పత్తికి తరువాత జలమునుండి మేఘము, స్థావర జంగమములు, విశాల తేజస్సుతో కూడిన భూమియు ఉత్పన్నములైనట్లు వ్రాయబడియున్నది. కాని యారంభమున పంచభూతములను రచించినట్లును ఉన్నది. ఇట్లు పృథివి యుత్పత్తి రెండుసారులు చెప్పబడినది.

6. దక్షుడు, మరీచి, అత్రి మున్నగు మనుష్యులు, రుద్రాదిదేవతలు, దైత్యులు దానవులు పుట్టినట్లు ముందు చెప్పబడినది. కశ్యపాది ఋషులతో దక్షకన్యలకు వివాహములు జరిగినవి. అనంతరము యోనిజసృష్టి యారంభ మైనది. దానికితరువాత మరల కృష్ణుని ముఖాద్యవయవములనుండి బ్రాహ్మణ క్షత్రియాదు లుత్పన్నులైనారని అయోనిజసృష్టి యేర్పడినట్లు చెప్పుట యుక్తిసంగత మెట్లగును ? పాఠకులు నిర్ణయింతురుగాక !

7. సత్యయుగమున మృత్యుభయము లేదని పైక్రమమున వ్రాయ బడి యున్నది. కాని, యంతకుపూర్వమే దైత్యులు పుట్టిన తరువాత మృత్యువు పుట్టినట్లు వర్ణింపబడి యున్నది. మృత్యువన లోకులు ఈ లోక మును విడిచి పరలోకమున కేగుటయేకదా ? కాబట్టి యప్పుడు మృత్యు భయము లేదని వ్రాయుట న్యాయసంగత మెట్లు కాగలదు ?

8. సత్య త్రేతాయుగములలో మైథునధర్మము లేదని యిందుగలదు. సత్యయుగమున సంకల్పము వలనను, త్రేతయందు స్పర్శమాత్రమునను సంతానము కలుగుచుండెడిదనియు నిందు గలదు. కాని, యీవర్ణన సత్య యుగమునాటి హరిశ్చంద్రుని కథకును, త్రేతాయుగమునాటి రాముని చరిత్రకును విరుద్ధము.

# సృష్టిరచనాప్రకారము - 4

[శుకదేవునకు వ్యాసోపదేశము]

(మ. భా. శాం. ప. 288 అ.)

"సృష్టికి పూర్వమున నజరము నమరమునగు పరబ్రహ్మమును, త్రిగుణాత్మకమగు ప్రధానమును నుండెను. వైష్ణవి, ప్రకృతి, మహామాయ యని యీ ప్రధానమునకే పేరులు. ఇది సత్వరజస్తమో గుణముల సము దాయము.

జీవుల కనేకవిధములగు కర్మఫలములనిచ్చుట కియ్యది ప్రాదుర్భవించెను. ఇందు క్షోభ (క్రియ) కలిగించుటకు భగవానుని సామీప్యస్థితి దీనికి చాలును. దీని నుత్పత్తి కనుకూల మొనర్చుచు భగవానుడందు ప్రవేశించి క్షోభ నుత్పన్నముచేసెను. క్షోభ కలిగినమీదట ప్రకృతినుండి మహత్తు కలిగెను. ప్రకృతికంటె నిందు స్థూలత యున్నందున దీనిని మహత్తనిరి. ఇందును సత్వరజస్తమోగుణత్రయ మేళన మున్నది. ప్రకృతి యీ మహత్తు నందుగూడ నన్నివైపులనుండి వ్యాప్తమై యుండును. దాని ప్రభావము వలన నా మహత్తునుండి సత్వరజస్తమోగుణాత్మక మయిన మువ్విధము లగు నహంకార ముత్పన్నమయ్యెను. వానిలో తమోగుణాత్మకమగు నహంకారమునుండి శబ్దతన్మాత్రయు, దానినుండి యాకాశము నుత్పన్నమయ్యెను. ఆకాశమునుండి స్పర్శతన్మాత్ర, దానినుండి వాయువును జనించెను. వాయువు నుండి రూపతన్మాత్ర, దానినుండి అగ్నియు నుత్పన్నమయ్యెను అగ్ని నుండి రసతన్మాత్రయు. దానినుండి జలము నుత్పన్నమయ్యెను. జలము నుండి గంధతన్మాత్ర జనించెను. ఆ జలము క్రమముగా మంచువలె గడ్డకట్టి పృథివియైనది. ఇట్లు పంచభూతము లుత్పన్నమైనవి. ఈ భూతముల పరస్పర మేళనమువలన నేర్పడిన విశేషావస్థయే యన్న మనబడును. పదునొకం డింద్రియములు మనస్సును తైజసములు. అనేక భేదములలో విభక్తమై యున్నకాలము కూడ నీ పరివర్తనములకు కారణమైయున్నది. గుణ భేదమువలన పరమాత్మకును మూడు రూపములును, క్రియలు నున్నవి. సృష్టించుటవలన నతడు బ్రహ్మయనియు, పాలించుటవలన విష్ణువనియు. సంహార మొనర్చుట వలన శివుడనియు జెప్పబడును."

## విశేష వక్తవ్యము :

ఈ రచనా ప్రకారమునందు, పదునొకం డింద్రియములు, మనస్సు తైజసములని చెప్పబడినవి. ప్రవృత్తి, ప్రకాశము నను రెండు తేజస్సు

కార్యములు. ఇంద్రియములు కూడ ప్రకాశము, ప్రవృత్తి కలవియే. కర్మేంద్రియములు ప్రవృత్తి కలవి. జ్ఞానేంద్రియములు ప్రకాశములు. ప్రకాశమిట జ్ఞానము. జ్ఞానేంద్రియములు. మనస్సు విషయజ్ఞానము కలిగించును. ప్రకాశము సత్వగుణకార్యము, ప్రవృత్తి రజోగుణకార్యము కాబట్టి జ్ఞానేంద్రియములు సత్వగుణప్రధానము లనియు, కర్మేంద్రియములు రజోగుణ ప్రధానము లనియు తెలియవలయును. మొదట తమోగుణ ప్రధానమగు నహంకారమునుండి పంచభూతోత్పత్తి చెప్పబడినది. రజోగుణప్రధానమగు నహంకారము సత్వగుణప్రధానమగు నహంకారము మిగిలియున్నవి. వాని కార్యములు చెప్పబడలేదు. కావున రజోగుణాహంకార కార్యము కర్మేంద్రియములనియు, సత్వగుణాహంకార కార్యములు జ్ఞానేంద్రియములు, మనస్సుననియు నెంచవలయును. వ్యాసుడు వీనినన్నిటిని కలిపి తైజసములని నుడివియున్నాడు. అతని పూర్వప్రక్రియ ననుసరించి తైజస శబ్దమున కర్థము పైన చెప్పినట్లు అనాయాసముగ దెలిసికొనవచ్చును.

ఈ ప్రక్రియయందు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు శరీరధారులైన దేవతలుగా ప్రకటింపబడలేదు. గుణకర్మభేదములనుబట్టి యొక పరమాత్మ కివి నామములని చెప్పబడినవి.

# సృష్టిరచనాప్రకారము - 5

[దేవతా నారద సంవాదము]

(మ. భా. శాం. ప. 218 అ.)

**'పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, నైదును మహాభూతము లనబడును. ఆత్మప్రేరితమైన కాల మీ పంచభూతములతోనే ప్రాణుల నుత్పన్నము చేయును. ఇంతకంటె నధికముగ జెప్పువా డసత్యము చెప్పును. నారద !'**

'కాలము, పంచమహాభూతములు నెల్లప్పుడు నుండునవియు, నాశము లేనివియు, స్థిరములు నని యెంచుము. ఇవి యన్నియు గొప్ప తేజో రాశులు. స్వభావముచేత నే యివి యట్టివి. ఈ పంచభూతములకు పరమున నేదియు యుక్తి ప్రమాణముల మూలమున సిద్ధముకాదు. ఇందు సంశయము లేదు. మనుష్య శరీరము పృథివినుండియు, శ్రోత్రమాకాశము నుండియు, చక్షువు సూర్యుని నుండియు, ప్రాణము వాయువు నుండియు, రక్తము జలమువలనను నేర్పడినవి'

**విశేష వక్తవ్యము :**

ఈ ప్రక్రియలో ప్రకృతి, మహత్తు, అహంకారము క్రమమున సృష్టి ప్రారంభింపబడలేదు. మహాభూతములనుండి యారంభింపబడినది. కాని, యవి స్థిరములు; నాశములేనివి; స్వభావముచే నట్టివిగా నంగీకరింపబడినవి. అట్లంగీకరింపబడక పోయినచో ప్రళయకాలమున నష్టమై సూక్ష్మరూపము నొంది పృథివి జలమునందును, జలము తేజస్సునందును, తేజస్సు వాయువు నందును, వాయువాకాశములోను లీనమగునట్లు నిర్దేశింపబడి యుండెడిది. అప్పుడు న్యాయ వైశేషికముల పద్ధతి ననుసరించి ఆంశిక సృష్టిరచన యని చెప్పుటకు వీలయ్యెడిది. కాని యిట నట్లులేదు. కావున దీని నాంశిక సృష్టి యనరాదు. ఈ ప్రక్రియలో నీ క్రింది దోషములు గలవు.

1. ఇందు పంచభూతములు స్థిరములు, నాశము లేనివని చెప్పబడెను. కాని వేదమునం దివి ప్రళయమున నుండవని యున్నది. ప్రమాణముకొఱకు ఋగ్వేదమున దశమమండలము 129 సూక్తము చూతురుగాక !

2. ఉపనిషత్తులుకూడ భూతములు ప్రళయమున స్థిరములని యంగీకరింపవు. తైత్తిరీయోపనిషత్తు బ్రహ్మానందవల్లి యిట ప్రమాణము.

3. భూతములకు పరమున నేమియు లేదని యిట వర్ణింపబడినది. కాని, సృష్టివిజ్ఞానము నెఱిగిన విద్వాంసులు మనువు, కపిలుడు నిరువురును ప్రకృతి మహదహంకారముల నంగీకరించుచున్నారు.

ఈ కారణములవలన నుపర్యుక్త సృష్టిరచన వేదోపనిషత్తులకు విరుద్ధము. లేఖకు డీ ప్రక్రియకు వైశేషికరూపమునొసంగ జూచియున్నాడు. కాని యదియును సరికాదు.

## సృష్టిరచనాప్రకారము - 6

[జనక వసిష్ఠ సంవాదము]

(మ. భా. శాం. ప. 308 అ.)

"మూర్తి రహితుడగు శంభువు మూర్తిధారియగు స్వయంభువు నుత్పన్న మొనర్చెను. హిరణ్యగర్భుడు, బుద్ధి, మహత్తు, విరించి యను నామము లితనికే. ఇత డనేక రూపములుగల ప్రపంచమును సృష్టించెను. అందువలన నితనికి విశ్వరూపుడనియు నామము. ఇతడు రెండువిధములగు నహంకారమును సృష్టించెను. అందొకదానికి విద్యాసర్గమనియు, రెండవ దానికి అవిద్యాసర్గమనియు నామములు. ఆ ప్రజాపతి తనను అవ్యక్త - నిరాకార - రూపమునుండి అహంకారయుక్త - వ్యక్త - సాకారరూపమున పరిణమింపజేయును. దీనికే విద్యాసర్గమని నామము. మహత్తునుండి అహంకారము నుత్పన్నము చేయును. దీనికే అవిద్యాసర్గమని నామము. ఈ యహంకారమునుండి వాయువు, అగ్ని, జలము, ఆకాశము, పృథివి, శబ్ద స్పర్శ రూప రస గంధములు నను పది యుత్పన్నమయ్యెను. తరువాత పది యింద్రియములు, మనస్సు నొకేమాటు ఉత్పన్నమయ్యెను. ఇట్లీ యిరువదినాలుగు తత్త్వముల యుత్పత్తి చెప్పబడినది. ఇరువది యైదవ తత్త్వ మవ్యక్తము. అయ్యది జ్ఞానముతో వ్యవహరించు చేతనము."

**విశేష వక్తవ్యము :**

ఈ ప్రక్రియలో విద్యాసర్గము, అవిద్యాసర్గమునని అహంకారము లను రెంటిని బ్రహ్మ సృష్టించెను. తరువాత అవిద్యాసర్గమునుండి భూతోత్పత్తి జరిగినది. కాని విద్యాసర్గ ప్రయోజన మిందు చూపబడలేదు. ప్రజాపతి స్వయముగ విద్యాసర్గనామముతో నహంకార రూపమును ధరించెను. కాబట్టి యిది చేతనపరిణామముగ దోచుచున్నది. కాని యీ చేతన మెయ్యది? దీని ప్రయోజన మేమి ? స్పష్టపఱుప బడలేదు. ఉపనిషత్తులలో కాని, స్మృతులందు కాని, దర్శనములలో కాని యిట్టి విద్యాసర్గనామక మగు నహంకార మెక్కడను జూడము. ప్రజాపతి తన నిరాకార రూపము నుండి సాకారరూపమున పరిణతుడైనట్లు ఇక్కడ వర్ణింపబడెను. కాని, అరంభముననే మూర్తిరహిత భగవంతుడు మూర్తిమంతమగు స్వయంభువు నుత్పన్నము చేసెనని యుండెనుకదా ? మఱి యత దవ్యక్తముగా నెట్లుండెను ?

అహంకారమునుండి పంచభూతములు, శబ్దాదులు నన్నియు నొకేసారి యుత్పన్నమైనట్లు చెప్పబడినది. కాని నాలుగవ సృష్టిరచనాక్రమము నందివియన్నియు క్రమముగా నుత్పన్నమైనట్లు పూర్వముచెప్పబడియున్నది. దానిని ఉపనిషదాదులు సమర్థించుచున్నవి. కాబట్టి యదియే సరియని యంగీకరించుట యుచితముగా కనబడుచున్నది.

# సృష్టిరచనాప్రకారము - 7

[యాజ్ఞవల్క్యుడు జనకున కుపదేశించుట]

**(మ. భా. శాం. ప. 315 అ.)**

ఎనిమిది ప్రకృతులు, పదునాఱు వికారములు - ఇది సాంఖ్య యోగ ముల సామాన్యమతము, విశేషరూపమున సాంఖ్యమతము. ఈ యిరువది నాలుగింటిలో నేడు వ్యక్తములు, మిగిలినవి యవ్యక్తములు. అవ్యక్తము,

మహత్తు అహంకారము, పృథివి, వాయువు, ఆకాశము, అగ్ని, జలము నను నీ యేడు ప్రకృతులు. శ్రోత్రము, త్వక్కు, చక్షువులు, జిహ్వా, నాసిక, శబ్దస్పర్శరూపరసగంధములు, వాక్పాణిపాదములు, అపానము, జననేంద్రియము, మనస్సు నను నీ పదునారు వికారములు. దీనికి తరువాత తొమ్మిదిసర్గములు చెప్పుదురు. అవ్యక్తమునుండి మహదుత్పత్తి మొదటిసర్గము. మహత్తునుండి అహంకారోత్పత్తి ద్వితీయము. అహంకారమునుండి మనస్సు జనించుట మూడవసర్గము. మనస్సునుండి పంచమహాభూతోత్పత్తి నాల్గవ సర్గము. మహాభూతములనుండి శబ్దస్పర్శరూపరసగంధముల యుత్పత్తి యైదవ సర్గము. శ్రోత్రాదుల యుత్పత్తి యాఱవ సర్గము. దీనిని చింతాత్మక సర్గమందురు. దీనికి తదుపరి శ్రోత్రాదీంద్రియముల సముదాయ ముత్పన్నమగును. ఇయ్యది యేడవది. దీని నైంద్రియికమందురు. ఉపరి స్రోతస్సు, వక్రస్రోతస్సు, నిమ్నస్రోతస్సు, ఉత్పన్నములగును. ఇది యెనిమిదవ సర్గము. దీనిని ఆవర్జకమందురు. వక్రస్రోతస్సు, నిమ్నస్రోతస్సు నుత్పన్నమగును. ఇది తొమ్మిదవ సర్గము. దీనిని ఆవర్జకమందురు.

**విశేష వక్తవ్యము :**

ఈ రచనా ప్రకారము నాలుగవ రచనా ప్రకారము ననుసరించి వ్రాయబడినది. కాని, దానితో కూడ నిది కలియదు. అందు పంచభూతోత్పత్తి యహంకారమునుండి యైనట్లున్నది. ఇందుననో, మనస్సునుండి. అందు శబ్దాది తన్మాత్రలు భూతములనుండి యుత్పన్నమైన ట్లున్నది. ఇందు భూతముల తరువాత నుత్పన్నమైన ట్లున్నది. అందు నింద్రియోత్పత్తి యహంకారమునుండియు, నిందు భూతములనుండియు నైన ట్లున్నది. నాలుగవ సృష్టి రచనా క్రమము కపిలునియు, మనువుయొక్కయు రచనాక్రమములతో బోలియున్నది. ఉపనిషత్తులతోను దానికి

బోలిక యున్నది. అందువలన నదియే యుక్తమగును. ఈ రచనాక్రమ మయుక్తమే.

ఈ ప్రక్రియలో శ్రోత్రాదీంద్రియోత్పత్తి రెండుమారులు చెప్పబడినది. రెండవమారు చెప్పినది ఇంద్రియ గోలకముల యుత్పత్తి కావచ్చును. కాని, ఇంద్రియ గోలకములు శరీరభాగములే. అందువలన శరీరరచనా వర్ణనములోనే వాని రచనావర్ణన వచ్చియుండవలసినది. అట్లు రాలేదు.

ఈ రచనాక్రమమున ఆవర్జకములని జెప్పబడిన పైని, క్రింది, వంకర స్రోతస్సులేమో తెలియకున్నవి, ఈ స్రోతస్సు కర్థము ఆకాశ మనుటకును వీలులేదు. ఆకాశోత్పత్తి యంతకుముందే చెప్పబడినది. మఱి యా స్రోతస్సు శూన్యమునకు పేరందుమేని యది నిత్యమగుటచే దాని యుత్పత్తిని జెప్పుట యసంగతమగును.

ఈ సృష్టిక్రమమును లేఖకుడు శ్రుత్యనుకూలమని యన్నాడు. దీనిని ప్రతిపాదించు శ్రుతియేదో తెలియదు. కపిలునకుగాని, మనువుకు గాని యిట్టిశ్రుతి దొరకలేదు. దొరకియున్న వారుకూడ నిట్టే రచనాక్రమ మును జెప్పియుండెడివారు.

## సృష్టిరచనాప్రకారము - 8

[కపిలుడు ఆసురి కుపదేశించుట]

(మ. భా. శాం. ప. 327 అ.)

ఉత్తమరజస్సు, సత్త్వము, ప్రధానము, తత్త్వము, అజరము, అక్షరము మున్నగునవి అవ్యక్త నామములు. అవ్యక్తమునుండి మొదటి తత్త్వము వ్యక్త ముద్భవించెను. పురుషుడు, మహత్తు, బుద్ధి, స్మృతి, ధృతి, మేధ, వ్యవసాయము, సమాధి, ప్రాప్తి మున్నగునవి వ్యక్తమునకు నామములు. ఈ వ్యక్తమునుండి అహంకార ముద్భవించును. అది వ్యక్త

తర మనబడును, విరించి, అభిమానము, అవివేకము, ఈర్ష్య, కామము, క్రోధము, లోభము, మదము, దర్పము, మమత యనునవి యన్నియు వ్యక్తతరాహంకారమునకు నామములు. అహంకారమునుండి శబ్దస్పర్శరూప రసగంధములు కల భూతములు జనింపజేయబడినవి. వీనితోబాటు త్వక్ చక్షుః శ్రోత్ర జిహ్వా ఘ్రాణములను నైదింద్రియములు, వాక్పాణి పాదాపాన జననేంద్రియములను నైదు కర్మేంద్రియములను నుత్పన్నము లైనవి.

## విశేష వక్తవ్యము :

ఈ సృష్టిరచనా ప్రకారముకూడ నితర ప్రకారములకంటె విలక్షణముగానే యున్నది. ఇందు ప్రకృతి యవ్యక్తమనబడినది. ఆ యవ్యక్త శబ్దముచేతనే చేతనాశక్తికూడ గ్రహింపబడినది. ఈ మూలతత్త్వమునుండి యుత్పన్నమైన మహత్తు, దానినుండి యుత్పన్నమైన యహంకారము రెండును జడచేతనముల మిశ్రిత పరిణామములని యెంచబడినవి, కావుననే యీ రెండు తత్త్వములకు ద్వివిధములగు నామములు పెట్టబడినవి. రెండవ పరిణామమునకు మహత్తనియు, పురుషుడనియు రెండు నామములు. మూడవ పరిణామము విరించి (బ్రహ్మ) అహంకారమునని యనబడినది. ఈ విరించి పదమునకు బ్రహ్మ యను నర్థము మేము చెప్పినదికాదు. ఈ ప్రక్రియ వ్రాసిన లేఖకు డిట్లే యభిప్రాయ పడుచున్నాడు. దీనిని ఋజువు చేయుటకు నీ యధ్యాయమునందలి శ్లోకమునే యుల్లేఖించుచున్నాము.

"అహం కర్తేత్యహంకర్తా ససృజే విశ్వమీశ్వరః,
తృతీయ మేనం పురుష మభిమానగుణం విదుః."

మ. భా. శాం. ప. 237 అ. 13 శ్లో.

"నేను జేయుదు, నేను చేయుదు నను అహంకార భావముతో నీశ్వరుడు ప్రపంచమును రచించెను. ఈ యభిమానగుణము కలవాడు తృతీయపురుషుడు."

ఈ శ్లోకమిట నహంకారరచన ప్రసంగముననున్నది. అహంకారము ప్రకృతినుండి మూడవది. కావున నీ పురుషుడు మూడవవా డనబడినాడు. ఇతడు సృష్టికర్త. కాబట్టి యీ మూడవపురుషుడు విరించి యనబడినందున నతడు బ్రహ్మయే యగునని భావము. అహంకారమున నిట్లు జడచేతనముల మేళనము చూచి, రెండవ పరిణామమైన మహత్తుకు గూడ బ్రయుక్తమయిన పురుషశబ్దము చేతనమునే తెలుపునని యనవలసియున్నది. ఈ రెండవ పురుషు డెవడో తెలియదు. ఈ ప్రక్రియలో నితని పనిమేమియు కనబడదు. పరిణామముల యీ స్వరూపమును జూచి యారంభమున గల యవ్యక్తము కూడ జడము, చేతనము నని యెంచవలసి యున్నది.

ఈ విధముగ నహంకారమువఱకు జడచేతనములను కలిపి సృష్టి రచియింపబడినది. తరువాత పంచమహాభూతాదుల యుత్పత్తిలో చేతనము గ్రహింపబడదు. పూర్వపుసృష్టి మిశ్రితతత్త్వములతో నైనట్లు తెలిపినందున భూతాదులును మిశ్రితతత్త్వములే యైయుండవలసి యుండెను.

నాల్గవ సృష్టిరచనాక్రమమునందు తన్మాత్రలక్రమమున భూతోత్పత్తి చెప్పబడెను. కాని, యిందు శబ్దాదిగుణయుక్తభూతముల యుత్పత్తి యొకే మాటు చెప్పబడినది. అందు ఆకాశమునుండి వాయువు. దానినుండి యగ్నియు ననుక్రమమున భూతోత్పత్తి చెప్పబడినది. ఇందు భూతము లన్నియు ననేకముగా జనించినట్లున్నది. ఇట్టి ప్రక్రియ యంతయు నాలుగవ రచనాప్రకారమునకు విపరీతముగ నున్నది. నాల్గవప్రకారము శ్రుతిస్మృతుల కనుకూలముగ నున్నది. కావున నదియే యథార్థమని యెంచవలయును.

## సృష్టిరచనాప్రకారము - 9

[నారదునకు విష్ణూపదేశము]

(మ. భా. శాం. ప. 347 అ.)

ఓ నారద! జగత్తును ధరించు నీ పృథివి జలమునందు లీనమగును. ఆ జలము జ్యోతిలోను, జ్యోతి వాయువునందును, వాయువు ఆకాశము

నందును, ఆ మనస్సు అవ్యక్తమునందును, అవ్యక్తము పురుషునియందును లీనమగును. ఆ సనాతన పురుషునకు పరమున నేమియును లేదు. అతడు తక్క మఱియొకటి నిత్యముకాదు. అతడే వాసుదేవుడు; సనాతనుడు.

పృథివ్యాపస్తేజోవాయురాకాశములన్నియు గలిసి శరీరమగును. ఆ శరీరమునందు ప్రవిష్టుడై దానిని నడుపువాడు జీవుడు. అతడే శేషుడు. అతడే సంకర్షణుడు. అతడు తన కర్మానుసారముగనే సనత్కుమారుడయ్యెను. భూతములన్నియు నే మనస్సునందు లీనమగునో యా మనస్సే ప్రద్యుమ్నుడు. ప్రద్యుమ్నునుండి యే కార్యకారణసంఘాత ముత్పన్నమయ్యెనో దాని పేరు అనిరుద్ధుడు. జీవుడే వాసుదేవుడు, క్షేత్రజ్ఞుడు, సంకర్షణుడు. సంకర్షణునినుండి ప్రద్యుమ్నుడను మనస్సును, దానినుండి యనిరుద్ధుడను నహంకారమును నుత్పన్నమగును. దాని పేరే యీశ్వరుడు. నారద! యీ స్థావరజంగమ జగత్తంతయు నావలననే యుత్పన్నమగును. నేను రూపవంతుడనని యెంచకు. నే నొక్కక్షణములో నీ కన్నులకు గనబడకుండున ట్లదృశ్యుడను కాగలను. యోగయుక్తులగు భక్తులు నాయందే ప్రవేశింతురు. ఈ తత్త్వములలో నిరువదియైదవ తత్త్వము నేనే.

**విశేష వక్తవ్యము :**

ఈ రచనాప్రకార మనేక యంశములలో మూడవ సృష్టి రచనాక్రమముతో సమత్వము కలిగియున్నది. ఈ రెండు క్రమములందును జీవుడు సంకర్షణుడనియో లేక వాసుదేవుడనియో చెప్పబడియున్నాడు అట్లే ప్రకృతి యొక్క ప్రథమపరిణామమగు మహత్త్వము ప్రద్యుమ్నుడనియు, రెండవ పరిణామమగు నహంకారము అనిరుద్ధుడనియు వర్ణింపబడినది.

ఈ ప్రకరణమున జీవుడే సంకర్షణుడు, వాసుదేవుడు, క్షేత్రజ్ఞుడు నని యున్నది. మఱియు మూడవ పరిణామమైన యహంకారమునే అనిరుద్ధుడు

ఈశ్వరుడు నని వర్ణించుట చూడనగును. ఇయ్యది వైదిక సృష్టిక్రమమునకుగాని, స్మార్త సృష్టికిగాని, దార్శనిక సృష్టికిగాని యనుకూలముగాదు. వాస్తవమున, నుపర్యుక్త 3-8 సృష్టిక్రమములలోను శ్రీకృష్ణునకుగల యైతిహాసిక రూపమును దొలగించి యతని నొక కల్పిత వస్తువుగా నొనర్చుటకు ఇందు ప్రయత్నించినట్లు విచారశీలురకు దోచకపోదు. జీవుని పేరే వాసుదేవుడనియు, సంకర్షణుడనియు ననుటవలన వసుదేవుని పుత్రుడైన వాసుదేవుని యునికిలో సంశయము కలుగుటయేకాక, యతని సంతానములయిన ప్రద్యుమ్నానిరుద్ధులను మహదహంకారము లనుటవలన కృష్ణుడు కల్పితుడనుట మిక్కిలి సంభవమగును. ఈ విష్ణు నారదుల సంవాదముకూడ నీ కల్పనను దృఢపఱచుటకే రచించినట్లు తోచుచున్నది. విష్ణుభగవానుని ముఖమునుండి వెలువడినమాటలు శ్రద్ధేయము లగునుకదా ?

ఈ ప్రక్షేప సమయమున కృష్ణు డవతారపురుషుడని యంగీకరించువారు కొందఱు, కాదని నిషేధించువారు కొందఱు నుండి యుందురని యెంచుట కెంతయు నవకాశముగలదు. కృష్ణుడు భగవంతుని యవతారము కాదనువారే యతని యునికికే భంగము కలిగించుటకై యిట్టి కల్పనచేసి యుందురని యూహింపవచ్చును.

మహాభారతములోని యీ కాల్పనిక ప్రక్షిప్తభాగములే యైతిహాసికుల దృష్టిని మార్చివేయును. ఇట్టి భాగములను ప్రమాణముగ గ్రహించినందున మహాభారతమంతయు కాల్పనికమని యనుట కవకాశములభించును.

మహాభారతములోని నవవిధములగు నుపర్యుక్తసృష్టి ప్రకరణములను పాఠకులు చదివియుందురు. వాని విషయమున విశేష వక్తవ్యములందు మా యభిప్రాయములను వివరించితిమి. ఇంకను కొన్ని సామాన్యాభిప్రాయముల నిట పొందుపఱచుచున్నాము.

సృష్టి రచనాక్రమమునకు చెందిన యీ ప్రకరణములు శాంతిపర్వమున విభిన్న స్థానములందు జూడనగును. ఒకచో లభింపవు. ఈ ప్రసంగములన్నియు వ్యాసునివి కావు. ఈ నిర్ణయమునకు వచ్చుట కీ క్రింది కారణములు పాఠకులు గమనింతురుగాక :

1. ఇవియన్నియు వ్యాసరచితములగునెడల వీనిలో పరస్పరవిరోధ ముండరాదు.

2. వ్యాసుడు వేదవిదుడు. వేదములకు అనన్య భక్తుడు. సుయోగ్య సంపాదకుడు. కావున తన గ్రంథమున పూర్వాపర విరుద్ధములు, శ్రుతి స్మృతి విరుద్ధములునగు విషయములకు తావీయడు.

3. సృష్టిరచన యను నొకే విషయమును భిన్నభిన్న స్థానములలో ప్రకటింప నవసరము లేదు.

ఇవియన్నియు విభిన్న సృష్టులకు సంబంధించిన మతములుగా ప్రదర్శించి యుండవచ్చునని యెవరేని యనవచ్చును. కాని, క్రింది కారణములను బట్టి యదియును సరికాదు.

1. ఒకే విషయమునకు చెందిన వేరువేరు మతములు తొమ్మిది చూపుట వారి కిష్టమగునెడల వాని నొక్కతావుననే ప్రదర్శించి తుదకు తన మతమును అంకితమొనర్చి యుండెడివాడు.

2. ఈ తొమ్మిదింటిలో మూడుప్రసంగములను వర్ణించువారు బ్రహ్మ, విష్ణువు, వ్యాసుడును. ప్రస్తుతపు మహాభారతము ననుసరించి బ్రహ్మయే సృష్టికర్త. విష్ణువు స్వయముగా నీశ్వరుడే. ఇక వ్యాసుడు విష్ణ్వవతారమే కదా ! అందువలన నీ ముగ్గురి మతములలో విరోధ ముండరాదు. కాని వీరి మతములలోకూడ విరోధమున్నట్లు పూర్వము చదివియున్నారు.

3. ఈ తొమ్మిది మతములలో నొకటి రాముడు, పరశురాముడు, నారదుడు, వ్యాసుడు, అసితుడు, వాల్మీకి యనువారి పరస్పర సంవాదమై

యున్నది. ఇందు రాముడు, పరశురాముడు, వాల్మీకి యను ముప్పురు వ్యాసునకు సమకాలికులు కారు. కాగా వారి పరస్పర సంవాదాత్మకమగు నీ ప్రసంగము కల్పితమగుట స్పష్టము. రామాదులు వ్యాసుని కాలమున నున్న ఋషులే యందురేని యా ప్రసంగము 'వ్యాస శుకసంవాద' మున కనుకూలముగా నుండవలయును. కాని, విరుద్ధముగా నున్నది.

కాబట్టి పై తొమ్మిది ప్రసంగములలో నెనిమిది వ్యాసునివి కావు. ఇతర మహర్షులవి కూడ కావు. అవి కల్పితములే యని పాఠకులు గ్రహించియే యుందురు. కాని, యీ తొమ్మిది ప్రసంగములలో వ్యాసమహర్షి రచితమని చెప్పదగిన ప్రసంగ మేదో వేఱుగ తెలిసికొనవలసియున్నది. 'వ్యాసశుక సంవాదము' అను నాలుగవ సృష్టి రచనాప్రకరణమే మూల భారతములలోని వ్యాసరచిత ప్రసంగ మని మా యభిప్రాయము. ఇందలి సృష్టి క్రమమును శ్రుతి స్మృతులు, దర్శనమును ఆమోదించుచున్నవి. మిగిలిన ప్రసంగములన్నియు ప్రక్షిప్తము లనకతప్పదు. పాఠకు లీ నిర్ణయ మునకువచ్చుట కీ క్రింది మూడుఋక్కుల వ్యాఖ్యానమును జదువుదురుగాక!

"ఓం ఋతం చ సత్యం చాభీద్ధాత్తపసోఽధ్యజాయత, తతో రాత్ర్యజాయత తతః సముద్రో అర్ణవః" ఋ. 10-190-1.

"ఓం సముద్రా దర్ణవా దధి సంవత్సరో అజాయత, అహోరాత్రాణి విదధద్ విశ్వస్య మిషతో వశీ." ఋ. 10-190-2.

"ఓం సూర్యచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్ దివం చ పృథివీం చాంతరిక్ష మథోస్వః" ఋ. 10-190-3.

**భా వా ర్థ ము :**

**(అభీద్ధాత్తపసః) జ్ఞానభండారమగు భగవంతుని సమున్నత తపము (ఈశ్వరుని మూలమున ప్రకృతియం దేర్పడు క్షోభ) వలన (ఋతంచ సత్యంచ అజాయత) జ్ఞానము. సత్యము నుత్పన్నమయ్యెను.**

ఆది సత్యమన ప్రకృతియొక్క ప్రథమ పరిణామమయిన సత్వగుణ ప్రధానమగుమహత్తత్త్వమని గ్రహింపవలయును. అంతఃకరణమునందుసత్వగుణము ప్రధానముగ నున్నపుడే సత్యమాభాసించును. అందువలన సత్య మనబడినది. అట్టి సత్యజ్ఞానముకూడ తపమువలననే జనించును. తపస్సువలన సత్యజ్ఞాన ముత్పన్న మగునట్లు భగవంతుని ద్వారమున ప్రకృతిలో క్షోభ - తాపము - ఉత్పన్నమైనపుడు సత్యము - మహత్తత్త్వము జనించినదని భావము. పై మంత్రములలో సృష్టిక్రమము సంక్షిప్తముగాను, ఆలంకారికముగాను వర్ణింపబడినది.

(తతో రాత్ర్యజాయత) తరువాత రాత్రి యుత్పన్నమైనది. సత్వగుణ ప్రధానమైన దివమున (పగలు) కు తదుపరి తమః ప్రధానమగు రాత్రి యుత్పన్నమయినట్లు సత్వగుణ ప్రధానమగు మహత్తత్త్వమునకు తరువాత తమోగుణ ప్రధానమయిన అహంకారము జనించును. రాత్రివలన నిద్ర, ఆలసట కలుగునట్లు అహంకారమువలన ప్రమాదాలస్యములు జనించును. అందువలననే యహంకారము రాత్రి యనబడినది. ఇట్టి సమత నాధారముగ తీసికొనియే లోకవ్యవహారము ఏర్పడుచుండును. ఒక మనుష్యునియందు సత్వగుణము మిక్కుటముగా జూడబడిన నతనికి మహత్త్వమియ్యబడును. గొప్పతన మొసంగబడును. అట్టి మహత్త్వము లభించిన మీదటనే యతని యందు అభిమాన మేర్పడును. అది తమోగుణ ప్రధానముగ నుండును. గొప్పతనము లభించినమీదట నహంకారము - అభిమాన మేర్పడునను నీ యుపదేశము నిచ్చుటకే మంత్రమునందు మహత్తత్త్వమునకు తదుపరి అహంకారము జనించుననుటకు రాత్రి జనించునని యాలంకారికముగ భగవంతుడు మంత్రమున నుపదేశించి యున్నాడు.

(తతః సముద్రో అర్ణవః) అటుపై సముద్రము, అర్ణవము, నుత్పన్నమయ్యెను. వైదికభాషలో నాకాశము సముద్ర మనబడును. జలసముదాయ

ఘును చెప్పుట కిట అర్ణవ శబ్దము వేఱుగ ప్రయోగింపబడినది. అందువలన సముద్రశబ్ద మాకాశముకొఱకే ప్రయోగింపబడినదని అచట నెంచవలయును. అందువలన నహంకారమునకు తదుపరి ఆకాశము, జలనిధి జనించినవని గ్రహించుట యుక్తము.

మంత్రమున నిట నహంకారము తదుపరి ఆకాశము జనించుననియు తదుపరి జలోత్పత్తి యగుననియు చెప్పబడినది. కాని, ఆకాశానంతరమున జలోత్పత్తికి పూర్వము జరుగు సూక్ష్మ సృష్టిభేదములు వర్ణింపబడలేదు.

వేదములు సూక్ష్మరూపముననే యున్నవి. అందులో ప్రతి విషయమును విపులముగ వర్ణించిన పక్షమున మానవు డా వేదములను ననేక జన్మములలోను జదువలేనంత పెద్ద గ్రంథములయి యుండెడివి. మనుజుడు తన బుద్ధిబలము మూలమున వేదమునందు సూక్ష్మముగ సూచింపబడిన జ్ఞానాంకురములను గ్రహించి వానిని విస్తరింపజేసి శాఖా ప్రశాఖాయుక్త వృక్షములుగ జేయవలసి యున్నాడు. తదుపరి పుష్పఫలములను బొంద గలుగును. అందువలననే మహర్షులీ యాకాశ జలసృష్టులకు మధ్యనేర్పడిన యవస్థా విశేషములను వర్ణించి యున్నారు. కపిల మహర్షి, మనువు నను వీరిరువురును అహంకారమునకు తరువాత నాకాశమేర్పడులోపలశబ్దతన్మాత్ర (ఆకాశపు సూక్ష్మావస్థ) యేర్పడుట యవసరమనిరి. అట్లే ఆకాశమునకు తదుపరి జలము కలుగుటకు ముందు వాయువు, అగ్ని యేర్పడవలసి యున్నదని తిత్తిరి మహర్షి తన (తైత్తిరీయ) ఉపనిషత్తునందును ప్రశస్త పాదులు తమచే రచియింపబడిన వైశేషికదర్శన భాష్యమునందును వ్రాసి యున్నారు. కపిలుడు, మనువు ననువారు వాయువు అగ్ని యేర్పడుటకు ముందే వాని సూక్ష్మరూపములగు స్పర్శతన్మాత్ర, రూపతన్మాత్ర యేర్పడ వలయునని నుడివియే యున్నారు. మహర్షి వ్యాసుడు పూర్వ మీ పుస్తకమునందు వర్ణింపబడిన నాలుగవ సృష్టిరచనా క్రమమునందు పై అంశముల నన్నింటిని చక్కగ జెప్పియున్నాడు.

(సముద్రాదర్ణవా దధి సంవత్సరో అజాయత)అ జలావస్థను బొందిన ఆకాశమునుండి సమస్తలోకములను తనలో నిముడ్చుకొనునట్టియో లేక సంవత్సరమంతయు నుండునట్టియో యొక వస్తు వేర్పడినది.

ఆ జలమునం దుత్పన్నమైన వస్తువును గూర్చి 'ఒక్క సంవత్సర కాలము జలమునందు ప్రకాశమయమగు నొక గొప్ప యంద ముండె' నని శతపథబ్రాహ్మణము - 11-1-1 వర్ణించినది.

మనువుకూడ తన గ్రంథమున ప్రథమాధ్యాయపు తొమ్మిదవ శ్లోకమున నీ వస్తువునుగూర్చి యిట్లే చెప్పియున్నాడు. దాని యాకార నామముల నట్లే వర్ణించినాడు.

ఈ యండమునందు లోకలోకాంతరములు వసించుటచే నియ్యది 'అధి సంవత్సర' మనబడినదనియు. నొక సంవత్సర కాల మిది జలమున నుండి, పెరిగి, పెద్దదై పక్వమైనదనియు మే మంతకు పూర్వమే వ్రాసి యుంటిమి.

మేము వ్రాసిన యీ యర్థము వ్యాకరణము ననుసరించి సరియగుటయేకాక, యిది యుక్తి ప్రమాణసంగత మనియు చెప్పుట సముచితమని యెంచుచున్నాము. ఋగ్వేదములోని యీ మంత్రములలో నికముందు పృథివి, సూర్యుడు మున్నగు లోకముల యుత్పత్తి చెప్పబడినది. ఆ లోకలోకాంతరము లే వస్తువునుండి యుత్పన్నమయ్యెనో శతపథబ్రాహ్మణమున చదువగలము.

"తదిదం హిరణ్మయాండే యావత్ సంవత్సరస్య వేలా, తావత్ పర్యప్లవత" (11-6-1)

"ఈ ప్రకాశమయమగు నండము ఒక్క సంవత్సర కాలము జలమున తేలియాడుచుండెను." ఇట్లు జలమునం దీ యండ ముద్భవించినట్లు

చెప్పి, తదుపరి దానిని భగ్నముచేసి యందుండి లోకలోకాంతరముల యుత్పత్తి చేసినట్లు చెప్పబడెను.

అట్లే పైన చూపిన మంత్రములందును లోకలోకాంతరముల యుత్పత్తి చెప్పబడినది. మఱియు సంవత్సరముననుండు కొండొక వస్తువు కూడ సూచింపబడినది. అందువలన నీ యధిసంవత్సరము లోకోత్పత్తికి బీజ మనక తప్పదు. అయ్యదియే శతపథమున నండమని చెప్పబడినది. మనువుకూడ నీ యభిప్రాయమునే మొదటి యధ్యాయమున జెప్పియున్నాడు.

ఇట్లు జలోత్పత్తి యైనది. అందు అధి సంవత్సరమను పేరుగల యొక గొప్ప యండ ముద్భవించినది. తరువాత నా యండము పగిలి యందుండి పృథివి యుత్పన్నము కానున్నది. ఆకాశము, వాయువు, అగ్ని, జలము నను మహాభూతోత్పత్తికి పూర్వము వాని సూక్ష్మరూపములగు శబ్ద స్పర్శ రూప రసతన్మాత్ర లుద్భవించినవని ఋషులు వర్ణించినట్లు పృథివి యుత్పన్నమగుటకు ముందే దాని సూక్ష్మవస్థయైన గంధ తన్మాత్రయుత్ప న్నము కావలసియున్నది. కాని, పై మంత్రములందీ తన్మాత్రను గూర్చిన స్పష్టీకరణము లేదు. అందువలన కపిలుడు, మనువు నీ యంశమునుగూర్చి వ్యాఖ్యానము చేసియున్నారు. పృథివికి పూర్వము గంధతన్మాత్ర యుద్భ వించినదని వారు నుడివిరి. ఇట్లీ యండమున పంచ మహాభూతముల మేళన మున్నట్లు తెలియుచున్నది ఈ భూతముల కలయిక వలననే యితర లోక లోకాంతరములు తదుపరి యుత్పన్నమగునని తెలియనగును.

ఇంద్రియములుకూడ శబ్ద తన్మాత్రవలె నతి సూక్ష్మములు. వాని యుత్పత్తియు పై మంత్రములందు వర్ణింపబడి లేదు. కావుననే కపిలాది మహర్షు లీ యంశమునుగూడ తమ గ్రంథములలో స్పష్టపఱచియున్నారు. అహంకారమునుండియే ఇంద్రియములుకూడ శబ్ద తన్మాత్రవలె నుత్పన్న మైనట్లు వారు నుడివియున్నారు. వ్యాసుడుకూడ భారతమున పూర్వమున

జూపినట్లు నాల్గవ సృష్టిప్రకరణమునం దీ యంశముల నట్లే సంగ్రహించి యున్నాడు. పదునొకం డింద్రియములు కూడ నాకాశాదులతో బాటు ఆ యండములోనే యున్నవని వేఱుగ జెప్పనక్కఱలేదు.

తన్మాత్రల యుత్పత్తి విషయమున కొంత మతభేదము లేకపోలేదు. ఒక మహర్షి వీని యుత్పత్తి తిన్నగా నహంకారమునుండి జరిగినట్లంగీకరించి యున్నాడు. మఱియొక రట్లుకాక యహంకారమునుండి యాకాశ తన్మాత్ర, దానినుండి యాకాశము, ఆ యాకాశమునుండి స్పర్శ తన్మాత్ర, దానినుండి వాయువు, ఆ వాయువునుండి రూపతన్మాత్ర, దానినుండి యగ్ని అను నీ క్రమమున నుత్పన్నమైన ట్లంగీకరించియున్నారు. కాని యీ మతభేదమంతగా మౌలికమనరాదు. సూక్ష్మమునుండి స్థూల ముత్పన్న మగునను సృష్టిక్రమమునకు చెందిన ముఖ్యనియమము పై రెండు మతము లందును సమానముగ జూడనగును

సృష్టిరచనలో భూతసృష్టి, లోకసృష్టి యని రెండుభాగము లున్నవి. పంచభూతములు, ఇంద్రియములు రెండును భూతసృష్టికి చెందినవి. పృథివి, చంద్రుడు, సూర్యుడు మున్నగు లోకములు లోకసృష్టిలో చేరును.

కొన్ని యెడల నాంశికసృష్టి రచనయు, మఱికొన్ని యెడల పూర్తి సృష్టిరచనయు లభించును. యాజ్ఞవల్క్యుడు శతపథమునందు జలముతో సృష్టిరచన నారంభించియున్నాడు. అతడు ప్రకృతి, మహదహంకార పంచ తన్మాత్రాది క్రమమున భూతముల రచన వర్ణింపకయే లోకసృష్టిమాత్రము వర్ణించి యున్నాడు.

కావున జలమునుండి యారంభించి అంత క్రమమున లోకరచన యైనట్లు వర్ణించినాడు. తైత్తిరీయమునందును, వైశేషికమునందును ఆకాశమునుండి మొదలిడి సృష్టిరచన చెప్పబడినది. వారు ప్రకృతి మొదలు తన్మాత్రలవఱకు గల క్రమమును చెప్పరైరి. కపిలుడు, వ్యాసుడు నిరువురు

ప్రకృతి మొదలు చివరివఱకు క్రమముగ భూతసృష్టి వర్ణించినారు. కాని లోకముల సృష్టిని జెప్పరైరి. మహర్షి మనువు మాత్రము లోకసృష్టి, భూతసృష్టి రెండును వర్ణించి యున్నాడు. ఇట్లు ఋషుల వ్యాఖ్యానమున నొకయెడ నాంశికముగను, మఱియొక యెడ బూర్ణముగను సృష్టిరచన గ్రంథములందు జూడనగును. కాని, క్రమము మాత్ర మందఱిదియు నొక్కటే. విరోధములేదు. వారు తమ రుచుల కనుకూలముగ నా యా యంశములను వర్ణించినారు.

పైన జూపిన ఋక్కులలో నింతవఱకు భూతసృష్టి యెట్లు వర్ణింపబడినదో చూపియున్నాము. ఇక లోకసృష్టి మిగిలియున్నది.

(అహోరాత్రాణి విదధద్ విశ్వస్య మిషతో వశీ: సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్ దివం.చ పృథివీం చాంతరిక్ష మధో స్వః)

**భా వా ర్థ ము :**

అన్నిటిని వశమునందుంచుకొని ధారణచేయు నాపరమాత్మ జగత్తు కొఱకు దినరాత్రులను నిర్మించుచు, పూర్వసృష్టిలోవలె సూర్యచంద్రులను, దివమును, పృథివిని, స్వర్లోకములను సృజియించెను.

అధిసంవత్సరమను నండమును బ్రద్దలుచేసి వానినుండి భగవంతుడు వేఱు వేఱు లోకములను సృష్టించినాడని తాత్పర్యము. ఈ లోకములలో నంతరిక్షముకూడ లెక్కకువచ్చినది. అంతరిక్ష మన నాకాశము. ఆకాశము పూర్వమే యుత్పన్నమైనట్లు మొదట చెప్పి మరల నిట నయ్యది యుత్పన్నమైన ట్లున్నది. ఇయ్యది పునరుక్తి కాదు. ఆకాశములు రెండు. ఒకటి భూతాకాశము. రెండవది లోకాకాశము. భూతాకాశము పృథివ్యాదులవలె శబ్దమున కాధారము. లోకాకాశము లోకలోకాంతరముల కాధారమగు కాళీ జగత్తు. పూర్వము చెప్పబడిన యండమునందు లోకలోకాంతరములు, కాళీ

స్థలమును నున్నవి. లోకములను విభజించినపుడా యా లోకముల మధ్య నున్న కాళీస్థల మంతరిక్షలోక మనబడినది. ఇయ్యది యుత్పన్న మగు స్థానవిశేషమేమియు గాదు. మొదటినుండియు నిది యట్లేయుండును. కాని యది లోకలోకాంతరముల యుత్పత్తికి తరువాతనే వ్యవహారమునకు వచ్చును. అందువలన లోకములతోబాటు దానినికూడ మంత్రము నిర్దేశించి నది. కావుననే మంత్రమున'అకల్పయత్' అను శబ్దము ప్రయోగింపబడినది. ఈ శబ్ద ముత్పన్నమగువానికిని, కానివానికిని నుపయోగింపబడును.

ఇది యంతయు జదివిన తరువాత పాఠకులు నావలెనే పూర్వము వర్ణింపబడిన తొమ్మిది విధములయిన సృష్టి ప్రకారములోను 'వ్యాస శుక సంవాద' నామక సృష్టి ప్రకారమే వ్యాస రచిత మూలభారతమునకు సంబం ధించినదనియు, మిగిలిన యెనిమిది ప్రకారముల సృష్టి రచనలు ప్రక్షిప్తము లనియు నిర్ణయింతురని యెంచుచున్నాడ.

మే ముల్లేఖించిన యీ ప్రక్షిప్తభాగము లన్నియు మహాభారతము నందలి పదునెనిమిది పర్వములలో నొకే శాంతిపర్వమునందున్నవి. అందు వను నొకే ప్రకరణమున జూడనగును. ఇక మహాభారతమునం దంత టను నెంతభాగము ప్రక్షిప్తమో - కలుపబడినదో పాఠకులు స్వయముగ నూహింపగలరు.

భగవద్గీతయు నీ మహాభారతమున నొక భాగమే. కావున నిందును నెన్నియో ప్రక్షేపము లుండవచ్చును. అనాయాసముగ మన కీ యూహ కలుగును. కాని, గీతలో వాస్తవమున నేభాగము ప్రక్షిప్తమో నిర్ణయిం చుట సుగమము కాదు. ఈ విషయమును నిర్ణయించుటకు వీలుగ 'గీతలో ప్రక్షేపములు' అను పేరుతో రెండవ ప్రకరణము పాఠకుల సమ్ముఖమున నుంచుచున్నాము.



# గీతలో ప్రక్షేపములు

## ద్వితీయాధ్యాయము

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ
నిత్యః సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః. గీ. 2-24

ఈ యాత్మ ఖండించుటకు, దహించుటకు, తడుపుటకు, శుష్కింప జేయుటకు వీలుకానిది. ఇది నిత్యము, సర్వవ్యాపకము, స్థిరము, సనాతనము.

ఈ శ్లోకము ప్రక్షిప్తము-తరువాత చేర్పబడినది. ఇందులకు కారణము పునరుక్తి. ఇందలి విషయము దీనికి పూర్వాపరశ్లోకములందు జెప్పబడినది. 'ఆత్మ ఖండింపబడదు. దహింపబడదు. తడుపబడదు. శుష్కింప జేయబడదు.' అని 23 వ శ్లోకమునను 'అది నిత్యము, అజము, పురాణము, అవికారి' అని 20-25 శ్లోకములందును చెప్పబడినది. మరల నా విషయమే 24 వ శ్లోకమున వర్ణించుట పునరుక్తి. 'నిత్యము, అజము, పురాణము, అవికారి' అని చెప్పినమీదట 'సనాతనము, స్థిరము' అని చెప్పనక్కఱలేదు. కాని, ఆత్మ సర్వవ్యాపక మని చెప్పుటకే యీ శ్లోకము నెవరో గీతలో చేర్చియుందురు. ఆత్మసర్వవ్యాపక మనుట గీతా రచయిత సిద్ధాంతముకాదు. ఈ శ్లోకమునకు పూర్వమే 'పురాణశరీరములను విడిచి దేహధారి (ఆత్మ) యితర క్రొత్త శరీరములను బొందును' (2-22) అని స్వయముగ చెప్పి యున్నాడు. సర్వవ్యాపకు డొక శరీరమునువిడిచి మఱియొక శరీరమున కెట్లు వెళ్ళును? అది యతనిపని కాదు. అతడు మొదటినుండియు నంతట నుండును కదా? కాబట్టి యీ శ్లోకము ప్రక్షిప్తము.

ఈ యధ్యాయమున 48 వ శ్లోకము వఱకు సాంఖ్యమును నిరూపించి 49 శ్లో. నుండి యోగమును గీతాకారుడు వర్ణించియున్నాడు. యోగ మనగా నిట నిష్కామ కర్మ. ఫలమును కామింపక కర్తవ్యబుద్ధితో నొనర్చు కర్మ నిష్కామకర్మ యనబడును. ఈ ధ్యేయమును మనస్సున నిడుకొని యీ యధ్యాయమున 41 శ్లోకము నుండి 44 శ్లో. వఱకు ఫలమును కామించి చేయు కర్మ బుద్ధియందు విక్షేపము జనింపజేయునని యా కర్మను నిందించి

యున్నారు. మఱియు 'ఫలకామనతోనే కర్మ నొనరింపవలయును. లేకున్న నే కర్మయు చేయజాలము' అని చెప్పువారు వేదజ్ఞులు కారని చెప్పి, వారిని వేదవాద రతులనినాడు. వేదము పేరిట గోల చేయువారని భావము.

తరువాత 45-46 శ్లో. ప్రక్షిప్తములు.

"త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున !
నిర్ద్వంద్వో నిత్యసత్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్." 45
"యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః." 46

**భావార్థము :**

ఓ యర్జునా ! వేదములందు గుణత్రయ వర్ణనమే యున్నది. నీ వీ గుణములనుండి వెలువడుము. సత్యమున స్థితుడవగుము. ద్వంద్వములను విడువుము. సాంసారిక వ్యవహారములనుండి యున్నతుడవై యాత్మిక బలమును ధరింపుము.

'అన్ని యెడలను నీరు నిండియున్నపుడు ఒక నీటిగుంటతో నెంత ప్రయోజనముండునో విజ్ఞానికి వేదములవలన నంతే ప్రయోజనము'

ఈ శ్లోకములు ప్రక్షిప్తము లనుటకు రెండు కారణములు. వీనికి ప్రకరణముతో సంబంధము లేకునికి యొకటి. గీతాకారుని మతమున కను కూలము కాకపోవుట రెండవ కారణము.

ఈ ప్రకరణము నిష్కామకర్మకు సంబంధించినది. పై శ్లోకము లందు ఫలాకాంక్షతో కర్మల నొనరించువారు నిందింపబడిరి. మరల 47 శ్లోకమున నిష్కామకర్మ విధింపబడినది. అట్టియెడ మధ్యలోని యీ రెండు శ్లోకములందును నిష్కామకర్మను గుఱించియే కొంత చెప్పుట యుక్తము. కాని, యీ శ్లోకముల (45-46) లో వేదములు నిందింపబడినవి: వాని విషయమున నుపేక్షాభావము ప్రకటింపబడినది. అందువలన నియ్యవి ప్రకరణబద్ధములు కాక ప్రక్షిప్తము లగుచున్నవి.

ఈ శ్లోకములు గీతాకారుని మతమున కనుకూలములును కావు. త్రైగుణ్యమునుండి విడివడిన యధికారికి కూడ వేదవిహితకర్మ లను ష్ఠేయములే యని కృష్ణు డిట్లనియుండెను.

"నమే పార్థాస్తి క ర్తవ్యం త్రిషు లోకేషు కించన
నానవా ప్త మవా ప్తవ్యం వ ర్త ఏవ చ కర్మణి" 3-22

"ఓ యర్జునా ! ముల్లోకములందును నేను చేయవలసిన కర్తవ్య మేముండును ? లేదు. నేను కోరి పొందదగిన వస్తువును లేదు. అయినను కర్మ చేయుచునే యున్నాను."

ఇట్లే మూడవ యధ్యాయమునందును, పదునెనిమిదవ యధ్యాయము నందును యజ్ఞాది కర్మల నన్నింటిని విధించియుండుట చూడనగును. కాని పై ప్రక్షిప్త శ్లోకములలో కర్మలను విధించు వేదములనే విడువ ననుమతి యొసగబడినది.

మఱియు నా శ్లోకములందు వేదములలో గుణత్రయమే ప్రతిపాదింప బడినదనియు, విజ్ఞానికి వేదముతో బనిలేదనియు జెప్పబడినది. ఇది యంతయు గీతాకారుని మతమునకు విరుద్ధము.

గీతాకారుడు వేదములలో గుణత్రయ వర్ణనమే కాక పరమేశ్వర వర్ణన మున్న ట్లంగీకరించియున్నాడు. చూడుడు :

"యదక్షరం వేదవిదో వద న్తి విశంతి యద్యతయో వీతరాగాః
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి త త్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే"
గీ. 8-11.

"వేదవిదు లే యవినాశి పరమాత్మను వ్యాఖ్యానింతురో, వీతరాగ లగు యతు లెవనిలో ప్రవేశింతురో, ఎవనిని బొందుట కిచ్ఛగించుచు బ్రహ్మ చర్యము నాచరింతురో యా పదమును సంక్షేపముగ జెప్పుదును."

ఈ శ్లోకమునుబట్టి వేదవిదులే బ్రహ్మమును వర్ణింపగలరని స్ప మగుచున్నది కాబట్టి గీతాకారుడు వేదములందు బ్రహ్మ ప్రతిపాద్యము నంగీకరించుచున్నాడు. ఇంతే కాక విజ్ఞానికి వేదముతో బనిలేదనియు నంగీ

రింపడు. పదునాలుగవ యధ్యాయము మొదలు 18 వ యధ్యాయమువఱకు గీతలో విజ్ఞానము వర్ణింపబడియున్నది. సత్వాదిగుణముల కంటె నాత్మను వేఱుగ నెఱుగుటయే యా విజ్ఞానము. ఇట్టి విజ్ఞానము కలిగిన మీదటను నీశ్వరుని శరణుజొచ్చుట విజ్ఞాని కవసరమని విజ్ఞాన వర్ణనాంతమున వచించి యున్నాడు. మఱియు వేదముల వలన నీశ్వరుని స్వరూపజ్ఞానము కలుగును. కావున గీతామతమున విజ్ఞానికిని వేదము లవసరము కాబట్టి పై శ్లోకములు (45-46) గీతామతమునకు విరుద్ధము లగుటచే ప్రక్షిప్తములే.

ఇట్లే యీ యధ్యాయమున 60-61 శ్లోకములు కూడ ప్రక్షిప్తములే.

"యతతో హ్యాపి కౌంతేయ పురుషస్య విపశ్చితః
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః" 60

"తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా." 61

ఓ యర్జున ! మిక్కిలిగ ప్రయత్నించు విద్వాంసుని మనస్సును కూడ నింద్రియములు బలవంతముగ నీడ్చుకొని పోవును. వీని నన్నిటిని నిరోధించి యోగియైన పురుషుడు నన్నిష్టునిగ నంగీకరింపవలయును. ఇంద్రియములను వశపఱచుకొనువాని బుద్ధి స్థిరమగును.

ఈ శ్లోకములు ప్రక్షిప్తము లనుటకు రెండు కారణము లున్నవి.

(1) ఇవి ప్రకరణ సంగతములుకావు. వీనికి పూర్వము 59 వ శ్లోకమున 'భోజనము చేయకున్న పురుషునకు విషయ సంబంధము విడి పోవును కాని విషయవాంఛ విడువదనియు, భగవంతుని దర్శనానంతర మదియు పోవుననియు' చెప్పబడినది.

తరువాత 62 శ్లో. మొదలు 65 శ్లో వఱకు "విషయవాంఛ జనించు విధము, అయ్యది బుద్ధిని నశింపజేయు విధము, భగవంతుని ప్రాప్తికిముందు విషయేచ్ఛ నివృత్తికగు నుపాయము, తరువాత బుద్ధి స్థిరమగు విధము"

అన్నియు వర్ణింపబడినవి. ఇట్లు 59-62, 63, 64, 65 శ్లోకములలో విషయ వాంఛవలన బుద్ధిచాంచల్యము, దాని నివృత్తివలన బుద్ధిస్థిరతయు వర్ణింప బడినవి. ఈ ప్రసంగపు మధ్యలో 60, 61 శ్లోకములలో బుద్ధిస్థిరతకు వేఱొక యుపాయము, ఇంద్రియనిరోధము నను విషయముల వర్ణనమెట్లు సంగతమగును? విషయవాంఛ స్వరూపము, దానియుత్పత్తి వర్ణనము 62 వ శ్లోకమునుండి యారంభించి వర్ణింపబడియుండగా, విషయవాంఛ బుద్ధినాశ మునకు కారణమనియు. దాని నివృత్తి బుద్ధిస్థితికి కారణమనియు ప్రారంభించి చెప్పుచుండ పై శ్లోకములు మధ్యలో సంగతములు కావనుట స్పష్టము కాదా ? ఒక ప్రసంగములో నింకొక ప్రసంగమెట్లు చేర్పబడును ? కాబట్టి ప్రక్షిప్తమనక తప్పదు.

ఇక రెండవ కారణము పునరుక్తి. 'ఇంద్రియముల నిరోధము బుద్ధి స్థిరతకు కారణ' మను ప్రసంగము 58 వ శ్లోకములో ముందు వచ్చియే యున్నది. ఆ శ్లోకమిది.

"యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః
ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 58

"కూర్మము తన యంగములను ముడుచుకొనునట్లు మనుజు డింద్రియములను విషయములనుండి తొలగించునెడల అతనిబుద్ధి స్థిరమగును."

61 వ శ్లోకమున 'మత్పరః' అను పదముతో 'కృష్ణుని యధీనతను' తెల్పుచు యోగిరాజగు కృష్ణుని ఈశ్వరునిగజేయుటకునుప్రయత్నింపబడినది.

ఈ యధ్యాయమున మఱియు 67, 68, 69 శ్లోకములు కూడ ప్రక్షిప్తములే.

"ఇంద్రియాణాంహి చరతాం యన్మనోఽనువిధీయతే
తదస్య హరతి ప్రజ్ఞాం వాయు ర్నావ మివాంభసి." 67

"తస్మాత్ యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః
ఇంద్రియా ణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా." 68

"యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః" 69

"నీటిలో నున్న పడవను వాయు వాకర్షించునట్లు ఇంద్రియముల వెంట బరువిడు మనస్సు మనుజుని బుద్ధిని విచలితము జేయును."

"కాబట్టి అర్జునా ! ఎవని యింద్రియములు విషయములనుండి సర్వ విధముల దూరముచేయబడునో వాని బుద్ధి స్థిరమగును."

"ప్రాణుల కన్నింటికి రాత్రియైన దానిలో సంయమిపురుషుడు మేల్కొని యుండును. ప్రాణులన్నియు దేనియందు మేల్కొనియుండునో, యది జ్ఞానియైన మునికి రాత్రి."

ఇందలి మొదటి రెండు శ్లోకములందును మరల నింద్రియ నిరోధమువలన బుద్ధి స్థిరమగునని చెప్పబడినది. మే మింతకుపూర్వమే 58 శ్లో. నందు ఈ విషయమే చెప్పబడినదని వ్రాసియుంటిమి. కాబట్టి మరల నీ శ్లోకములందు జెప్పుట పునరుక్తి యగుచున్నది. కావున నీ రెండును ప్రక్షిప్తములే.

పై మూడు శ్లోకములును ప్రసంగానుకూలముకానందున ప్రక్షిప్తము లనవచ్చును. వీనికి ముందు 66 వ శ్లోకమున 'కర్మయోగి కానివానికి సమబుద్ధి - సమభావన ప్రాప్తము కాదు. సమభావన లేక శాంతి లభింపదు. శాంతి లేక సుఖము దొరకదు' అని శాంతిలాభమునకు సాధనములు చెప్పబడినవి.

మఱియు 70 వ శ్లోకమునందు 'స్థిరము, పూర్ణమునగు సముద్రమున నదీజలములు ప్రవేశించునట్లు, కామనలన్నియు నెవనిలో లీనమగునో వానికే శాంతి లభించును. కాని, కామికి లభింపదు' అని శాంతి ప్రాప్తికి సాధనము చెప్పబడినది. 66 వ శ్లోకమున శాంతి లభింపమికి కారణము. 70 వ శ్లోకమున శాంతి లభించుటకు కారణము వర్ణింపబడి యున్నవి. అందువలన నీ రెండు శ్లోకములు నొకదాని తరువాత రెండవది యుండుట సంగత

మగును. వీనిమధ్యలో 67, 68, 69 శ్లోకము లితర ప్రసంగమును వర్ణించుట చేత నవి ప్రక్షిప్తములనక మఱి యేమనగలము? వీనిని మధ్యలో నెవ రెందులకు చేర్చిరో యూహింపజాలము.

# తృతీయాధ్యాయము

మూడవ యధ్యాయమునందలి 30, 31, 32 శ్లోకములు మూడును ప్రక్షిప్తములే. ఇయ్యవి 29, 33 శ్లోకముల మధ్యలో చేరి యా రెంటికిగల యావశ్యక సంబంధమును భంగము చేయుచున్నవి. పైగా వీనికిట ప్రసక్తియు కనిపింపదు. 29, 33 శ్లోకములు చదివి చూడుడు.

"ప్రకృతే ర్గుణ సంమూఢాః సజ్జంతే గుణకర్మసు
తా నకృత్స్నవిదో మందాన్ కృత్స్నవి న్న విచాలయేత్." 29

"సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్ జ్ఞానవానపి
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి." 33

"స్వాభావిక గుణములచే మోహితులై మనుజులు తామస రాజస సాత్త్విక కర్మలు చేయుదురు. జ్ఞాని యైనవాడు మందులగువారిని కర్మ విముఖులను చేయరాదు"

"జ్ఞానికూడ తన స్వభావము ననుసరించియే చేష్టించును. ప్రాణులు స్వభావానుగుణముగ నడచును. దమనము వారిస్వభావమును మార్పజాలదు."

ఈ శ్లోకార్థములను జదివినమీదట పాఠకుల కా శ్లోకములకు గల ఘనిష్ఠ సంబంధము బోధపడి యుండును. వీని మధ్య మఱియొక శ్లోకమునకు స్థానమే లేదు.

ఈ ప్రసంగమున స్వభావానుకూలముగ బనిచేయు విధానము కలదు. కాని మధ్యలో 30, 31, 2 శ్లోకములందు, 'నాకర్పించుచు నన్ని కర్మలు చేయుము' అని చెప్పబడినది. 'అట్లు చేసినవాడు శ్రేష్ఠుడు, చేయనివాడు శ్రేష్ఠుడుకాడనియు' చెప్పబడినది. పై శ్లోకములకు మధ్య కథనము ప్రసం

గోచితముగాలేదు. యోగిరాజగు కృష్ణుని పరమాత్మని చేయుటకై యీ మూడు శ్లోకములు చొప్పింపబడినవి. కావున నివి ప్రక్షిప్తములు.

# చతుర్థాధ్యాయము

ఈ యధ్యాయమునందలి మొదటి 15 శ్లోకములు ప్రక్షిప్తములే. రెండవ యధ్యాయమునందలి 38 వ శ్లోకముతో కర్మయోగము ప్రారంభమై ఆఱవ యధ్యాయపు 4 వ శ్లోకము వఱకు నడచినది.
నాలుగవ యధ్యాయమున ప్రథమ శ్లోక మిది.

"ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహ మవ్యయం
వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్." 4-1

'ఈ యవ్యయమగు యోగమును నేను వివస్వంతునకు, నతడు మనువునకు, నా మనువు ఇక్ష్వాకునకును జెప్పెను.'

"స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః సనాతనః." 3

'ఆ పురాతన యోగమే నేను నీకు నేడు చెప్పితిని.'

అను నీ శ్లోకమువలన కర్మయోగ ప్రకరణము సమాప్తమైనట్లు తెలియుచున్నది. కాని యిట కర్మయోగము సమాప్తము కాలేదు. ముందు చాలదూరము నడుపబడినది. మధ్యలో నర్జునుడు 'మనుజుడు కోరకయే పాప మెందులకు చేయును ?' అని ప్రశ్నించెను వానికి సమాధానముచెప్పి, నాలుగవ యధ్యాయపు 16 వ శ్లోకమున మరల కర్మయోగ ప్రకరణము ప్రారంభించియున్నాడు.

"కిం కర్మ కి మకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః
తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్." 16

"కర్మ యన నేమి ? అకర్మ యన నేమి ? అను నీ విషయమున విద్వాంసులకును భ్రాంతి కలుగును. నేను నీ కా కర్మ చెప్పుదును. దాని నెఱిగి నీ వమంగళమునుండి విడివడగలవు" అనిఇట్లు కర్మయోగప్రకరణము

నిరంతరముగా ముందుకు నడచినది. మధ్యలో దాని సమాప్తిని సూచించు శ్లోకములు ప్రక్షిప్తములని స్పష్టముగా దెలియును. ఈ శ్లోకము గీతాకారునిదే యగునెడల కర్మయోగసమాప్తిలో చెప్పియుండెడివాడు.

నాలుగవ యధ్యాయమున నాల్గవ శ్లోకమున 'మీకును వివస్వంతునకును మధ్య నెంతో కాల వ్యవధాన మున్నది కదా : మీ రతని కెట్లు కర్మయోగమును చెప్పితిరి?' అని యర్జునుడు ప్రశ్నించును. ఈ ప్రశ్నకు సమాధానము 8 వ శ్లోకపు ఉత్తరార్ధము.

"ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే।" 4-8

'నేను ధర్మసంస్థాపనకొఱకు యుగయుగమున జన్మింతును.'

ఈ శ్లోకముల నిందుజేర్చిన మహాశయు డింతటితో నాగక, కృష్ణుని యుపాసన, దాని ఫలమును గూడ చెప్ప నారంభించినాడు. అదియునుగాక తరువాత కృష్ణభగవానుడే గుణకర్మల ననుసరించి వర్ణములను సృష్టించి నట్లును జెప్పియున్నాడు. ఇట్టి ప్రకరణమునంతటిని కలగా పులగముచేసి దీని నొక వస్తు ప్రదర్శనశాలగా చిత్రించినాడు. తరువాత నా ప్రసంగముల నన్నిటిని ప్రకరణబద్ధము చేయదలచి 14, 15 శ్లోకములు రచించియున్నాడు.

"న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్ న స బధ్యతే." 14

"ఏవం జ్ఞాత్వా కృతంకర్మ పూర్వైరపి ముముక్షుభిః
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్. 15

"నాకు కర్మఫలాభిలాష లేదు. నన్ను కర్మలు లిప్తుని జేయవు. ఈ విధముగ నన్నెఱిగినవాడును కర్మలిప్తుడు కాడు."

"ఇది యెఱిగియే ప్రాచీనకాలపు ముముక్షువులు కర్మ లాచరించిరి. నీవును కర్మ లాచరించు. పూర్వులు చేసినారు."

ఇట్లు ప్రక్షేపక మహాశయుడు తన శ్లోకములను ప్రకరణముతో కలుప యత్నించినాడు. కాని, అంతమాత్రమున నయ్యది యుక్తము కాదయ్యె. అర్జునుడు, అతని సమకాలికులైన ఋషులను 'కృష్ణుడు కర్మ ఫలాభిలాషి కాదనియు, నతనిని కర్మ లంటవనియు' నెఱిగియుందురేమో కాని, కృష్ణుని జన్మకు పూర్వమున గల ముముక్షువు లీ విషయము నెట్లెఱిగి యుందురు ؛ వా రెఱిగి కర్మల నెట్లు చేసియుందురు? యోగదృష్టితో నెఱిగి యుందురేమో యనిన కర్మానుష్ఠానమునకు తదుపరికదా, వారు యోగులై యుందురు ؛ కర్మారంభమునకు ముందు వారికి యోగదృష్టి లేదుకదా, ఎట్లెఱుగగలరు ?

ఈ విషయము నింక నెక్కుడుగ చర్చింపనవసరము లేదనియెంచెద. ఇంతటితోనే పై 15 శ్లోకములు ఈ యధ్యాయమున చేర్పబడినవియే యని స్పష్టపడునని యెంచెద.

ఇట్లే యీ యధ్యాయమునందలి 24 వ శ్లోకముకూడ చేర్చబడినదే. ఈ శ్లోకమునకు పూర్వము కృష్ణుడు "మనుజుడు మొదట నిష్కామ భావముతో కర్మ లాచరింపవలయును. అట్లు చేయలేకున్న యజ్ఞముకొఱకు (లోకహిత భావనతో)కర్మల నాచరింపవలయును. అట్లు చేసిన వాని కర్మలు కర్మలయినను కర్మలు కానివానితో సమానమగును. అతనిని బంధనమున బడవేయవు" అని చెప్పినాడు. తరువాత శ్లోకములలో ననేకవిధములగు యజ్ఞములను గూర్చి వ్యాఖ్యానముచేసి, వానిలో జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమని ప్రతిపాదించి యున్నాడు. ఈ రెండు ప్రసంగములకు మధ్య నెవరో యద్వైతము నంగీకరించు నొక మహాశయుడు ప్రసంగబద్ధము కాని విచిత్రశ్లోకము నొకదానిని చేర్చియున్నాడు.

"బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్ బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతం
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా." 4-24

'బ్రహ్మరూపమగు కర్మసమాధి (కర్మయోగము) నొనర్చువాడు బ్రహ్మనే పొందును. అతని హవిస్సు బ్రహ్మకే యర్పణమగును. బ్రహ్మ రూపాగ్నియందు బ్రహ్మచేతనే వేయబడినది.'

పూర్వప్రసంగము ననుసరించి యిట కర్మ యకర్మ యెట్లగునో తెలుపవలసి యుండెను. కాని యీ శ్లోకమునందు కొండొక విశేషపద్ధతితో యజ్ఞమొనరించువానికి బ్రహ్మప్రాప్తియను ఫలము చేకూరునని చెప్పబడినది.

ముందు రాబోవు ప్రసంగముతోను నీ శ్లోకమునకు ప్రసక్తిలేదు. ఈ ప్రకరణమున విభిన్న యజ్ఞములు వర్ణింపబడినవి. ఈ శ్లోకము ఫల ప్రతిపాదకమగుటచే కర్మవిధాయక మన నొప్పదు. ఇందుఫలము గౌణముగా జెప్పబడినది. కర్మవిధాయక శ్లోకమే యిది యందు మేని యదియును పొసగదు. అట్లంగీకరించిన పునరుక్తి యగును. కారణమేమన : 25 వ శ్లోకమునందు కృష్ణుడు బ్రహ్మార్పణ యజ్ఞమును విధించుచున్నాడు.

"బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞేనై వోపజుహ్వతి." 25

'కొందఱు మహనీయులు బ్రహ్మరూపమగు నగ్నియందు తమ కర్మరూప యజ్ఞమును కర్మద్వారమున హవనమొనర్తురు.'

ఉపర్యుక్త హేతువువలన పాఠకులకు 24 వ శ్లోకము ప్రక్షిప్త మైనట్లు విదితమై యుండునని యెంచెద.

ఇట్లే యీ యధ్యాయమునందలి 34, 35, 36, 37 శ్లోకములుకూడ ప్రక్షిప్తములే. 33 వ శ్లోకమున ద్రవ్యయజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమని చెప్పబడినది. జ్ఞానమే సర్వకర్మల సంపూర్ణతకు సాధనమనియు నుడువ బడినది. ఈ ప్రకరణమునందలి జ్ఞానము వేదజ్ఞానము కాని, ధర్మశాస్త్ర జ్ఞానము కాని కాదు. ఇట నిశ్చయాత్మక బుద్ధియే జ్ఞాన మనబడినది. మా యీ నిర్ణయమునకు ప్రమాణము ఈ యధ్యాయములోని 41 వ శ్లోకమే.

"యోగ సన్న్యస్త కర్మాణం జ్ఞాన సంఛిన్న సంశయం
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ :" 41

"ఎవడు కర్మయోగము ననుసరించి కర్మలను త్యజించెనో, జ్ఞానము ద్వారమున సంశయమును దూరముచేసెనో, అట్టి యాత్మధనుడగు మనుజునకు అర్జునా ! కర్మలు బంధకములు కావు."

ఇందు సంశయమును దూరముచేయునది జ్ఞానమని చెప్పబడినది. అయ్యది నిశ్చయాత్మక బుద్ధియే యగును. ఈ బుద్ధి లభించుట కుపాయము కృష్ణుడు 38, 39 శ్లోకములందు జెప్పియున్నాడు. శ్రద్ధ కర్మతత్పరత, ఇంద్రియ సంయమము, కర్మయోగమును సాధించుటయు నీ జ్ఞానప్రాప్తికి సాధనములు. ఇట్లు చెప్పుటయు సరియగును. శ్రద్ధాదులు లేక బుద్ధి స్థిరము కానేరదు. బుద్ధి స్థిరతయే నిశ్చయము. పాఠకుల కీ ప్రకరణమున జ్ఞానమన నేమో యిప్పుడు తెలిసియే యుండును.

ఇక నీ ప్రక్షిప్త శ్లోకముల జ్ఞానమును కూడ చూడుడు :

"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః." 4-34

"యద్ జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాండవ ।
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి." 35

"నమ్రత, పలువిధములయిన ప్రశ్నలు, సేవ యను వాని మూలమున నా జ్ఞానమును తత్త్వజ్ఞులైన జ్ఞానులు నీకు నేర్పుదురు. ఆ జ్ఞానము వలన భూతముల నన్నింటిని నాయందును మఱియు నీయందును జూతువు. ఆ జ్ఞానము లభించినమీదట నిట్టి మోహము నీకు గలుగదు."

ఈ శ్లోకములకు తరువాత 41 శ్లో. లో నిశ్చయాత్మకబుద్ధి జ్ఞానమని కృష్ణభగవానుడు నుడివియున్నాడు. 'ప్రస్తుతము నీకు గలిగిన సంశయమును వదలి వెంటనే కర్తవ్యపథమును నిర్ణయించుకొను'మని కృష్ణుని యభిప్రాయము. కాని, దీనికి విరుద్ధముగ పై శ్లోకములలో నాత్మలో నన్ని ప్రాణులను దర్శించునట్టి తత్త్వజ్ఞానము జ్ఞానమని చెప్పబడినది.

మఱియును, నీ శ్లోకములందు జ్ఞానోపదేశము తత్త్వజ్ఞులనుండి గ్రహింపుమని యున్నది. కాని కృష్ణుడు 38 వ శ్లోకమునందు 'కర్మయోగ మును సాధించుటవలన సమయము వచ్చినపుడు నిశ్చయాత్మక జ్ఞానము స్వయముగనే యాత్మయందు ప్రకాశించును' అని నుడివియున్నాడు. కావున నిట్టి పూర్వాపర విరోధములను జూచినమీదట పై శ్లోకములు ప్రక్షిప్తము లనుటలో సంశయముండదు.

ఈ శ్లోకములు గీతకు చెందినవిగా నెంచుట యుక్తము కాదు. క్రమముకూడ కనబడదు. నిబంధరీతి ననుసరించి ముందు జ్ఞానము, దాని ప్రశంస, దాని ప్రాప్తికి సాధనము. తదుపరి దానిఫలము వ్రాయుటయుక్తము. పైన జూపిన ప్రక్షిప్త శ్లోకములను తీసివేసి చదివినచో నీక్రమము స్పష్ట మగును. 33 వ శ్లోకమున జ్ఞానయజ్ఞ ప్రవచనము, అందే యుత్తరార్థము నందును, 38 వ శ్లోకపు పూర్వార్ధమునందును జ్ఞానయజ్ఞ ప్రశంస, 39 వ శ్లోకమునందు దాని ఫలము, 40 వ శ్లోకమున దాని యప్రాప్తివలన హానియు చెప్పబడినది. కాబట్టి పైన జూపిన శ్లోకములను ప్రక్షిప్తములని యంగీక రింతుమేని క్రమము చక్కగ కుదురును. లేకున్న క్రమము సరికాదు.

34 వ శ్లోకమున సాధనము చెప్ప ప్రారంభింప బడినది. తరువాతి మూడు శ్లోకములందును భిన్న విషయము ప్రారంభింపబడినది. తరువాత మరల 38 వ శ్లోకములో సాధనము జెప్ప ప్రారంభింపబడినది.

36 వ శ్లోకమున పాపనాశక వస్తునామము, 37 నందు కర్మనాశక వస్తునామము జ్ఞానమని చెప్పబడినది. కాని పైన జూపినట్లు 41 వ శ్లోకము నందు సంశయనాశకమగు జ్ఞాన మీ ప్రకరణమున జ్ఞానమని వర్ణింపబడినది. కాబట్టి 36-37 శ్లోకములు ప్రక్షిప్తములే యగును.

## పంచమాధ్యాయము

ఐదవ యధ్యాయమున 13 వ శ్లో. మొదలు అధ్యాయాంతమువరకు గల శ్లోకము లన్నియు ప్రక్షిప్తములే.

ఇందు కర్మఫల సంన్యాస ప్రకరణము ప్రారంభింపబడినది. 12 వ శ్లోకమున నిట్లున్నది.

"యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీం
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే." 12

"కర్మలందు లగ్నుడై ఫలమును విడుచువాడు స్థిరశాంతినిబొందును. కర్మల నాచరింపక కామనావశుడైన బంధనమున బడును."

తరువాత నున్న శ్లోకముల నన్నిటిని విడిచి యాఱవ యధ్యాయము నందలి ప్రథమ శ్లోకమును చూడుడు.

"అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్ని ర్నచాక్రియః." 6-1

"కర్మ ఫలము నాశ్రయింపక కర్తవ్య కర్మల నాచరించువాడే సన్యాసి; యోగియును. అగ్ని నారాధనము చేయనివాడు కాని, కర్మలను విడిచినవాడు కాని కాడు."

పై రెండు శ్లోకములందును కర్మ ఫల త్యాగము విధింపబడినది. అందువలన నివి రెండు నొక ప్రకరణమునకు జెందినవి. మధ్య నున్న- శ్లోకములలో నీ విషయము చెప్పబడనందున నవి ప్రక్షిప్తము లనకతప్పదు.

ఇంతేకాక యింక ననేక దోషములునుగలవు. కర్మఫలమును విడిచి కర్మల నాచరించుటయే యోగమనీ గీతాకారుని అభిప్రాయము. యోగికే కాక సన్న్యాసికి కూడ కర్మ త్యాగము మంచిది కాదనియు నత డభిప్రాయపడు చున్నాడు. పై శ్లోకమున (6-1) నియ్యది స్పష్టపడుచునే యున్నది.

ఐదవ యధ్యాయపు రెండవ శ్లోకమున కర్మ సన్న్యాసము, కర్మ యోగము ఉత్తమమని చెప్పబడినది. ఇందే 6 వ శ్లోకమున సన్న్యాసము.

యోగము రెండు నొక్కటియే యనియు చెప్పబడినది. కర్మఫల త్యాగమే కర్మ త్యాగ మగును; కాని కర్మలు వదలవలసిన యగత్యము లేదు. మఱియు నాఱవ యధ్యాయమున కర్మలను వదలువానిని సన్న్యాసి యనుటయే తగ దనుచున్నాడు. 18 వ యధ్యాయమున కృష్ణుడు మరల నీ విషయమునే స్పష్టము చేసియున్నాడు.

"ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ
కర్తవ్యా నీతి మే పార్థ । నిశ్చితం మత ముత్తమమ్" 18-6

"ఓ యర్జునా ! ఈ యజ్ఞాది కర్మలను కూడ ఆసక్తిని, ఫలమును విడిచి చేయవలయును. ఇదియే నా నిశ్చితము, నుత్తమము నగు మతము."

ఇప్పుడు గీతాకారునకు కర్మ త్యాగ మిష్టము కాదని పాఠకులు గ్రహించియే యుందురు.

ఇక ప్రక్షేపకుల లీలలు చూడుడు :

"సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్ న కారయన్." (5-13)

"సంయమి యగు దేహధారి నవద్వారములుగల నగరమున సర్వ కర్మలను మనస్సుతో విడిచి, తాను చేయక యితరులచే చేయింపక సుఖముగ నుండును."

ఇందు కర్మత్యాగమే విధింపబడినది. ఇయ్యది గీతాకారున కిష్టము కాదు. తరువాత 14 వ శ్లోకమున 'పరమాత్మ కర్మ నుత్పన్నము చేయడు, ఎవనిని కర్తగా చేయడు' అని యున్నాడు-ఇది కొంత యుక్తమే, కారణ మేమన జీవుడు కర్మల నొనర్చుటలో స్వతంత్రుడు; అతడు స్వయముగనే కర్మలం జేయును; కర్తయునగును. కాని, ఈ శ్లోకమున నుత్తరార్ధములో 'కర్మఫలముతో సంబంధమునుకూడ పరమాత్మ కల్పింపడు. ఇది యంతయు స్వభావముగనే జరుగును' అనుచున్నాడు. ఇది యుక్తము కాదు.

కారణమేమన : వేదములు, ఆస్తిక దర్శనములు నన్నియు 'ఈశ్వరుడు కర్మ ఫలదాత' యని యంగీకరించుచున్నవి. స్వభావముగనే కర్మఫలము లభించు ననుట నాస్తికదర్శనము లనుమతించును. ఆస్తికులంగీకరింపరు. కాగా కర్మఫలమును, కర్మనుకూడ భగవానుని కర్పించునట్టి పరమాస్తికుడు గీతాకారు డీ మతము నె ట్లంగీకరించును ? అందువలన నీ శ్లోకములన్నియు గీతాకారునివి కావు. ప్రక్షేపకుని లీలలే యగును.

మఱియు ప్రక్షిప్త శ్లోకములందు జ్ఞానమువలన నజ్ఞాననాశము సమత్వభావము, ధ్యానయోగమువలన బ్రహ్మప్రాప్తి, విషయవాసనలను త్యజించుట, కామక్రోధముల త్యాగము, జీవుని బ్రహ్మరూపత, కృష్ణుని జ్ఞానమువలన శాంతిలాభము మున్నగు ప్రకరణబద్ధములు కాని విషయము లీ ప్రక్షిప్త శ్లోకములందు వర్ణింపబడి యున్నవి.

ప్రకరణ సంగతములు కానందున నివి ప్రక్షిప్తములని వేఱుగవ్రాయ నవసరములేదు. ఇంతేకాక యీ విషయములు ఇతర స్థలములందును జెప్పబడినవి. ఆఱవ యధ్యాయమునందు ధ్యానయోగమువలన బ్రహ్మప్రాప్తి కలుగునను ప్రకరణము చూడనగును. సమత్వయోగము కూడ నీ యధ్యాయముననే 5 వ శ్లోకమునుండి విస్తారముగ జెప్పబడినది. ఈ యధ్యాయముననే కర్మయోగికి కామద్వేషములు త్యాజ్యములని యున్నది. ఇట్టి విషయములు వచ్చియుండ వీని నైదవ యధ్యాయమున ప్రసంగము లేనిచోట చేర్ప నేల ? కర్మ త్యాగమును, జీవబ్రహ్మరూపతను గీతలో చేర్చుటకే యీ శ్లోకముల నిందు చేర్చినారని వేఱుగ చెప్ప నక్కఱలేదు.

# షష్ఠాధ్యాయము

**ఆఱవ యధ్యాయమున 14వ శ్లోకము మొదలు 23వ శ్లోకమువరకుగల శ్లోకములు ప్రక్షిప్తములు. ఇందులకు కారణము ప్రసంగభంగమే. 13వ శ్లో.**

మొదలు 13 వ శ్లో. వరకు కృష్ణభగవానుడు ధ్యానయోగము విధిని చెప్పి యున్నాడు. తరువాత 23 వరకును ప్రక్షిప్తములు. ఆ పైన 24, 25, 26 శ్లోకములు ధ్యానయోగ విధమును దెలుపును. అటు తరువాత 28-29 శ్లోకము లలో బ్రహ్మప్రాప్తి, సామ్యబుద్ధిసిద్ధి యను రెండు ఫలములు ధ్యానయోగ మునకు జెప్పబడినవి. ఇక నీ ప్రక్షిప్త శ్లోకముల విషయముం జూడుడు.

ప్రక్షేపకుడు తన శ్లోకములను ప్రసంగముతో గలుపుటకుగాను 14 వ శ్లోకమున మరల ధ్యానయోగమును విధించియున్నాడు. 15 వ శ్లోకమున ధ్యానయోగ ఫలమును జెప్పియున్నాడు. 16 వ శ్లోకము మొదలు 19 వ శ్లోకమువరకు ధ్యానయోగాధికారిని వర్ణించినాడు. 20 మొదలు 23 వరకు గల శ్లోకములలో యోగ లక్షణము చెప్పినాడు.

ఈ ప్రసంగము లన్నియు నెట్లు ప్రకరణ సంగతములు కాగలవో పాఠకు లాలోచింతురు గాక. కృష్ణుడు ధ్యానయోగ లక్షణాధికారములను జెప్పదలచిన, దానిని విధించుటకు ముందేచెప్పియుండెడివాడు. విధిక్రమ మును భంగ మొనర్చి మధ్యలో పై ప్రసంగములను జేర్చుట యెట్లు సంగత మగును ? ఎట్లునుకాదు. 15 వ శ్లోకమున జెప్పబడిన ధ్యానయోగఫలము కూడ విధికి మధ్య ప్రసంగరహితమై యయుక్తమగుచున్నది. ధ్యానయోగ మున కీ ఫలమే కలుగునని కృష్ణుడు విధి ప్రసంగమును సమాప్తమొనర్చిన పిదప 28 వ శ్లోకమున వర్ణించియున్నాడు. అందువలన నీ ఫలవర్ణనము పునరుక్తము నగుచున్నది. ఇట్లు వివేచనాపూర్వకముగ విచారించినమీదట పై శ్లోకములన్నియు ప్రక్షిప్తము లనక తప్పినది కాదు.

ధ్యానయోగ ప్రసంగములో నివి యన్నియు కృష్ణుని పరమాత్మగా నిరూపించుటకును, ప్రసంగమును బొడిగించుటకును జేర్పబడినను ప్రక్షేప ములు-చేర్పబడినవని తోచుచున్నది.

ఇట్లే యీ యధ్యాయమునందలి 27 వ శ్లోకము కూడ ప్రక్షిప్తమే. ఈ శ్లోకమున ధ్యానయోగ ఫలము బ్రహ్మానంద ప్రాప్తియని చెప్పబడినది. 28వ శ్లోకమునందును ఈ ఫలమే వర్ణింపబడినది. అందువలన పునరుక్తమై ప్రక్షిప్తమగుచున్నది. ఆనందమునకు బ్రహ్మరూపము సిద్ధింపజేయుటకై యీ శ్లోకమును చేర్చినట్లు తోచుచున్నది. కారణ మేమన 28 వ శ్లోకము నందు ఆనందము బ్రహ్మకు సంబంధించిన ధర్మమని నుడువబడినది.

ఈ యధ్యాయమున 30-31 శ్లోకములుకూడ ప్రక్షిప్తములే. వీనికి పై శ్లోకములయందు సమత్వయోగ వర్ణనము వచ్చుచున్నది. తరువాత 32 వ శ్లోకమునను నా విషయమే యున్నది. 29-32 శ్లోకములను క్రమముగా కలిపి చదివిచూడుడు.

"సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగ యుక్తాత్మా సర్వత్ర సమదర్శనః" 29
"ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ః
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః." 32

"అంతట సమభావముతో జూచు యోగయుక్తుడగు నాత్మ తన నన్ని ప్రాణులలోను, అన్ని ప్రాణుల దనలోను జూచును."

"ఇతరుని సుఖమును తన సుఖముతోను, ఇతరుని దుఃఖమును తన దుఃఖముతోను సమానముగ నంతట జూచువాడు పరమయోగి."

అని 29 లో చెప్పిన విషయమే 32 లో స్పష్టము చేయబడినది.

ఈ రెండు శ్లోకముల మధ్యలో చేర్చబడిన శ్లోకములలో నొక శ్లోకార్థమును జూడుడు.

"యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి." 30

"నాలో నందఱను, అందఱిలో నన్నును నెవడు జూచునో యతనికి నాకు గల సంబంధము నష్టముకాదు." "యోగిరాజగు కృష్ణుని వ్యాపకుడని యెఱుగువాడు కృష్ణుని సంబంధమునుండి దూరము కాడు" అను నీ భావము

సమత్వయోగ వర్ణనమునకు మధ్యలో నెటనుండి రాలివచ్చెనో పాఠకులే గమనింతురు గాక.

మఱియు నీ యధ్యాయమున 47 వ శ్లోకముకూడ ప్రక్షిప్తమే. ఈ యధ్యాయమున కృష్ణచంద్రుడు 'ధ్యాన' యోగము మూలమున నింద్రియములను మనస్సుతోబాటు నిరోధించినందున ఆనందప్రాప్తి, సామ్యబుద్ధి యొక్క సిద్ధియు నను రెండు లాభములు కలుగునని చెప్పియున్నాడు. తరువాత ధ్యానయోగము మూలముననే భగవద్భక్తివలన పరమ పురుషప్రాప్తి యావేశింపవలసి యుండెను. కాని మధ్యలో నర్జునుడు అపూర్ణ ధ్యాన యోగికి కలుగు గతిని గూర్చి ప్రశ్నించెను. కృష్ణుడు ప్రశ్నకు సమాధానము నిచ్చిన తరువాత నాఱవ యధ్యాయపు 46 వ శ్లోకమున కర్మ యోగిని ప్రశంసించుచు నీ క్రింది శ్లోకమున నా విషయమునే మరల నిట్లు ప్రారంభించినాడు.

"అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్." 8-8

"అర్జున ! ధ్యానయోగము మూలమున నన్య వస్తువులనుండి విరోధింపబడిన చిత్తముతో పరమాత్ముని చింతనచేయుచు మనుజుడు పరమ పురుషుని ప్రాప్తించును." ఇది యెనిమిదవ యధ్యాయపు టెనిమిదవశ్లోకము. తరువాత నెనిమిదవ యధ్యాయపు 22 వ శ్లోకము వఱకు నీ ప్రసంగమే నడుచును. ఇపుడీ యాఱవ యధ్యాయపు 47 వ శ్లోకమును జూడుడు.

"యోగినా మపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః." 6-47

"నాయందే ధ్యానము లగ్నమొనర్చి నా భక్తి నొనర్చువాడే యోగులలో నుత్తమయోగి." ఇయ్యది ప్రక్షిప్తము కాక మఱి యేమగును ?

ఎనిమిదవ యధ్యాయమున నైదు శ్లోకములలో ధ్యానయోగికి దివ్యుడగు పరమపురుషుని భక్తి నొనర్ప కృష్ణభగవాను డుపదేశించెను. ఇట

నాఱవ యధ్యాయపు 47 వ శ్లోకమున నతనికే తన భక్తి నుపదేశించు చున్నాడు. ఇట కృష్ణునే పరమాత్మగా నెంచిన ఉపదేశము పునరు క్తమగును. పరమాత్ముడని యంగీకరింపని పక్షమున కృష్ణుడు తనను భగవంతునికంటె గొప్పవానినిగ చెప్పజాలడు. కాబట్టి యీ శ్లోకము కృష్ణునిది కాక మఱియొక నిచే నిందు ప్రక్షిప్తము చేయబడినదని యెంచక తప్పదు. మహాత్ముడగు కృష్ణుని పరమాత్మునిగ చిత్రింపదలచిన యొకానొక మహానుభావు డీ శ్లోక మును చేర్చియుండును. రాబోవు ప్రసంగములకిది యంగముగా నెంచ బడుటకు గాను ఈపని చేసియుండవచ్చును.

## సప్తమాధ్యాయము

ఏడవ యధ్యాయమంతయు ప్రక్షిప్తమే. ఎనిమిదవ యధ్యాయములో మొదటి 7 శ్లోకములుకూడ ప్రక్షిప్తములే.

ధ్యానయోగ ప్రకరణ మింకను పూర్తి కాలేదు. ఎనిమిదవ యధ్యా యమునందలి 8 వ శ్లోకము మొదలు 22 వ శ్లోకము వఱకు భక్తిగర్భిత ధ్యానయోగము వలన పరమపురుషుని ప్రాపించు నుపాయమే చెప్పబడినది. ఆఱవయధ్యాయము చివర కూడ ధ్యానయోగ ప్రకరణమే యున్నది. ఈ ప్రకరణమునకు మధ్యలోచేరి 7 వ అధ్యాయము. 8 వ అధ్యాయము లోని 7 శ్లోకములు ప్రకరణము భంగపఱచుచున్నవి. అందువలన నవి ప్రక్షిప్తములే.

ఏడవ యధ్యాయము ప్రక్షిప్తమనుటకు మఱియొక ప్రబలమైన యుక్తియు కలదు. దానిని తెలిసికొనుటకు పాఠకులు ఏడవ యధ్యాయపు రెండవ శ్లోకమును చదువవలయును.

"జ్ఞానం తేఽహం స విజ్ఞాన మిదం వక్ష్యామ్యశేషతః
యద్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే." 7-2

"ఇక నేను నీకు జ్ఞాన విజ్ఞానముల నుపదేశింతును. వాని నెఱిగిన తదుపరి యెఱుగవలసినది మిగులదు."

ఇట్లు జ్ఞాన విజ్ఞానములు చెప్పుదునని యిట ప్రతిజ్ఞ చేయబడినది. కాని యధ్యాయమందెక్కడను వాని వర్ణనమే లేదు. గీతలో జ్ఞానమన సదాచారము, సంయమమునకు జెందిన కతిపయ నిశ్చిత నియమములును వాని వర్ణనము 13 వ యధ్యాయములో 6 వ శ్లోకము మొదలు 11 వ శ్లోకము వఱకు చెప్పబడినది. అక్కడ నుపసంహారములో వ్రాయబడినది.

"ఏతత్ జ్ఞానమితి ప్రోక్తం అజ్ఞానం యదతోఽన్యథా." 13-11

'ఇది జ్ఞానము - దీనికి విపరీతమైనది అజ్ఞానము.'

పాఠకులు జాగరూకతతో జదువుదురేని ఈ యేడవ యధ్యాయమున నా నియమముల వర్ణన మెచ్చటను గానరాదు. ఇక విజ్ఞాన నిరూపణము గీతలో పదునాలుగవ యధ్యాయము మొదలు 18 వ యధ్యాయము చివరి వఱకు వర్ణింపబడినట్లు చూతురు. విజ్ఞాన నిరూపణములో ననేక ప్రకరణము లున్నవి. సాధారణ దృష్టికి ఆ ప్రకరణము లన్నింటిలోను సత్వరజస్తమో గుణముల కార్యములు, అంతఃకరణముపై వానివలన కలుగు ప్రభావము చెప్పబడినవి. ఈగుణ వివేక నిరూపణముకూడ ప్రధానముగ నీ యధ్యాయమునలేదు. ఇందు కృష్ణభగవానుని భక్తి, సర్వవ్యాపకత, భక్తివలన కలుగు లాభము, చేయనందున కలుగు హాని, అక్కడక్కడ సత్వాది గుణోల్లేఖనము గౌణముగా మాత్రమే వర్ణింపబడినవి. జ్ఞాన విజ్ఞానముల వర్ణన మీ యధ్యాయమున వచ్చుటకును వీలులేదు. ఈ ప్రతిజ్ఞ కృష్ణభగవానునిది కాదు. ఇది ప్రక్షేపకునిది. కృష్ణు డీ ప్రతిజ్ఞను తొమ్మిదవ యధ్యాయారంభమున జేసియున్నాడు.

"ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే
జ్ఞానం విజ్ఞానసహితం యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్." 9-1

"ఓ శ్రద్ధాలువగు నర్జున ! జ్ఞానవిజ్ఞానములతో గూడిన రహస్యతత్త్వమును నీకు చెప్పుదును. అది తెలిసికొని యశుభమునుండి నీవు విడివడుదువు."

ఈ ప్రతిజ్ఞను జూచిన తదుపరి పాఠకులు ఏడవ యధ్యాయపు ప్రతిజ్ఞ కృష్ణునిది కాదని గ్రహించియే యుందురు. అది ప్రక్షేపక మహాశయునిది. కృష్ణునిదే యగు పక్షమున మరల తొమ్మిదవ యధ్యాయమున నేల చెప్పబడును ?

ప్రక్షేపకు డిట మంచియెత్తే యెత్తియున్నాడు. కాని పొరపాటు పడినాడు. ధ్యానయోగము తరువాతనే జ్ఞానవిజ్ఞానముల నిరూపణ ప్రసంగ మున్నది. 6 వ యధ్యాయపు 8 వ శ్లోకమున ధ్యానయోగమును ప్రారంభించి 'ఇంద్రియములను జయించి, జ్ఞానవిజ్ఞానముల వలన నాత్మను తృప్తిపఱచి మట్టి, రాయి, సువర్ణము నేకముగ నెఱిగినవాడే యోగి-యోగమున లగ్నమై యున్నట్లు చెప్పబడు' నని యున్నది. ఇట్లు గీతాకారుడు యోగికి జ్ఞానవిజ్ఞానముల నెఱుగుట యావశ్యకమని చెప్పినాడు; కాని, యింతవఱకు వాని నిరూపింపలేదు. ఇప్పుడిక వాని నిరూపింపవలసియున్నది. ఈ సంగతిని దెలిసికొని ప్రక్షేపక మహాశయుడు గీతాకారుని జ్ఞానవిజ్ఞాన ప్రకరణము కంటె ముందు దన ప్రకరణము నారంభించుట యావశ్యకమని యెంచి నట్లున్నది. అందువలన తన ప్రక్షేపముకూడ జ్ఞానవిజ్ఞాన ప్రకరణమునకు మధ్యలో చేరునుగదా ! యని యెంచెను. కాని, యతడు పొరపడినాడు. ధ్యానయోగము పూర్తికాకముందే తాను ప్రారంభించుట యొక పొరపాటు. తొమ్మిదవ యధ్యాయపు మొదటి శ్లోకమును తీసివేయ కుండుట రెండవ పొరపాటు. అట్లు కాక ప్రక్షేపకు డా శ్లోకమును తీసివేయవలసి యుండెను; లేదా దానికి తరువాతనైన తానారంభింపవలసి యుండెను. మఱియు జ్ఞానవిజ్ఞానములకు సంబంధించిన తన ప్రతిజ్ఞను వ్రాయక యుండవలసినది. అట్లు చేసిన పక్షమున నతని యెత్తుగడ సఫలమై యుండెడిదేమో ! పాఠకుల కిప్పుడు సప్తమాధ్యాయ మంతయు ప్రక్షిప్తమనియే బోధపడి యుండవచ్చును. 8 వ అధ్యాయములోని యేడు శ్లోకములుకూడ పైకారణములను బట్టియే ప్రక్షిప్తములు.

# అష్టమాధ్యాయము

ఈ యధ్యాయమున 12 మొదలు 21 వఱకు గల శ్లోకములన్నియు ప్రక్షిప్తములే. ఇవి ప్రసంగమును భంగపఱచుచున్నవి. 11-22 శ్లోకములు చదువవలయును.

"యదక్షరం వేదవిదో వదంతి విశంతి యద్ యతయో వీతరాగాః
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే.
8-11

"పురుషః స పరః పార్థ! భక్త్యా లభ్య స్త్వనన్యయా
యస్యాంతఃస్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్." 8-22

"ఏ యవినాశిని వేదవిదులు వర్ణింతురో రాగరహితులైన యతులు దేనిని ప్రాపింతురో, దేనిని గోరి బ్రహ్మచర్యమును నడుపుదురో, ఆ పదమును నీకు సంక్షేపముగ చెప్పుదును.

"ఓ యర్జున ! ఆపదము పరమపురుషుడే. అత డనన్య భక్తివలన లభించును. అతనిలోనే యన్నిభూతము లున్నవి. అతడే యీ సర్వమును విస్తరింపజేసెను."

ఈ రెండు శ్లోకముల పరస్పర సంబంధమును పాఠకులు చూతురు గాక ! తరువాత ప్రక్షేపకుని శ్లోకములుకూడ రెండు చూడుడు.

"సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణం ఆస్థితో యోగధారణామ్." 12

"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మా మనుస్మరన్
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్." 13

'ద్వారముల నన్నింటిని బంధించి మనస్సును హృదయమున నిల్పి తన ప్రాణములను మస్తిష్కమున జేర్చి యోగధారణ చేయుచు' -

'ఓమను నక్షర బ్రహ్మ నుచ్చరించుచు, నన్ను స్మరించుచు, శరీర మును విడచి వెళ్ళువాడు పరమగతిని ప్రాపించును.'

ఈ శ్లోకార్థములను 11 వ శ్లోకార్థముతో కలిపిచూచి సామంజస్యము కుదురునో లేదో స్వయముగనే పాఠకులు చూతురుగాక !

6వ యధ్యాయపు 8 వ శ్లోకమునుండి గీతాకారుడు ధ్యానయోగమును ప్రారంభించి దానిని విస్తరింపజేసి యున్నాడు. ఇప్పు డెనిమిదవయధ్యాయపు పదునొకండవ శ్లోకమున ధ్యానయోగమువలన పొందదగు పరమదేవుడగు పరమాత్మని స్వరూపమును వర్ణించుచున్నాడు. మఱియు నా పదస్వరూప మును జెప్పుటకే యర్జునునకు నిర్దేశించుచున్నాడు. కాని, మన ప్రక్షేపక మహాశయుడు మాత్రము 8 వ యధ్యాయపు పండ్రెండవ శ్లోకమున ధ్యాన యోగమును విధించుటకునుద్యుక్తుడగుచున్నాడు. ఇప్పుడీప్రక్షిప్తశ్లోకములను మధ్యనుండి తొలగించి యిరువదిరెండవ శ్లోకభావమును చూడుడు. పదు నొకండవ శ్లోకమున నే పదమును జెప్పదలచెనో యీ యిరువది రెండవ శ్లోకమునందును ఆ పదమును గూర్చియే చెప్పినట్లు మీ కనుభవముకాగలదు. ఈ ప్రక్షిప్తభాగములను మీరు జాగరూకతతో జూచిన నందు కృష్ణుని పరమేశ్వరునిగ జేయు భావము ప్రస్ఫుటమగును. అందుకే యీ శ్లోకముల నిట జేర్చినాడు. పాఠకుల కిపు డీ విషయమున సంశయ ముండరాదు.

ఎనిమిదవ యధ్యాయపు 23 వ శ్లో. మొదలు 27 వ శ్లో. వఱకు గల భాగము ప్రక్షిప్తమే.

28 వ శ్లోకమున భక్తిధ్యానయోగముల మూలమున పరమపురుషుని ధ్యానించు జ్ఞానము ప్రశంసింపబడినది.

"వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్ పుణ్యఫలం ప్రదిష్టమ్

అత్యేతి తత్ సర్వ మిదం విదిత్వా
యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్." 28

'వేదపాఠము, యజ్ఞము, తపస్సు, దానముచేయుట వలన కలుగు పుణ్యముకంటె, ధ్యానభక్తి యోగముల మూలమున భగవంతుని ఉపాసించు విధానము నెఱిగి యెక్కుడు పుణ్యమును బొందగలడు. అన్నిటికంటె శ్రేష్ఠము, ఆదిపదము నగు భగవంతుని పొందగలడు.'

మధ్యలో నితర శ్లోకములు చేర్పబడినందున నీ యిరువది యెనిమిదవ శ్లోకమునందలి 'ఇదమ్' 'ఈ' యను పదసంబంధము ఇరువదిరెండవ శ్లోకముతో విడిపోవుచున్నది. మఱియు నా ప్రసంగ ముపసంహారములేనిది యగుచున్నది. కొండొక కాలవిశేషమున ప్రయాణ మొనర్చుటను గూర్చి వర్ణించుట కిట ప్రసక్తియు గనిపింపదు. సామ్యబుద్ధి సిద్ధించుటకు వలయు ధ్యానయోగము, ప్రసంగానుకూలమగు ధ్యానయోగ ఫలప్రాప్తియు నిట వర్ణింపదగినవి; వర్ణింపబడినవికూడ. ఇప్పు డిక పూర్వోక్తములగు జ్ఞాన విజ్ఞాననిరూపణ జరుగవలసి యుండెను. ఇంతేకాక యీ ప్రక్షిప్తశ్లోకములు గీతాకారునివిగ నెంచెదమేని 28 వ శ్లోక సంబంధ మీ శ్లోకములతో నున్న ట్లెంచవలసి యుండును. కారణ మేమన రెండవ ప్రకరణము ప్రారంభ మగుటవలన మొదటి ప్రకరణము 22 వ శ్లోకముతోనే సమాప్తమైనది. మఱియు కొండొక కాలవిశేషమున ప్రయాణమొనర్చుటకు చెందిన జ్ఞానమునకు శాస్త్రీయ దృష్టితో నింతటి మహత్త్వమును నీయ జనదు. వేదములు, యజ్ఞము, తపస్సు, దానము నను వాని పుణ్యముకంటె, ప్రయాణ జ్ఞానమువలన జనించు పుణ్య మెక్కుడెట్లు కాగలదు? కాబట్టి యీ మధ్య శ్లోకము లన్నియు గ్రంథమును విస్తరింపజేయుటకై యందు జేర్పబడినవిగా నెంచి ప్రక్షిప్తము లనుటయే యుక్తము.

# 9, 10, 11, 12 అధ్యాయములు

తొమ్మిదవ యధ్యాయపు మొదటిశ్లోకము తక్క మిగిలిన శ్లోకములు, 10, 11, 12 అధ్యాయములు సంపూర్ణముగా నన్నియు ప్రక్షిప్తములే. తొమ్మిదవ యధ్యాయారంభమున జ్ఞాన విజ్ఞానముల నుపదేశించుటకు ప్రతిజ్ఞ చేయబడినది. కాని, యందలి తరువాతి శ్లోకములందుకాని, అనంతరపు మూడధ్యాయములలో కాని యెక్కడను జ్ఞాన విజ్ఞానముల పేరైనను కనిపింపదు. నవమాధ్యాయములోని విషయసూచిక యిట్లున్నది.

1. ఇది యంతయు నాచే నొనరింపబడిన విస్తారమే.
2. సర్వభూతములు నాయందే యున్నవి.
3. ప్రళయమున నివియన్నియు నాయందే లీనమగును.
4. నా యీ మహత్తు నెఱుగక మనుష్యుడనని నన్నవమానించు వారు మూర్ఖులు.
5. ఋషులు నన్నే భజించుచు వచ్చిరి.
6. నాభక్తి వలననే పరమగతి గల్గును.

దశమాధ్యాయమున కృష్ణభగవానుని విభూతుల వర్ణనమున్నది.

పదునొకండవ యధ్యాయమున కృష్ణు డర్జునునకు విశ్వరూపము దర్శింప జేసెను.

పండ్రెండవ యధ్యాయమునందు 'నా భక్తులే నాకు ప్రియు' లని యోగిరాజగు కృష్ణుడు ప్రకటించి యున్నాడు.

ఇట్లీ యధ్యాయములలో నెక్కడను జ్ఞాన విజ్ఞానములే కనిపింపవు.

కృష్ణుని పూర్ణముగ పరమేశ్వరు నొనర్చుటకే యీ యధ్యాయము లందు ప్రయత్న మొనర్చబడినది. ప్రక్షేప మహోదయు డీ విషయముల నన్నిటిసిట జ్ఞాన విజ్ఞానములలో కలుపుటకే లిఖించియున్నాడు. కాని, గీతా కారుని మతములో నివియన్నియు జ్ఞాన విజ్ఞానములు కావు. గీతాకారుడు

పదమూడవ యధ్యాయపు 7 వ శ్లోకము మొదలు 11 వ శ్లోకము వఱకు జ్ఞానమును వ్యాఖ్యానము చేసియున్నాడు. చివరి శ్లోకమున

"ఏతత్ జ్ఞాన మితి ప్రోక్తం అజ్ఞానం యదతోఽన్యథా." 13-11

'పైన చెప్పినదంతయు జ్ఞానము. దానికి విపరీతమయిన దజ్ఞానము' అని వర్ణించియున్నాడు. ఇట్లు సంయమము, త్యాగపూర్వక జీవనము జ్ఞానమని గీతాకారుని మతము. ఈ శ్లోకమునకు పూర్వపు శ్లోకములందును, 12, 11, 10 అధ్యాయములందును జెప్పినది జ్ఞానమేల కాదని యెవరైనను శంకింపవచ్చును. పూర్వము చెప్పబడినందున నీ చివరి శ్లోకములోని 'ఏతత్' 'ఇది' యను పదముచే గ్రహింపబడవచ్చునుగదా ! అనినచో సమాధానమిట్లు చెప్పుదుము. ప్రస్తుతము మనకు లభించు గీత యట్లు గ్రహింప నవకాశ మీయదు. ఈ 13 వ యధ్యాయపు 18 వ శ్లోకమున నిట్లున్నది.

"ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః" 13-18

"క్షేత్రము, జ్ఞానము, జ్ఞేయము నిట సంక్షేపముగా వర్ణించితిమి."

ఈ పదమూడవ యధ్యాయమునందే మొదటి యాఱు శ్లోకములందు క్షేత్రవర్ణనము చేయబడినది. ఏడవ శ్లోకము మొదలు పదునొకండవ శ్లోకము వఱకు జ్ఞానము చెప్పబడినది. తదుపరి 12 నుండి 17 వఱకు జ్ఞేయము వర్ణింపబడినది. క్షేత్రమునకు జ్ఞేయమునకు మధ్య వర్ణింపబడిన యీ జ్ఞానము 13 వ యధ్యాయమునకు చెందినదేకాని యితరాధ్యాయములకు చెందినదికాదు.

సత్వాది గుణములు, ఆత్మ యను నీ రెంటియొక్క వివేకజ్ఞానమే గీతయందు విజ్ఞాన మనబడినది. విజ్ఞానమన విశేషజ్ఞానము, ఉన్నతజ్ఞానము. ఈ విజ్ఞానమును పదునాలుగవ యధ్యాయమునుండి వ్యాఖ్యానముచేయ నారంభించి యున్నాడు. అయ్యది గీతా సమాప్తి వఱకు నడచినది.

"పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్
యద్ జ్ఞాత్వా మునయః సర్వే పరాం సిద్ధి మితో గతాః 14-1

"ఇక ముందు జ్ఞానములలో నుత్తమ జ్ఞానము వర్ణింతుము. దాని నెఱిగియే మునులెల్లరు నుత్తమ సిద్ధిని బొందిరి"

దీనినిబట్టి చూచినను 10, 11, 12, అధ్యాయములలో విజ్ఞానమునకు తావే లేదు. కాబట్టి 9 అ. 1వ శ్లో. తరువాత 12వ యధ్యాయాంతమువఱకు గీతలలో గల శ్లోకములన్నియు ప్రక్షిప్తము లనుట నిశ్చితము.

# త్రయోదశాధ్యాయము

ఈ యధ్యాయమున మొదటి ఆఱుశ్లోకములు ప్రక్షిప్తములు. ఇందులకు కారణము పూర్వపంక్తులలోనే వ్రాయబడినది. నవమాధ్యాయమున నే జ్ఞానము వర్ణింపబడునని చెప్పబడినను యా జ్ఞానవర్ణన మీ యధ్యాయమున నేడవ శ్లోకముననే ప్రారంభింపబడినది. అందువలన నీయాఱు శ్లోకములు ప్రక్షిప్తములని భావము. కాని,

'క్షేత్ర క్షేత్రజ్ఞయో ర్జానం యత్తద్ జ్ఞానం మతం మమ" 13-2

"క్షేత్రముయొక్కయు క్షేత్రజ్ఞునియొక్కయు జ్ఞానమే నేను జ్ఞానమని యంగీకరింతును" అని యనినందున నీయాఱు శ్లోకములే జ్ఞానమని యేల యంగీకరింపరా దందురేని అది సరికాదు. క్షేత్ర ప్రకరణము ఆఱవ శ్లోకముతో సమాప్తమగును. ఏడవ శ్లోకమునుండి ప్రారంభమైన ప్రకరణాంతమునగూడ నిట్లున్నది.

"ఏతద్ జ్ఞానమితి ప్రోక్తం అజ్ఞానం యదతోఽన్యథా" 13-11

"ఈ చెప్పినదే జ్ఞానము. దీనికి విరుద్ధమైనది జ్ఞానముకాదు."అని యున్నందున పూర్వపు టాఱు శ్లోకములు జ్ఞాన ప్రకరణ మనుటకు వీలు లేదు. ఈ సంశయమునుకూడ ప్రస్తుత గీతయే దూరము చేయుచున్నది. ఆ తరువాత నీ యధ్యాయమునందే 18 వ శ్లోకములో చూడుదేమున్నదో:

"ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః" 13-18

"క్షేత్రము, జ్ఞానము, జ్ఞేయము ననునివి సంక్షేపముగ జెప్పబడినవి."

దీనినిబట్టి మొదటి యాఱు శ్లోకములలో క్షేత్రవర్ణన మున్నదని స్పష్టమగుచున్నది. తరువాత నైదు శ్లోకములలో జ్ఞానము, ఆ పైన ఆఱు శ్లోకములలో జ్ఞేయము వర్ణింపబడినది. అందువలన నీ యధ్యాయపు ఏడవ శ్లోకముతోనే జ్ఞానము చెప్పబడుట సుస్పష్టము. నవమాధ్యాయమున చేసిన ప్రతిజ్ఞ ప్రకారము జ్ఞానవర్ణనము జరుగవలసియుండగా నట్లు చేయక క్షేత్ర జ్ఞుల వర్ణన మారంభమైనది. కాబట్టి ప్రసంగరహితముగ నీ యాఱు శ్లోకములందు జేయబడిన వర్ణనముబట్టి యివి ప్రక్షిప్తములగుచున్నవి. ఇయ్యది సర్వక్షేత్రములందును కృష్ణునే క్షేత్రజ్ఞునిగ చేయదలచి చేసినట్లు తెలిసికొనవలయును.

ఈ యధ్యాయమున దశమ శ్లోకము కూడ ప్రక్షిప్తమే.

"మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ
వివిక్త దేశసేవిత్వ మరతిర్ జనసంసది" 13-10

"ఘనిష్ఠ సంబంధముతో నాయందు భక్తిగలిగి యుండుట, జన సముదాయమును వీడి యేకాంతస్థలమున నుండుట"

అను నీ శ్లోకమునందలి యుత్తరార్ధమున జెప్పబడిన విషయము తొమ్మిదవ శ్లోకమున వచ్చియే యున్నది. చూడుడు.

"అసక్తి రనభిష్వంగః పుత్రదార గృహాదిషు." 13-9

"సంగమునకు దూరముగా నుండుట, దారా పుత్రాదులనుండి దూరముగ నుండుట."

ఈ శ్లోకార్థమును జదివిన తరువాత పదవ శ్లోకార్థ మిందుగలదని పాఠకులు సులభముగా గ్రహించియే యుందురు. ఇట్లు పునరుక్తమగుటచే నుత్తరార్ధము ప్రక్షిప్తమగుచున్నది. సగము ప్రక్షిప్తమైన పూర్ణ శ్లోకము

ప్రక్షిప్తమని వేఱుగ చెప్పనేల ? కృష్ణు ననన్యభక్తికి పాత్రునిగా నొన రించుటకై యీ శ్లోకమిందు చేర్చబడినదని గుర్తింపనగును.

పూర్వమున ధ్యానయోగ ప్రకరణమునందు ధ్యానయోగ్యమగు పర మాత్మను గుఱించి కొంత నిరూపించినట్లు ఇక్కడ జ్ఞాన ప్రసంగమున జ్ఞేయమగు పరమాత్మనుగూర్చి కొంత నిరూపణము జరిగినది. ఈ వర్ణన మీ యధ్యాయపు 17 వ శ్లోకమున సమాప్తమైనది. తరువాత 18 వ శ్లోక మున ప్రక్షేపక మహోదయుడు తన క్షేత్ర వర్ణనము నుపసంహరించెను. దీనికి తదుపరిసంగతి ననుసరించి విజ్ఞాన వర్ణన మారంభింపవలసియుండెను. కాని 14 వ అధ్యాయపు ప్రథమ శ్లోకమున విజ్ఞాన వర్ణన మారంభింప బడినది. ఈ విషయము పూర్వమే యుల్లేఖించితిమి. అందువలన 13 వ అధ్యాయపు 17 వ శ్లోకమునకు 14 వ అ. 1 వ శ్లోకమునకు మధ్యగల శ్లోకములన్నియు ప్రక్షిప్తములే యగుచున్నవి.

ఈ ప్రక్షిప్తభాగమున ముఖ్యముగ ప్రకృతి పురుషుల స్వరూపము, వాని సంబంధము వర్ణింపబడినది. ఇయ్యది ప్రకారాంతరమున విజ్ఞాన వర్ణనములోనే చెప్పబడినది. ఇట్లు పునరుక్తమగుట ప్రక్షిప్తము. ఇందు ప్రక్షేపకుడు జీవబ్రహ్మైక్యమును ప్రతిపాదింప యత్నించి యున్నాడు

## చతుర్దశాధ్యాయము

ఇందు 2, 3, 4 శ్లో ప్రక్షిప్తములు. ఇట మొదటి శ్లోకమున విజ్ఞానము నుపదేశింతునని చెప్పబడినది. ఆ యుపదేశము 5 వ శ్లోకమున నారంభింపబడినది. రెండవ శ్లోకము విజ్ఞానము నుపదేశింపక పూర్వమే ఫలము చెప్పబడినది. కృష్ణునితో సమత్వ ప్రాప్తియే యా ఫలము. కృష్ణుని ప్రసక్తి తెచ్చుటయే యిందు ఫలము చెప్పబడినదని దీనింబట్టి స్పష్టమగు చున్నది. ఇందులకు ప్రమాణము ఫలము వర్ణింపబడిన శ్లోకమునకు తరువాతనున్న రెండు శ్లోకములే.

"మమ యోనిర్ మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్
సంభవః సర్వభూతానాం తతో భవతి భారత." 14-3

"సర్వయోనిషు కౌంతేయ ! మూర్తయః సంభవంతి యాః
తాసాం బ్రహ్మ మహద్ యోనిః అహం బీజప్రదః పితా." 14-4

"మహద్ బ్రహ్మము నాయోని, నే నందు గర్భాధానముచేయుదును. ఓ యర్జున ! భూతములన్నియు దానివలన నుత్పన్నమగును."

"ఓ యర్జున ! అన్ని యోనులందును నుత్పన్నములగు మూర్తులకు యోని మహత్ బ్రహ్మము. నేను బీజమునుంచు పితను."

ఈ శ్లోకములందు విజ్ఞాన ఫలముయొక్క నామరూపములే లేవు. సృష్ట్యుత్పత్తి చెప్ప నారంభింపబడినది. విజ్ఞాన ప్రకరణముతో దీనికి సంబంధము సున్న దీనింబట్టి కృష్ణుడు సృష్టికి బీజముచు విత్తువాడని చెప్పుటకై రెండవ శ్లోకమున ఫలప్రసక్తితో కృష్ణుని ప్రసంగ మారంభింప బడినదని స్పష్టము కాకపోదు. కాబట్టి 2, 3, 4 శ్లోకములు ప్రక్షిప్తము లగుచున్నవి.

ఈ యధ్యాయమున 19 వ శ్లోకము ప్రక్షిప్తమే. 19-20 శ్లోకము లలో రెంటియందును 'గుణములకంటె పురుషుడు వే' అని తెలిసికొనిన మోక్షము కలుగునని యున్నది. చూడుడు.

"నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోధిగచ్ఛతి 14-19

"గుణానేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్
జన్మమృత్యుజరాదుఃఖైః విముక్తోఽమృతమశ్నుతే." 14-20

"ద్రష్ట-ఆత్మ-గుణములనే కర్తగా నెఱిగి, తనను గుణములకంటె వేఱని తెలిసికొనినపుడు నా స్వరూపమును-ముక్తిని - బొందును."14-19

"ఈ ముక్తి స్వరూపము సరియా ! కాదా ? యను విషయ మిట చర్చింప ననువు కాదు."

"శరీరధారియగు నాత్మ శరీర సంబంధముగల గుణములనుండి విడివడి తనను వానికంటె భిన్నముగా నెఱిగి జన్మ జరామృత్యువులనుండి వేఱై ముక్తిని బొందును." 14-20

ఈ శ్లోకార్థములను జదివిన మీదట రెండింటి యాశయ మొక్కటియే యని తెలియగలదు.

ఒక్క శ్లోకముతోనే పని పూర్తియగుచుండ రెండవది వ్యర్థమై ప్రక్షిప్తమగుచున్నది. అయిన నీ రెంటిలో నేది గీతాకారుని శ్లోకము? ఏది ప్రక్షిప్తము? అని యాలోచింపవలసి యున్నది. ఈ నిర్ణయ మొనర్చుటకు పాఠకులు తరువాతి శ్లోకమును జూడుడు.

"కైర్లింగై స్త్రీన్ గుణా నేతా నతీతో భవతి ప్రభో!
కిమాచారః కథం చైతాన్ త్రీన్ గుణా నతివర్తతే." 14-21

"భగవన్! మనుజు డే సాధనములవలన నీ గుణములనుండి వేఱగును? ఎట్టి యాచారవంతుడు? ఎట్లీ గుణములనుండి యుత్తీర్ణుడగును?"

ఇట్లిరువదియవ శ్లోకములోని శబ్దములను, భావములను నాధారముగ తీసికొని యున్నాడు. కాబట్టి 20 వ శ్లోకము గీతాకారునిది. 19 వ శ్లోకము ప్రక్షిప్తము. ఇందు కృష్ణుని స్వరూపప్రాప్తియే ముక్తియని చెప్పుట ప్రక్షేపకుని యాశయము.

ఈ యధ్యాయపు 26-27 శ్లో. కూడ ప్రక్షిప్తములే. ఇవి యధ్యాయాంతమున నున్నవి.

'గుణాతీతు డెవడు?' అని యడిగిన అర్జునుని ప్రశ్నకు 25 వ శ్లోకమున సమాధానము చెప్పబడినది.

"సర్వారంభ పరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే"

ప్రవృత్తులన్నియు విడిపోయినవాడు గుణాతీతుడు" అని సమాధానము సమాప్తమైనది.

ఇక 26-27 శ్లోకములు చూడుడు.

"మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే" 14.26

"బ్రహ్మణో హి ప్రతిష్ఠాహం అమృతస్యావ్యయస్య చ
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాంతికస్య చ." 14-27

"భక్తితో నన్ను భజించువాడు ఈ గుణములను వీడి బ్రహ్మరూప మును బొందును."

"అమరుడు నవికారియు నగు బ్రహ్మ నాలోనే యున్నాడు. మఱియు ననాదిధర్మమును నాయందే యున్నది."

ఇట నర్జునుని ప్రశ్నము 'గుణాతీతు డెవడు ? అని. అందులకు నిరువదియైదవ శ్లోకమున సమాధానము చెప్పబడినది. ఇక కృష్ణోపాసనను గూర్చి కాని, ఆతనియందు బ్రహ్మముయొక్క స్థితి యున్నదని కాని చెప్పుట కిట ప్రసక్తి యేమియు లేదు.

ఇయ్యది విజ్ఞాన ప్రకరణము. కావున విజ్ఞానమునకు సంబంధించిన విషయ మేదైన చెప్పియుండిన సమంజసముగా నుండి యుండెడిది.

# పంచదశాధ్యాయము

ఈ యధ్యాయ మంతయు ప్రక్షిప్తమే. పదునాలుగవ యధ్యాయా రంభమునుండి విజ్ఞానప్రకరణము నడచుచున్నది. ఇది దీర్ఘ ప్రకరణము. ఇంకను సమాప్తి కాలేదు. 18 వ యధ్యాయపు 63 వ శ్లోకముతో నియ్యది సమాప్తమగును. సమాప్తి శ్లోక మిది.

"ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యాద్ గుహ్యతరం మయా
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు. 18-63

"ఈ గుహ్యతమమగు రహస్యము నీ కుపదేశించితిని. దీనిని విచా రించి నీ కెట్లు తోచిన నట్లు చేయుము."

ఇట్లు 14 అ, మొదలు 18 అ. 63 శ్లోకమువఱకు నిది యొకటే ప్రకరణము. ఈ ప్రకరణమునం దంతటను సత్వరజస్తమో గుణములు, ఆత్మ భిన్నభిన్నరూపమున వర్ణింపబడినవి. వాని వివేకప్రాప్తి ముక్తి యనియు చెప్పబడినది. 16, 17, 18 అధ్యాయములలో నీ గుణములు

మనుజుని ప్రతి వ్యవహారమునందును విభిన్న రూపములలో వ్యాపకములై యున్నవని వర్ణింపబడినది. మఱియు ప్రతి వ్యవహారము యొక్క ఉత్తమత కాని ప్రథమతకాని యీ గుణవిశేషతలమీదనే యాధారపడి యుండు ననబడినది. మనుజుని సంపత్తి, శ్రద్ధ, ధృతి, బుద్ధి, కర్తృకరణములు, ఆహార వ్యవహారములు, యజ్ఞదాన తపస్సులు, నన్ని గుణకర్మలు నీగుణము లతో నోతప్రోతములై యుండును. కొన్నింట తమోగుణ ప్రాభవమున్న మఱికొన్నింట రజోగుణరాజ్యముండును. వేఱొకట సత్వగుణాధికారము కన నగును. ఇట్లీ యధ్యాయములలో గుణముల వ్యాపక సద్భావమును జూపి మోక్షాధికారి యధిక సావధాన మొనర్ప బడినాడు. ధ్యానయోగానంత రమున ధ్యేయమగు పరమాత్మ నిరూపింప బడినట్లును, జ్ఞాన నిరూపణా నంతరమున జ్ఞేయమగు పరమాత్మ స్వరూప నిరూపణ మొనర్చినట్లును, నిక్కడ విజ్ఞానమును నిరూపించిన పిదప కేవల మీ వివేక జ్ఞానమే యంతిమ ధ్యేయము కాదని యర్జునునకు చెప్పబడినది. ఈ వివేకముకూడ పరమేశ్వ రుని సమీపించుట కొక సాధనము కావున నా జగన్నియంతను శరణు జొచ్చుమని యుపదేశింపబడినది.

14 వ అధ్యాయము మొదలు 18 వ అధ్యాయము వఱకు నొకటే ప్రకరణమని యిప్పుడు పాఠకులు గ్రహించి యుందురు. అందువలన నీ ప్రకరణమున గుణములయు, పురుషునియు వివేచనము మించి మఱి యొండు విషయ మేదియు నుండరాదు.

కాని, 15వ అధ్యాయములో నితర విషయము లనేకములు చూడబడు చున్నవి. ఆరంభమున పరమాత్మయొక్కయు, ప్రపంచము యొక్కయు వర్ణన మాలంకారికముగ జేయబడినది. తరువాత కొంతదూరము వెళ్ళిన తరువాత పరమాత్ముని స్థానమున కృష్ణుడు నిలబెట్ట బడినాడు. అటనుండి కృష్ణ భగవానుని యుపదేశ మారంభమైనది.

"జీవుడు నా యంశమే. శరీరమును విడిచి వెళ్ళు జీవుడు ఇంద్రియములను వెంట గొనిపోవును. మనస్సు ఇంద్రియముల మూలమున విషయములను గ్రహించును. సూర్య చంద్రాగ్నులలో నా తేజస్సే యున్నది. నేనే పృథివిని ధరించి పోషించుచున్నాను. నే నందఱి హృదయములలో ప్రవిష్టుడనై యున్నాను. క్షరాక్షరములకు పరమున పురుషోత్తముడను నేనే. జ్ఞానులు నన్నే భజింతురు." ఇది యంతయు కృష్ణుని యుపదేశమున గల విషయము. పదునైదవ యధ్యాయమున వర్ణింపబడిన యీ విషయములకు జ్ఞాన విజ్ఞాన ప్రకరణముతో నెట్టి సంబంధమున్నదో పాఠకులు స్వయముగ నూహింతురుగాక !

గీతాకారుడు పరమాత్ముని విషయమున తాను చెప్పదలచిన దంతయు నీ ప్రకరణాంతమున జెప్పినాడు.

కాని, ప్రక్షేపక మహాశయు డిదియంతయు సహింపజాలక ప్రకరణ మధ్యముననే కృష్ణభగవానుని పరమాత్మ నొనర్చుటకు గాను ఈశ్వర విషయము నిరికించి యున్నాడు. ఇతడు ప్రారంభమునుండియు నీ రీతినే యనుసరించుచున్నాడు.

ఈ 15 వ అధ్యాయము ప్రకరణము మధ్యలో వచ్చినందున నిందలి విషయము కూడ విజ్ఞానమున కందమే యని పాఠకులందురేని యిందులకు నా సమాధానములు రెండు. ఒకటి-గీతలో విజ్ఞానమని చెప్పిన విషయ మీ యధ్యాయమున లేదు. రెండు-గీతాకారుడు విజ్ఞాన విషయమును 18 వ యధ్యాయమున సమాప్తము చేసియున్నాడు. 15 వ యధ్యాయపు ప్రకరణ మా యధ్యాయాంతముననే సమాప్తమైనది. అంతిమ శ్లోకమును చూడుడు.

"ఇతి గుహ్యతమం శాస్త్రం ఇద ముక్తం మయానఘ ।
ఏతద్ బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత." 15-20

"పాపరహితుడవగు నో యర్జున ! నేనీ గుప్తశాస్త్రమును నీ కుపదేశించితిని. దీని నెఱిగి నీవు బుద్ధిమంతుడవు, కృతకృత్యుడవు నగుదువు."

ఈ ప్రకరణముకూడ గీతాకారుని విజ్ఞాన ప్రకరణమున కంగమగు నెడల నత డెనిమిదవ యధ్యాయమున జేసిన ఉపసంహారముతోనే ప్రయోజనము సిద్ధించియుండెడిది. మరల నిట నిట్లు ఉపసంహార మొనర్పవలసిన యవసరమేమున్నది? కాబట్టి యీ ప్రకరణమంతయు ప్రక్షేపకుని శాస్త్రమే కాని కృష్ణునిది కాదని స్పష్టమగుచున్నది.

## షోడశాధ్యాయము

ఈ యధ్యాయమున 18, 19, 20 శ్లోకములు ప్రక్షిప్తములు. ఈ యధ్యాయమునందు సత్వగుణము ప్రకటమగు దైవీసంపద వర్ణింపబడినది. తదుపరి 18, 19, 20 శ్లోకములకు ముందు తమో గుణము ప్రకటమగు నాసుర సంపద వర్ణనము జరుగుచున్నది. అసురసంపద గల వారియందలి కామక్రోధదర్పాభిమానాది దుర్గుణములు 18 వ శ్లోకమున జూపబడినవి. అవి యన్నియు నంతకు పూర్వమే వచ్చియుండెను. కాబట్టి మరల నీ శ్లోకమున వానిని జెప్పుట పునరుక్తి అసురసంపత్తిగల వారికి గలుగు ఫలము 16 వ శ్లోకమున (పతంతి నరకేఽశుచౌ) అశుద్ధమగు నరకమున బడుదురని చూపబడినది. మరల 20 శ్లోకమున యధమగతి కలుగునని చెప్పుటయు పునరుక్తియే. కాని, ప్రక్షేపకమహోదయుడు కృష్ణుని పరమేశ్వరు నొనరించుటకై కంకణము కట్టుకొని యున్నాడు. కావున నీ యసురసంపద ప్రకారములోకూడ కృష్ణుని ప్రకరణమును చూపక యుండలేడయ్యె.

గీతలోని ప్రతి ప్రకరణమునందును కృష్ణునకు ప్రసక్తి కలిగించి యతనిని పరమేశ్వరు నొనరించుటకై యత్నించినట్లు స్పష్టముగా కనిపించును.

## సప్తదశాధ్యాయము

ఈ యధ్యాయమునందలి 5-6 శ్లోకములు ప్రక్షిప్తములు. 16 వ అధ్యాయమున నాసుర సంపత్తి వర్ణనము సమాప్తమైనది. ఈ 17 వ అధ్యాయమున సత్వరజస్తమో గుణములవలన నేర్పడు వస్తువులలోగల

భేదత్రయము చూపబడినది. ఈ 5-6 శ్లోకములకు పూర్వము శ్రద్ధకుచెందిన భేదత్రయము వర్ణింపబడినది. తరువాత నేడవశ్లోకమునుండి ఆహారము, యజ్ఞము, తపము, దానము మున్నగువాని భేదములను వర్ణింప నారంభింప బడినది. ఈ మధ్యలో ప్రక్షేపక మహాశయుడు ప్రవేశించి 5-6 శ్లోకములలో నాసురీసంపత్తిని వర్ణించి రసభంగ మొనర్చిక మానడయ్యె చూడుడు :

"అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపోజనాః
దంభాహంకార సంయుక్తాః కామరాగ బలాన్వితాః" 17-5
"కర్షయంతః శరీరస్థం భూతగ్రామ మచేతసః
మాం చైవాంతఃశరీరస్థం తాన్ విద్ధ్యాసుర నిశ్చయాన్." 17-6

"దాంభికుడు, అహంకారి, కాముకుడు, రాగి యైనవారు శాస్త్రవిధిని విడిచి భయంకర తప మొనర్తురు.

"శరీరములోని భూతగ్రామమును నన్నును కృశింపజేయుదురు. వీరు ఆసుర నిశ్చయము గలవారు."

ఈ యసుర సంపద కిక్కడ ప్రయోజన మేమో పాఠకులు గ్రహింతురుగాక. ప్రసక్తియున్నను లేకున్నను ప్రక్షేపకుడీ యధ్యాయమును మాత్ర మేల విడుచును ? కృష్ణభగవాను డందఱి శరీరములో నున్నాడని చెప్పుటకై యీ శ్లోకముల నిట చేర్చుకున్న నతనికి నిద్రపట్టదు.

# అష్టాదశాధ్యాయము

ఈ యధ్యాయమున 50-58 శ్లోకములు తొమ్మిది ప్రక్షిప్తములే. ఈ ప్రకరణమున స్వభావము ననుసరించి కర్మలు చేయుట వలనను, చేయకుండుట వలనను గలుగు హాని లాభములు నిరూపింపబడినవి. 49 వ శ్లోకముతో నీ ప్రకరణము సమాప్తముకాదు. మధ్యలో నీ తొమ్మిది శ్లోకములు విడిచి 59-60 శ్లోకములను జదువుదుమేని యందునను నా ప్రకరణ మున్నది. మధ్యలో నీ తొమ్మిది శ్లోకములు చేర్చి బ్రహ్మప్రాప్తి విషయము

చెప్పబడినది. ఈ ప్రసంగము ప్రకరణమును చెడగొట్టు చున్నది. కాబట్టి ప్రక్షిప్తములనక వీలులేదు. బ్రహ్మప్రాప్తి సాధనమును ముందు రాబోవు శ్లోకములలో ధ్యానయోగముగ జెప్పబోవుచున్నాడు. ఆఱవ యధ్యాయమున ధ్యానయోగము ద్వారమున బ్రహ్మానంద ప్రాప్తి కలుగునని విస్తారముగ జెప్పియేయున్నాడు. అందువలన నీ శ్లోకములు పునరుక్తి దోషగ్రస్తములై ప్రక్షిప్తములగుచున్నవి. ఇది రెండవకారణము.

'బ్రహ్మప్రాప్తి కలిగినమీదట నత డానందమున నిమగ్నుడగును. అతని నెవరు నడ్డగింపలేరు. అతని కే యాకాంక్షయు నుండదు. తదుపరి యతడు నా భక్తుడగును. భక్తితో నన్నెఱుగ యత్నించును. అతడు కర్మము లన్నియు నా కర్పించుచు చేయును 'అని మరల కృష్ణుడు తరువాతి శ్లోకము లందు చెప్పెను. ఈ మాటల కర్థమేమైననున్నదా? బ్రహ్మప్రాప్తికి తదుపరి కూడ కృష్ణభక్తి యవసరమట. ఇట్టి యసంబద్ధ ప్రసంగములు గీతాకారుని వెట్లగును ? కృష్ణభక్తుల లీలయో, శత్రువుల ప్రక్షేపములో యగును.

ఈ యధ్యాయములో 64-71 వఱకుగల 8 శ్లోకములును ప్రక్షిప్త ములే. 61-62 శ్లోకములలో కృష్ణుడు, 'ఈశ్వరుడు సర్వప్రాణుల హృదయమున నున్నాడు. ఓ యర్జున ! అతడు తన శక్తిరూప యంత్రముపై ప్రపంచ ప్రాణుల నన్నింటిని త్రిప్పుచున్నాడు. పూర్ణశ్రద్ధతో నతనినే శరణుజొచ్చుము. అతని దయవలననే యుత్కృష్ట శాంతిరూప పరమ ధామమును బొందగలవు' అని చెప్పియున్నాడు.

అంతమున నీ యుపదేశమొనర్చి 63 వ శ్లోకమున విజ్ఞానప్రకరణ మును సమాప్త మొనరించియున్నాడు.

"ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యాత్ గుహ్యతరం మయా
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు." 18-63

"రహస్యములకంటె రహస్యమును నీకు నేను చెప్పితిని. దీనిని విచారించి నీ యిష్టము వచ్చినట్లు చేయుము."

ఈ శ్లోకమున పూర్వార్ధము జ్ఞాన ప్రకరణ సమాప్తికి సూచకము. ఉత్తరార్ధమును చూచిన తదుపరి యిక నర్జుననకు చెప్పవలసినదేమియు లేనట్లు తెలియుచున్నది. కాని, ప్రక్షేపకుని యుపదేశముమాత్ర మింకను పూర్తికాదు. ఏ మనుచున్నాడో యతడు చూడుడు :

"సర్వం గుహ్యతమం భూయః శృణు మే పరమం వచః.'' 18-64

"అన్నిటికంటె గూఢమగు నా పరమ వచనమును వినుము.'. అని యింకేదో మిగిలి యున్నట్లు చెప్పనారంభించినాడు. ఆ పరమ వచన మేమో తరువాత కృష్ణుని మాటలలో ప్రక్షేపకు డిట్లు చెప్పుచున్నాడు.

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామే వైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే." 18-65

"నాయందు మనస్సు లగ్నముచేయుము. నా భక్తుడవగుము. నన్ను పూజింపుము నాకు నమస్కరింపుము నీవు నాకు ప్రియుడవు. నేను నిజముగ ప్రతిజ్ఞ చేయుచున్నాను. ఇట్లు చేసిన గాని నీవు నన్ను పొందలేవు."

పైన 62 వ శ్లోకమునందు 'పరమేశ్వరుని శరణు జొచ్చుము. అంతయు నీకు లభించును' అని చెప్పియున్నాడు. ఇప్పుడిట 'నాశరణు జొచ్చుము' అనుచున్నాడు. దీని తాత్పర్యమేమి ? కృష్ణభగవానుడు పరమేశ్వరుడగుటచే రెండు నొకటే యందురేని యపుడు పునరుక్తి యగును. కావున వ్యర్థమగును. అందువలన నీ శ్లోకము ప్రక్షేపకునిదని పాఠకులకు వేఱుగ జెప్పనేల ?

ఇట్లే 76, 77 వ శ్లోకములు కూడ ప్రక్షిప్తములే.

"రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమ మద్భుతమ్
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ పునః పునః." 18-76

"తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునః పునః."18-7

"రాజన్ ! కృష్ణార్జునుల సంవాదమును స్మరించి నేను పునః పునః ప్రసన్నుడ నగుచున్నాను."

"కృష్ణుని ఆ రూపమును స్మరించి మాటి మాటికి నా కాశ్చర్యము, ప్రసన్నతయు కలుగుచున్నది."

ఇందు 76 వ శ్లోక విషయము 74 వ శ్లోకమున వచ్చినది మరల జెప్పుట వ్యర్థము. సంజయు డనుచున్నాడు.

"ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః
సంవాద మిమ మశ్రౌషం అద్భుతం రోమహర్షణమ్." 18-74

"నేను కృష్ణార్జునుల సంవాదమును వింటిని. అది యాశ్చర్య భరితము, రోమాంచకమును." రోమాంచము ప్రేమను, హర్షమును సూచించును. ఇట్లు ఈ సంవాదమును గూర్చి ఆశ్చర్యము, ప్రసన్నత రెండును పూర్వమే (74) ప్రకటింప బడినవి. మరల వానిని 76 లో ప్రకటించుట పునరుక్తి యగుచున్నది.

77 వ శ్లోకమున కృష్ణుని విశ్వరూపమును జ్ఞాపకము చేసినాడు. అందులకే ప్రక్షేపకుడు 76 వ శ్లోకమును గూడ రచించి యుండవచ్చును. విశ్వరూపసందర్శన ప్రకరణమెక్కడ ప్రక్షిప్తమందురోయను భయమతనికి కలిగి వానిని దృఢపఱచు కొనుటకై మరల నిట దానిని స్మరించియుండును.

76-77 శ్లోకములను తీసివేసినను పూర్వాపర ప్రసంగమున కెట్టి భంగమును కలుగదు. వీనిని మధ్యనుండి తొలగించిన పక్షమున 75-78 శ్లోకముల శాబ్దిక సంబంధము, ఆర్థిక సంబంధము మిక్కిలి సుందరముగ కనిపించును. 75 లో సంజయుడు "నేను ఈ యోగమును యోగీశ్వరుడగు కృష్ణునినుండి వింటిని" అని చెప్పియున్నాడు. తరువాత 78 లో యోగీశ్వరుడగు కృష్ణుని యునికియే విజయ సాధనమని నుడివినాడు. దీనింబట్టి మధ్యలోని 76-77 శ్లోకములు ప్రక్షిప్తము లనుట సుస్పష్టము.

వాడుకలో నున్న గీత :

| | అధ్యాయము | శ్లోకములు | ప్రక్షిప్తములు | యథార్థములు |
|---|---|---|---|---|
| 1. | అర్జుని విషాదయోగము | 47 | .... | 47 |
| 2. | సాంఖ్యయోగము | 72 | 8 | 64 |
| 3. | కర్మయోగము | 43 | 3 | 40 |
| 4. | జ్ఞానయోగము | 42 | 20 | 22 |
| 5. | కర్మసన్న్యాసయోగము | 29 | 17 | 12 |
| 6. | ధ్యానయోగము | 47 | 14 | 33 |
| 7. | జ్ఞానవిజ్ఞానయోగము | 30 | 30 | .... |
| 8. | అక్షరబ్రహ్మయోగము | 28 | 22 | 6 |
| 9. | రాజవిద్యారాజగుహ్యయోగము | 34 | 33 | 1 |
| 10. | విభూతియోగము | 42 | 42 | .... |
| 11. | విశ్వరూపసందర్శనయోగము | 55 | 55 | .... |
| 12. | భక్తియోగము | 20 | 20 | .... |
| 13. | క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము | 34 | 24 | 10 |
| 14. | గుణత్రయ విభాగయోగము | 27 | 6 | 21 |
| 15. | పురుషోత్తమప్రాప్తియోగము | 20 | 20 | .... |
| 16. | దైవాసురసంపద్విభాగయోగము | 24 | 3 | 21 |
| 17. | శ్రద్ధాత్రయవిభాగయోగము | 28 | 2 | 26 |
| 18. | మోక్షసన్న్యాసయోగము | 78 | 19 | 59 |
| | మొత్తము | 700 | 338 | 362 |

యథార్థశ్లోకములతో గీత :

| విషయమునుబట్టి అధ్యాయ విభాగము | శ్లోకములు |
|---|---|
| 1. అర్జునుని విషాదము (విషాదయోగము) | 56 |
| 2. సాంఖ్యయోగము | 26 |
| 3. కర్మయోగము | 13 |
| 4. స్థితప్రజ్ఞుని లక్షణము | 14 |
| 5. కర్మసన్న్యాసావశ్యకత | 8 |
| 6. కర్మయోగము (యజ్ఞముకొఱకు కర్మ అవసరము) | 8 |
| 7. కర్మయోగము (జ్ఞానికిని కర్మ మావశ్యకమే) | 16 |
| 8. కర్మయోగము (ప్రవృత్తికి ముఖ్యకారణము) | 8 |
| 9. కర్మయోగము (కర్మసంన్యాసమునకు సాధనము కర్మయే) | 8 |
| 10. కర్మయోగము (యజ్ఞ జ్ఞానయజ్ఞముల శ్రేష్ఠత) | 14 |
| 11. కర్మయోగము (కర్మసంన్యాసముకంటె కర్మయోగము శ్రేష్ఠము) | 16 |
| 12. ధ్యానయోగము (సామ్యబుద్ధి - దాని సాధనము, ధ్యానయోగము) | 29 |
| 13. భక్తియోగము (భక్తినిరూపణము) | 6 |
| 14. జ్ఞానయోగము (జ్ఞానజ్ఞేయముల నిరూపణము) | 11 |
| 15. విజ్ఞానయోగము (గుణకార్య వివేకము - గుణాతీత లక్షణము) | 21 |
| 16. విజ్ఞానయోగము (దైవాసుర భావ వివేకము) | 21 |
| 17. విజ్ఞానయోగము (గుణనిష్ఠ) | 28 |
| 18. విజ్ఞానయోగము (గుణనిష్ఠ) | 59 |
| మొత్తము | 362 |

# గీత - విషయ వివేచనము

"కుర్వన్నే వేహ కర్మాణి జిజీవిషే చ్ఛతగ్ం సమాః
ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే." యజు 40-2.

ఈ యాజుష మంత్రము కర్మయోగమును ప్రతిపాదించుచున్నది. గీత యంతయు నీ మంత్రమునకు భాష్యమని చెప్పవచ్చును. ఒక్క మంత్రమునకు భావపూర్ణము, స్వారసికము, విస్తృతమునగు నిట్టి యనువాదము సంపూర్ణ సాహిత్యమునం దెచ్చటను గనజాలము. ఈ మంత్రభావ మిది.

"కర్మల నాచరించుచునే లోకమున జీవింపగోరుము. ఈ గతి నిన్ను విపరీతమార్గమున గొనిపోదు. ఇట్టి కర్మ బంధనకారణము కాదు."

ఇందలి యంతిమ వాక్యము మొదట విధింపబడిన కర్మలలో కొంత విశేషతను సూచించుచున్నది. ప్రతికర్మవలనను పుణ్యమో పాపమో కలుగును. అ పుణ్యాపాపములే మంచి చెడుజన్మలకు కారణములు. జన్మమే బంధనము. అట్టియెడ కర్మ బంధన కారణము కాదని యెట్లు చెప్పబడినది? వేద మేకర్మలను జీవన కాలమంతయు చేయుచుండుటకు విధించుచున్నదో యా కర్మలలో కొంత విశేషత యున్నదనుట, కాబట్టి యుచితమే యగుచున్నది.

కొంచెము లోతుగా నాలోచించిన పక్షమున నీ మంత్రమున నిష్కామ కర్మ విధింపబడినట్లు తెలియకపోదు. నిష్కామ కర్మ బంధన హేతువు కాదనుట నిశ్చిత సిద్ధాంతము.

మార్గమున నడచునపుడు కాలికి తృణస్పర్శ కలుగవచ్చును కోరకయే వాయువేగమునకు కాళ్ళు చేతు లెన్నడైన కదలవచ్చును. ఇట్లే యనేక క్రియలు ఇచ్ఛాశక్తి సంబంధము లేకయే జరుగును. ఈ క్రియలకు ఫలము ఉండదు. దానిని సంభావింపనురాదు. ఇట్టి వానికికూడ ఫలముండు నెడల వాయువేగమున పడిపోయిన నా వృక్షముక్రింద పడి చనిపోయిన వ్యక్తి

విషయమున నే నపరాధి నగుదును - హంతకుడను కావలసి యుండును. ఆ వృక్షము నాకు చెందినదగుటయే యిందులకు కారణము. వృక్షము నాదే యైనను నేను కోరి దానిని పడవేయలేదు. కావున దానిక్రిందపడి చచ్చినవ్యక్తి హత్యతో నాకు సంబంధముండదు. నేను హంతకుడనని యెవరు నెంచరు.

అంతఃకరణముమీద నేర్పడు సంస్కారములే పాపపుణ్యము లన బడును. భావన కారణముగ నా సంస్కారము లేర్పడును. మనుజు డెట్టి కామనతో (భావన) నేకర్మ నాచరించునో యట్టి సంస్కారమే యతని యంతఃకరణమున నేర్పడును. కాబట్టి మంచి భావనకాని, చెడుభావనకాని చేయకయే కర్మల నుదాసీన భావముతో కర్తవ్యములని యెంచి చేసినపుడు వానికి కలుగు ఫల మేముండును ? ఫలము లభించునందు మేని దాని కాధార మేమగును ? (కర్తవ్యమని చేసిన కర్మల విషయమున భావన (కామన) అను నాధారముండదు. కావున పుణ్యపాపరూప సంస్కారము లేర్పడవని, సుఖదుఃఖరూప ఫలములు కలుగవనియు భావము.) అందువలననే నిష్కామ కర్మ బంధన హేతువు కాదందురు. కావున పై మంత్రములోని మొదటి పాదమున విధింపబడిన కర్మ నిష్కామకర్మ యనవలయును. ఇదియే గీతకు ప్రతిపాద్యవిషయము.

గీతలో నితరవిషయము లేవైన లభించిన నవన్నియు నిష్కామ కర్మను బలపఱచుటకే యని యెంచవలయును. కాబట్టి గీతయంతయు నొక్క వేదమంత్రమునకే వ్యాఖ్యానము - భాష్యము.

ఆరంభమున కామనావిరహితమైన కర్మ యొకటి యుండునా ? యని ప్రశ్న యుదయించును. మనుజు డేదిచేసినను కోరకయే యెట్లు చేయును ?

కర్మనారంభించు ప్రతివ్యక్తియు 'నేనీ కర్మ నెందుకు చేయవలయును?' అని ప్రశ్నింపక యుండడు. ఇది సత్యమే. ఈ ప్రశ్న కతనికి రెండు సమాధానములు లభించును. ఫలాపేక్షతో నా కర్మ నాచరింపగోరుట యొకటి. కర్తవ్యబుద్ధితో ఫలాపేక్ష చేయకయే చేయుట రెండవది.

"వర్ణాశ్రమముల ననుసరించి భగవంతుడు నా కీ కర్మను విధించి యున్నాడు. 'దీనికి ఫలమేమి లభించును ?' అని ప్రశ్నింపనేల ? ఇది నాకు చేయదగిన పని. అందువలన నేను చేయుదును" అను బుద్ధికి కర్తవ్యబుద్ధి యని పేరు.

ఈ రెండవ విధమగు సమాధానమునే గీత సరియని యెంచును. కాని, యీ సమాధానము సులభముకాదు. ఇట్టి సమాధానము చెప్పుటకు వలయు యోగ్యత సంపాదింప ననువగు నుపాయము లనేకములు గీతయందు బోధింపబడినవి. గీత కీ విషయములన్ని గౌణములని యెంచవలయును.'నేనీ సంగ్రామము నెందుకు చేయవలయును?' అను ప్రశ్నయే యుద్ధారంభమున నర్జునుని మనస్సున నుదయించినది. అర్జునుని యీ విషయమును చిత్రించుటకే వ్యాసమహర్షి గీతలో ప్రథమాధ్యాయము

## అర్జునుని విషాదము

వ్రాసియున్నాడు. అర్జునుడు క్షత్రియుడు అందువలన వర్ణానుసారమతనికి సంగ్రామము కర్తవ్యమయ్యెను. సంగ్రామ ఫలము నూహించినపుడర్జునున కది భయంకరముగా తోచినది. బంధుబాంధవులను చంపుట యతనికిరుచికరముకాదయ్యె. సంగ్రామముచేసి పొందు రాజ్యప్రాప్తి యతనికి తుచ్ఛమయ్యెను. తమోగుణ ప్రభావ మర్జును నావరించినట్లు కృష్ణభగవానుడు గుర్తించెను. అర్జునుడు క్షాత్రధర్మమును మోహవశమున మఱచినాడని తెలిసికొనెను. అర్జును నావరించిన యావరణను దొలగింప నెంచియే కృష్ణుడతనికి రెండవ యధ్యాయము

## సాంఖ్య యోగము

వినిపించెను. నిత్యానిత్యములను, ఆత్మానాత్మలను, క్షరాక్షరములను వివేకమువలన గణించుట సాంఖ్యమనబడును. ఈ వివేచన మూలమున యోగిరాజగు కృష్ణుడు ఆత్మ నశింపదనియు, శరీరము నశించుననియు స్థిరపఱచి, అర్జునుని మోహమును - భ్రాంతిని దూర మొనర్ప యత్నించెను.

తరువాత కృష్ణుడు అర్జునునకు గలిగిన కర్మఫల దృష్టిని గూర్చియు కర్మఫల త్యాగమును గూర్చియు విమర్శించుచు తృతీయాధ్యాయమున

## కర్మ యోగము

నిష్కామ కర్మానుష్ఠానము నుపదేశించి యున్నాడు. "అర్జున ! కర్మను కర్తవ్యబుద్ధితో చేయుము. ఫల కామనను సర్వము విడిచిపెట్టుము. ఫల సంబంధము తెగినమీదట కర్మ బంధమునకు కారణము కాదు. సంగ్రామము వలన నీకు రాజ్యలక్ష్మి లభింపవలయునని నీవు కోరకుము. కొండొక విశేష వ్యక్తిని చంపుట నీవు లక్ష్యములో నుంచుకొనకు. సంగ్రామమును కేవల కర్తవ్యబుద్ధితో నొనరింపుము. ధర్మానుకూలమగు సంగ్రామము సేయ కుండుట పాపము. కాబట్టి నీవు పాపభాగి వెట్లు కాగలవో చెప్పుము." అని కృష్ణుడు బోధించెను.

కర్మకు కామనతోగల సంబంధము తెంచుట కష్టమేకాని యసంభవము కాదు. వివిధ ఫలజాలమునుండి తొలగించి బుద్ధిని స్థిరపఱచి, దానియందు సుఖ-దుఃఖములు, హాని-లాభములు మున్నగు ద్వంద్వములను సహించుశక్తి గలిగించినచో కామన విడిచి కర్తవ్య బుద్ధితో కర్మల నాచరించుట యంత కష్టము కాదు. ఇట్లాచరించు మనుజుని స్థితిగతుల తెలుపుటకై కృష్ణభగవానుడు నాలుగవ యధ్యాయమున

## స్థితప్రజ్ఞ లక్షణము

స్థిర బుద్ధిగల పురుషుని చిహ్నములు వర్ణించెను. అటుపైన ఐదవ యధ్యాయమున

## కర్మసంన్యాసావశ్యకత

నిర్దేశించియున్నాడు.

కర్మలను బొత్తిగా విడచుట యసంభవము. బలవంతముగ శారీరిక కర్మలను విడిచిపెట్ట గలిగినను మానసిక కర్మలు నడుచుచునే యుండును.

కర్మలను త్యజించుట యసంభవమే. దానితోబాటు కర్మఫలమును విడుచుటయు సులభముకాదు. అందఱు స్థిరబుద్ధులు కాలేరుకదా! అను శంక కలుగ వచ్చును. ఇట్టి శంకను దూర మొనర్పనెంచి కృష్ణు డాఱవయధ్యాయమున

## యజ్ఞార్థము కర్మావశ్యకత

యను ప్రసంగము నారంభించియున్నాడు. "అర్జున! కర్మఫలము పూర్ణముగ విడుచుట కష్టమని యెంచెదవేని యజ్ఞముకొఱకు కర్మల నాచరింపుము. యజ్ఞార్థమున లోకహితముకొఱకని యర్థము. అట్లుచేయు కర్మలు బంధన హేతువులు కావు." అని యనెను. సంగ్రామ మొనర్చిన కలుగు లోకహిత మేమి? అను సందేహము వొడమిన అన్యాయము, అత్యాచారము తొలగుటయే లోకహితమని అర్జునుడు తలపవలయును. కృష్ణు డీ సంగ్రామమున కుద్దేశించిన ఫల మిదియే.

యజ్ఞాది కర్మలు జ్ఞానహీనులకుగాను విధింపబడి యుండవచ్చును. కావున నర్జునుడు జ్ఞానమార్గము నాశ్రయించినపు డతని కీ కర్మల నొనరింపవలసిన యవసరమేముండును? ఈ ప్రశ్నమునకు సమాధానము చెప్పుటకే కృష్ణభగవానుడు సప్తమాధ్యాయమున

## జ్ఞానికి కర్మావశ్యకత

గూర్చి నుడివియున్నాడు. కర్మ చేయుటవలన జ్ఞానికి పాపము అంటదు. అతడు కర్మను ఫలాపేక్షతో చేయడు. కామింపకున్న పక్షమున పాప పుణ్యములకు భాగి కాడు. కాని యతడు కర్మచేయుటయే మానిన పక్షమున నజ్ఞాను లతని నాదర్శముగ నెంచి కర్మల నాచరింపక మానుకొందురు. అందువలన వారికెంతో హానికలుగును. కావున జ్ఞానియైనవాడు తప్పక కర్మల నాచరింపవలయును.

ఇతరులకొఱకు జ్ఞాని కర్మల నొనరింపవలయునని నీవు చెప్పుచున్నావు. కాని యట్లెందుకు చేయవలయును? జనులకు ధర్మమననేమో

యధర్మమననేమో తెలియునుగదా ! అట్లు తెలిసియు వారు పాపము నేల చేయుదురు ? అను నీ యర్జునుని ప్రశ్నలకు సమాధానము చెప్పుటకుగాను కృష్ణుడు ఎనిమిదవ యధ్యాయమున

## ప్రవృత్తికి ప్రధానకారణము

చెప్పియున్నాడు "అర్జున ! ఇందు పాపము! వారి దోషమేమియు లేదు. వారి హృదయమున కామక్రోధముల నుద్భవింపజేయు రజోగుణమున్నది. ఆ కామక్రోధములు మనుజుని పాపమువంకకు బలవంతమున లాగును.

"అటులయినచో నిక కర్మ యెన్నడును విడువరానిదే యగునా ?" అను ప్రశ్నకు నవమాధ్యాయమున

## కర్మసంన్యాసమునకు సాధనము కర్మయే

అని కృష్ణుడు చెప్పి యున్నాడు.

కర్మలు తమను చేయకుండునట్లు చేయుటయే కర్మత్యాగము. అనగా కర్మలు మనుజుని బంధనమున బడవేయజాలకుండునట్లు వానిని జేయుట యని యర్థము. అర్జున ! ఇట్టి కర్మకూడ కర్మయోగము మూలముననే సిద్ధించును. ఫలకామన విడిచి చేయుకర్మ నపుంసకమగును. ఫలమునిచ్చు యోగ్యత దానికుండదు. ఇట్లది ఫలరహిత మగుటయే సంన్యాసము.

పూర్వము కృష్ణుడు యజ్ఞముకొఱకును, జ్ఞానికొఱకును కర్మ యావశ్యక మని చెప్పి యున్నాడు. కాని, ఆ యజ్ఞము, కర్మయు నేమో యెన్ని విధములో, వాని స్వరూపమేమో యింతవఱకు స్పష్టముచేసి యుండడయ్యె. అందువలన దశమాధ్యాయమున

## యజ్ఞము, జ్ఞానయజ్ఞము - వాని శ్రేష్ఠత

గూర్చి వర్ణించియున్నాడు.

ద్రవ్యయజ్ఞము, తపోయజ్ఞము, యోగయజ్ఞము, జ్ఞానయజ్ఞము నను వానినిగూర్చి వ్యాఖ్యానమొనర్చుచు నీ యధ్యాయమున జ్ఞానయజ్ఞము శ్రేష్ఠ మని నుడివియున్నాడు. ఇట జ్ఞానశబ్దమున కర్థము సంశయమును పోనాడి

యొక నిర్ణయమును చేర్పుట యని యెంచవలయును. అర్జునుడు సంశయ గ్రస్తుడై యున్నాడు. కావున నతనికొక నిర్ణయము కలిగించుటకై కృష్ణు డీ యుపదేశము చేసియున్నాడు.

జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమగునెడల జ్ఞానముతోనే సర్వము సంపన్నము కాదా ? ఇక కర్మయేల ? అందువలన కర్మ సంన్యాసమే సిద్ధించుచున్నది కదా ! మీ యుపదేశమంతయు కలగాపులగముగా నున్నది. దయచేసి కర్మ యోగము, కర్మ సంన్యాసము నను రెంటిలో నేది శ్రేష్ఠమో నిర్ణయించి చెప్పుడు ?" అను నర్జునుని ప్రశ్నకు కృష్ణుడు బదులు చెప్పుటకై పదు నొకండవ యధ్యాయమున

## కర్మసంన్యాసముకంటె కర్మయోగము శ్రేష్ఠము

అని చెప్పియున్నాడు. సంన్యాసము, కర్మ రెండును శ్రేష్ఠములే కాని యనుష్ఠాన దృష్టితో కర్మయోగమే శ్రేష్ఠము. ఫలకామన విడిచి కర్మ చేయగలుగుదుము. కాని కర్మ బొత్తిగ వదలజాలము. కర్మలను వదల దలచినను ముందు మనస్సున నుండు కోరికలు వదలవలసి యుండును. లేకున్న మానసిక కర్మలు జరుగుచునే యుండును. కామనలను విడువ వలసి వచ్చినపుడు ముందుగా కర్మయోగము ప్రారంభమైనట్లే యెంచ వలయును. కామనలు వదలుట వలన కర్మలు ఫలదాయకములు కానేరవుకదా! అందువలన కర్మ సంన్యాసమున కవసర మేముండును ?

ఇయ్యది సరియేకాని ఫలకామనాత్యాగము మాత్రము సులభమా ? యన కృష్ణుడు పండ్రెండవ యధ్యాయమున

## సామ్యబుద్ధి, దాని సాధనము ధ్యానయోగము

ను గూర్చి వర్ణించి యున్నాడు. సుఖదుఃఖములు, మిత్రశత్రువులు, మట్టి బంగారములు, హానిలాభములు నన్నియు సమములని యెంచు మను జుని బుద్ధి సమమగును. ఎవని కిట్టి సామ్యబుద్ధి కలుగునో వా డెందులకు

కామించును ? మనుజుడు - ధ్యానయోగము ననుష్ఠించిన మనుజుడు సులభముగనే సామ్యబుద్ధిని సంపాదింపగలడు.

"ఒక్కదెబ్బకు రెండు పిట్టలన్నట్లు" ధ్యానయోగమువలన రెండు ఫలములు సిద్ధించును. ధ్యానయోగమువలన కలుగు మొదటి ఫలము సామ్యబుద్ధి సిద్ధించుట. రెండవదిజగన్నియంతయు ప్రకాశాత్మకుడునగు భగవంతుని ప్రాప్తి కలుగుట. ఇయ్యది కలుగకున్న సకల కర్మలు నిస్సారములగును.

ప్రసంగవశమున కృష్ణభగవానుడు భగవంతుని ప్రాప్తికి రెండవ సాధనముగ పదుమూడవ యధ్యాయమున

## భక్తి యోగము

వర్ణించియున్నాడు. భక్తియోగ మీశ్వరుని ప్రాప్తికి సాధనమగుటయే కాక చిత్తైకాగ్రతను గలిగించి సామ్యబుద్ధి నుత్పన్న మొనర్చుటలో కారణమగును.

ధ్యానయోగము, భక్తియోగము, సామ్యబుద్ధి యివి యన్నియును యమనియమములను పాలింపక సిద్ధింపవు. అందువలన పదునాలుగవ యధ్యాయమున

## జ్ఞాన యోగము

ను కృష్ణుడు చెప్పియున్నాడు. అహింస, శౌచము మున్నగు సదాచారములను యోగ దర్శనమున పతంజలి నియమములనియు, మనువు ధర్మమనియు చెప్పినట్లు కృష్ణుడిట నట్టివానినే జ్ఞానమని పేర్కొనియున్నాడు. వాస్తవమున ధర్మమున కివియన్నియు నంగములు. అంతఃకరణమునందు ధ్యానయోగమునకు, సామ్యబుద్ధికి వలయు యోగ్యతను గలిగించి మనుజుని కర్మయోగమునకు తగిన యధికారిగ సిద్ధపఱచును.

సత్వరజస్తమో గుణములు మానవుని కార్యక్రమ మంతయు జీవించినంతకాలము నడుపుచుండును. ఈ మూడు గుణములలో నెయ్యది మానవుని యంతఃకరణమున నెక్కుడుగా నుండునో యా గుణ ప్రభావ

మున నతడట్టి పనులనే చేయును. విపరీతములను జేయజాలడు. గుణము లలో గల యీ వైశిష్ట్యమును దెలుపుటకే కృష్ణుడు పదునైదవ యధ్యాయమునందు

## గుణకార్య వివేకము

ను వర్ణించియున్నాడు. ఈ గుణకార్య వివేకము విజ్ఞానయోగమున కొక యంగము. కావుననే యీ యధ్యాయమున విజ్ఞానయోగ మారంభమైనది. గుణములు, వాని కార్యములు ఉపదేశించు గు ణ ము ల నుండి వేఱగుటకు నిది బోధింపబడినది.

అర్జునుడు గుణాతీతుడు కాదనిన యధికారి కాడు అతని హృదయ మున సత్వగుణోదయమయి యుండెను. అందువలన నతడు దైవీ సంపద కధికారి. కావున నతని కతని స్థితిని దెలుపనెంచి పదునాఱవ యధ్యాయమున

## దైవాసురభావ వివేకము

ను కృష్ణుడు వ్యాఖ్యానమొనర్చి యున్నాడు. ఇం దాసంపదలవర్ణన మెంతో బాగుగ జేయబడినది. "భగవన్ ! శాస్త్రవిధిని విడచి (కర్మయోగవిధిని విడచి) యజ్ఞమొనర్చువారికి కలుగు నిష్ఠ యెద్ది ? సత్వగుణీ నిష్ఠయా ? లేక రజోగుణీ నిష్ఠయా ? లేక తమోగుణీ నిష్ఠయా ?" యని యర్జునుడు కృష్ణు నడిగెను.

ఆ ప్రశ్నకు సమాధానము చెప్పుచు కృష్ణుడు పదునేడవ యధ్యాయమున

## గుణ నిష్ఠ

ను స్పష్టము చేసియున్నాడు. ఈ యధ్యాయమునందు మనుజు డే గుణము నందు నిష్ఠగలవాడైన నే యవస్థ యతనికి సిద్ధించునో, అతడెట్టి కర్మల నాచరించునో యవియన్నియు వర్ణింపబడినవి.

ఈ వర్ణనము విని యర్జునుడు కర్మయోగము, కర్మసంన్యాసమునను రెండును గుణదృష్టితో వినగోరెను. కావున పదునెనిమిదవ యధ్యాయమున కృష్ణుడు గుణదృష్టితో సన్న్యాసము, యోగము వ్యాఖ్యానము చేయ దలచి గుణనిష్ఠ ప్రకారాంతరమున జెప్పియున్నాడు.

చివర కర్జునుడు తనలో తమోగుణము లేదనియు, రజోగుణము, సత్వగుణము నున్నవనియు దెలిసికొనెను. కృష్ణుని యుపదేశము వలన తమోగుణ జన్యమైన మోహమనెడి తెర తొలగిపోయినదనియు గుర్తించెను. అతనియందుగల క్షాత్రధర్మము రజోగుణ సాహాయ్యముతో నపుడు ధర్మయుద్ధ మొనర్చుటకు ప్రేరేపింప దొడగినదనియు నెఱిగెను. సత్వగుణ సాహాయ్యమున నతడు నిష్కామభావముతో యుద్ధ మొనర్పగల ననియు, యుద్ధ మొనర్చినందువలన నేర్పడు పుణ్య పాపములనుండి తప్పించుకొనగల ననియు దలంపగలిగెను. ఇట్లు యోచించి యర్జునుడు రణక్షేత్రమున దుముకుట కనుమతించెను. కృష్ణుని గీతోపదేశమును సమాప్తమయ్యెను.



# శ్రీమద్భగవద్గీత

## ప్రథమాధ్యాయము

## అర్జునుని విషాదము

**పారము - సంగతి :**

వ్యాసమహర్షిచే రచింపబడిన భగవద్గీతలోని యీప్రథమాధ్యాయము అర్జునునకు బోధించిన కర్మయోగమునకు భూమిక యనదగియున్నది.

యుద్ధముకొఱకు బహుకాలముగ నర్జునుడు ప్రతీక్షించుచుండెను. యుద్ధమునకు ప్రతిబంధకముగా నున్న యజ్ఞాతవాసపు దినము లతనికి యుగములుగా గడచనినవి. కౌరవులవలన తమకు గలిగిన యవమానము నతడు క్షణకాలమయినను మఱవజాలకుండెను. అతడే అనేక ప్రయత్నము లొనర్చి యోగిరాజగు కృష్ణుని యుద్ధమున కభిముఖు నొనర్చెను. రథారూఢుడై యుద్ధక్షేత్రమున ప్రవేశించెను. కాని యత డనుకొన్నట్లు పాచికలు పాఱవయ్యెను. యుద్ధక్షేత్రమున దన యెదుట నిలచిన బంధువులను జూచుటయే తడవుగ హృదయమున నెటనో యణగి మణగి యున్న తమోగుణము మోహరూపమును ధరించి యతనికి సాక్షాత్కరించెను. క్షణకాలములో ధనుర్బాణములను త్యజించునట్లు అతని వివశునొనర్చెను. వ్యాసు డీ యధ్యాయమున మోహగతమగు నైంద్రజాలిక శక్తినెంతో చక్కగ ప్రదర్శించి యున్నాడు.

మోహము ప్రబలమై యర్జునుని క్షాత్రభావము నజ్ఞానమనెడి తెర చాటున దాచివైచినది. మోహావేశమున నా యర్జునుడే కృష్ణుని యెదుట నసామయికమగు రాగాలాప మొనర్చుచు యుద్ధ వైముఖ్యమును జూప నారంభించెను.

'కృష్ణ ! ఈ తుచ్ఛమగు నైశ్వర్యము కొఱకు రాజ్యభోగముల కొఱకును గురువులయు, బంధువులయు రక్తములో నా చేతులనెట్లు రంజిల్ల జేయుదును ? వీరు హతులు కాగా మిగిలిన కులస్త్రీల శీలభ్రష్టతకు, వర్ణ సాంకర్యమునకు నెట్లు తోడ్పడ గలుగుదును ? ఈ తుచ్ఛమగు రాజ్యము కొఱకు నావంశమును నాశన మొనర్తునా ? సభ్యతను సమయింతునా ? గోవింద ! నేనీపని నొనర్పజాలను. ఇంతకంటెను వీరే నిరాయుధుడనగు నన్నే యీ రణరంగమున హత మొనర్చిన మేలనిపించుచున్నది' అని యిట్లు మోహదుందుభిని మ్రోయించి యర్జునుడు ధనుర్బాణముల విసర్జించి రథమున కూలబడెను.

ప్రాచీన కాలపు వీరులయిన క్షత్రియులు ధర్మానుకూలమైన సంగ్రామమున ప్రాణములర్పించుట కర్తవ్యముగ నెంచెడివారు. మహాభారత కాలమువఱకు గల క్షత్రియుల హృదయమున నిట్టి యపూర్వభావము లుదయించుచుండెడివి. కాన, అర్జునునకు గలిగిన విషాదము యోగిరాజగు కృష్ణునకు రుచికరము కాదయ్యె. కావుననే యర్జునునకు గలిగిన విషాదము నతడు అనార్యమనుటకు సంకోచింపడయ్యె. అంతేకాక 'అర్జున ! నపుంసకుడవు కాకుము; హృదయదౌర్బల్యమును విడువుము; నిలబడుము.' అని యతనిని తర్జించెను. ఆ యుత్తేజక వాక్యముల నర్జునుడు వినెను, కాని కఠోర వాక్యములుకూడ నతని హృదయమున నావేశము కలిగింపవయ్యె. అర్జునుడు మరల శబ్దాంతరములతో తన మొదటి యభిప్రాయమునే వెల్లడించి యిట్లనెను. 'ఈ యుద్ధము చేసి రాజ్యమును బొందుటకంటె భిక్షాశినై బ్రతుకుట మేలనిపించుచున్నది.' ఇంతేకాక కృష్ణుని ద్వారమున తనపై మోపబడిన దోషమును స్వీకరించుచు నిట్లనెను. 'నిశ్చయముగ నా క్షత్రియ స్వభావము మోహాక్రాంతమై నష్టమైనది. నాకిప్పుడేమియుం దోచుటలేదు. ఈ జరుగనున్న వంశనాశనముముందు ఇంద్రరాజ్యముకూడ తృణమువలె దోచుచున్నది. నీవు గురువవు. తగిన యుపదేశమిమ్ము. నేను మాత్రము యుద్ధము చేయను.'

**గీతాభాష్యము :**

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ ! 1

**ధృతరాష్ట్రుడు సంజయు నడుగుచున్నాడు :**

ఓ సంజయ ! ధర్మక్షేత్రే కురుక్షేత్రే - పుణ్యభూమి యగు కురుక్షేత్రమున, సమవేతాః యుయుత్సవః - కూడి యుద్ధము చేయవలయునను, మామకాః - చ-ఏవ - పాండవాః - నాయొక్కయు, పాండునియొక్కయు కుమారులు, కిమకుర్వత - ఏమిచేసిరి ?

తా : ఓ సంజయ! ధర్మక్షేత్రమైన కురుక్షేత్రము నందు యుద్ధము చేయవలయునను కోరికతో చేరిన నాకుమారులగు దుర్యోధనాదులు, పాండురాజు కుమారులైన ధర్మరాజాదులును ఏమిచేసిరి? అని ధృతరాష్ట్రుడు సంజయుని అడిగెను.

దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్. 2

**సంజయు డనెను :**

రాజా - దుర్యోధనుడు, తదా - అప్పుడు, వ్యూఢం - వ్యూహబద్ధ, పాండవానీకం - పాండవ సేనను, దృష్ట్వా - చూచి, ఆచార్య ముపసంగమ్య-ఆచార్యుని చెంతజేరి, వచనమ్ అబ్రవీత్ - (ఇట్లు) పలికెను.

తా . ధృతరాష్ట్రు డడిగిన ప్రశ్నకు సమాధానముగా సంజయు డిట్లు చెప్పదొడగెను. రాజగు దుర్యోధనుడు యుద్ధము చేయుట కనువుగా నిలబెట్టబడిన పాండవుల సేనను జూచి,

తమకు విలువిద్య నేర్పిన ద్రోణాచార్యుని కడకేగి యీ క్రింది విధముగ నతనితో ననెను.

పశ్యైతాం పాండుపుత్త్రాణా మాచార్య మహతీం చమూమ్
వ్యూఢాం ద్రుపదపుత్త్రేణ తవ శిష్యేణ ధీమతా. 3

ఆచార్య - ఓ ద్రోణాచార్య ! ధీమతా-బుద్ధిమంతుడు, తవ శిష్యేణ-నీ శిష్యుడునగు, ద్రుపద పుత్త్రేణ - ధృష్టద్యుమ్నునిచే, వ్యూఢాం-నియమ బద్ధముగా నిలబెట్టబడిన, పాండుపుత్త్రాణాం - పాండవుల, ఏతాం - ఈ మహతీం చమూం - గొప్పసేనను, పశ్య -చూడుము.

తా:- ఓ యాచార్య! ఈ పాండవులసేన యెంత గొప్పదియో చూడుడు. ఈ సేనను ద్రుపదుని కుమారుడు నీకు శిష్యుడు బుద్ధిమంతుడు నైన ధృష్టద్యుమ్నుడు వ్యూహాబద్ధముగ విజయమునకు దగిన పన్నుగడతో నిలబెట్టియున్నాడు.

అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః. 4

అత్ర యుధి - ఈ యుద్ధమున, భీమార్జునసమాః-భీమార్జునులవలె మహా ఇష్వాసాః - పెద్దపెద్ద ధనుర్ధారులు, యుయుధానః చ విరాటః - యుయుధానుడు, విరాటుడు, చ మహారథః ద్రుపదః - మహారథియగు ద్రుపదుడును.

తా : ఈసేనయందు యుద్ధమున బాల్గొన వచ్చిన వారిలో భీమార్జునులకు సములైన గొప్ప ధనుర్ధారులు ఎందఱో ఉన్నారు. వారిలో యుయుధానుడు - సాత్యకి విరాటుడు, ద్రుపదుడు నను మువ్వురును మహారథులు.

ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్
పురుజిత్ కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః. 5

ధృష్టకేతువు, చేకితానుడు, శక్తిశాలియగు కాశీరాజు, పురుజిత్తు, కుంతి భోజుడు, నరశ్రేష్ఠుడగు శిబిదేశపురాజు.

తా : ధృష్టకేతుడు, చేకితానుడు, కాశీరాజు ననువారు వీర్యవంతులు, పురుజిత్తు, కుంతిభోజుడు. శైబ్యుడు నను నీ ముగ్గురు నరశ్రేష్ఠులు.

యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః. 6

పరాక్రమశాలి యగు యుధామన్యుడు, శక్తిశాలి యగు నుత్తమౌజుడు, సుభద్రాపుత్రు డభిమన్యుడు, ద్రౌపదీపుత్రులునెల్లరు మహారథులు.

తా : విక్రాంతుడైన యుధామన్యుడు, వీర్యవంతుడైన ఉత్తమౌజుడు, సుభద్రాపుత్రు డభిమన్యుడు, ద్రౌపదీ పుత్రులు ప్రతివింధ్యుడు మున్నగు నుపపాండవులు ఎల్లరు మహారథులే.

(వీరు కాక ధర్మరాజు మున్నగు పాండవులు, పాండ్యరాజు, ఘటోత్కచుడు మున్నగు వారు అనేకులు ఇక్కడ లెక్కింపబడలేదు. వారుకూడ మహారథులే. ప్రసిద్ధులగుటచే నిక్కడ పేరుపెట్టి లెక్కింపలేదు.)

పై శ్లోకములందు లెక్కింపబడినవారు, అందఱు మహారథులేకాక అతిరథులుకూడ నని భావింపదగినవారు. కాని, వీరిలో అర్ధరథుడని కాని, రథుడని కాని యెంచదగిన వా రొక్కరును లేరు.

పదివేలమంది ధనుర్ధారులతో యుద్ధము చేయగలవాడై శస్త్రశాస్త్రములలో నేర్పరియైనవాడు మహారథు డనబడును. అసంఖ్యాకులైన ధనుర్ధారులతో యుద్ధము చేయగలిగిన శస్త్రశాస్త్ర ప్రవీణుడు అతిరథు డనబడును.

ఒక్క ధనుర్ధారితో యుద్ధము చేయగలవాడు రథుడనియు, అంతకంటెను తక్కువ సామర్థ్యము గలవాడు అర్ధరథుడనియు నెంచబడును.)

అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే. 7

ఓ ద్విజోత్తమః యే తు అస్మాకం విశిష్టాః-ఎవరు మనలో విశిష్టులో తాన్ నిబోధ - వారినిగూడ తెలిసికొనుము. తాన్ తే సంజ్ఞార్థం బ్రవీమి-వారినిగూర్చి మీకు తెలియ జేయుదును.

(ఇది యంతయు విని తాను పాండవులకు భయపడుచున్నానని ద్రోణాచార్యు డెంచునేమో యని తనలోని భీతిని గప్పిపుచ్చుటకో యన దుర్యోధను డిట్లనుచున్నాడు).

తా : ఓ బ్రాహ్మణోత్తమ ! మన పక్షమున యుద్ధము చేయవచ్చిన నాయకులను మీ స్మరణకు దెచ్చుచున్నాను. మీకు దెలియని దేమియులేదు. అయినను నిశ్చితముగ దెలిసికొనుడు.

(ఈ శ్లోకమున నాచార్యుని ద్విజోత్తమః అని దుర్యోధనుడు సంబోధించుట గమనింపదగిన విషయము. ద్రోణుని బ్రాహ్మణోత్తమః అనుటచే ప్రశంసించినట్లు కనిపించును కాని, బ్రాహ్మణుడు క్షత్రియులవలె యుద్ధముచేయజాల డను భావము దుర్యోధనుని హృదయమున నున్నట్లు బోధించుటకై వ్యాసు డీ పదము నిట బ్రయోగించెను.)

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవ చ. 8

మీరు, భీష్ముడు, కర్ణుడు యుద్ధమున జయించు కృపుడు, అశ్వత్థాముడు, వికర్ణుడు (ధృతరాష్ట్ర పుత్త్రులలో నొకడు) ఇట్లే సోమదత్త పుత్త్రుడు భూరిశ్రవుడు.

తా : మీరు, భీష్ముడు, కర్ణుడు, యుద్ధమున జయించు వాడైన కృపాచార్యుడు, అశ్వత్థామ, వికర్ణుడు, సోమదత్తుని పుత్రుడు భూరిశ్రవుడు వీరెల్లరు మన పక్షమునగల నాయకులు.

(ఇట ద్రోణాచార్యుని భీష్ముని కంటెను ప్రథమునిగా దుర్యోధనుడు గణించి యున్నాడు. ద్రోణుడు బ్రాహ్మణుడగుటచే యుద్ధము చేయుటలో భీష్ముని కంటె నధికుడు కాడు. అందువలననే భీష్ముని ప్రథమ సేనాపతిగా నియమించి యున్నాడు. అట్టియెడ ద్రోణు నిట యోధనాయకులలో ప్రప్రథమునిగా లెక్కింప నేల ? ఇదియు ద్రోణుని ప్రీతికొఱకే యని బోధపడును. వాస్తవమున ద్రోణుడు అర్జున పక్షపాతి యని దుర్యోధను డెఱుగును. అర్జునునియెడ గల పక్షపాత బుద్ధితో నేకలవ్యునకు ద్రోణుడు చేసిన యపకృతిని దుర్యోధను డెట్లు మఱవ గలడు ? అర్జునునిపై గల పక్షపాతముతో నేకలవ్యునకు ఘోరాపకారము చేసిన ద్రోణుడు ఈ యుద్ధమున తన కపకారము చేయకుండుటకుగాను, తాను ద్రోణుని భీష్మునికంటె గొప్పవానినిగా స్తుతియించిన తన యెడల బ్రీతిగలుగవచ్చునను భావముతో నతనిని ప్రథమ నాయకునిగా గణించియున్నాడు.)

అన్యే చ బహవః శూరా మదర్థే త్యక్తజీవితాః
నానాశస్త్రప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః. 9

మదర్థే - నాకొఱకు, త్యక్తజీవితాః - విడిచిన ప్రాణములు గల వారు, అన్యే చ బహవః శూరాః - ఇతరు లనేకశూరు లున్నారు. సర్వే యుద్ధ విశారదాః - వారందఱు యుద్ధమున నిపుణులు.

తా : ఇట్లు శ్రేష్ఠులను ముందు లెక్కించి, యింకను బలువురు శూరులు 'నాకొఱకై ప్రాణములు త్యజించి యున్నారు. వారెల్లరు నానావిధములగు శస్త్రములతో యుద్ధ మొనర్ప గలవారు, యుద్ధ విశారదులు నని దుర్యోధనుడు చెప్పెను.

అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితమ్. 10

తత్ అస్మాకం భీష్మ అభిరక్షితం బలం- ఆ మన భీష్మునిచే రక్షింపబడు సేన, అపర్యాప్తం - అసంఖ్యము. ఏతేషాం భీమాభిరక్షితం బలం తు - భీమునిచే రక్షింపబడు వీరి సేనమాత్రము, పర్యాప్తం - పరిమితము కొలది సంఖ్యగలదియై యున్నది.

తా : అయినను భీష్మునిచే రక్షింపబడు మన బలము (సేన) అపర్యాప్తమై యున్నది. అటు పాండవసేన భీముని రక్షణలో పర్యాప్తమై యున్నది.

అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః
భీష్మమేవాభిరక్షంతు భవంతః సర్వ ఏవ హి. 11

హి - కాబట్టి, సర్వేషు అయనేషు - సర్వసేనా ప్రవేశ ద్వారములందును, యథాభాగమ్ - భాగముననుసరించి, అవస్థితాః - నిలబడినవారై, భవంతః సర్వ ఏవ - మీరందఱు, భీష్మం ఏవ - భీష్మునే, అభిరక్షంతు - అన్నివైపులనుండి రక్షింపుడు.

తా : కావున నాయా యుద్ధస్థానములందు నియమితులై యున్న మీరెల్లరు భీష్ముని రక్షించుటకై యత్నింపుడు.

(భీష్ముని కపాయము కలుగకున్న దనకు విజయము చేకూరుట తథ్యము; అని దుర్యోధనుని అభిప్రాయము).

తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్. 12

ప్రతాపవాన్ - ప్రతాపశాలియైన, కురువృద్ధః పితామహః - కౌరవ వృద్ధుడైన భీష్మ పితామహుడు, ఉచ్చైః సింహనాదం వినద్య - పెద్దగా సింహమువలె గర్జించి, శంఖం దధ్మౌ - శంఖమును పూరించెను.

తా : ఇట్లు ద్రోణుని ప్రశంసలో మగ్నుడై యున్న దుర్యోధనునకు హర్షము గలిగించుచు కురువృద్ధుడైన భీష్మ పితామహుడు సింహనాదముచేసి శంఖమును బూరించెను.

(భీష్మునికి నిందాస్తుతులు రెండును సమానములే. దుర్యోధనునికై తన దేహము నెట్లును యుద్ధమున వినియోగింప నిశ్చయించి యున్నాడు.)

తతః శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః
సహసై వాభ్యహన్యంత స శబ్ద స్తుములోఽభవత్. 13

తతః - తరువాత, శంఖాః చ భేర్యః - శంఖములు, భేరీలు, పణవ ఆనక గోముఖాః చ - డోలు, ఢమరు మున్నగు వాద్యములును, సహసా ఏవ - వెంటనే, అభి అహన్యంత - వాయించబడెను. స శబ్దః - ఆశబ్దము, తుములః అభవత్ - పెద్దదయ్యెను.

తా : సేనాపతియైన భీష్ముడు శంఖనాదము చేయగా సేనయందున్న శంఖములు, నగారాలు, తప్పెటలు మున్నగు వాద్యము లన్నియు వెంటనే పెద్దధ్వనియగునట్లు మ్రోయింపబడెను.

తతః శ్వేతైర్ హయైర్ యుక్తే మహతి స్యందనే స్థితౌ
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః. 14

తతః- తరువాత, శ్వేతైః హయైః- తెల్లని గుఱ్ఱములతో, యుక్తే- కూడిన, మహతి స్యందనే - గొప్ప రథముమీద, స్థితౌ - నిలబడియున్న, మాధవః పాండవః చ ఏవ-కృష్ణార్జునులు, దివ్యౌ శంఖౌ - దివ్యశంఖములను, ప్రదధ్మతుః. - మ్రోయించిరి.

తా : అంతట తెల్లని గుఱ్ఱములను బూన్చిన గొప్ప రథము నందున్న కృష్ణార్జును లిరువురు తమ దివ్య శంఖములను బూరించిరి.

పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః. 15

హృషీకేశః - కృష్ణుడు, పాంచజన్యం - పాంచజన్యమను శంఖమును, ధనంజయః - అర్జునుడు, దేవదత్తం - దేవదత్తమను శంఖమును, భీమకర్మా వృకోదరః - భయంకర కర్మల నాచరించు భీముడు, పౌండ్రం మహాశంఖం - పౌండ్రమను పేరుగల గొప్ప శంఖమును, దధ్మౌ - పూరింపసాగిరి.

తా : కృష్ణుడు పాంచజన్యమును, అర్జునుడు దేవదత్తమును, మహాబలుడైన భీముడు పౌండ్రమను పేరుగల మహాశంఖమును పూరించిరి.

అనంత విజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః
నకులః సహదేవశ్చ సుఘోష మణిపుష్పకౌ. 16

కుంతీపుత్రః రాజా యుధిష్ఠిరః - ధర్మరాజు, అనంతవిజయం - అనంతవిజయ నామక శంఖమును, నకులః సహదేవః చ నకులుడు సహదేవుడును, సుఘోష మణిపుష్పకౌ - సుఘోషము, మణిపుష్పకము నను శంఖములను పూరించిరి.

తా : కుంతీ పుత్రుడు ధర్మరాజు అనంతవిజయమును, నకుల సహదేవులు వరుసగా సుఘోషము మణిపుష్పకము నను శంఖములను పూరించిరి.

కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః. 17

పరమేష్వాసః కాశ్యః - మహాధనుర్ధారి యగు కాశీరాజు, మహారథః శిఖండీ - మహారథియగు శిఖండియు, ధృష్టద్యుమ్నః విరాటః చ - ధృష్టద్యుమ్నుడు, విరాటుడు, అపరాజితః సాత్యకిః చ - ఓటమి నెఱుగని సాత్యకి.

తా : మహా ధనుర్ధారి యగు కాశీరాజు, మహారథుడయిన శిఖండియు, ధృష్టద్యుమ్నుడు, విరాటుడు, ఓటమి నెఱుగని సాత్యకియు తమ తమ శంఖములను బూరించిరి.

ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే
సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్. 18

పృథివీపతే - ఓరాజా ! ద్రుపదో ద్రౌపదేయాః - ద్రుపదుడు, ఉపపాండవులు, మహాబాహుః సౌభద్రః - మహాభుజుడగు నభిమన్యుడు, పృథక్ పృథక్ శంఖాన్ దధ్ముః - వేఱువేఱుగ శంఖములను పూరించిరి.

తా : ఇట్లే ద్రుపదుడు, ఉపపాండవులు, అభిమన్యుడు నెల్లరు వారివారి శంఖములను వేఱువేఱుగ ధ్వనింప జేసిరి.

స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్. 16

సః తుములః ఘోషః - ఆ ఘోర శబ్దము, నభః చ పృథివీం చ ఏవ - ఆకాశమును భూమిని, వి అనునాదయన్ - విశేష రూపమున ప్రతిధ్వనింప జేయుచు, ధార్తరాష్ట్రాణాం - దుర్యోధనాదుల, హృదయాని - హృదయములను, వ్యదారయత్ - బ్రద్దలు చేసెను.

తా : పాండవయోధు లెల్లరు నిట్లు తమతమ శంఖము లను బూరింపగా నేర్పడిన ధ్వని యెంతయో పెద్దది యగుటయేకాక భూమ్యాకాశములను బ్రతిధ్వనింపజేయుచు దుర్యోధనాదుల హృదయములను బ్రద్దలు చేసినదా యన్న ట్లుండెను.

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః
ప్రవృత్తే శస్త్ర సంపాతే ధనురుద్యమ్య పాండవః. 20

హృషీకేశం తదా వాక్య మిద మాహ మహీపతే
సేనయో రుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత ! 21

మహీపతే! - ఓ రాజన్ ! అథ - తరువాత, కపిధ్వజః - హనుమద్ధ్వజుడగు అర్జునుడు, ధార్తరాష్ట్రాన్ వ్యవస్థితాన్ - దుర్యోధనాదుల నియమబద్ధులై నిలుచుండగా, దృష్ట్వా - చూచి, శస్త్ర సంపాతే ప్రవృత్తే- శస్త్ర ప్రయోగము ప్రారంభముకాగా, ధనుః ఉద్యమ్య - విల్లునెత్తి, హృషీకేశం ఇదమాహ - కృష్ణునితో నిట్లనెను.

అచ్యుత - కృష్ణ ! ఉభయోః సేనయోః మధ్యే - రెండు సేనల మధ్య, మే - నా, రథం స్థాపయ - రథమును నిలుపుము.

తా : అనంతరము కపిధ్వజుడైన యర్జునుడు యుద్ధమునకు సన్నద్ధులై వారి వారి స్థలములందు శస్త్రాస్త్రములను బ్రయోగింప నుద్యుక్తులగుచున్న దుర్యోధనాదులను జూచి, తాను ధనుస్సును చేతనెత్తి కృష్ణునితో ననెను. హృషీకేశ ! రెండు సేనలకు మధ్య నా రథమును నిలుపుము.

యావదేతాన్ నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్
కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే. 22

యావత్ - అట్లు నిలిపినందున, యోద్ధుకామాన్ అవస్థితాన్ - యుద్ధము చేయవలయునని నిలబడిన వారిని, అహం నిరీక్షే-నేను చూతును. అస్మిన్ రణసముద్యమే - ఈ యుద్ధప్రయత్నమున, మయా కైః సహ యోద్ధవ్యమ్ - నే నెవరితో యుద్ధము చేయవలసియున్నదో,

తా : యుద్ధము చేయు కోరికతో నరుదెంచిన యోధు లెవరో, ఎవరితో నేను యుద్ధమొనరింపవలయునో యుద్ధ స్థలిలో నున్న వారిని జూచెదను.

యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేర్ యుద్ధే ప్రియచికీర్షవః. 23

అహం - నేను, యోత్స్యమానాన్ - పోరాడనెంచువారిని, అవేక్షే- చూతును, య ఏతే అత్ర - ఎవరీస్థలమున, దుర్బుద్ధేః ధార్తరాష్ట్రస్య - దుర్బుద్ధిగల దుర్యోధనునకు, యుద్ధప్రియచికీర్షవః - యుద్ధమున ప్రియ మొనర్పనెంచుచు, సమాగతాః - వచ్చియున్నారో,

తా : దుర్బుద్ధియైన దుర్యోధనునకు ప్రియమొనర్ప నెంచి యుద్ధరంగమున సంగరము చేయవచ్చిన వారిని జూచెదను.

ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత
సేనయో రుభయో ర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్. 24

**సంజయు డనెను :**

భారత - భరతసంతానమగు నో ధృతరాష్ట్ర ! హృషీకేశః - ఇంద్రియాధిపతి యగు కృష్ణుడు, గుడాకేశేన - నిద్రను జయించిన యర్జు నునిచే, ఏవమ్ ఉక్తః - ఇట్లు చెప్పబడినమీదట, ఉభయోః సేనయోః

మధ్యే - రెండు సేనలమధ్య, రథోత్తమం - శ్రేష్ఠరథమును, స్థాపయిత్వా- నిలబెట్టి.

తా : అని యర్జునుడు చెప్పగా విని కృష్ణుడు రథమును రెండు సేనలకు నడుమ నిలబెట్టి.

భీష్మద్రోణ ప్రముఖతః సర్వేషాం చ మహీక్షితామ్
ఉవాచ, పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూ నితి. 25

భీష్మద్రోణ ప్రముఖతః - భీష్మద్రోణుల కెదురుగ, సర్వేషాం చ మహీక్షితాం - రాజుల కందఱకు నెదుట, ఉవాచ - చెప్పెను. పార్థ ! అర్జున ! పృథాపుత్ర ! ఏతాన్ సమవేతాన్ కురూన్ - ఈ కలిసి యేక ముగానున్న కౌరవులను, పశ్య - చూడు.

తా : భీష్ముడు, ద్రోణుడు, ఇతర రాజులు నెల్లరు గన బడునట్లు ఎదురుగా రథమును నిల్పి కృష్ణు డర్జునునితో ననెను: 'ఓయి ! కుంతీపుత్ర ! అర్జున! నీ కెదురుగా నేకమయియున్న యీ కౌరవులను జూడు.

తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄ నథ పితామహాన్
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తథా. 26
శ్వశురాన్ సుహృద శ్చైవ సేనయో రుభయోరపి
తాన్ సమీక్ష్య స కౌంతేయః సర్వాన్ బంధూ నవస్థితాన్. 27

తత్ర - అక్కడ, పార్థః - అర్జునుడు, పితౄన్...సుహృదః చ ఏవ - తండ్రులను, తాతలను, ఆచార్యులను, మేనమామలను, సోదరులను, పుత్రులను, పౌత్రులను, మిత్రులను, మామలను, సుహృత్తులను, సేనయోః ఉభయోః - రెండు సేనలలోను, స్థితాన్ అపశ్యత్ - ఉన్న వారిని చూచెను.

సః కౌంతేయః - ఆకుంతీపుత్రు డర్జునుడు, తాన్ అవస్థితాన్ బంధూన్ సర్వాన్ - ఆ నిలచియున్న బంధువుల నందఱను, సమీక్ష్య - బాగుగచూచి,

తా : అర్జునుడు యుద్ధరంగమున నున్నవారిని తండ్రులను, తాతలను, ఆచార్యులను, మేనమామలను, భ్రాతలను, పుత్ర పౌత్రులను, స్నేహితులను జూచెను.

మఱియు మామలు, సుహృత్తులును నతనికి రెండు సేన లందును గనఁబడిరి. ఆ యర్జునుడు అట నున్న బంధువుల నందఱను బాగుగ జూచి-

కృపయా పరయా విష్టో విషీద న్నిద మబ్రవీత్
దృష్ట్వేమం స్వజనం కృష్ణ ! యుయుత్సుం సముపస్థితమ్. 28

పరయా కృపయా - అత్యంత కృపతో, ఆవిష్టః - కూడినవాడై, విషీదన్ - దుఃఖించుచు, ఇదం అబ్రవీత్ - ఇట్లనెను.

కృష్ణ ! యుయుత్సుం - యుద్ధము చేయవలయునను, ఇమం - ఈ సముపస్థితం - వచ్చియున్న, స్వజనం - తన జనమును, దృష్ట్వా - చూచి,

తా : మిక్కిలి దయతో గూడినవాడై దిగులు పడుచు కృష్ణునితో నిట్లనెను. కృష్ణ ! యుద్ధబుద్ధితో వచ్చిన యీ స్వజనులం జూచి,

సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే. 29

మమ - నా, గాత్రాణి - అంగములు, సీదంతి - సడలిపోవుచున్నవి. ముఖం చ పరిశుష్యతి - నోరుకూడ ఎండిపోవుచున్నది. మే - నా,

శరీరే చ - శరీరమునందును, వేపథుః చ రోమహర్షః - కంపము, రోమాంచ మును, జాయతే - కలుగుచున్నది.

తా : నా యంగము లన్నియు సడలిపోవు చున్నవి. నోరెండుచున్నది. నా శరీరము కంపించుచున్నది. రోమములు నిక్కబొడుచుకొని గగుర్పాటు గలుగు చున్నది.

గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్ చైవ పరిదహ్యతే
న చ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః. 30

హస్తాత్ - చేతినుండి, గాండీవం - గాండీవము, స్రంసతే - జారు చున్నది. త్వక్ చ ఏవ పరిదహ్యతే - త్వక్కుకూడ మండుచున్నది. అవ స్థాతుం చ న శక్నోమి - నిలబడుటకును సమర్థుడను కాకున్నాను. మే మనః చ - నా మనస్సుకూడ, భ్రమతీవ - తిరుగుచున్నట్లున్నది.

తా : గాండీవము చేతినుండి జారిపోవుచున్నది. చర్మ మున తాపము గలుగుచున్నది - మండిపోవుచున్నది. నిలుచు టకు శక్తి లేకున్నది. మనస్సు తిరుగుచున్నట్లున్నది.

నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే. 31

కేశవ ! విపరీతాని నిమిత్తాని చ - విపరీత లక్షణములుకూడ, పశ్యామి - చూచుచున్నాను. ఆహవే - యుద్ధమునందు, స్వజనం హత్వా - బంధుజనమును చంపి, శ్రేయః న అనుపశ్యామి - మేలు కనకున్నాను.

తా : కృష్ణ ! విపరీతనిమిత్తములు కనబడుచున్నవి. పైగా యుద్ధమున స్వజనులను చంపి పొందు శ్రేయస్సేమియు గనిపింపకున్నది.

న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ
కిం నో రాజ్యేన గోవింద ! కిం భోగైర్ జీవితేన వా. 32

ఓ కృష్ణా ! విజయం, రాజ్యం, సుఖాని చ - విజయము, రాజ్యము, సుఖములును. న కాంక్షే - కోరను. ఓ గోవింద ! నః - మనకు, రాజ్యేన, భోగైః, జీవితేన వా - రాజ్యముతోను, భోగములతోను, జీవితముతోను, కిం - ఏమిలాభము ?

తా : విజయము కలుగునందువా అది నాకక్కఱలేదు. రాజ్యము, సుఖములు నంతకంటెను వలదు. గోవింద ! రాజ్యము, భోగములు, జీవితము ఎందులకు ?

యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగాః సుఖాని చ
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ. 33
ఆచార్యాః పితరః పుత్త్రాః తథైవ చ పితామహాః
మాతులాః శ్వశురాః పౌత్రాః శ్యాలాః సంబంధిన స్తథా. 34

యేషాం అర్థే - ఎవరి కొఱకు, నః - మనకు. రాజ్యం, భోగాః, సుఖాని చ - రాజ్యము, భోగములు, సుఖములును, కాంక్షితం-కావలయునో, తే ఇమే - ఆ యీ, ఆచార్యాః, పితరః, పుత్రాః - ఆచార్యులు, పితరులు, పుత్రులు, చ ఏవ తథా - మఱియు నట్టి, పితామహాః- తాతలు, మాతులాః- మేనమామలు, శ్వశురాః - మామలు, పౌత్రాః - మనుమలు, తథా - అట్లె శ్యాలాః - బావమఱుదులు, సంబంధినః - సంబంధము కలవారు. ప్రాణాన్ ధనాని చ త్యక్త్వా - ప్రాణములు, ధనములును విడిచి, యుద్ధే అవస్థితాః - యుద్ధమున నిలబడి యున్నారు.

తా : రాజ్యము, భోగములు, సుఖములు నెవరికొఱకు వలయునో వారెల్లరు ధనములను, ప్రాణములను వదలి

యీ యుద్ధరంగమున నిలబడియున్నారు. వారు నెవరో కాదు-ఆచార్యులు, తండ్రులు, బిడ్డలు, తాతలు, మేనమామలు, మామలు, మనుమలు, బావమఱదులు, వియ్యంకులును. ఇందు శత్రువు లెవరు ?

ఏతా న్న హంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన ।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే. 35

మధుసూదన । - మధుహంతకుడవగు నో కృష్ణ!, ఏతాన్ ఘ్నతః అపి - ఈ చంపువారిని కూడ, త్రైలోక్యరాజ్యస్య హేతోః అపి-ముల్లోక రాజ్య నిమిత్తమైనను, హంతుం - చంపుటకు. న ఇచ్ఛామి - కోరను, మహీకృతే ను కిమ్ - ఇక కేవల భూమికొఱ కెట్లు చంపుదును ?

తా : మధుసూదన ! కృష్ణ ! వీరు నన్ను జంపిన జంపుదురుగాక ! నేను మాత్రము వీరిని జంప గోరను. భూ నభోంతరాళములపై నాధిపత్యము లభించినను వీరిని జంపగోరను. అట్టియెడ గేవల మీ భూమికొఱ కెట్లు చంపుదును !

నిహత్య ధార్తరాష్ట్రాన్ నః కా ప్రీతిః స్యాజ్జనార్దన ।
పాపమే వాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః, 36

జనార్దన । - కృష్ణ । (దుర్జనులకు కష్టముల నిచ్చువాడ!) ధార్తరాష్ట్రాన్ - ధృతరాష్ట్రుని పుత్రులను, నిహత్య - చంపి, నః - మనకు కా ప్రీతిః స్యాత్ - ఏమి ప్రసన్నత కలుగును ? ఏతాన్ ఆతతాయినః - ఈ యపరాధులను, హత్వా - చంపిన, పాపమేవ - పాపమే, అస్మాన్ ఆశ్రయేత్ - మనకు కల్గును.

తా : జనార్దన ! కృష్ణ ! ధృతరాష్ట్రుని కుమారులైన దుర్యోధనాదులను జంపిన మనకు గలుగు మేలేమి ? వారు

ఆతతాయులు కావచ్చును. కాని; వారిని జంపినను మనకు పాపమే కలుగును గదా !

(ఆతతాయు లన నెవరు ః

అగ్నిదో గరదశ్చైవ ఖడ్గపాణిర్ ధనాపహః
క్షేత్ర దారాపహారీ చ షడైతే ఆతతాయినః.

నిప్పుతో గృహాదులను దహింపజేయువారు; విషముపెట్టి ప్రాణులం జంపువారు; కత్తులతో నెదురించువారు; ధనమును, పైరును, భార్యను నపహరించువారు- నను నీ యార్గురును ఆతతాయు లనబడుదురు. ఇట్టివారిని విచారింపకయే చంపవలయునని యర్థశాస్త్రము చెప్పును.

గురుం వా బాలవృద్ధౌ వా బ్రాహ్మణం వా గుణాన్వితం
ఆతతాయిన మాయాంతం హన్యాదే వావిచారయః-
నాతతాయివధే దోషో హంతు ర్భవతి కశ్చన ;

గురువైనను, బాలుడైనను, వృద్ధుడైనను, గుణవంతుడైన బ్రాహ్మణు డైనను నత డాతతాయి యైనపక్షమున మంచి చెడుగులు విచారింపకయే అతనిని చంపదగును. ఆతతాయిని జంపువాని కెట్టి దోషమును గలుగదు. అను నీ యర్థస్మృతి వాక్యముల ననుసరించి దుర్యోధనుడు నతని పక్షపాతులు భీష్మద్రోణాదులు నెల్లరు నాతతాయులు, కావున వారిని జంపుట వలన బాపము కలుగ దని యున్నను-

"మా హిగ్ంసీః సర్వాభూతాని" అను వేదవాక్యము ననుసరించి యెట్టి ప్రాణిని జంపినను పాపి కాక తప్పదు. అని యర్జునుడెంచి ఆతతాయు లైన దుర్యోధనాదులను జంపినను బాపమే కలుగునని కృష్ణునితో నుడివిన ట్లెంచవలయును.

అర్థశాస్త్ర విధానము కంటె ధర్మశాస్త్రమైన వేదవిధి ప్రధానము అధికప్రమాణముగా నెంచవలయును. శ్రుతిస్మృతులలో పరస్పర విరోధము కలిగినపుడు శ్రుతినే యంగీకరింప వలయునని మహర్షు లంగీకరింతురు.

"శ్రుతి స్మృతి విరోధే తు శ్రుతి రేవ గరీయసీ"

తస్మా న్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్
స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవ ! 37

తస్మాత్ - కావున, వయం - మనము, స్వబాంధవాన్ ధార్తరాష్ట్రాన్ - మన బంధువులయిన ధృతరాష్ట్రపుత్రులను, హంతుం - చంపుటకు, అర్హాః న - అర్హులముకాము. మాధవ ! - కృష్ణా!, స్వజనం - మన బంధువులను. హత్వా - చంపి, కథం సుఖినః స్యామ - ఎట్లు సుఖుల మగుదుము ! (కామని భావము.)

తా : కావున మాధవ ! స్వబాంధవులైన పెత్తండ్రి కొడుకులను మనము చంపరాదు. స్వజనులను జంపి మన మెట్లు సుఖింపగలము !

యద్యప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్. 38

లోభ ఉపహత చేతసః - లోభమువలన చెడియున్న మనస్సుకల వారైన, ఏతే - వీరు, కులక్షయకృతం దోషం - కులనాశముచేసినందున కలుగు దోషమును, మిత్రద్రోహే పాతకం చ - మిత్రులకు ద్రోహము చేసినందున కలుగు పాపమును, యద్యపి న పశ్యంతి - చూడ నప్పటికిని.

తా : కృష్ణ ! దుర్యోధనాదులు లోభదూషిత మనస్కులు. కావున వారికి వంశనాశనము, మిత్రద్రోహము వలన గలిగెడి పాతకము కనిపింప కున్నది.

కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివ ర్తితుం
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్ జనార్దన ! 39

జనార్దన ! - కృష్ణ!, కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిః - కుల నాశము చేసినందువలన గలుగు దోషము నెఱుగు, అస్మాభిః - మనచే: అస్మాత్ పాపాత్ - ఈ పాపమునుండి, నివ ర్తితుం - తొలగుటకు, కథం న జ్ఞేయమ్ - ఎట్లు తెలియబడదు ? ఎట్లు ప్రయత్నింపబడదు? అని భావము.

తా : కాని, వంశనాశనమువలన గలుగు దోషమును బాగుగ జూచుచున్న మన మేల యీ పాపమునుండి దూర ముగా నుండరాదు కృష్ణ !

కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాః సనాతనాః
ధర్మే నష్టే కులం కృత్స్నమ్ అధర్మోఽభిభవత్యుత. 40

కులక్షయే - వంశ నాశనమైన మీదట, సనాతనాః కులధర్మాః - సనాతన కులధర్మములు, ప్రణశ్యంతి - నశించును, ఉత - మఱియు, ధర్మే నష్టే - ధర్మము నశించినచో, కృత్స్నం కులం - సంపూర్ణ కులమును, అధర్మః అభిభవతి - అధర్మము అణచివేయును.

తా : మఱియు, కులక్షయ మగుటవలన పరంపరాగతము లైన సనాతన కులధర్మములు — సంధ్యాగ్నిహోత్రములు నశించును. ధర్మనాశమువలన కులమునం దధర్మము పెరుగును.

అధర్మాభిభవాత్ కృష్ణ ! ప్రదుష్యంతి కులస్త్రియః
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ ! జాయతే వర్ణసంకరః. 41

కృష్ణ !, అధర్మాభిభవాత్ - అధర్మముచే కులమణచబడినందున, కులస్త్రియః - కులస్త్రీలు, ప్రదుష్యంతి - దూషితలగుదురు, స్త్రీషు దుష్టాసు-

స్త్రీలు దూషితలయిన పిదప, వార్ష్ణేయ - కృష్ణ ! వర్ణసంకరః - వర్ణ సంకరము, జాయతే - కలుగును.

తా : అధర్మము వృద్ధియగుటవలన కులస్త్రీలు దూషిత లగుదురు. కుల నాశకులైన పాపుల సాంగత్యమువలననో, లేక పతు లధర్మవర్తను లగుట జూచి స్త్రీలును నధర్మవర్తనకు గడంగుటవలననో వారు దూషిత లగుదురని భావము. అందు వలన వర్ణసాంకర్యము గలుగును.

సంకరో నరకా యైవ కులఘ్నానాం కులస్య చ
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః. 42

సంకరః - సాంకర్యము, కులఘ్నానాం కులస్య చ - కులనాశకు లకు, కులమునకును, నరకాయ ఏవ - దుఃఖమునకే సాధనమగును, హి - కారణమేమన, ఏషాం పితరః - వీరి వృద్ధులు, లుప్త పిండ ఉదక క్రియాః - అన్నము, జలము, సేవాకర్మలు లోపించినవారై, పతంతి - పతితులగుదురు.

తా : వర్ణసాంకర్యము కులనాశకుల దుఃఖమునకు హేతువగును. కులనాశకుల పితరులును అన్నోదకముల నిచ్చు వారు లేనందున దుఃఖమగ్ను లగుదురు.

దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః. 43

కులఘ్నానాం వర్ణసంకర కారకైః ఏతైః దోషైః - కులనాశకుల యొక్క వర్ణసాంకర్యము నొనర్చు నీ దోషముల మూలమున, జాతి ధర్మాః - వర్ణధర్మములు, శాశ్వతాః కులధర్మాః - సనాతన ధర్మములు, ఉత్సాద్యంతే - పెరికివేయబడును.

తా : వర్ణసాంకర్యము గలిగించు నిట్టి కులనాశకుల పాపముల – దోషములవలన వర్ణధర్మములు, వంశధర్మములును నశించును.

ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన !
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ. 44

ఓ జనార్దన ! ఉత్సన్నకుల - ధర్మాణాం - కులధర్మములను విడుచు, మనుష్యాణాం - మనుజులకు, నియతం నరకే వాసో భవతి - నిశ్చయముగ దుఃఖదాయక యోనులందు నివాస మేర్పడును, ఇతి శుశ్రుమ - అని వినుచున్నాము.

తా : ఇట్లు వర్ణధర్మములు, వంశధర్మములు, ఆశ్రమ ధర్మములు నశించినందున మానవులు దుఃఖములపా లగుదురని కృష్ణ ! వినియున్నాము గదా !

అహో బత మహ త్పాపం కర్తుం వ్యవసితా వయమ్
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజన ముద్యతాః. 45

అహో బత - ఎంత కష్టము. వయం - మనము, మహత్ పాపం- గొప్ప పాపము, కర్తుం వ్యవసితాః - చేయసాగితిమి, యత్ రాజ్యసుఖలోభేన-ఏకారణమున రాజ్యసుఖాపేక్షతో, స్వజనం హంతుం ఉద్యతాః - స్వజనులను చంపుటకు సిద్ధపడితిమి.

తా : కావున కృష్ణ ! రాజ్య సుఖములందలి లోభబుద్ధితో స్వజనులం జంపుటకు బూనుకొని మహత్ పాపము జేయ నిశ్చయించితిమి. ఇది యెంత కష్టము !

యదిమా మప్రతీకారం అశస్త్రం శస్త్రపాణయః
ధార్తరాష్ట్రా రణే హన్యుః తన్మే క్షేమతరం భవేత్. 46

శస్త్రపాణయః-శస్త్రధారులైన, ధార్తరాష్ట్రాః-ధృతరాష్ట్రి పుత్రులు, అప్రతీకారం - ప్రత్యపకారము చేయని, అశస్త్రం - శస్త్రములు ధరింపని, మాం - నన్ను, రణే - యుద్ధమున, యది హన్యుః - చంపుదురేని, తత్ - అది, మే - నాకు, క్షేమతరం భవేత్ - ఎక్కువ మేలు అగును.

తా : శస్త్రాస్త్రములను విడిచి, ప్రత్యపకారమునకు బూనుకొనని నన్ను శస్త్రపాణులైన దుర్యోధనాదులు యుద్ధమున జంపినను అది నాకెక్కుడు మే లనిపించుచున్నది.

ఏవ ముక్త్వాఽర్జునః సంఖ్యే రథోపస్థ ఉపావిశత్
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః. 47

సంజయు డిట్లు చెప్పుచున్నాడు :

శోక సంవిగ్న మానసః - దుఃఖముచే ఖిన్నుడైన అర్జునుడు, ఏవం ఉక్త్వా - ఇట్లు చెప్పి, సశరం చాపం - బాణ సహితమగు ధనువును, విసృజ్య - విడిచి, రథ ఉపస్థే - రథముమీద, ఉపావిశత్ - కూర్చుండెను.

తా : అని యిట్లుచెప్పి యర్జునుడు విల్లు నమ్ములను విడిచి, దుఃఖాకుల మనస్కుడై రథముమీద కూలబడెను.

తం తథా కృపయావిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్
విషీదంత మిదం వాక్య మువాచ మధుసూదనః. 48

తథా - ఆవిధమున, కృపయా ఆవిష్టం - దయాపూర్ణుడును. అశ్రు పూర్ణ ఆకుల ఈక్షణమ్ - కన్నీటితో నిండి వ్యాకులమగు దృష్టిగల వాడును, విషీదంతం తం - దిగులు చెందుచున్నవాడును నగు నాయర్జునునితో, మధుసూదనః - మధుహంతకుడగు కృష్ణుడు, ఇదం వాక్యం ఉవాచ - ఇట్లు పలికెను.

తా : అంతట పైన వర్ణించిన విధమున కృపాపూర్ణుడై కనులనిండ నీరు గ్రమ్ముచుండ వ్యాకుల దృష్టిగలవాడై చింతించు చున్న అర్జునుని జూచి మధుసూదను డీ ట్లనెను.

కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితం
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున. 49

అర్జున ! విషమే - ఈ కఠిన సమయమున, ఇదం - ఈ, అనార్యజుష్టం - అనార్యులకు ప్రియమగు, అస్వర్గ్యం - సుఖము నొసగని, అకీర్తికరం - కీర్తి నొసంగని, కశ్మలం - మాలిన్యము - మోహము, త్వా - నిన్ను, కుతః సముపస్థితమ్ - ఎటనుండి చేరినది ?

తా : అర్జున ! ఈ కఠిన సమయమున నీ మాలిన్యము నిన్నెటనుండి యాక్రమించినది ? ఇయ్యది యార్యులలో నుండ దగినది కాదే ! మఱియు నిది నీకు సుఖమును గాని, కీర్తిని గాని కలిగించునది కాదే !

క్లైబ్యం మాస్మగమః పార్థ ! నైత త్త్వ య్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వో త్తిష్ఠ పరంతప. 50

పార్థ ! కుంతీ పుత్రుడవగు అర్జున ! క్లైబ్యం - నపుంసకతను, మాస్మగమః - పొందకు, ఏతత్ త్వయి న ఉపపద్యతే - ఇది నీయందుండ తగదు, పరంతప - శత్రు తాపక ! క్షుద్రం హృదయ దౌర్బల్యం - తుచ్ఛమగు హృదయ దుర్బలతను, త్యక్త్వా ఉత్తిష్ఠ - విడిచి నిలబడుము.

తా : కావున నో పార్థ ! కుంతీ పుత్రుడవైన నీవు నపుంసకతను బొందకుము. నీ కిది తగదు. నీవు శత్రుతాపకుడవు. నీచమైన యీ హృదయ దౌర్బల్యమును విడనాడి లేచి నిలబడుము. యుద్ధమునకు సిద్ధపడుము.

(ఈ ప్రకరణమున నర్జునుని మందలించుచు కృష్ణుడు 'ఈ కశ్మలము - మాలిన్యము - నీకెటనుండి కలిగినది. ఇది ఆర్యులలో నుండవగినది కాదు...' అని పలికి యున్నాడు (49 శ్లోకమునందు). కాబట్టి అర్జునుడు ఆర్యుడనియు. అట్లే కృష్ణాదులును అని బోధపడుచున్నది. ప్రస్తుతము భారతీయులు తమ్ముదాము హిందువుల మని చెప్పుకొనుచున్నారు. కావున భారతీయులు హిందువులా ? లేక ఆర్యులా ? అని సందేహము కలుగుట సహజము. ప్రాచీన కాలమున భారతీయులు ఆర్యులని వ్యవహరింపబడి నట్లు (సంస్కృత సాహిత్యమును బరికించిన) కనబడును ప్రాచీన గ్రంథ ములలో వేదములందుకాని, ఉపనిషత్తులందుకాని, మనుస్మృత్యాదులందు కాని యెక్కడను 'హిందు' పదము కనిపింపదు. నేటి భారతీయులు హిందువు లని యేల పిలువబడుచున్నారు ? ఎప్పటినుండి, యెందుల కీనామము వీరికి సంక్రమింప జేయబడినది ? ఈ పదమున కర్థమేమి ? ఇయ్యది యేభాషకు చెందినది ? అను ప్రశ్నలు చదువరులకు కలుగకమానవు.

భారతదేశమునకు హిందుస్థాన్ అను పేరుగలదనియు అందుండు వారు కావున హిందువులనబడు చున్నారనియు కొందఱు చెప్పుదురు. కాని, భారతదేశమునకు 'హిందుస్థాన్' అను నామమెక్కడిది ? ఎప్పటిది ? హిందుస్థానముననుండు వారు హిందువులగుచో క్రైస్తవులు, మహమ్మ దీయులు నీ హిందుస్థానమున నుండియు హిందువులని యేల పిలువ బడరు ? మహమ్మదీయులను హిందువులనిన వారేల ఒప్పుకొనరు ? కావున హిందుస్థానమున నుండువారు హిందువులనుట సరికాదని తెలియు చున్నది. హిందుపదము భారతీయభాషలకు జెందినది కాదని నిజ మారసిన తెలియును. ఈ పదము పారసీక భాషకు చెందినది. భారతీయులు స్వాతం త్ర్యమును గోలుపోయి మహమ్మదీయ శాసనమునకు లోబడిన కాలమున మహమ్మదీయులు భారతీయులను హిందుపదముతో వ్యవహరింప నారం భించినట్లు చరిత్ర పరిశోధన వలన తెలియుచున్నది.

భారతదేశము పూర్వము ఆర్యావర్త మన బడెడిది. ఆర్యులు వసించుచోటు- కావున ఇక్కడి ఆర్యులు మహమ్మదీయుల ఆధిపత్య కాలమున ఇస్లామ్ మతమును స్వీకరింపనందున హిందువు లనబడసాగిరి. హిందుపదమున కర్థము 'కాఫిర్' 'గులామ్' అని పారసీక భాషాకోశము లందు వ్రాయబడి యుండుట జూడనగును. కాఫిర్ అనగా పాపి, మతము నందు విశ్వాసము లేనివాడు అని యర్థము. 'గులామ్' అనగా బానిస - అస్వతంత్రుడు. అందువలననే మహమ్మదీయులను హిందు పదముతో వ్యవహరించిన వారంగీకరింపరు. ఈ పదమును భారతీయులు ప్రథమమున నంగీకరింపక పోయినను కాలము గతించిన కొలది మహమ్మదీయ ప్రాభవమునకు లోబడి గత్యంతరములేక మహమ్మదీయ పరిపాలకులచే తముపై రుద్దబడిన హిందుపదమునకు తలలొగ్గి తమ్ముతాము హిందుపదముతో వ్యవహరించుకొన నారంభించినట్లు కనిపించుచున్నది. కావుననే సంస్కృత వాఙ్మయమున ప్రాచీనగ్రంథములలో నెక్కడను నీ హిందుపదము కనిపింపదు. కాబట్టి వాస్తవమున భారతీయులు హిందువులు కారు. వారు ఆర్యులు. మనము ఆర్యులము. ఆర్యులు అనగా పూజ్యులు - శ్రేష్ఠులు - జ్ఞానులు నని అర్థము. అందువలననే కృష్ణు డర్జునుని గురించి 'ఈ మాలిన్యము అనార్యులలో నుండదగినది. నీలో నెటనుండి వచ్చినది. దీనిని విడిచి పెట్టు' మని మందలించి యున్నాడు.)

కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన ।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన. 51

అర్జును డనుచున్నాడు :

అరిసూదన : మధుసూదన ! శత్రునాశకుడవు, మధునాశకుడవు నగు నో కృష్ణ ! అహం - నేను, సంఖ్యే - యుద్ధమున, భీష్మం-భీష్ముని. ద్రోణం చ-ద్రోణునికూడ, ఇషుభిః - బాణములతో, కథం ప్రతియోత్స్యామి- ఎట్లెదిరించి యుద్ధము చేయగలను ? పూజార్హౌ - వారు పూజ్యులు కదా ?

తా : శత్రునాశకుడ వగు నోకృష్ణ! పూజింపదగిన భీష్మ ద్రోణుల నెదిరించి ఈ సంగరమున బాణములతో నెట్లు ప్రతి యుద్ధము చేయగలను ?

గురూ నహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష మపీహ లోకే
హ త్వార్థకామాం స్తు గురూ నిహైవ
భుంజీయ భో గాన్ రుధిరప్రదిగ్ధాన్. 52

హి - ఏలయన, మహానుభావాన్ గురూన్ అహత్వా - మహాశయులగు గురువులను చంపక, ఇహలోకే భైక్షమపి భోక్తుం శ్రేయః - ఈలోకమున భిక్షాన్నమైనను తినుట మంచిది, అర్థకామాన్ గురూన్ - అర్థాపేక్ష గల గురువులను హత్వాతు - చంపిన, ఇహఏవ - ఇక్కడనే, రుధిర ప్రదిగ్ధాన్ భోగాన్ భుంజీయ-రక్తసిక్తములయిన భోగములను భుజింతుము.

తా : మహానుభావులైన గురుజనులను జంపుటకంటె నీ లోకమున భిక్షాన్నము దిని బ్రతుకుట మేలుకదా ! అర్థకాములైన వారిని జంపి వారిరక్తముతో దడుపబడిన భోగముల నెట్లనుభవింతును ?

న చైతద్ విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యదివా నో జయేయుః
యా నేవ హత్వా న జిజీవిషామః
తేఽవస్థితాః ప్రముఖే ధా ర్తరాష్ట్రాః. 53

యద్ వా జయేమ-మనమే జయింతుమో, యది వా నః జయేయుః-వారే మనలను జయింతురో, కతరత్ - ఈ రెంటిలోనేది, నః గరీయః - మనకు శ్రేష్ఠమో, ఏతత్ న చ విద్మః - దీనినికూడ మన మెఱుగము.

విజయము మనకే కలుగుననని యొక విధమున నెంచినను కలుగు నష్టము నూహించి యర్జునుడనుచున్నాడు. యాన్ హత్వా న ఏవ జిజీవిషామః - ఎవరిని చంపి బొత్తిగా జీవింపగోరమో, తే ధార్తరాష్ట్రాః - ఆ ధృతరాష్ట్రపుత్రులే, ప్రముఖే అవస్థితాః - ఎదుట నిలబడియున్నారు.

వీరిని చంపి తాను జయము పొందుటయు శ్రేయస్కరము కాదని యర్జునుని తాత్పర్యము.

తా : ఇంతేకాక కృష్ణ ! మన యిరుపక్షము లందును నేపక్షము గొప్పదో మనకు దెలియదు. మనలను వారే జయింతురో మనము వారినే జయింతుమో కూడ తెలియదు. ఒకవేళ మనమే వారిని జయింతుమని యెంచినను ఎవరిని జంపి జీవింప నిచ్ఛగింపమో యా ధృతరాష్ట్రపుత్రులు దుర్యోధనాదులే మనయెదుట నిలబడియున్నారు. వారి నెట్లుచంపుదును?

కార్పణ్య దోషోపహత స్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసంమూఢచేతాః
యచ్ఛ్రేయః స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్. 54

కార్పణ్యదోషోపహత స్వభావః - దయ యనెడి దోషముచే నణచి వేయబడిన క్షాత్రస్వభావముగలవాడను, ధర్మసంమూఢ చేతాః - కర్తవ్యాకర్తవ్యములను తెలియని చిత్తముగలవాడనునై, త్వాం పృచ్ఛామి - నిన్నడుగుచున్నాను. యత్ శ్రేయః స్యాత్ - ఏది మంచిదో, తత్ మే నిశ్చితం బ్రూహి - అది నిర్ణయముగ జెప్పుము, అహం తే శిష్యః - నేను నీకు శిష్యుడను, త్వాం ప్రపన్నం మాం - నీ శరణుజొచ్చిన నన్ను, శాధి - ఆదేశింపుము.

తా : కార్పణ్యదోషముచే నా స్వభావము అణచివేయ బడినది. క్షాత్ర స్వభావము నశించినది. కావున యుద్ధమొనర్చి బంధుబాంధవులను జంపుట ధర్మమో లేక యస్త్ర శస్త్రము లను వదలి, భిక్షాటనముచేసి జీవితము గడపుట ధర్మమో తెలియకున్నది. ఇందేది శ్రేయస్కరమో నీవే నిశ్చయించి చెప్పుము. కృష్ణ ! శిష్యభావముతో నిన్నర్థించుచున్నాను. నన్ను శాసింతువుగాక ! నేను నీశరణు జొచ్చుచున్నాను.

న హి ప్రపశ్యామి మమాపనుద్యాత్
యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణాం
అవాప్య భూమా వసపత్న మృద్ధం
రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్. 55

భూమౌ - పృథివిపై, అసపత్నం ఋద్ధం రాజ్యం - శత్రు రహితము సమృద్ధమునగు రాజ్యమును, సురాణాం చ ఆధిపత్యం అపి-దేవతల యాధిపత్యమును కూడ, అవాప్య - పొందియు, యత్-ఏది, ఇంద్రియాణాం ఉత్శోషణం - ఇంద్రియములను శోషింపజేయు, మమ శోకం - నా దుఃఖ మును, అపనుద్యాత్ - దూరమొనర్చునో, అట్టిదానిని, న హి ప్రపశ్యామి - చూడలేకున్నాను.

తా : నాకీ భూమిపై సంపదలతో గూడి శత్రురహిత మైన రాజ్యము లభించినను, దేవతలపై ఆధిపత్యము లభించి నను, ఇప్పుడు నా యంగము లందు గలుగు శోషణ - పీడ - తొలగు నని యూహింప జాలకున్నాను.

ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః
న యోత్స్య ఇతి గోవిందమ్ ఉక్త్వా తూష్ణీం బభూవ హ. 56

పరంతపః గుడాకేశః - శత్రుతాపకుడు, నిద్రను జయించినవాడు నగు అర్జునుడు, హృషీక ఈశం, గోవిందం - జితేంద్రియుడగు కృష్ణుని(తో), న యోత్స్యే - యుద్ధముచేయను, ఇతి ఉక్త్వా - అని చెప్పి, తూష్ణీం బభూవ హ - మౌనముగా నుండెను.

తా : అని యిట్లు పలువిధముల నర్జునుడు తనకు గలుగుచున్న దుఃఖమునుగూర్చి కృష్ణునకు వెల్లడించి 'నేను యుద్ధము చేయను' అని మౌనము వహించెను.

ప్రథమాధ్యాయము సమాప్తము



# శ్రీమద్భగవద్గీత

## ద్వితీయాధ్యాయము

## సాంఖ్యయోగము

సారము - సంగతి :

అర్జును డిట్లు యుద్ధముచేయనని నుడివి దీనుడై ప్రార్థించుటనువిని, యతడు ధర్మసంకటములో బడియున్నట్లు తెలిసికొని కృష్ణ డతనికి ధర్మ తత్త్వమును దెలుప నారంభించెను.

అర్జునుడు చెప్పిన వాక్యములసారము మూడు సమస్యలుగా నిర్ణ యింపనగును.

(1) అనతికాలములో తన వంశీయు లందఱు చనిపోవుదురను శోకము అర్జునునకు కష్టము కలిగించుచున్నది.

(2) తన గురువులను, బంధువులను చంపుట కత డసమర్థుడనని యెంచెను.

(3) క్షాత్రధర్మము ననుసరించి చేయదగు నియతకర్మమైన సంగ్రా మమును విడిచి యతని స్వభావము సన్న్యాసమువంకకు మరలెను.

అర్జునునకు గలిగిన సమస్యలు ఈ మూడుమాత్రమే. ఈగీతయందీ మూడు సమస్యలే పరిష్కరింపబడెను. ఈ రెండవ యధ్యాయమునందు సాంఖ్యయోగము - జడచేతన వివేకము - మూలమున అర్జునుని దుఃఖమును దొలగింప యత్నింపబడెను.

జన్మము, మృత్యువు రెండును శరీరధర్మములు, ప్రపంచమునందు లేనివస్తువునకు పుట్టుక కాని ఉనికిగల వస్తువునకు అభావము కాని యెన్నడు నేర్పడదు. కాని, ప్రకృతికి సంబంధించిన వస్తువులు పగటి వేషగానివలె ననేక రూపులొందుచుండును. ఈ పరివర్తనలు నీవు శత్రు

ధారివైనను, కాకున్నను జరుగుచునే యుండును. ఇయ్యది శరీరస్థితి. ఇక నీ శరీరమును ధరించు జీవుడు - ఆత్మ అమరుడు. ప్రాతవస్త్రమును విడిచి క్రొత్తవస్త్రము ధరించునట్లా జీవుడొక శరీరమును విడిచి మఱియొక శరీరమును బొందును.

ఆత్మ యుత్పన్నమై నష్టమగునదిగా నెంచెదవేని ఉత్పన్నమగునది యవశ్యము నశించును. కావున ఆత్మయు నశింపక తప్పదు. ఈ దృశ్యప్రపంచమంతయు మృత్యుబారి నుండి యెన్నడును తప్పించుకొననిదైనపుడు, నీ వెవరికొఱకు శోకించుచున్నావు ?

ఇక నర్జునుని రెండవ సమస్యను 'ఈ సంగ్రామము ధర్మయుక్తము-ధర్మానుకూలము' అని యొక్క మాటతోనే తీర్చివేసెను. అర్జునుడుకూడ యోగిరాజగు కృష్ణుని సంక్షిప్త సమాధానముతోనే తన వాదమెంత దుర్బలమైనదో వెంటనే తెలిసికొనెను. అందువలననే యతడు మరల నీ విషయమును ప్రస్తావింపడయ్యె. వాస్తవమున అర్జునునకు దోడుగానున్న వారి మూలమున సాగింపబడిన ఈ సంగ్రామము ధర్మానుకూలమేయై యుండెను. కౌరవులు పాండవుల కొనర్చిన యన్యాయము, అత్యాచారమే యిందులకు కారణము. వారు మర్యాదనెన్నడో విడిచియుండిరి. కపట ద్యూతమును కల్పించిరి. సతియు, సాధ్వియునగు ద్రౌపదిని నిండు సభలో నవమానించిరి. పాండవు లరణ్యమున కేగునపుడు ఘృణితములు, నవమాన జనకములు నగు మాటలతో వారిని నిందించిరి. లక్కయింటిలో నుంచి వారిని దహింపజేయబూనిరి. వనవాసమొనర్చి వచ్చిన వారికి వారి భాగము నీయక భుజబలముతో హరింపనెంచిరి. ప్రార్థించిన మీదట గూడ సూదిమొన మోపదగినంత స్థలము కూడ యుద్ధమొనర్పక యీయమనిరి. ఇట్టి యన్యాయములను, అత్యాచారములను సహించి పాండవులు అపరాధులను దండింపక విడుతురేని క్షాత్ర ధర్మమునకు తిలాంజలి యిచ్చినట్లే యగును. ఇంతేకాక రానున్న తమ సంతానమునకు తమ యీ యాచరణము మూల

మున 'క్షత్రియుడు తన గ్రాసము నన్యు లపహరించు చుండగా నవమాన మును సహించుచు జీవింపగల, డను నీతిని నేర్పిన వా రగుదురు.

ఈ యాదర్శమెంతయు మంచిదే కాని, గురుజనులను బంధువులను జంపుటయు పాపమే కదా ? యనవచ్చును. అది ఎన్నటికిని కాదు. రాజ ధర్మము మిక్కిలి కఠోరము. అత్యాచారియగు పుత్రునికాని, తండ్రినికాని మృత్యుదండనకు గురిచేయని క్షత్రియుడు ఘోరపాపమునకు గురియగును. ఈ నగ్న సత్యమును యోగిరాజగు కృష్ణుని యెదుట భీష్మ పితామహుడు స్వయముగ నంగీకరించి యున్నాడు.

సమయత్యాగినో లుబ్ధాన్ గురూ నపి చ కేశవ
నిహన్తి సమరే పాపాన్ క్షత్రియః సహధర్మవిత్.
(మ. భా, శాం. ప. 55-16)

'ఓ కృష్ణ ! లోభులు, నియమభంగము నొనర్చువారు నైన గురువు లను కూడ సంగ్రామమున జంపువాడే ధర్మవిదుడగు క్షత్రియుడు' అని భీష్ముడు కృష్ణునకు చెప్పియుండెను.

ఇట్లే యుధిష్ఠిరునకు గూడ చెప్పెను.

మాతా పితా చ భ్రాతా చ భార్యా చైవ పురోహితః
నా దండ్యో విద్యతే రాజ్ఞో యః స్వధర్మే న తిష్ఠతి.
(మ. భా. శాం. ప. 121-60)

'స్వధర్మమున నుండని మాతకాని, తండ్రికాని, సోదరుడుకాని, పత్నికాని, ఆచార్యుడుకాని, యెవరైనను రాజునకు అదండ్యుడు కాడు.'

'అర్థస్య పురుషో దాసః' 'పురుషుడు ధనమునకు దాసుడు' అను మాటను జెప్పి తాము లోభము కారణముగ సంగ్రామమున జేరినట్లు భీష్ముడు, ద్రోణుడు నిరువురు నంగీకరించిరి. ధనముకొఱకు అన్యాయ

పక్షము నవలంబించుట ధర్మోల్లంఘనమే యగును. కావున కృష్ణుడు యుద్ధమును ధర్మానుకూల మనుటయు నుచితమే. యుద్ధము ధర్మానుకూలమని చెప్పుటవలననే యర్జునుని రెండవ సమస్య పరిష్కరింపబడినది. అతని మూడవసమస్యా పరిష్కారము మూడవ యధ్యాయమున నారంభింపబడును.

తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత
సేనయో రుభయోర్ మధ్యే విషీదంత మిదం వచః. 1

సంజయ వచనము :

భారత ! - భరతపుత్ర ! ధృతరాష్ట్ర ! హృషీకేశః - కృష్ణుడు, ప్రహసన్నివ - నవ్వుచు, ఉభయోః సేనయోః మధ్యే విషీదంతం - రెండు సేనలమధ్య దుఃఖించుచున్న, తం - అర్జునుని (తో), ఉవాచ - పలికెను.

తా : సంజయుడు ధృతరాష్ట్రునితో నిట్లు చెప్పుచున్నాడు. ఓ భారత ! ధృతరాష్ట్ర ! యుద్ధరంగమున నుభయసేనలమధ్య దుఃఖించుచున్న అర్జునుని జూచి కృష్ణుడు నవ్వుచు నిట్లనెను.

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః. 2

కృష్ణుని వచనము :

త్వం అశోచ్యాన్ అను అశోచః - నీవు శోకింపదగని వారినిగూర్చి శోకించుచున్నావు, ప్రజ్ఞావాదాన్ చ భాషసే - పండిత వచనములను పలుకుచున్నావు, పండితాః - విద్వాంసులు, ఆత్మజ్ఞులు, గతాసూన్ - అసువులు విడిచినవారిని గూర్చి కాని, అగతాసూన్ చ - ప్రాణములు విడువనివారిని గూర్చి కాని, న అనుశోచంతి - శోకింపరు.

తా : ఓయీ! అర్జున! శోకింప దగని భీష్మద్రోణాదులను గూర్చి నీవు శోకించుచున్నావు. కాని; ప్రాజ్ఞులు –

పండితులు - చెప్పు మాటలను జెప్పుచున్నావు. వాస్తవమున పండితులు - ఆత్మజ్ఞానులు ప్రాణములు పోయినవారిని గూర్చి కాని, ప్రాణములు పోక బ్రతికి యున్నవారిని గూర్చి కాని యెన్నడును దుఃఖింపరు.

(అర్జున! భీష్మాదులు నీకంతె నన్ని విధముల బెద్దవారు. వారు నిన్ను యుద్ధమున జంపి దుర్యోధనునకు విజయము చేకూర్ప నరు వెంచి యున్నారు. పిల్లలను గని, పెంచి పెద్దవారింజేసి, విద్యాబుద్ధుల నేర్పిన పెద్దలే వారిని యుద్ధమున జంప నడుకట్టి, శస్త్రాస్త్రములతో సన్నద్ధులయి యుండ వారినిగూర్చి పిన్నలు 'అయ్యో! ఈ పెద్దలతో మే మెట్లు ప్రతి యుద్ధ మొనర్చి యెదుర్కొందుము' అని ఆలోచించుట యుచితమా? అర్జున! ఆత్మజ్ఞునివలె మాటలాడుచున్నావే. ఆత్మజ్ఞాని యైన వాడు శరీరములు నశించుననియు, ఆత్మలు నశింపవనియు నెఱుగును. శరీరమున నాత్మ యున్నంతవఱకే సంబంధబుద్ధి (ఇతడు తండ్రి - ఇతడు గురువు అను బుద్ధి) యుండును. కాని, ఆత్మ శరీరమును వదలి వెళ్ళిన తదుపరి యా శరీరమునందు బంధుబుద్ధి కలిగి శోకించుట యజ్ఞతకాదా? కావున గతించిన వారిని గూర్చి కాని, గతింపనున్న వారింగూర్చి కాని శోకించుట ప్రాజ్ఞుల పనికాదు. బుద్ధిమంతులు 'తమ కర్తవ్యమేమి?' అని మాత్రము ఆలోచింతురని భావము.)

న త్వే వాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః
న చైవ న భవిష్యామః సర్వే వయ మతః పరమ్. 3

అహం - నేను, జాతు న ఆసం (ఇతి) న తు ఏవ - ఒకప్పుడు లేను అనునది లేదు. న త్వం న ఇమే జనాధిపాః - నీవు కాని, ఈ రాజులు కాని లేరనుట సరికాదు, ఎల్లరు పూర్వముండిరని భావము. వయం సర్వే - మనమందఱము, అతః పరం - దీనికి తదుపరి, న భవిష్యామః ఇతి న ఏవ - ఉండము అనునదియుకాదు. ఈ శరీరమునకు

పూర్వమునందును, పరమునందును, వర్తమానమునందును ఎల్లప్పుడు నుందుమని భావము.

(అర్జునునకు గలిగిన వ్యామోహమును - భ్రాంతిని బోనాడ నెంచి కృష్ణుడు 'ఆత్మ శరీరము కంటె భిన్నమనియు, నిత్యమనియు, దెలుప దలచి యిట్లనుచున్నాడు.)

తా : అర్జున ! నేను ఈ శరీర మేర్పడుటకు బూర్వము లేనని యెంచకు. అట్లే నీవును నీ యీ శరీరము లేనపుడు లేవని తలంచకు. మఱియు నీరాజులుకూడ వారి యీ దేహము లేర్పడుటకు ముందు లేరని తలంచకు. ఇంతేకాక యీ దేహము లున్నంత వఱకే మన మెల్లరము నుందుమనియు, నీ దేహములు నశించిన మఱుక్షణమున నుండము అనియు నెంచవలదు. మన మెల్లరము భవిష్యత్తునందు - శరీరములు నశించిన తదుపరి కూడ నుందుము.

(యుద్ధ మొనర్చిన నందు శరీరములు నశించు ననుట ఎల్లరెఱిగిన విషయమే. అర్జునునకు 'ఈశరీరమే ఆత్మ, అంతకు మించి - శరీరము కంటె భిన్నమగు నాత్మయను వస్తువొండులేదు, అను భ్రమకలిగినది.

పృథివ్యాది పంచభూతముల కలయిక వలన నీ శరీర మేర్పడు ననియు, నయ్యది కొంత కాలము లోకమున బనిచేసి, యనంతర మెప్పుడో నశించుననియు, అంతకు మించి యీ శరీరమున పంచభూతాత్మకముకాని ఆత్మయను వస్తువు - ద్రవ్యము - తత్త్వము ఒకటి వేఱుగ నుండుననుట తథ్యము కాదనియు నెంచువారు భారతమున లోకాయతులు, చార్వాకులు, శరీరాత్మవాదులు ననబడుదురు. ఇట్టి వారిని నేటి విద్యావంతులు భౌతిక వాదులనియు నందురు. ఆంగ్లమున వీరినే 'మెటీరియలిస్టు' లందురు వీరి జీవితమునకు లక్ష్యము శారీరక సుఖమే.

కావుననే 'యావజ్జీవేత్ సుఖం జీవేత్' జీవించినంతకాలము సుఖముగ జీవింపవలయు నందురు. జీవితములో సాధింపదగిన పురుషార్థము కూడ ఐంద్రియిక సౌఖ్యము తక్క మఱియొండు అంగీకరింపరు. అందువలననే 'అంగనా లింగనా జన్య సుఖమేవ పుమర్థతా' స్త్రీల కౌగిళింతవలన గలుగు సుఖమే పురుషార్థ' మందురు.

ఇక ఆత్మవాదు లట్లుకాక దేహమునందు దానికంటె భిన్నమగు వస్తు వొకటి వేఱుగ నుండుననియు, నయ్యది పృథివ్యాది పంచభూతముల రాసాయనిక సమ్మేళనమువలన నేర్పడునది కాదనియు నందురు. ఆ వస్తువును ఆత్మ, జీవాత్మ, జీవుఁడు అను నామములతో వ్యవహరింతురు. ఆ వస్తువు పంచభూతములకంటె విలక్షణమైనది. కాని, పంచభూతముల వలెనే యదియు నొకద్రవ్యమే. దానియందును భూతములందువలె గుణము లుండును. ఆ గుణములు గంధరసాదులవంటివి కావు. విలక్షణములు. వానిని తత్త్వశాస్త్రకారులు గౌతమ కణాదాదులు 'ఇచ్ఛా ద్వేష ప్రయత్న సుఖదుఃఖజ్ఞానములు' అని నుడువుదురు. ముఖ్యముగా జ్ఞానము, కోరిక, ప్రయత్నము నను నీ గుణములు ఆత్మలింగములు. ఆత్మయనున దొక వస్తువనియు నయ్యది భూమ్యాది పదార్థ సమ్మేళనమువలన నేర్పడునది కాదనియు తెలుపుట కివి యాధారములు. మఱియు రాసాయనిక ప్రయోగముల మూలముననే వైజ్ఞానికుడు నేటివఱకును జ్ఞానాది గుణములను నుద్భవింపజేయలేదని యెంచెద. కాగా జ్ఞానాది గుణముల కాశ్రయమై, స్వతఃసిద్ధమై, కారణ ద్రవ్యములచే నేర్పడనందున నాశనము లేనిదై నిత్యముగా నుండు నొక వస్తువు ఆత్మ యనబడును. అది శరీరముకాదు. శరీరము కారణ ద్రవ్యములయిన భూమ్యాదులచే నేర్పడును; వృద్ధిక్షయాది వికారములకు లోనగును; నశించును. అట్టి శరీరముకంటె ఆత్మ భిన్నము. ఆ యాత్మయే తెలుగున 'నేను' ఆంగ్లమున 'ఐ' హిందీలో 'మై' సంస్కృతమున 'అహమ్' అను పదములతో వ్యవహరింపబడుచున్నది. కొందఱు

పాశ్చాత్య తత్త్వవేత్తలు నుడువునట్లు అయ్యది కాల్పనికము కాదు. అది ఉనికి (సత్తా) కలిగినది. క్రైస్తవులు, మహమ్మదీయులు చెప్పునట్లు దేవునిచే మట్టిబొమ్మ ముక్కుపుటములలో ఊదబడిన ఊపిరికాదు. ఆత్మ జన్మ మరణములు లేని నిత్యవస్తువు. మిక్కిలి సూక్ష్మము. ఇంద్రియము లకుగాని యంత్రములకుగాని పట్టునబడునదికాదు. ఇట్టి యాత్మలు శరీరమున కొక్కటి వంతున బ్రహ్మాండమున నెన్నియున్నవో తెలియదు. మానవ గణితమున కందవు.

ప్రత్యక్షముగా జూడనగు నీ శరీరమునందు దీనికి భిన్నమైన ఆత్మ వస్తువొండు కలదనుటకు 'నాశరీరము, నాశిరస్సు, నాబుద్ధి; నేను దేహము కాను; నేను శిరఃపాణ్యాదులుకాను' అను నిట్టి వ్యవహార మొక ప్రమాణము. నాయిల్లు, నాభార్య, నాబిడ్డలు మున్నగు వ్యవహారములందు ఇల్లు, ఆలు, బిడ్డలు తనకంటె వేఱుగా నెట్లు తెలియబడుచున్నవో అట్లే నాదేహాది ప్రయోగములందును 'నేను' దేహముకంటె భిన్నమని తెలియబడుట సుకరమే కదా? కావున దేహాదులు తనకు సంబంధించినవియే. దేహాదులు నశించిన తాను నశింపడు అను విషయము వివేకులకు సులభగ్రాహ్య మగును.)

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా
తథా దేహాంతర ప్రాప్తిర్ ధీర స్తత్ర న ముహ్యతి. 4

దేహినః - శరీరధారియైన జీవికి, అస్మిన్ దేహే - ఈ దేహమున, యథా కౌమారం, యౌవనం, జరా - ఎట్లు బాల్యము, యౌవనము, వృద్ధాప్యము కలుగునో, తథా దేహాంతరప్రాప్తిః - అట్లే మఱియొక దేహము లభించును, తత్ర - ఈ విషయమున, ధీరః - బుద్ధిమంతుడు, న ముహ్యతి- మోహము చెందడు.

తా : ఈ దేహమునందు కౌమార, యౌవన, జరాద్యవస్థలు కలుగుచుండుట లోకవిదితము. జీవు డీ శరీరమునం

నుండగానే దేహమునకే యవస్థలు కలుగుచున్నవి. ఈ యవస్థలను మనము కుమార శరీరము, యువశరీరము, వృద్ధశరీరము నని వ్యవహరింపవచ్చును. అప్పుడు దేహమునందుండు జీవికి యొక్క జీవితమునందే అనేక దేహములు ఒకదాని తరువాత మఱియొకటి కలుగుచున్నవనుట యసత్యముకాదు. దీనిని బట్టి యీ శరీరము నశించిన తదుపరి జీవికి మఱియొక శరీరము లభించునని తెలియుచున్నది. అందువలన జ్ఞానియైనవాడు శరీరనాశమునకు చింతింపడు. తాను నశించినట్లు భ్రాంతిపడడు.

బాల్య, యౌవనాది శరీరములు మాఱినను, ఆ దేహములతో వ్యవహరించు జీవుడు మాత్రము మాఱడు. బాల్యదేహముతో నొకప్పుడు క్రీడలను సలిపిన జీవుడే వృద్ధదేహముతో వ్యవహరించునపుడు 'నేను చిన్ననాడు ఇట స్నేహితులతో నాడితిని' అని స్మరించును. శరీరములతో బాటు జీవుడుకూడా మాఱియుండు పక్షమున నిట్టి స్మరణకు అవకాశ ముండదు. కావున జీవితకాలమున శరీరమునందు వికారములు గలిగి యెప్పటి కప్పుడు దేహము మాఱినను జీవుడు మాత్రము మాఱడని స్పష్టమగుచున్నది. ఒకే ఆత్మ పలుశరీరములతో వ్యవహరించు ననుట సిద్ధమగుచున్నది. ఆత్మలో మార్పు లుండవనియు బోధపడుచున్నది. మార్పులు, వికారములు లేని వస్తువు నిత్య మనబడును. నిత్యమైన జీవునకు పలుదేహములు లభించును. కావున జ్ఞానియైనవాడు దేహనాశమునకు జింతింపక కర్తవ్యము నాచరింప బూనును.)

మాత్రా స్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణ సుఖదుఃఖదాః
అగమాపాయినోఽనిత్యాః తాం స్తితిక్షస్వ భారత. 5

కౌంతేయ ! - అర్జున ! - శీతఉష్ణ సుఖదుఃఖదాః - శీతోష్ణములను సుఖదుఃఖములను నిచ్చు, మాత్రాస్పర్శాః తు - తత్త్వసంబంధములు

మాత్రము, ఆగమ అపాయినః - వచ్చిపోవునవి, అనిత్యాః - అందువలన నిత్యములుకావు, భారత ! తాన్ - వానిని, తితిక్షస్వ - ఓర్చుకొనుము.

తా : 'ఆత్మలు నిత్యములై దేహములకంటె భిన్నములైనను దేహములు నశించుటవలన వానితో నాత్మలకు గల సంబంధము విడిపోవును. దేహసంబంధము కారణముగా బంధుబుద్ధితో వ్యవహరింపబడు భీష్మాదులు నాకు దూరులగుదురు. అందువలన దుఃఖము కలుగును కదా !' అని తలతువేని అర్జున! అట్టి దుఃఖము సహింపక తప్పదు. లోకమున నెల్లపుడు ప్రాణులకు నానావిధ పదార్థములతో సంయోగ వియోగములు కలుగుచునే యుండును. వానివలన సుఖదుఃఖములును గలుగును. అయ్యవి నిత్యములుకావు. వచ్చుచు పోవుచునుండును. వానిని సహింపుము.

యం హి న వ్యథయ న్త్యేతే పురుషం పురుషర్షభ
సమ దుఃఖ సుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే. 6

పురుషఋషభ : - నరపుంగవ, ఏతే - ఈద్వంద్వములు, సమ దుఃఖ సుఖం - సుఖదుఃఖములు సమానముగ నెంచు, యం ధీరం పురుషం- ఏ ధీర పురుషుని, న వ్యథయంతి - కష్టపెట్టవో, సః హి - ఆ ధీరుడే. అమృతత్వాయ కల్పతే - మోక్షమున కర్హుడగును.

తా : మఱియు నీ సుఖదుఃఖములను బొంది వ్యథ జెందనివారు, వికారములకు లోనుగానివారు, వానిని సమానముగ ననుభవించువారు జ్ఞానులగుదురు. వారే మోక్షమున కర్హులగుదురు. నిత్య సుఖశాంతులను బొందుదురు.

నాసతో విద్యతే భావః నాభావో విద్యతే సతః
ఉభయో రపి దృష్టోంతస్ త్వనయో స్తత్త్వదర్శిభిః. 7

అసతః - లేనిదానికి, భావః - పుట్టుక, న విద్యతే - ఉండదు, సతః - ఉనికిగలదానికి, అభావః - అభావము - లేకునికి, న - కలుగదు, అనయోః ఉభయోః అపి - ఈరెంటి యొక్కయు, అంతః - సిద్ధాంతము, తత్త్వదర్శిభిః - తత్త్వజ్ఞానులచే, దృష్టః - చూడబడినది.

లోకమున జూడబడు వస్తువులన్నియు నేదోయొక రూపమున నుండునే కాని యపి యెన్నడును నునికిలేనివి కానేరవని తాత్పర్యము.

తా : అర్జున! అసత్తునకు భావముకాని, సత్తునకభావము కాని యుండదు. ఇది తత్త్వజ్ఞులు తెలిపిన నిశ్చిత సిద్ధాంతము.

(ఉనికి (సత్తా) లేని పదార్థము లోకమున నెన్నడు పుట్టదు; వర్తిల్లదు; వృద్ధిక్షయములను బొందదు;నశింపదు; ఉనికిని బోగొట్టుకొనదు. నశించియు నేదోయొక రూపమున నుండును. కావున ప్రాకృతిక పదార్థములు పుట్టి నశించినంత మాత్రమున నవి యునికి లేనివని యెంచబనదు. నాశమనగా అభావముకాదు. రూపపరివర్తన మని భావము. నశించు వస్తువు తన కారణరూపమును బొందియుండును. వస్త్రములు నశించి తంతురూపమునను, ఘటాదులు నశించి మృత్తికా రూపమునను, కుండలాదులు నశించి బంగారు రూపమునను ఉండును. ప్రస్తుతము స్థూలరూపమున గనబడు పదార్థము లన్నియు ప్రళయకాలమున సూక్ష్మరూపమున నుండును. ఈ సూక్ష్మరూపమునే ప్రకృతి, అవ్యక్తము, మాయ యని యందురు. కాబట్టి ప్రపంచము సత్తారహితము - ఉనికి లేనిది కాదు. జీవులు నిత్యులైనట్లు ప్రకృతియు నిత్యమే. స్థూలములై యింద్రియములకు దెలియనగు రూపములే యనిత్యములు.)

(ఇట్లు ఆత్మ-అనాత్మ (శరీరము) లను గూర్చి వివరించి కృష్ణుడర్జునునకు మఱియొక నిత్యపదార్థమును దెలుపనెంచి యిట్లనుచున్నాడు )

అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి. 8

యేన - ఎవని మూలమున, ఇదం సర్వం - ఈ సర్వ ప్రపంచమును, తతం - విస్తరింప జేయబడినదో, తత్ - ఆ పరమేశ్వర తత్త్వమును, అవినాశి - నశింపని దానినిగా, విద్ధి - తెలిసికొనుము, అస్య అవ్యయస్య వినాశమ్ - ఈ యవినాశి వినాశమును, కశ్చిత్ - ఎవడును, కర్తుం - చేయుటకు, న అర్హతి - శక్తుడు కాడు.

తా : ఈ కనబడుచున్న ప్రపంచము నంతటిని విస్తరింప జేసి యం దేపదార్థము వ్యాపకమై యున్నదో యది యొక నిత్యపదార్థము. అది యెన్నడు నశింపదు.

మన యింద్రియములచే తెలియబడు నీ జడ ప్రపంచ మంతయు నాశనమగునదై యున్నది. ఇందలి పదార్థము లన్నియు నిరంతరము మార్పులు చెందుచుండుట చూచుచున్నాము. మార్పులు చెందు వస్తువు నిత్యము కాదు. అది యనిత్యము; పుట్టి చచ్చునది. పుట్టి చచ్చు వస్తువులు దార్శనిక భాషలో కార్యము లనబడును. కార్యము కారణముల వలన నేర్పడును. ఒక కార్యమేర్పడుటకు అనేక కారణములుండును. అందు ఉపాదాన నిమిత్తకారణములు ముఖ్యములు ఏ కారణ పదార్థము కార్యరూపమున నగునో యా కారణము ఉపాదాన మనబడును. ఉపాదాన కారణమును కార్యరూపమున మార్చునది నిమిత్తకారణము. నిమిత్త కారణములలో జ్ఞానవంతమగు చేతనము కర్త యనబడును. అయ్యది చేతన నిమిత్తకారణ మనియు జెప్పబడును.

మట్టి కుండ యగును. కుండ కార్యము. మట్టి ఉపాదానము. మట్టి స్వయముగా కుండ కానేరదు. మట్టిని కుండగా మార్చు చేతన నిమిత్తకారణము (కుమ్మరి) కర్త యగును. అట్లే యీ ప్రపంచము ఒక

కార్యమనుకొనిన దానికి ఉపాదాన కారణము ప్రకృతి. ఆ ప్రకృతిని ప్రపంచముగా స్థూలరూపమున మార్చు చేతన నిమిత్త కారణము సృష్టి కర్త, పరమేశ్వరుడు - దేవుడు - భగవంతుడు నని నానావిధములయిన నామములతో జెప్పబడును.

కార్యము పరిమితమై యుండును. దేశకాలములు దాని కవధులుగా నుండును. కావున నీ ప్రపంచ మనెడి కార్యము కూడ పరిమితమే. మానవ దృష్టికి బ్రహ్మాండ మెంత పెద్దదిగా దోచినను విజ్ఞులదృష్టిలో నియ్యది పరిమితము; వ్యాప్యము. ఇట్టి ప్రపంచమునకు కర్తయగు చేతన నిమిత్త కారణము - పరమేశ్వర తత్త్వము వ్యాపకమై ప్రపంచమునం దంతట నుండుటయే కాక దానిని మించియుండి దానిని సృజించుచుండును. వ్యాపకమై యంతటనుండు నీ పరమతత్త్వము నశింపదు. పరిమితవస్తువే నశించును. అపరిమితము నశింపదు; వికారములకు లోనుకాదు.

ఇంతవఱకు కృష్ణుడు అర్జునునకు ప్రకృతి, జీవులు, పరమేశ్వరుడు నను మూడు స్వయం సత్తాకములై నిత్య సత్యములయిన పదార్థము లున్నట్లు వివరించి యున్నాడు. ఇందు ప్రకృతి మార్పులు చెందు స్వభావ యోగ్యతలుకలది; జడము; క్రియారహితము. పరిణామము నొందుటకు దగిన యోగ్యత దానియందున్నది. కాని స్వయముగా మాఱదు. దానిని మార్చు చేతన వ్యాపక తత్త్వము పరమేశ్వర తత్త్వము. ఇక జీవులు జ్ఞానేచ్ఛాది గుణములుగలిగి, సూక్ష్మములై, నాశనములేని నిత్యచేతనములు.

(ఇట్లు అర్జునునకు తత్త్వజ్ఞానము గలిగిన కృష్ణుడు కర్తవ్యమును బోధించు చున్నాడు.)

అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః
అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత. 9

అనాశినః - నాశముకాని, అప్రమేయస్య - ఇంద్రియ గమ్యము కాని, నిత్యస్య - నిత్యమైన, శరీరిణః - దేహధారికి - జీవునకు, ఇమే

దేహాః - ఈ దేహములు, అంతవంతః - నాశనము గలవిగా, ఉక్తాః - చెప్పబడినవి, తస్మాద్ యుద్ధ్యస్వ - కావున యుద్ధమొనర్పుము. (దేహములు తప్పక నశించును కావున కర్తవ్యము విడువకుము.)

తా : భరత వంశోద్భవ ! అర్జున ! ఇంద్రియములకు గోచరము కాక నిత్యమైయుండు జీవునకు అనిత్యములయిన దేహము లనేకములు లభించుచుండును. కావున దేహనాశనమునకై చింతించి ధర్మస్థాపనార్థము ప్రారంభించిన యుద్ధరూప కార్యమును విడువకుము.

య ఏనం వేత్తి హంతారం, య శ్చైనం మన్యతే హతం
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే. 10

యః ఏనం హంతారం వేత్తి - ఎవడు ఇతనిని చంపువానినిగా నెఱుగునో, యః చ ఏనం హతం మన్యతే-మఱియొక డెవడు ఇతనిని చంపబడిన వానినిగా నెంచునో, తౌ ఉభౌ న విజానీతః - ఆ యిరువురు తెలియని వారు, అయం న హంతి; న హన్యతే - ఈ జీవుడు చంపడు, చంపబడడు.

తా : ఒక జీవు డింకొక జీవుని జంపుననియు, ఒకడు మఱియొకనిచే జంపబడుననియు నెంచు వారిరువురు జ్ఞానులు కారు. జీవుడు చంపబడడు. దేహము నశించును.

న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. 11

అయం కదాచిత్ న జాయతే - ఈ యాత్మ ఎన్నడు ఉత్పన్నము కాదు. న వా మ్రియతే - చావదు కూడ, వా న భూత్వా భూయః భవితా - మఱియు నిది లేక మరల కలుగునదికాదు. అయం - ఈ జీవుడు, అజః - జన్మలేనివాడు, నిత్యః - ఎల్లప్పుడు నుండువాడు, శాశ్వతః - స్థిరుడు, పురాణః - అనాది. శరీరే హన్యమానే న హన్యతే - శరీరము చంపబడిన మాత్రమున నితడు చంపబడడు.

తా : జీవతత్త్వము చావదు, పుట్టదు. పుట్టి మరలచచ్చి లేకుండునది కాదు. కావున నది నిత్యము. మార్పులు చెందక యెల్లపుడు నొక్కటిగ నుండును. శరీరము నశింపజేయబడి నను అది నశింపదు.

(అనేక సూక్ష్మపదార్థములు కలిసి స్థూలరూపము నొందుట పుట్టుక-జన్మము అనబడును. ఇట్టి స్థితి దేహమునకు గలదుకాని జీవునకులేదు. జీవతత్త్వము అనేకము కలిసి యేర్పడునదికాదు. అది యొకే సూక్ష్మ తత్త్వము. దాని యునికి స్వతంత్రము. కొంద ఱెంచునట్లు జీవాత్మ యీశ్వర నిర్మితముకూడకాదు. మఱికొందఱు భావించునట్లు బుద్ధి ప్రతిబింబిత చిదాభాసమునుకాదు. కావుననే తత్త్వజ్ఞులు 'ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభా వపి' ప్రకృతి, జీవుడు నను నీ రెండును అనాదులు. ఆదిలేనివి - కారణములవలన నేర్పడినవి కావు, అని నుడివిరి.

వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్
కథం స పురుషః పార్థ ! కం ఘాతయతి హంతి కమ్. 12

యః ఏనమ్ - ఎవడీయాత్మను, అవినాశినం, నిత్యం, అజం, అవ్యయం వేద - నాశరహితము, నిత్యము, జన్మలేనిది వికారములేనిదిగ తెలియునో, పార్థ - అర్జున! స పురుషః - అపురుషుడు, కథం కమ్ ఘాతయతి,

కం, హన్తి - ఎట్లు ఎవనిని చంపించును ; ఎవనిని చంపును ? ఆత్మ నిత్యమని యెఱిగిన వాని హృదయమున నొకని చంపించుటకుగాని, చంపుటకుగాని తలంపు కలుగదు. అతడు కేవల కర్తవ్యము నాచరింప బూనునని తాత్పర్యము.

తా : అర్జున ! ఇట్లు జీవాత్మ నాశము నొందదనియు, నిత్యమనియు, పుట్టుకలేనిదనియు, వ్యయించునది కాదనియు నెఱిగిన వాడు దానిని జంపుడు ననియు, జంపింతు ననియు నెట్లు భావించును ! ఎన్నడు నట్లు భావింపడు అని భావము.

వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ. 13

నరః - మనుజుడు, జీర్ణాని వాసాంసి - చిరిగిన వస్త్రములను, యథా విహాయ - ఎట్లు విడిచి, అపరాణి నవాని గృహ్ణాతి - ఇతర నూతనవస్త్రములను గ్రహించునో, తథా - అట్లే, జీర్ణాని, శరీరాణి - జీర్ణశరీరములను, విహాయ - విడిచి - దేహీ - ఆత్మ, అన్యాని నవాని సంయాతి - ఇతరమగు క్రొత్తదేహములను పొందును.

(ధర్మయుద్ధమున పోరాడువారికి రెండు లాభములు దుర్లభములైనవి లభించును. ఒకటి, వారు తమ కర్తవ్యమును పాలించినవారగుదురు. రెండు, ప్రాతశరీరమును విడిచి క్రొత్తదేహమును పొందుదురు. కాగా అర్జును డెవరు చత్తురని యెంచుచున్నాడో వారికి నష్టము కలుగదని భావము.)

తా : మనుజుడు చిరిగిన గుడ్డలను వదలి నూతన వస్త్రములను ధరించునట్లు జీవుడు జీర్ణ శీర్ణములై తనకు పనికిరాని శరీరములను విడిచి క్రొత్త దేహములను బొందుచుండును.

ప్రశ్న : చచ్చినందున ఆత్మకేమియు నష్టము కలుగదా ? శరీరచ్ఛేదన, దహనాదులవలన ఆత్మకేమియు హానిలేదా ?

ఉత్తరము : ఏమియు కలుగదు. కారణమేమన :

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః
న చైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః. 14

శస్త్రాణి - శస్త్రములు, ఏనం - ఈయాత్మను. న ఛిందంతి - ఛేదింపవు, ఖండింపవు, పావకః - అగ్ని. ఏనం - ఇతనిని, న దహతి-దహింపదు, ఆపః - నీరు, ఏనం - ఇతనిని, న క్లేదయంతి - తడుపజాలవు, మారుతః చ - వాయువుకూడ, ఏనం - ఇతనిని, న శోషయతి - శుష్కింపజేయలేదు. (ఆత్మ కేవిధమైన హానియు కలిగింపజాలవని భావము.)

తా : కత్తులు కటారులు మున్నగు శస్త్రములు జీవాత్మను ఖండింపజాలవు. అగ్ని దహింపలేదు; నీరు నానబెట్టలేదు; గాలి శుష్కింపజేయ నేరదు.

(జీవాత్మ కారణముల కలయికచే నేర్పడినది కాదని యింతకు బూర్వమే చెప్పియుంటిమి. కావున నట్టి సూక్ష్మతత్త్వమును కత్తులు కటారులు నెట్లు ఖండింపగలవు ? ఖండించుట - భేదించుట యన విభజించుట యని అర్థము. అనేకములైన చిన్న చిన్న వస్తువులు కలిసి యొకపెద్ద వస్తువుగా నేర్పడును. అట్టి వస్తువు కత్తులచే విభజింపబడ నగును. అవయవమేళనము లేని యొకే సూక్ష్మతత్త్వమును మఱియొక తత్త్వమేదియు విడదీయజాలదు. కావుననే యిట కృష్ణుడర్జునునకు పృథివి, జలము, అగ్ని, వాయువు నను నీతత్త్వము లేవియు జీవాత్మలో నెట్టి వికారమును గలిగింపజాలవని స్పష్టముగా జెప్పియున్నాడు. దీనింబట్టి గరుడ పురాణాదులందు వర్ణింపబడిన బూటకపు కథలవలన జీవాత్మను యముడు కింకరులచే యమలోకమునకు తెప్పించి యట జీవునకు

శస్త్రాదులతో బాధలు గలిగించుననుట తత్త్వశాస్త్ర విరుద్ధమనియు నందు వలన నట్టి కథలు పుక్కిటి పురాణము లనియు నెంచి నమ్మరాదు.

జీవు డొక శరీరమును విడిచి మఱియొక శరీరమును బొందును. ఇట్లు ఒక దేహమును విడిచి మఱియొక దేహమును బొందు లోపల కొంతకాలము యమలోకమున నుండు ననుటయు, నట బాధల ననుభవించు ననుటయు, ఇట్లే స్వర్గమున గొంతకాలముండి రంభాసంభోగాది సుఖముల ననుభవించు ననుటయును నసత్యములే. పురాణములందు కల్పింపబడిన స్వర్గ నరకాదిలోకములు, అట ననుభవించు సుఖదుఃఖములు నన్నియు బూటకములనియే యెంచవలయును. మనుజులు చెడుగు చేయక మంచి నాచరించుటకై కల్పించిన భయలోభములే కాని మఱియొండు సత్య మీ కథలలో కనిపింపదు.)

అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే
తస్మా దేవం విది త్వైనం నానుశోచితు మర్హసి. 15

అయం - ఈ యాత్మ, అవ్యక్తః - ఇంద్రియములతో తెలియ బడదు, అయం - ఆత్మ, అచింత్యః - విచారగమ్యమును కాదు, అయం - ఇది, అవికార్యః - వికారములేనిదిగ, ఉచ్యతే - చెప్పబడును, తస్మాత్ - కావున, ఏనం - ఈ యాత్మను, ఏవం విదిత్వా - ఇట్లు తెలిసికొని, అనుశోచితుం - దుఃఖించుటకు, న అర్హసి - తగవు.

తా : మఱియు నీ జీవాత్మ నేత్రాది ఇంద్రియములకు దెలియదగినది కాదు. ఇది అతీంద్రియము. అత్యంత సూక్ష్మము. కావున ఇంద్రియ గ్రాహ్యమైన వస్తువుల మనస్సుతో నెట్లు స్మరియింతుమో జీవాత్మను అట్లు స్మరింపజాలము. చింతన చేయజాలము. ఇది వికారములకు లోనగునదియు గాదు.

అవయవ సంయోగముచే నేర్పడు వస్తువులే వికారములకు లోనగును. జీవాత్మ నిరవయవ పదార్థము. దేహమువంటిది కాదు. అందువలన అర్జున! జీవాత్మ యొక్క వాస్తవ స్థితిని గుర్తించినచో నిట్లు శోకింపవు. నీవు శోకింపదగినవాడవు కావు.

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతం
తథాపి త్వం మహాబాహో ! నైవం శోచితు మర్హసి. 16

మహాబాహో ! - అర్జున ! అథ చ ఏనం - మఱియు నీయాత్మ నొకవేళ, నిత్యజాతం, వా నిత్యం మృతం, మన్యసే - నిత్య ముత్పన్న మగునదిగనో, లేక నిత్యము మరణించునదిగనో యెంచెదవేని, తథాపి - అట్లయినను, త్వం - నీవు, ఏవం శోచితుం - ఇట్లు దుఃఖించుటకు, న అర్హసి - తగవు. (జన్మ మరణములు అనివార్యములు కావున శోకింప బనిలేదని భావము)

తా : దీర్ఘ బాహువులు గల అర్జున ! పైన వివరించి నట్లు జీవాత్మ నిత్యమని యెంచక యది పుట్టి చచ్చునదిగా నెంచెదవేని అప్పుడును నీవు శోకింపబనిలేదు జన్మ మరణ ములు జీవాత్మకు నీ మతమున ననివార్యమగుటం జేసి చింతించి ప్రయోజనమేమి ? నీవు శోకించి యుద్ధము మానినంత మాత్ర మున భీష్మ ద్రోణాదులు మరణము నొందకుండరు గదా !

జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి. 17

హి - కారణమేమున, జాతస్య - పుట్టినవానికి, మృత్యుః - చావు, ధ్రువః - తప్పదు, మృతస్య చ, జన్మ, ధ్రువం - చచ్చినవానికిగూడ

జన్మ తప్పదు, తస్మాత్ - కావున, అపరిహార్యే అర్థే - తప్పనిదాని విషయమున, త్వం శోచితుం న అర్హసి - నీవు శోకింప నర్హుడవు కావు.

(ఆత్మకు చావు పుట్టుక లున్నవని యంగీకరింతుమేని, అపు డా యాత్మ శరీర రచన కుపయోగపడు భూతముల వంటిదే యగును. అనగా జన్మమరణముల నంగీకరించు వారి దృష్టిలో నదియు నొక పార్థివ పదార్థము వంటిదే యగును. అటులయిన-)

తా : పుట్టినవాడు తప్పక చచ్చును. చచ్చిన వాడు మరల తప్పక పుట్టును. కావున జన్మమరణముల నెవ్వరును తప్పించుకొనజాలరు. అట్టి యెడ నీవు భీష్మద్రోణాదుల గూర్చి చింతించి ప్రయోజన మేమి ?

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత
అవ్యక్త నిధనా న్యేవ తత్ర కా పరిదేవనా. 18

భూతాని - పంచభూతములు, అవ్యక్త ఆదీని - సూక్ష్మమైన ప్రకృతి నుండి యేర్పడినవి, వ్యక్తమధ్యాని - మధ్యకాలమున ప్రకటమయినవి, అవ్యక్త నిధనాని - నాశసమయమున సూక్ష్మములై కనబడవు, తత్ర పరిదేవనా కా ? - ఈ విషయమున శోకమేల ?

తా : పృథివ్యాది పంచభూతములు అవ్యక్తము-ప్రకృతి అను సూక్ష్మపదార్థమునుండి జనించినవి. స్థూలరూపమును బొంది ఇవి ఇంద్రియములచే గ్రహింపబడుచున్నవి. కొంత కాలము స్థూలరూపమున నుండి మరల తమకు కారణము లైన సూక్ష్మపదార్థములలో జేరి క్రమముగా అవ్యక్తములో లీనమగును. కావున నిట్టి పదార్థములను గూర్చి చింతింపనేల? నిష్ప్రయోజనమని భావము.

ఆశ్చర్యవత్ పశ్యతి కశ్చి దేన
మాశ్చర్యవద్ వదతి తథై వ చాన్యః
ఆశ్చర్యవ చ్చైన మన్యః శృణోతి
శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్. 19

వాస్తవమున ఆత్మ పృథివ్యాది భూతముల వంటిది కాదు. దీని నెఱిగినవా రట్లే నుడువుదురు. కశ్చిత్, ఏనం, ఆశ్చర్యవత్ పశ్యతి - ఒకడు ఈ యాత్మను వింతగా చూచును. తథా, ఏవ, చ, అన్యః, ఆశ్చర్యవత్, వదతి - అట్లే యింకొకడు వింతగా చెప్పును, అన్యః, చ, ఏనం, ఆశ్చర్యవత్, శృణోతి - ఇంకొకడు కూడ నీ యాత్మను వింతగా వినును. కశ్చిత్, శ్రుత్వా, అపి, ఏనం, న, చ, ఏవ, వేద - కొండొకడు వినియు నీ యాత్మను తెలిసికొననే లేడు.

తా : జీవాత్మ వాస్తవమున పంచ భూతముల వలె సూక్ష్మకారణ ద్రవ్యముల వలన నేర్పడునది కాదు. అందు వలననే దాని వాస్తవ స్థితిని పామరులు గుర్తింపరు. ఆత్మ వాస్తవికతను గుర్తించిన వారు దానిని వింతగా జూతురు. వింతగా జెప్పుదురు. ఆశ్చర్యముగా విందురు. అట్లు వినియు దాని నెల్లరు గ్రహింపనేరరు.

దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత !
తస్మాత్ సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి. 20

అయం దేహీ - ఈ యాత్మ, సర్వస్య దేహే - ప్రతి శరీరమునందును, అవధ్యః - నిత్యమై యున్నది. భారత ! - అర్జున !, తస్మాత్ - కావున, సర్వాణి భూతాని - సర్వప్రాణులను గూర్చి, త్వం శోచితుం న అర్హసి - నీవు శోకింపదగవు. ఇదియే నా మతము.

తా : భరతవంశ సంజాతా ! ప్రాణి దేహమునందు గల ఈ జీవుడు వధింపబడువాడు కాడు. దేహము మాత్రము వధింపబడును. ఆత్మ కారణద్రవ్యములచే నేర్పడునది కాదు. కావున నది యనాది - ఆదిలేనిది. ఆదియన కారణము. కారణములేనిది కావున నది వధింపబడదు - విభజింపబడదని భావము. దేహమట్లు గాక సకారణమగుటచే నది వధింపబడ నర్హమగును. ఇట్టి వాస్తవమును గుర్తించి అర్జున ! నీ వీ ప్రాణులు నశించునని యెంచి దుఃఖించుట తగదు.

స్వధర్మ మపి చావేక్ష్య న వికంపితు మర్హసి
ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయో అన్యత్ క్షత్రియస్య న విద్యతే. 21

చ స్వధర్మం, అపి, అవేక్ష్య - మఱియు నీ ధర్మమైనను చూచి, వికంపితుం, న అర్హసి - కంపింప - చలింప నర్హుడవుకావు, హి - కారణ మేమన, క్షత్రియస్య - క్షత్రియునకు, ధర్మ్యాత్ యుద్ధాత్ - ధర్మాను కూలమైన యుద్ధముకంటె, అన్యత్ శ్రేయః - ఇంకొక మంచిపని, న విద్యతే - లేదు.

తా : మఱియు నో యర్జున ! క్షాత్రధర్మమును గూర్చి యాలోచించినను నీ విట్లు విచలితుడ వగుట తగదని తెలియును. క్షత్రియునకు ధర్మము నెలకొల్పుటకు యుద్ధము చేయుటకంటె నుత్తమ కార్యము మఱియొకటి లేదు. లోకమున ధర్మమును గాపాడు వాడు క్షత్రియుడు గాక మఱియొక డెవడు ?

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతం
సుఖినః క్షత్రియాః పార్థ ! లభంతే యుద్ధ మీదృశమ్. 22

పార్థ ! - అర్జున ! యదృచ్ఛయా, ఉపపన్నం - తనకు తానై లభించిన, అపావృతం, స్వర్గద్వారం - తెఱవబడిన స్వర్గద్వారమైన, ఈదృశం యుద్ధం - ఇట్టి యుద్ధమును, సుఖినః క్షత్రియాః - సుకృతులయిన క్షత్రియులు, లభంతే - పొందుదురు.

తా : పార్థా ! ఈ యుద్ధము కావలయునని నీవు కోరి తెచ్చుకొనినది కాదు. తనకు దానై వచ్చినది. సుకృతులైన క్షత్రియులకే యిట్టి యుద్ధము లభించును. ధర్మస్థాపనకై యుద్ధమొనర్చి, కీర్తిని గడించి సుఖముల ననుభవింపుము.

అథ చేత్ త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి
తతః స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి. 23

అథ చేత్, త్వమ్ - ఇప్పుడొకవేళ నీవు, ఇమం, ధర్మ్యం, సంగ్రామం - ఈ ధర్మానుకూల సంగ్రామమును, న కరిష్యసి - చేయవేని, తతః - అప్పుడు, స్వధర్మం, కీర్తిం చ - స్వధర్మమును, కీర్తిని, హిత్వా- విడిచి, పాపం అవాప్స్యసి - పాపమును బొందగలవు.

తా : ఇంత చెప్పినను నీవీ ధర్మయుద్ధమును జేయవేని, స్వధర్మమైన క్షత్రియుల కర్తవ్యమును విడిచినవాడ వగుదువు. కీర్తిని బోగొట్టుకొందువు. పాపము నందుదువు.

అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్
సంభావితస్య చా కీర్తిర్ మరణా దతిరిచ్యతే. 24

చ - మఱియు, భూతాని - జనులు, తే - నీ, అవ్యయాం, అకీర్తిం అపి - స్థిరస్థాయి యగు నపకీర్తినికూడ, కథయిష్యంతి - కీర్తింతురు. సంభావితస్య చ అకీర్తిః - మాన్యునకు కలుగు నపకీర్తికూడ, మరణాత్, అతిరిచ్యతే - మరణము కంటె నెక్కుడు కష్టము.

తా : లోకులు నీకు దుష్కీర్తి నాపాదింతురు. అది యెన్నడు నశింపదు. లోకమున గౌరవాన్వితుడైన వ్యక్తి యపకీర్తి బొందుటకంటె మరణించుట శ్రేయస్కరము.

భయా ద్రణా దుపరతం మంస్యంతే త్వాం మహారథాః
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్. 25

మహారథాః - మహారథులు, త్వాం - నిన్ను, రణాత్ - యుద్ధము నుండి, భయాత్ - భయమువలన, ఉపరతం - తొలగినవానినిగా, మంస్యంతే - ఎంచెదరు, త్వం చ - నీవుకూడ, యేషాం-ఎవరికి, బహుమతో భూత్వా-గౌరవింపదగినవాడవై యుంటివో, లాఘవమ్- (వారిదృష్టిలోనే) తేలికతనమును, యాస్యసి - పొందుదువు.

తా : మహారథు లెల్లరు నిన్ను భయపడి యుద్ధము నుండి విరమించితివని యెంచెదరు. భీష్మాదులగు మహాయోధు లందఱు నిన్నెంతో గౌరవించి యుద్ధ విశారదుడవనియు, అద్వితీయ ధనుర్ధారి వనియు యెంచుచుండిరి. అట్టివారి దృష్టిలో నీ వల్పుడ వగుదువు. వారు నిన్ను క్షుద్రునిగా జూతురు.

అవచ్యవాదాం శ్చ బహూన్, వదిష్యంతి త వాహితాః
నిందంత స్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్. 26

తవ - నీ, అహితాః చ - శత్రువులును, తవ - నీ, సామర్థ్యం-బలమును, నిందంతః - నిందించుచు, బహూన్ అవాచ్యవాదాన్ - అనేకములగు అనగూడని మాటలను, వదిష్యంతి - అందురు. ను - ఆహా ! తతో దుఃఖతరం కిమ్ - అంతకంటె నధికదుఃఖ మేమున్నది !

తా . అర్జునా ! శత్రువులు నిన్న నరాని మాట లందురు. వారిచే నిట్లు నిందింపబడుటకంటె నెక్కుడు దుఃఖము ఏమి యుండును ?

హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీం
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ ! యుద్ధాయ కృతనిశ్చయః. 37

వా - ఒకవేళ, హతః - చంపబడుదువేని, స్వర్గం - స్వర్గమును - సుఖమునిచ్చుజన్మను, ప్రాప్స్యసి - పొందగలవు, వా - లేక, జిత్వా - జయించి మహీం - భూమిని, భోక్ష్యసే - అనుభవింపగలవు, తస్మాత్ - కావున, కౌంతేయ - అర్జున ! కుంతీపుత్ర ! యుద్ధాయ - యుద్ధముజేయ, కృతనిశ్చయః - నిశ్చయించినవాడవై, ఉత్తిష్ఠ - నిలబడుము.

తా : యుద్ధ మొనర్చి శత్రువులచే జంపబడినచో స్వర్గమును బొందుదువు-సుఖము నొసగూర్చు జన్మము లభించును, లేక నీవే శత్రువులను జయించిన పక్షమున రాజ్యసుఖముల ననుభవింతువు. ఉభయ విధములను నీకు మేలే కలుగును. కావున నో యర్జున యుద్ధముజేయ నిశ్చయించి నిలబడుము. కుంతిని వీరమాత నొనరింపుము.

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి. 38

సుఖదుఃఖే, లాభాలాభౌ, జయాజయౌ - సుఖదుఃఖములు, లాభాలాభములు, జయాపజయములు, సమే కృత్వా - సమానములుగ నెంచి, తతః - ఆపైన, యుద్ధాయ - యుద్ధముకొఱకు, యుజ్యస్వ - పూనుకొనుము, ఏవం - ఇట్లు, పాపం - పాపమును, న అవాప్స్యసి పొందవు.

తా : అర్జునా ! యుద్ధము చేసిన బాపము లభించునని భయపడకుము. కర్తవ్య నిర్వహణ సమయమున ఫలమును గూర్చి చింతింపకు- హాని లాభములను విచారింపకు. జయాపజయముల నాలోచింపకు. సుఖదుఃఖములను సమానముగ ననుభవింప సిద్ధముగుము. నీకు పాపమంటదు.

ద్వితీయాధ్యాయము సమాప్తము.

# శ్రీమద్భగవద్గీత

## తృతీయాధ్యాయము

# కర్మయోగము

సారము - సంగతి :

రెండవ యధ్యాయమునందు కృష్ణుడు అర్జుననకు గలిగిన సమస్య లలో రెండింటిని నిర్ణయించి యున్నాడు. మూడవసమస్య కర్మసన్న్యాసము. తనవర్ణ ధర్మమైన యుద్ధమును త్యజించి భిక్షాన్నమును భుజించి బ్రతుకుట బాగను ఆలోచన అర్జుననకు కలిగినది. అందువలన కర్మను వదల వలయునా? వదలకూడదా? అనునదియే యీ మూడవ సమస్య. ఈ సమస్యనే కృష్ణ డీ యధ్యాయమున పరిష్కరింప నున్నాడు. ఈ యధ్యాయ మొక సూత్రమనియు, మిగిలిన యధ్యాయములన్నియు దీనికి భాష్యము లనియు చెప్పిన నతిశయోక్తి కానేరదు.

"అర్జున ! నీవు కర్మ నెందులకు త్యజింప దలచుచున్నావు ? ఒక చిన్న భూభాగము నాశించి బంధు బాంధవులను జంపుట నిందితమనియా ? నిజముగా రాజ్యప్రాప్తి కొఱకై బంధువులను జంపుదువేని యది నిశ్చితముగ నిందిత కర్మమే యగును. ఇయ్యది సంగ్రామ మనికాదు. ఏ కర్మమైనను ఫలాపేక్షతో చేయబడునేని యది ప్రశంసనీయముకాదు. ఫలాపేక్ష, కర్మలో నొక సుందరభాగమైన కర్తవ్యబుద్ధిని నశింపజేయును. ఇంతేకాదు. కర్మలకు ఫలము లనేకములు. వాని నభిలషించుబుద్ధి యెన్నడును స్థిరపడదు. అందువలనను ఫలాకాంక్ష నిందితమగు చున్నది. కాబట్టి కర్మలో నొక భాగమగు నీ ఫలాకాంక్ష త్యజింపవలసినదే" అని కృష్ణ డర్జుననకు బోధించెను.

"ఇక కర్మలో రెండవభాగమును గూర్చి యాలోచింపుము. అన్యాయమునకు, నత్యాచారమునకు విరుద్ధముగ శాస్త్రము నుపయోగించుట క్షత్రియునకు పరమధర్మము. ప్రస్తుతము నడువనున్న సంగ్రామాత్మక కర్మకు రెండవభాగ మియ్యదియే. ఇదియే కర్తవ్యము. దీనినే అభిక్రమ మందురు. కర్తవ్యపాలన మనెడి కర్మ. కర్మమున నీ యంశమే మానవుని అధికార మనబడును. కావున, అర్జున! కర్మలోగల యీ యంశము కూడ త్యజింపవలసినదేనా? నేనుమాత్ర మది కూడదందును. ఎన్నటికిని కూడదందును. కర్తవ్యత్యాగము నేశాస్త్రము అంగీకరింపదు. కర్మలో నొక యంశమగు కర్తవ్యభాగమును మాత్రము హస్తగత మొనర్చుకొని మనుష్యుడు పాపపుణ్యములనుండి విడివడును. కర్మల నొనర్చుటలో గల చతురత యిదియే. కావున, అర్జున: ఫలకామన వదలి, ఫలము లభించినను, లభింపకున్నను సమానస్థితిలోనుండి కర్తవ్యబుద్ధితో కర్మల నాచరించుచు ముందుకు నడువుము. ఇయ్యది సాధారణ మార్గముకాదు. రాజమార్గము. సంసారమును తరింపజేసి మోక్షద్వారము వఱకు తిన్నగా బోవు మార్గమిది. ఇందు సందేహమునకు తావులేదు.

ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్ యోగే త్విమాం శృణు
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి. 1

పార్థ ! - అర్జున ! తే - నీకు, ఏషా - ఈ, బుద్ధిః - బుద్ధి, సాంఖ్యే- ఆత్మానాత్మ వివేక విషయమున, అభిహితా - చెప్పబడినది, యోగే తు - కర్మయోగ విషయమున, ఇమాం శృణు - ఈ బుద్ధిని వినుము, యయా బుద్ధ్యా - ఏ బుద్ధితో, యుక్తః - కూడినవాడవై, కర్మబంధం - పాపపుణ్య రూపకర్మలవలన గలుగు బంధనమును, ప్రహాస్యసి - విడువగలవో.

కర్మయోగమును గూర్చి తెలిసికొని దాని నాచరించిన పక్షమున నీకు కర్మలవలన బంధము కలుగదని భావము.

తా : కుంతీపుత్ర ! అర్జున ! నీ కింతవఱకు ప్రకృతి పురుషులను గూర్చి వివరించితిని. ఆత్మకు అనాత్మకు గల భేదమును తెలిపితిని. ఇదియే సాంఖ్యబుద్ధి. ఇక కర్మయోగమును గూర్చి చెప్పెద వినుము. దానిని తెలిసికొని అనుసరింతువేని కర్మబంధము నుండి విడివడ గలవు.

(జీవుడు మానవ శరీరమును బొంది నానావిధ కర్మములం బ్రవర్తించును. మనుజుడు సామాన్యముగ నేదోయొక ఫలము నపేక్షింపక కర్మ నాచరింపడు. ఫలాపేక్షతో కర్మముల నాచరించి యాఫలములు లభించినపుడు సుఖదుఃఖరూపమున వాని ననుభవించును. కర్మముల నొనర్చుటకై జీవునకు దేహ మవసరమగునట్లు వాని ఫలముల ననుభవించుటకును దేహము కావలయును. దేహము లేక జీవుడు కర్మల నాచరింపనేరడు. ఫలముల ననుభవింప నేరడుకూడ. శుభకర్మములకు ఫలము సుఖము. అశుభ కర్మములకు ఫలము దుఃఖము. కావున సుఖదుఃఖములు కర్మఫలము లనుట నెన్నటను మఱవరాదు. ఇట్టి కర్మఫలములను జీవుడు దేహమునం దుండి యనుభవింపవలయును. కాబట్టి దేహమతనికి ఇంధనమగుచున్నది. కావున జీవులు దేహముతో కర్మలు చేయుచు వాని ఫలముల ననుభవించుటకు దేహరూప బంధనమున బడుచున్నారని తెలియుచున్నది. అట్టి బంధనము దొలగుట కుపాయము కావలయును. అర్జునుడు యుద్ధమొనర్చి దానివలన రాబోవు దుఃఖరూప ఫలము ననుభవించుటకు దేహబంధనమున బడ నిచ్ఛగింపకున్నాడు. అందువలననే యుద్ధము నుండి విరమించుకొన దలచి యున్నాడు. కర్తవ్యకర్మనుండి విముఖుడు కా నున్నాడు.

అట్టియెడ కృష్ణు డర్జునుని, కర్తవ్యాభిముఖుం జేసి; దానివలన గలుగు ఫలమునుండి తప్పించు కొనుటకు దగిన యుపాయము చెప్ప

నెంచినాడు. కర్మయోగ మట్టిదని బోధించుచున్నాడు. తాను వర్ణింపబోవు కర్మ యోగమునందు అర్జునునకు బ్రవృత్తి గలిగింపగోరి కర్మయోగము నిట్లు ప్రశంసించు చున్నాడు.)

నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్. 2

ఇహ - ఈ యోగమార్గమున, అభిక్రమనాశః న అస్తి - కర్తవ్య త్యాగము లేదు. ప్రత్యవాయః న విద్యతే - పాపమునులేదు. అస్య ధర్మస్య - ఈ ధర్మముయొక్క, స్వల్పమ్ అపి - కొంచెము భాగముకూడ, మహతో భయాత్ - పెద్ద భయమునుండి, త్రాయతే - రక్షించును.

తా : కర్మయోగము ననుసరించు నెడల కర్తవ్యమును విడువ నవసర ముండదు. కావున కర్తవ్యమును నాచరింప నందున గలుగు ప్రత్యవాయము (పాపము) కూడ వాటిల్లదు. కర్మయోగమునందు ప్రవృత్తి గలవారు చేసిన స్వల్పా చరణము కూడ జీవుని గొప్పభయము (మృత్యువు) నుండి తప్పించును.

(ప్రాణికి గలుగు భయము లన్నిటికంటె మృత్యుభయము మిక్కిలి గొప్పది. దానినుండి తప్పించు కొనుటయే మానవ జీవితమునకు లక్ష్యము. అందువలననే మానవుడు సాధింపవలసిన చతుర్విధ పురుషార్థము లలో నంతిమ పురుషార్థము మోక్షము - మృత్యువు నుల్లంఘించుటగా శాస్త్రములు వివరించుచున్నవి.

ప్రాచీన మహర్షులు, ఆధునికులలో బుద్ధాది మునులు, దయానంద సరస్వతి వంటి మహర్షులు మృత్యుభయమునుండి తప్పించు కొనుటకే కదా మహదైశ్వర్యములను, ఇతర సుఖములను విడిచి యరణ్యాదులందు ఘోరతపము చేసి యున్నారు !)

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్. 3

కురునందన ! - అర్జున ! ఇహ - కర్మయోగమున, వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకా - నిశ్చయరూపమగు నొకే బుద్ధివృత్తి యుండును. అవ్యవసాయినాం-(అనేక ఫలముల నపేక్షించుచు) అనిశ్చితమతి గలవారికి, బుద్ధయః- బుద్ధివృత్తులు, బహుశాఖాః - అనేక శాఖలుగలవై, అనంతాశ్చ - అనేకములై యుండును.

తా : కురునందన ! ఈ కర్మయోగమునందు నిశ్చయాత్మకమగు బుద్ధి యొకటి యుండును. నిశ్చిత మనస్కుడు కాని వానికి నానావిధబుద్ధులుకలుగును. వాడు దేనిని సాధింపజాలడు.

యా మిమాం పుష్పితాం వాచం ప్రదవం త్యవిపశ్చితః
వేదవాదరతాః పార్థ ! నాన్య దస్తీతి వాదినః. 4
కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్
క్రియావిశేష బహులాం భోగైశ్వర్యగతిం ప్రతి. 5

పార్థ - అర్జున ! -, కామాత్మానః - కామనలలో తన్మయులై, స్వర్గపరాః - స్వర్గమును ధ్యేయముగా నెంచుచు, వేదవాదరతాః - కర్మకాండరూప వేదవాక్యములందు లగ్నులై యుండువారు (వేదసారము నెఱుగనివారు కావున) అన్యత్ న అస్తి ఇతి వాదినః - సకామకర్మను మించి మఱియొండు లేదని చెప్పుచు, అవిపశ్చితః - అవిద్వాంసులు, జన్మకర్మఫలప్రదాం - జన్మమును, కర్మఫలమును నొసంగు, క్రియావిశేషబహులాం - భిన్న భిన్న క్రియలను విస్తరింపజేయు, భోగైశ్వర్యగతిం ప్రతి - భోగమును, ఐశ్వర్యమును నొసంగు, ఇమాం పుష్పితాం వాచం - ఈ మనోహర సకామకర్మరూపవాణిని, ప్రవదంతి - చెప్పుదురు.

తా : కొందఱు వేదవాదులు వేదమునందు విధింపబడిన సకామకర్మలే ముఖ్యములని యెంచి వానిని విశేష సుఖాభిలాషతో నాచరింతురు. వారి కా యా కర్మఫలముల ననుభవించుటకు వలయు దేహములు లభించును. అట సుఖముల ననుభవింతురు. అవియే యుత్తమములని యెంచి వానిని సంపాదింప నిరంతరము యత్నింతురు.

భోగైశ్వర్య ప్రసక్తానాం తయాపహృతచేతసామ్
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే. 6

తయా - ఆ సకామకర్మవిధిచే, అపహృతచేతసాం - హరింపబడిన చిత్తముగలవారై, భోగైశ్వర్య ప్రసక్తానాం - భోగమునందు, ఐశ్వర్యమునందు లగ్నులగువారికి, వ్యవసాయాత్మికా బుద్ధిః - నిశ్చయరూప బుద్ధివృత్తి, సమాధౌ - ఏకాగ్రతలో, న విధీయతే - ఉపయోగికాదు.

తా : అర్జున ! వారి మనస్సుల నాసుఖము లాకర్షించుచుండును. అట్టి భోగాసక్తులు నిశ్చితమతులు కాజాలరు. సమాహితులు – ఏకాగ్రవృత్తి కలవారు కానేరరని భావము.

కర్మణ్యే వాధికార స్తే మా ఫలేషు కదాచన
మా కర్మఫలహేతుర్ భూర్ మా తే సంగోఽ స్త్వకర్మణి. 7

కావున నో యర్జున ! బుద్ధిని నిశ్చల మొనర్చుటకు ఫలాపేక్షను త్యజింపుము. ఇంతేకాక, ఫలము నీ యధికారమునకు చెందినది కాదు. కావునను నది త్యజింపదగినదే.

తే - నీకు, కర్మణి ఏవ అధికారః - కర్మచేయుటకే యధికారమున్నది. ఫలేషు కదాచన మా - ఫలములతో నెన్నడు లేదు. కర్మ

ఫలహేతుః మా భూః - కర్మఫలమునకు కారణమైన వాడవు కాకుము. అకర్మణి తే సంగః మా అస్తు - కర్మత్యాగమున నీకు ఆసక్తి కలుగ కుండును గాక !

తా : అర్జున ! నీవు కర్మలాచరించుటకే తగినవాడవు. కాని, ఫలము నపేక్షించి చేయకుము. మనుజుడు కర్మ చేయుటకే యధికారి - అర్హుడు. ఫలముపై నతనికి అధికారముండదు. కావున ఫలాపేక్షతో కర్మ నాచరించుట తగదు. ఫలము నపేక్షింపని నాడు కర్మమాత్రమేల చేయవలయు ననకుము.

యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. 8

ధనంజయ ! - అర్జున ! సంగం త్యక్త్వా - ఫలాసక్తిని విడిచి, సిద్ధ్యసిద్ధ్యోః సమః భూత్వా - ఫలప్రాప్తిలోను, అప్రాప్తిలోను సమానముగ నుండి, యోగస్థః - సమభావనా యోగమునందు స్థిరుడవై, కర్మాణి కురు - కర్మలాచరింపుము, సమత్వం యోగః ఉచ్యతే - ఈ సమతయే యోగ మనబడును.

తా : ధనంజయ ! యోగమార్గమున కర్మల నాచరింపుము. ఫలము నభిలషింపకుము - నీవు చేయబోవు కర్మమునకు ముందుగానే యింతఫలము లేక యీ ఫలము రావలయు నని యుద్దేశింపకుము. ప్రారంభించిన కర్మ సిద్ధించినను, సిద్ధింపకున్నను హర్ష శోకములనెడి వికారములకు తావియకుము.

(మనుజుడు తాజేయుపని నెఱవేఱినపుడు సంతోషించును. నెఱవేఱని నాడు దుఃఖించును. ఈ హర్షశోకములే మానసిక వికారము లనబడును.

ఇట్టివి కలుగక యుండు స్థితి సమత్వము - యోగము అగును. ఇదియే కర్మమార్గము. అందులకై యత్నింపవలయును.)

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ ।
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః. 9

ధనంజయ ! కర్మ - ఫలాపేక్షతో గూడిన కర్మ, బుద్ధియోగాత్ - సమతాబుద్ధి యనెడి యోగముకంటె, దూరేణ అవరమ్ - మిక్కిలిచిన్నది. హి - ఆకారణమున, బుద్ధౌ - సమతాబుద్ధియందు, శరణం అన్విచ్ఛ - ఆశ్రయము నన్వేషింపుము, ఫలహేతవః-ఫలమును నిమిత్తముగా నంగీకరించువారు, కృపణాః - దయాపాత్రులు, చిన్నశ్రేణికి చెందినవారు.

తా : ఫలాపేక్షతో జేయు కర్మ శ్రేష్ఠముకాదు. సమత్వబుద్ధితో - యోగముతో చేయుకర్మ మిక్కిలి శ్రేష్ఠము. కావున యోగబుద్ధి నాశ్రయించి కర్తవ్యము నాచరింపుము. ఫలముల నభిలషించి నిరతము కార్యము లొనర్చువారు నికృష్టులు; కృపణులు. వారి కెన్నడు నాత్మజ్ఞానము కలుగదు.

"య ఏన మవిదిత్వా ప్రైతి స కృపణః"

ఎవడు మానవుడై జన్మించి తన్నుదా దెలియకయే మరణించునో వాడే కృపణుడు - అని తద్జ్ఞులు చెప్పుదురు.)

బుద్ధియుక్తో జహా తీహ ఉభే సుకృతదుష్కృతే
తస్మాద్ యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్. 10

ఇహ - ఇక్కడ. బుద్ధియుక్తః - సామ్యబుద్ధి జ్ఞాన కర్మలలో సమానతాభావయుక్తుడు, సుకృతదుష్కృతే ఉభే - పుణ్య పాపములు రెండు, జహాతి - విడిచిపెట్టును, రెంటినుండి విడివడును, తస్మాత్ - కావున, యోగాయ - యోగముకొఱకు, యుజ్యస్వ - పూనుకొనుము,

కర్మసు - కర్మలలో, కౌశలమ్ - నేర్పరితనము, యోగః - యోగము ఫలాకాంక్షలేక కర్మాచరణము యోగమనబడును.

తా : మానవ జన్మమున యోగమునందు బుద్ధినుంచి కర్మల నాచరించువాడు సుకృత దుష్కృతములను రెండింటిని విడుచును. అతడు యోగి - ఫలాపేక్షను విడిచినవాడు. కావున నతడు దుష్కర్మల నాచరింపడు. సుకర్మల నాచరించియు ఫలము నపేక్షింపడు. అందువలన నతడు సుకృత దుష్కృతములను రెండిటిని విడిచినవాడే యగును. అట్టి వానికి దేహబంధన మెట్లు కలుగును ? అర్జున నీవును యోగివి కమ్ము. కర్మల నొనర్చి వానివలన దేహమనెడి బంధనమున బడకుండుటయే కర్మకుశలత యనబడును. అదియే యోగము.

కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయమ్. 11

బుద్ధియుక్తాః మనీషిణః - సామ్యబుద్ధిగల బుద్ధిమంతులు, కర్మజం ఫలం త్యక్త్వా - కర్మవలనకలుగు ఫలమును విడిచి, జన్మబంధవినిర్ముక్తాః - జన్మమనెడి బంధనమునుండి విడివడి, అనామయం పదం గచ్ఛంతి _ రోగరహితస్థానము - మోక్షము పొందుదురు.

తా : కర్మలు సిద్ధించినను సిద్ధింపకున్నను హర్ష శోకముల బొందక సామ్యమున నుండు బుద్ధిమంతులే కర్మలవలన గలుగు ఫలములను విడిచి జన్మబంధనమునుండి ముక్తు లగుదురు. అట్టి వారే దుఃఖరహితమగు నుత్తమ స్థితిని బొందుదురు. ఇదియే మోక్షము.

యదా తే మోహకలిలం బుద్ధిర్ వ్యతితరిష్యతి
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ. 12

యదా - ఎన్నడు, తే బుద్ధిః - నీబుద్ధి, మోహకలిలం - మోహ పంకిలము (బురద) ను, వ్యతితరిష్యతి - దాటునో, తదా - అనాడు, శ్రోతవ్యస్య శ్రుతస్య చ - వినదగినట్టియు, వినినట్టియు సకామకర్మనుండి, నిర్వేదం - వైరాగ్యమును, గంతాసి - పొందగలవు.

తా : 'దేహమే యాత్మ' యను మోహరూప పంకిలము (బురద) నుండి నీ బుద్ధి యెన్నడు బైటపడునో - యీభ్రాంతిని న్నెపుడు విడుచునో - అప్పుడే నీకు కర్మఫలాపేక్షయు గలుగదు. కర్మఫలమునందు వితృష్ణ - వైరాగ్యము కల్గును.

శ్రుతి విప్రతి పన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా
సమాధా వచలా బుద్ధిస్తదా యోగ మవాప్స్యసి. 13

శ్రుతి విప్రతిపన్నా - నానావిధ శ్రుతులవలన విచలితమైన, తే బుద్ధిః - నీబుద్ధి, యదా - ఎప్పుడు, సమాధౌ - నిరోధమునందు, అచలా - స్థిరమై, స్థాస్యతి - నిలబడునో, తదా - అప్పుడు, యోగం అవాప్స్యసి - యోగమును బొందుదువు.

తా : అర్జున ! నానావిధములుగ సిద్ధాంతములను వినినందున నీ బుద్ధిలో స్థిరతలేదు. అది యెప్పుడు స్థిరమగునో యప్పుడే నీవు యోగివగుదువు.

తృతీయాధ్యాయము సమాప్తము



# శ్రీమద్భగవద్గీత

## చతుర్థాధ్యాయము

# స్థితప్రజ్ఞుని లక్షణము

సారము - సంగతి :

తృతీయాధ్యాయమున కృష్ణభగవానుడు స్థిరబుద్ధిని గూర్చి ప్రశంసించి యున్నాడు. అది కర్మయోగమునకు సహాయకమనియు నుడివి యున్నాడు. దాని విశేషములను దెలిసికొనవలయునని యర్జునునకు కోరిక యుదయించెను. "భగవన్ ! స్థితప్రజ్ఞుడైన మనుజుడెట్లు పలుకును? అతడెట్లుండును ? అతని నడత యెట్లుండును ?" అని అర్జునుడు కృష్ణుని ప్రశ్నించెను.

'కామనల నన్నింటిని విడిచి, సుఖదుఃఖములలో నేకరసుడై స్థితప్రజ్ఞుడుండును. రాగము, భయము, క్రోధము నతనికి నుండవు. శుభాశుభములలో లిప్తుడుకాడు. ఇంద్రియములను దమనముచేయును. రాగద్వేషము లతనికుండవు. స్థితప్రజ్ఞునం దీవిశేషలక్షణము లుండును.'' అని కృష్ణుడుపదేశించి యటుపైనా స్థితిని బొందుటకు వలయు సాధనములను ఉపదేశించి యున్నాడు. ఈ సాధనములు రెండువిధములుగ విభజింపనగును. ఒకటి విషయములను బొత్తిగా త్యజించుట. రెండవది రాగద్వేషములులేని యింద్రియములతో విషయములను సేవించుట.

ఇందు మొదటిసాధనము మిక్కిలి కఠినము. ఒకవేళ నొకడెట్లేని దాని ననుష్ఠించినను అంతఃకరణ ధర్మమైన రాగము చివరకు మిగిలియే యుండును. విషయత్యాగ మొనరించినను రాగ నివృత్తి కొఱకు చేసిన దేమియు లేదుగదా ? భగవద్దర్శనానంతరమే కాని రాగము నివృత్తము కాదు. రాగముండగా భగవత్ సాక్షాత్కారము కలుగనేరదు. కావున భగ

వంతుని దర్శనముకొఱకై విషయములను త్యజించినను విషయముల యెడ గల ప్రీతిని నశింపజేయుటకై యత్నింపవలసియే యుండును.

కాని, రెండవవిధమైన సాధనము సులభము. దానిక్రమముకూడ సరియైనదే. అందువలననే కృష్ణుడు దానినంతమున జెప్పియున్నాడు. రాగ ద్వేషములను విడిచి విషయములను సేవించుటవలన వానియందు ఉపేక్ష కలుగనారంభించును. రాగద్వేషములతోబాటు విషయాసక్తియు తొలగును. ఈ సాధనవలన చిత్తము నిర్మలమగును. దుఃఖములు నశించును. బుద్ధి స్థిర మగును. రాగద్వేషములు విడిచి విషయములను సేవించినంత మాత్రము ననే బుద్ధి స్థిరము కానేరదు. అందులకు యోగము, ఆ యోగమునకు చిత్త శాంతి, అట్టి శాంతికి కామనల త్యాగము నావశ్యక మగుచున్నది. అనంతర మున ప్రాప్తించు స్థితికే స్థిరబుద్ధి - బ్రాహ్మీస్థితి యని నామము. ఇట్టి స్థితినిబొందిన మనుజుడే స్థితప్రజ్ఞుడనబడును. ఈ యధ్యాయమునందే రాగ ద్వేషములతో విషయ సేవనము కూడ వర్ణింపబడినది. ఈ యవస్థ మనుజుని సర్వనాశనమునకు కారణమనియు నుడువబడినది.

స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ ।
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్. 1

కేశవ ! - కృష్ణ ! సమాధిస్థస్య - చిత్తైకాగ్రత నొసరించు, స్థిత ప్రజ్ఞస్య - స్థిరబుద్ధిగల మనుజునకు, కా భాషా? -లక్షణమేమి ? స్థితధీః - స్థిరబుద్ధిగలవాడు, కింప్రభాషేత ? - ఏమి మాటలాడును ? కిమాసీత ? - ఎట్లు కూర్చుండును ? కిమ్వ్రజేత ? - ఎట్లు నడచును ?

తా : కేశవ ! చిత్తైకాగ్రతను సంపాదించిన ప్రాజ్ఞుని లక్షణమేమి ? అతడెట్లు మాటలాడును ? అతడెట్లుండును ? అతని నడత యెట్లుండును ? అని అర్జునుడు ప్రశ్నించెను.

(కర్మయోగి స్థితిగతు లెట్లుండునో తెలిసికొనగోరి యర్జును డట్లు ప్రశ్నించిన మీదట కృష్ణుడు స్థితప్రజ్ఞుని గూర్చి యిట్లు చెప్పుచున్నాడు.)

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్
ఆత్మన్యే వాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే. 2

పార్థ : ఆత్మనా ఆత్మనిఏవ తుష్టః - తనలోనే తనకుతాను తుష్టుడై, యదా మనోగతాన్ - ఎప్పుడు మనస్సులో నున్న, సర్వాన్ కామాన్ - సమస్త సంకల్పములను, ప్రజహాతి - విడచునో, తదా - అప్పుడు స్థితప్రజ్ఞః - స్థిరబుద్ధిగలవాడని, ఉచ్యతే - చెప్పబడును. అని కృష్ణు డర్జునునకు సమాధానము చెప్పెను.

తా : అర్జున ! మనుజుడు తన మనస్సునం దేర్పడు కోరికల నన్నింటిని విడనాడిన నాడు స్థితప్రజ్ఞు డనబడును. అప్పు డతడు తనయందే తాను తుష్టుడగును.

(మానవుని మనస్సు ఆత్మచే ప్రేరితమై నేత్రాది ఇంద్రియముల మూలమున బయటికి ప్రవహించి వస్తువులందు జేరి, యావస్తువుల యాకృతులను ధరించు చుండును. అప్పుడే యావస్తువుల జ్ఞానము మానవునకు గలుగును. నదులలోని నీరు పంటకాలువల ద్వారమున క్షేత్రమునందు జేరి కేదారముల యాకృతులను ధరించునట్లు మనస్సు ఇంద్రియ ప్రణాళికల మూలమున వస్తువులం జేరి వాని యాకృతులం బొందును. ఈ మానసిక ఆకృతులే చిత్తవృత్తు లనబడును. ఇయ్యది యోగుల పరిభాష. మానవుడు జాగ్రదవస్థలో నున్నంతకాలము చిత్తవృత్తులు నిరంతర మేర్పడు చుండును. స్వప్నావస్థయందును మనస్సున నిట్టి వృత్తులు కలుగుచునే యుండును. కాని, యవి బాహ్యములుకావు. ఈ వృత్తులే మానవులకు గలుగు జ్ఞానముల కాధారము. ఇవియే జ్ఞానాకారము లనినను దోషములేదు.

ఇట్టి వృత్తులు మనస్సున గలుగ కుండునట్లు చేయుటయే యోగము. సమాధి యనబడును. అందువలననే పతంజలి మహర్షి తన యోగ దర్శనము నందు '(సూ : యోగ శ్చిత్తవృత్తి నిరోధః) యోగము చిత్త వృత్తుల నిరోధ' మని సూత్రించి యున్నాడు. చిత్తవృత్తు లేర్పడు చున్నంతకాలము జీవుడు బాహ్యప్రపంచము నెఱుగుచుండును. ప్రాకృతిక పదార్థముల నెఱుగుచు నవి తన కనుకూలములై సుఖకరములైన, వానిని సంపాదించుకోలేక తన కనుకూలములుకాక దుఃఖకరములని తోచినపుడు వానినుండి దూరముగా నుండుటకు ప్రయత్నించుచుండును. ఆ సమయ మున నతడు - జీవుడు ప్రపంచమున నుండును. చిత్తవృత్తులను నిరోధించి మనస్సును బాహ్యవస్తువులం జేరనీక దాని నరికట్టిన నాడు జీవుడు తనలోనే తా నుండును. ఇదియే కైవల్యస్థితి. ఈ యభిప్రాయమునే కృష్ణుడు అర్జునునకు పైశ్లోకము మూలమున తనలోనే తాను తుష్టుడగు నని (ఆత్మన్యే వాత్మనా తుష్టః) తెలిపినాడు. స్థితప్రజ్ఞుడు చిత్తము నరికట్టి బాహ్య పదార్థములవంక బోక తనలోనే తాను స్థిరుడై ఆత్మాను భూతిని బొందును. ఈ స్థితినే యోగదర్శన కర్త పతంజలి మహర్షి - (సూ : తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్) చిత్తవృత్తులు నిరోధించినపుడు జీవుడు (ద్రష్టుః స్వరూపే) ద్రష్టయైన తన స్వరూపమునందో, లేక లోక ద్రష్టయయిన పరమేశ్వరుని స్వరూపమునందో యుండునని సూత్రించినాడు.)

దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః
వీతరాగ భయక్రోధః స్థితధీర్ ముని రుచ్యతే. 3

దుఃఖేషు అనుద్విగ్నమనాః - దుఃఖములందు చలింపని స్థిరబుద్ధి కలవాడు, సుఖేషు - సుఖములందు, విగతస్పృహః - ఆసక్తిలేనివాడు, వీతరాగభయక్రోధః - రాగము, భయము, క్రోధము వీడినవాడు, మునిః - మననశీలుడును నగు మనుజుడు, స్థితధీః ఉచ్యతే - స్థితప్రజ్ఞుడనబడును.

తా : స్థితప్రజ్ఞుడు తనకు దుఃఖములు - కష్టములు కలిగి నపుడు వికలుడు కాడు; ఆవురుమని యేడ్వడు. సుఖములు కావలయునని ఆశలు పెట్టుకొనడు. రాగము, భయము, క్రోధము నతనికి ఉండవు అట్టివాడు ముని యనబడును.

యః సర్వత్రానభిస్నేహ స్తత్తత్ ప్రాప్య శుభాశుభమ్
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 4

యః - ఎవడు, సర్వత్ర - అంతటను, అనభిస్నేహః - స్నేహ రహితుడై, తత్తత్‌శుభాశుభం - ఆయాశుభాశుభములను, ప్రాప్య-పొంది, న అభినందతి, నద్వేష్టి - ప్రసన్నుడు కాడో, అప్రసన్నుడును గాడో, తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా - అతనిబుద్ధి స్థిరమైనది.

తా : మానవునకు శుభాశుభములు గలుగుచుండును. తెలిసియో తెలియకయో మనుజుడొనర్చు పనులకు ఫలము సుఖదుఃఖ రూపమున నతనికి చేకూరు చుండును. శుభము - సుఖము గలిగినపుడు అతడు పొంగిపోవును; దాని నభినం దించును. అశుభము - దుఃఖము కలిగినపుడు దానిని ద్వేషిం చును, కాని స్థిరబుద్ధిగల కర్మయోగి దేనియందును అనురా గము లేనివాడై శుభాశుభములు కలిగినపుడు నిర్వికారుడై వాని ననుభవించును. శుభమును ప్రశంసింపడు. అశుభమును నిందింపడు. రెండును అతనికి సమాన భోగ్యములే.

యదా సంహరతే చాయం కూర్మోంగానీవ సర్వశః
ఇంద్రియా ణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 5

యదా - ఎప్పుడు, అయం - ఇతడు, సర్వశః - అన్నివిధముల, కూర్మః అంగాని ఇవ - తాబేలు తన యవయవములనువలె, ఇంద్రి

యార్థేభ్యః - విషయములనుండి, ఇంద్రియాణి - ఇంద్రియములను, సంహరతే - మరల్చుకొనునో, అప్పుడు, తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా - అతని బుద్ధి స్థిరమయిన దని యెంచవలయును.

తా : కూర్మము - తాబేలు తన కపాయముగలుగు సూచన లేర్పడినపుడు వెంటనే తన సున్నితములగు నవయవములను బయటికి గనబడ కుండునట్లు తనలో నిముడ్చుకొనును. వాని కేమాత్రము దెబ్బ తగిలినను తనకు ప్రాణహాని కలుగునని యది యెఱుగును. అట్లే కర్మయోగి - స్థితప్రజ్ఞుడు ఇంద్రియములను విషయములనుండి దూరముగా నుంచుకొనును.

(మనుజుని నేత్రా దీంద్రియములు తమచే గ్రహింపబడు - తెలియబడు రూపాది విషయములచే నాకర్షింపబడును. రూపరసాదులు గల వస్తువులు విషయము లనబడును. అవియే యింద్రియార్థములు. ఇంద్రియములు, విషయములు రెండును ప్రాకృతిక పదార్థములే. అందువలన నింద్రియములు విషయములచే నాకర్షింపబడుట సహజము. కావున స్థితప్రజ్ఞుడు ఇంద్రియములను విషయముల వెంట బరువిడనీయక స్వాధీనము చేసికొని తనకు హాని కలుగకుండునట్లు వాని ననుభవించునని భావము.)

విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే. 6

నిరాహారస్య - ఆహారమును విడిచిన, దేహినః - జీవునకు, విషయాః - రూపరసాది విషయములు, రసవర్జం - విషయేచ్ఛ - రాగము తక్క, వినివర్తంతే - మరలి పోవును, అస్య రసః అపి - ఇతని యీ రాగము కూడ, పరం దృష్ట్వా - పరమేశ్వరుని సాక్షాత్కారమైన పిమ్మట, నివర్తతే - తొలగిపోవును.

చిత్తు డగును. అప్పుడే యతని చిత్తమునందు విక్షేపాది దోష ములు పోయి ప్రసాదగుణ మేర్పడును.

ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే. 10

ప్రసాదే - చిత్తము నిర్మలమైనమీదట. అస్య సర్వదుఃఖానాం హానిః ఉపజాయతే - ఇతని సమస్తదుఃఖములకు నాశముకలుగును, హి - కారణ మేమన, ప్రసన్నచేతసః - నిర్మలచిత్తుని, బుద్ధిః - బుద్ధి, ఆశు - వెంటనే, పర్యవతిష్ఠతే - స్థిరపడును.

తా : కర్మయోగి చిత్తప్రసాదమును బొంది దుఃఖము లకు దూరమగును. అతని కెట్టి దుఃఖము కలుగదు. వెంటనే యతని బుద్ధి స్థిరమగును.

నాస్తి బుద్ధి రయుక్తస్య న చాయుక్తస్య భావనా
న చాభావయతః శాంతి, రశాంతస్య కుతః సుఖమ్. 11

అయుక్తస్య - యోగయుక్తుడు కానివానికి, బుద్ధిః - స్థిరబుద్ధి, నాస్తి- ఉండదు. చ - మఱియు, అయుక్తస్య - యోగయుక్తుడు కానివానికి, భావనా - సామ్యభావనయు, న - ఉండదు. అభావయతః శాంతిః చ న-సమ భావన లేనివానికి శాంతియు నుండదు. (ఇక) అశాంతస్య-శాంతి లేనివానికి, సుఖం కుతః - సుఖమెట్లు కలుగును? కలుగదని భావము.

తా : కర్మయోగమునందు ప్రవర్తించని వానికి స్థిరబుద్ధి యేర్పడదు. అయుక్తునకు - యోగి కానివానికి భావనయు నుండదు. భావనా రహితునకు శాంతి కలుగదు. శాంతిలేని వానికి సుఖము శూన్యము.

(చిత్తమునందు రాగద్వేషాది మాలిన్యము లున్నంత వఱకు స్థిర బుద్ధి యేర్పడదు. అందులకు చిత్తప్రసాద మవసరము. చిత్తము నందలి మాలిన్యములను దొలగించి యందు ప్రసాదగుణమును జేకూర్చుటకు పరమర్షి పతంజలి యోగదర్శనమందు భావన సాధనముగ నిట్లు నిర్దేశించి యున్నాడు.

సూ : మైత్రీకరుణా ముదితోపేక్షాణాం
సుఖదుఃఖ పుణ్యాపుణ్య విషయాణాం
భావనాత శ్చిత్తప్రసాదనమ్. యో. సా. ౬౩

చిత్తమునందు ఈర్ష్య, పరాపకారబుద్ధి, అసూయ, అసహనత - అమర్షము అను నాలుగు విధములైన మాలిన్యము లుండును. ఈ మాలిన్యములను దొలగించిన పక్షమున చిత్తమున ప్రసాదగుణము కలుగును.

సంపన్నులై సుఖముగా కాలము నయించు వారిని జూచి వారియెడ మిత్రభావముతో నున్నయెడల ఈర్ష్య యనెడి మాలిన్యము దొలగును. సుఖముగా నుండు మిత్రుని జూచి యీర్ష్యపడువా రుండరు. మిత్రుని సుఖము తనచిత్త ప్రసాదమునకు కారణమగునని భావము.

ఇట్లే దుఃఖముల ననుభవించువారిం జూచి 'అయ్యో వీరు బాధలు పడుచున్నారే ! వీరి యీబాధ లెట్లు తొలగును' అని కరుణగలవారై వారికి తోడ్పడు వారి చిత్తమునందు పరాపకారబుద్ధి-పరుల కపకారముచేయవలయు ననెడి మాలిన్యము కలుగనేరదు. అది తొలగునని భావము.

మఱియు పుణ్యమొనర్చి సుఖముగా కాల మపనయించువారిం జూచి ముదము - సంతోషము చెందువారి మనస్సున నుండు అసూయ-యనెడి కాలుష్యము దొలగి పోవును.

ఇక పాపులను జూచినపుడు అమర్షము - అసహనము కలుగుట లోకసామాన్యము. అసహనము చిత్తమాలిన్యము. కావున పాపులను

జూచి వారియెడల నుపేక్షాభావన కలిగియున్న పక్షమున నసహనము కలుగదు.

ఇట్లు మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష యను నాలుగు విధములైన భావనల వలని చిత్తమునందలి ఈర్ష్య, పరాపకారిబుద్ధి, అసూయ, అసహనము అనెడి మాలిన్యములు క్రమముగా తొలగి చిత్తము ప్రసన్నమగును. ప్రసన్నచిత్తునకు నిశ్చితబుద్ధి కలుగును. అట్టివారు ఆత్మ సాక్షాత్కారమును బొంది సుఖింతురని పతంజలి వర్ణించి యున్నాడు.)

ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్
తద్వత్ కామా యం ప్రవిశంతి సర్వే
స శాంతి మాప్నోతి న కామకామీ. 12

ఆపూర్యమాణం - పూర్ణమై, అచలప్రతిష్ఠం - నిశ్చలస్థితిగల, సముద్రం - సముద్రమున, ఆపః యద్వత్ ప్రవిశంతి - జలమెట్లు ప్రవేశించునో, తద్వత్ - అట్లే, యం - ఎవనిలో, సర్వేకామాః ప్రవిశంతి - సర్వకామములు ప్రవేశించునో - కోరికలన్నియు నశించునో, సః - వాడు, శాంతిం ఆప్నోతి - శాంతిని బొందును, కామకామీ న - కోరికలుగలవాడు (శాంతిని) బొందడు.

తా : నదులన్నియు సముద్రమున జేరి నిజస్థితిని గోలుపోవునట్లు కోరిక లుదయింపక చిత్తము వృత్తి రహితమైన నాడు కర్మయోగి శాంతిని బొందును.

విహాయ కామాన్ యః సర్వాన్ పుమాం శ్చరతి నిఃస్పృహః
నిర్మమో నిరహంకారః స శాంతి మధిగచ్ఛతి. 13

యః పుమాన్ - ఏ పురుషుడు, సర్వాన్ కామాన్ - కోరికలన్నింటిని, విహాయ - విడిచి, నిఃస్పృహః - కోరికలు లేనివాడై,

నిర్మమః - మమత్వము లేనివాడై, నిరహంకారః - అహంకారమును విడచి, చరతి - లోకమున వర్తించునో, సః - వాడు, శాంతిం - శాంతిని, అధిగచ్ఛతి - పొందును.

తా : సంకల్పములను త్యజించి ఆశారహితుడై శరీరము మొదలు ప్రాపంచిక పదార్థములందు 'ఇయ్యవి నావే' యను మమత్వము లేక అహంకార రహితుడైన మానవుడు శాంతిని బొందును.

ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి
స్థిత్వాఽస్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి. 14

పార్థ : ఏషా బ్రాహ్మీ స్థితిః - ఇది బ్రహ్మనిష్ఠ - జ్ఞానయోగమున కంతిమావస్థ, ఏనాం ప్రాప్య న విముహ్యతి - ఈ స్థితిని బొందినవాడు మోహితుడు కాడు, అంతకాలే అపి - మరణ సమయమునందును, అస్యాం స్థిత్వా - ఈ స్థితియందే యుండి, బ్రహ్మనిర్వాణం - బ్రహ్మ ప్రాప్తిని, ఋచ్ఛతి - పొందును

తా : అని యిట్లు కృష్ణు డర్జునునకు బోధించి 'ఇదియే బ్రాహ్మీస్థితి. దీనిని బొందిన కర్మయోగి మోహమున బడడు. అతనికి విపరీతజ్ఞానము కలుగదు. వస్తు యాథార్థ్యము బోధ పడును. శరీరత్యాగము వఱకు నిట్టి స్థితిని విడువక యుండు వాడు మోక్షము పొందును.

(స్థితప్రజ్ఞుడయిన కర్మయోగియే దీని కర్హుడు. కావున నందులకై యత్నింపవలయును. ఈ ప్రకరణమున నేలక్షణములు స్థితప్రజ్ఞునకు జెప్ప బడినవో యా లక్షణముల నలవఱచుకొను సాధకుడు నొకనాడు స్థిత ప్రజ్ఞుడు - సిద్ధు డగును. యోగియై ముక్తిని బొందునని భావము.)

చతుర్థాధ్యాయము సమాప్తము

# శ్రీమద్భగవద్గీత

## పంచమాధ్యాయము

# కర్మసన్న్యాసావశ్యకత

సారము - సంగతి :

మూడవ యధ్యాయమున తొమ్మిదవ శ్లోకమునందు కృష్ణు డర్జును నకు సామ్యబుద్ధి సకామ కర్మకంటె శ్రేష్ఠమని నుడివియుండెను. కృష్ణుని యీ వచనమునందు అర్జునున కొకింత యాలోచింప నాశ్రయము లభించిన ట్లయ్యెను. కావున నతడు 'భగవన్! నీవు కర్మకంటె బుద్ధిని శ్రేష్ఠమని యెంచెదవేని నన్నీ సంగ్రామరూప ఘోరకర్మను విడిచి బుద్ధినేల యాశ్ర యింప నీయవు?' అని కృష్ణుని ప్రశ్నించెను. 'అట్లు కాదేని నిశ్చయించి యొకే విషయమును చెప్పుదువుగాక!' యనియు ప్రార్థించెను.

భగవాను డీప్రశ్న కిట్లు సమాధానము చెప్పనారంభించెను. 'అర్జున! సాంఖ్యుల జ్ఞానయోగము. యోగుల కర్మయోగమును నింతకుపూర్వమే నుడివియుంటిని.' (జ్ఞాననిష్ఠ, కర్మనిష్ఠ యను నీరెంటి యాధారమున కర్మ చేయవలసినదే కాని యది త్యజింపరాదని యింతకుపూర్వమే నుడివి యున్నట్లు కృష్ణుని సమాధానమున కభిప్రాయము.) 'సామ్యబుద్ధి నాశ్ర యించిన జ్ఞానికి కర్మచేయక తప్పదు. కర్మచేయక మనుజుడొక క్షణమును నుండజాలడు. అతని మనోభావములు బలవంతముగా నతనిచే కర్మలను జేయించుచునే యుండును. ఎవడేని బాహ్యేంద్రియ కర్మలను కట్టిపెట్టి నను మనస్సుతో నతడాకర్మల నాలోచించుచునే యుండును. ఇట్లు నటించుట మిథ్యాచారమగును. కర్మలు చేయక శరీరనిర్వాహము కూడ కాదు. కావున శరీరముండగా కర్మలత్యాగ మసంభవము. అందువలననే మన స్సుతో జ్ఞానేంద్రియములను నిగ్రహించుచు, ఆసక్తిని విడిచి కర్మేంద్రియ ములతో ఆశ్రమానుకూలములగు కర్మల నాచరించుచు నడుపుము.'

జ్యాయసీ చేత్ కర్మణ స్తే మతా బుద్ధిర్ జనార్దన :
తత్ కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ : 1

అర్జునుని ప్రశ్న :

జనార్దన ! - ఓ కృష్ణ, తే - నీకు, కర్మణః - కర్మకంటె, బుద్ధిః- బుద్ధి, జ్యాయసీ మతా చేత్ - శ్రేష్ఠమని అభిప్రాయ మగునెడల, కేశవ! - కృష్ణ, ఘోరే కర్మణి - ఘోరకర్మమయిన సంగ్రామమునందు, మాం తత్ కిమ్ నియోజయసి - నన్ను ఎందుకు నియోగించుచున్నావు ?

తా : అర్జునుడు స్థితప్రజ్ఞుని లక్షణములు వినిన యనంతరము కృష్ణుని ప్రశ్నించుచున్నాడు.

కేశవ ! కర్మకంటె జ్ఞానము శ్రేష్ఠమని నీ వంగీకరించు పక్షమున నన్నీ భయంకర యుద్ధకర్మ నొనర్చు మని యేల నియోగించు చున్నావు ?

వ్యామిశ్రే ణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయాం. 2

వ్యామిశ్రేణ వాక్యేన ఇవ - మిశ్రిత వాక్యముతో చెప్పుచున్నట్టు, మే - నా, బుద్ధిం - బుద్ధిని, మోహయసి ఇవ - భ్రాంతి పెట్టుచున్నట్లున్నావు, యేన అహం శ్రేయః ఆప్నుయామ్ - దేనివలన నేను శ్రేయస్సును పొందుదునో, తత్ ఏకం నిశ్చిత్య వద - ఆ ఒకటి నిశ్చయించి చెప్పుము.

తా : కలగలుపు మాటలతో కృష్ణ ! నన్ను భ్రమింపజేయుచున్నట్లున్నావు. నేను నీ మాటలను విని యేమిచేయుట యుక్తమో స్వయముగా నిశ్చయింపజాలకున్నాను. నే నేమి చేయవలయునో దేనివలన నాకు శ్రేయస్సు కలుగునో యొక

మార్గము నీవే నిర్ణయించి చెప్పుదువు గాక ! అనగా కృష్ణుడు చెప్పుచున్నాడు.

లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్. 3

కృష్ణుని సమాధానము ;

అనఘ - పాపరహిత - అర్జున! , పురా - పూర్వము, మయా - నాచే, అస్మిన్ లోకే- ఈ లోకమున, సాంఖ్యానాం జ్ఞానయోగేన - జ్ఞానులకు జ్ఞానము ద్వారమునను, కర్మయోగేన యోగినామ్ - కర్మయోగము మూలమున యోగులకు, ద్వివిధా నిష్ఠా - రెండువిధములగు నిష్ఠ ప్రోక్తా - చెప్పబడినది.

తా : పాపరహితుడ వగు నో యర్జున ! ఈ లోకమున జ్ఞానులకు సాంఖ్యయోగము, యోగులకు కర్మయోగము అని రెండురకములైన స్థితులు ఇంతకు పూర్వము నీకు తెలిపి యుంటిని.

న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే
న చ సంన్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి. 4

పురుషః - పురుషుడు, కర్మణాం అనారంభాత్ - కర్మల నారంభింప నందున, నైష్కర్మ్యం న అశ్నుతే - కర్మాభావమును బొందడు, సంన్యసనాదేవ - కర్మల త్యాగమువలననే, సిద్ధిం - సిద్ధిని, న సమధిగచ్ఛతి - పొందనేరడు.

తా : కాని, వాస్తవమున మనుజుడు కర్తవ్య కర్మల నారంభింప నంత మాత్రమున నిష్కర్మి - కర్మసన్న్యాసి

కాజాలడు. మఱియు కర్మలు చేయక వానిని విడిచినంత మాత్ర మున సిద్ధుడును గాడు.

న హి కశ్చిత్ క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్ గుణైః. 5

హి - కారణమేమన, కశ్చిత్ - ఎవడును, క్షణ మపి - ఒక క్షణముకూడ, అకర్మకృత్ - కర్మచేయక, న తిష్ఠతి - ఉండడు, సర్వః- అందఱు, ప్రకృతిజైః గుణైః - స్వాభావిక గుణముల మూలమున, అవశః - వివశులై, కర్మ కార్యతే - కర్మలు చేయుదురు.

తా : కారణ మేమన లోకమున నెవడును కర్మల నాచరింపక యొక క్షణమైన నుండలేడు. తన స్వభావమున కనుగుణముగ నేవో పనులు చేయుచునే యుండును. మనుజుడు సాత్వికుడో, రాజసికుడో, లేక తామస గుణము కలవాడో యైయుండును. సత్వరజస్తమోగుణములు ప్రకృతికి సంబంధించి నవి. ఆ గుణములతోనే మానవుని చిత్త మేర్పడును. ఇందేదో యొకగుణ మధికముగాను మిగిలిన రెండుగుణములు తక్కువ గాను నతని చిత్తమున నుండును. ఏ గుణము అధికముగా నుండునో తదనుకూలమైన పనులలో నతడు ప్రవర్తించును.

కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే. 6

యః విమూఢాత్మా - ఏ భ్రాంతపురుషుడు, కర్మేంద్రియాణి సంయమ్య - వాగాది కర్మేంద్రియములను కట్టిపెట్టి, ఇంద్రియార్థాన్ - విషయములను, మనసా స్మరన్ - మనస్సుతో స్మరించుచు, ఆస్తే -

ఉండునో, సః - వాడు, మిథ్యాచారః ఉచ్యతే - అసత్యాచారములు కల వాడుగ చెప్పబడును.

తా : కొందఱు హస్తపాదాది కర్మేంద్రియములను కట్టిపెట్టి కర్మల నాచరింపని వారై మనస్సుతో నింద్రియార్థము లైన రూపరసాదులను స్మరించు చుందురు. అట్టివారు కర్మ సన్న్యాసులు కాని, జ్ఞానులు కాని కారు. వారు మూఢా త్ములు, మిథ్యాచారులు, అసత్యాచరణ కలవారుగ నెన్న బడుదురు.

యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున
కర్మేంద్రియైః కర్మయోగ మసక్తః స విశిష్యతే. 7

తు - కాని, యః - ఎవడు, ఇంద్రియాణి - ఇంద్రియములను, మనసా నియమ్య - మనస్సుతో నియమించి, కర్మేంద్రియైః - వాగాది కర్మేంద్రియములతో, కర్మయోగం - కర్మయోగమును, అసక్తః - ఫలా పేక్షను విడిచినవాడై, ఆరభతే - ఆరంభించునో, అర్జున!, సః విశిష్యతే- అతడు కర్మలను విడుచువానికంటె శ్రేష్ఠుడగుచున్నాడు.

తా : కావున అర్జున ! ఇంద్రియములను విషయముల వంక బోనీక మనస్సుతో వాని నదుపులో నుంచుకొని ఫలాపేక్ష విడిచి కర్మేంద్రియములతో కర్తవ్యములను నెఱ వేర్చువాడే లోకమున విశిష్టుడు.

నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః. 8

త్వం - నీవు, నియతం కర్మ - వర్ణాశ్రమములకు తగినట్లు విధింప బడిన యజ్ఞ దానాది కర్మ, కురు - చేయుము, హి - కారణ మేమన.

అకర్మణః కర్మ జ్యాయః - కర్మత్యాగముకంటె కర్మాచరణ మెక్కువ, అకర్మణః తే - కర్మచేయని నీకు, శరీరయాత్రాపి - జీవన నిర్వహణము కూడ, న ప్రసిద్ధ్యేత్ - సిద్ధింపదు.

తా : అందువలన నీవును వర్ణాశ్రమములకు దగినట్లు విధింపబడిన కర్తవ్యముల నాచరింపుము. అదియే నీకు శ్రేయస్కరము. కర్మములను త్యజించుటకంటె కర్మల నాచరించుటయే శ్రేష్ఠము. కర్మల విడిచియుండు వాని జీవితమే నిలువదు కదా !

పంచమాధ్యాయము సమాప్తము



# శ్రీమద్భగవద్గీత

## షష్ఠాధ్యాయము

# కర్మయోగము

### (యజ్ఞముకొఱకు కర్మ ఆవశ్యకము)

సారము - సంగతి :

పంచమాధ్యాయమున కర్మత్యాగ మసంభవమని తెలుపుచు, ఆసక్తిని విడిచి నిష్కామకర్మ చేయ ప్రేరణ చేయబడినది. 'కర్మఫలత్యాగము మాత్ర మంత సులభమా ?' యని ప్రశ్నింప నవసరగును. కాబట్టి యందులకును నొకక్రమ మావశ్యక మగుచున్నది. ఫలము పూర్ణముగ త్యజించుటకు పూర్వము ఒకింత ఫలప్రాప్తితో గూడిన ఫలత్యాగము చేయుట సులభమగును. అట్టిత్యాగము ముందుగ జెప్పవలసి యున్నది. అందువలననే కృష్ణు డీ ప్రశ్నను సంభావించి సమాధాన మిట్లు చెప్పి యున్నాడు. పూర్ణఫలత్యాగము నీ కసంభవమని తోచు పక్షమున యజ్ఞార్థమైనను కర్మ నొనరింపుము. యజ్ఞార్థము కర్మచేయుటయన, పరోపకార భావముతోగాని, పరస్పర సహాయతా భావముతోగాని కర్మచేయుట యని భావము. పరమేశ్వరుడు ప్రజలను సృష్టించుచు సర్గారంభమున నీ సహయోగ యజ్ఞమును సృష్టించియున్నాడు. భగవంతుని సృష్టిలో పృథివి, జలము, అగ్ని, వాయువు, సూర్యచంద్రాది దేవతలన్నియు పరస్పర సహకారముతోనే ప్రపంచరచనలో భాగస్వాము లగుచున్నవి భగవంతుని యీ వ్యవహారము మూలముననూ, వేదచోదితములగు నుపదేశముల వలనను మనుజుడుకూడ నీ దేవతల సాహాయ్యముతో మిళితమైయున్న అన్నాది పదార్థములతో నీదేవతల శుద్ధియు, నిస్సహాయప్రాణుల కుపకారమును జేయుట యుక్తము. అట్లు చేయనినాడు అతడు నియమభంగ మొనర్చినవా డగును.

పాపియగును, చౌర్యమొనర్చిన ట్లగును. యజ్ఞమువలన మేఘము, దాని వలన నన్నము మున్నగునవి యుత్పన్నమగును. ఆ యజ్ఞము కర్మము చేయక సిద్ధింపదు. కావున కర్మఫలమును పూర్తిగ త్యజింపలేని మనుజుడు యజ్ఞము కొఱకైనను కర్మ మొనర్పవలయును. ఇట్టి కర్మాచరణమున ఫలాసక్తి యొకింత లేకపోలేదు. కాని, మనుజు డిట్టి కర్మలందు లగ్నుడగుటలో ముఖ్యకారణము లోకహిత భావనయే యగును. ఈ భావనయే యొకనా డతనిని పూర్ణఫలత్యాగమున కధికారిగ నొనర్చును. కావున నీ భావనయు కర్మబంధనమునుండి విడిపించుటకు సాధనమే యగును.

యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః
తదర్థం కర్మ కౌంతేయ ! ముక్తసంగః సమాచర. 1

యజ్ఞార్థాత్ - లోకహితభావనతో చేయబడు, కర్మణః అన్యత్ర - కర్మకాక మిగిలిన కర్మవలన, అయం లోకః - ఈ ప్రాణిసముదాయము, కర్మబంధనః - కర్మలతో బంధింపబడును. కౌంతేయ ! తదర్థం - యజ్ఞముకొఱకు, ముక్తసంగః - ఆసక్తిని విడిచి, కర్మ సమాచర - కర్మ నాచరింపుము.

తా : యజ్ఞముకొఱకు జేయు కర్మలు కాక మిగిలిన కర్మ లన్నియు బంధన హేతువు లగును.

(లోకమునకు మేలుసేయు కార్యము లన్నియు యజ్ఞము లనబడును. "యజ్ఞో వై శ్రేష్ఠతమం కర్మ" [యజ్ఞము అత్యుత్తమ కార్యము] అని శతపథ బ్రాహ్మణమున జెప్పబడినది. కావున స్వార్థబుద్ధిని వదలి పరహిత బుద్ధితో ఫలాపేక్షను దరిజేరనీయక కర్తవ్య కర్మ నాచరించిన అది బంధనము కలిగింపదు.

'యజ' అను క్రియాపదముతో యజ్ఞ శబ్ద మేర్పడును. యజ ధాతువునకు దేవపూజ, సంగతి కరణము, దానము నని మూడర్థములు.

ధాతువుయొక్క యర్థమునుబట్టి చూచిన యజ్ఞ మొక శుభకార్యమని తెలియును. 1. దేవపూజ - విద్వాంసుల సత్కారము, 2. సంగతి కరణము - ఉత్తమ పదార్థముల సేకరణము, 3. దానము - కష్టపడి న్యాయమార్గమున సంపాదించిన ద్రవ్యము పరుల ప్రయోజనార్థము వినియోగించుట - ఒక వస్తువుపై దనకుగల స్వామిత్వమును పరులకు సంక్రమింప జేయుట, ఇవియే యజ్ఞశబ్దమునకు గల విశేషార్థములు.

కృష్ణు డీ సందర్భమున యజ్ఞములు పలువిధములుగా నున్నట్లు 'ద్రవ్యయజ్ఞములు, తపోయజ్ఞములు, జ్ఞానయజ్ఞములు, స్వాధ్యాయయజ్ఞములు' నను నామములతో బోధించియున్నాడు. ఇవి యన్నియు నుత్తమ కర్మలనుటలో సందియము లేదు.

కాని, కొందఱు కర్మఠులమని చెప్పుకొనుచు యజ్ఞము పేరిట మేకలు మున్నగు సాధుజంతువులప్రాణములు దీయుట లోకమెఱుగును. ముఖ్యముగా ఆంధ్రబ్రాహ్మణు లప్పుడప్పుడు నేటికిని పశుహింస చేసి యజ్ఞముల నొనర్చుటకు వెఱవరు. యజ్ఞములందు పశుహింస నేలచేయుచున్నారని ప్రశ్నించిన 'నియ్యది వేదవిహిత' మని చెప్పుదురు. వేదమన నేమో యెఱుగనివారు (ప్రజలు) ఇట్టి మాటలు సత్యములని నమ్మి వేదములందు తమకు గల ప్రామాణిక బుద్ధి కారణముగా భక్తిశ్రద్ధలతో నీప్రాణిఘాతుకులకు ధనధాన్యము లొసంగి తోడ్పడుదురు. తమకు బుణ్యము లభించుననియు భ్రమపడుదురు.

'గాం మా హిగ్ంసీః'
'అవిం మా హిగ్ంసీః'
'అశ్వం మా హిగ్ంసీః'
'మా హిగ్ంసీః సర్వభూతాని.'

['గోవును, గొఱ్ఱెను, అశ్వమును దేనిని హింసింపకు. ఇంతేకాక సర్వభూతములను మిత్రదృష్టితో జూచుచు దేనిని హింసింపకుము.] అని

యెన్నియో వేదవాక్యములు ప్రాణిహింస చేయకుమని బోధించు చున్నవి. అట్టియెడ యజ్ఞమునందు పశువులను హింసింపుడని వేదము లెట్లు చెప్పును? పరస్పర విరుద్ధ విధులు మానవ రచితములగు నుత్తమ గ్రంథములందే యుండవు. ఈశ్వరీయములందు ఒకచో ప్రాణిహింస వలదని, మఱియొకచో ప్రాణిహింస చేయుడని యెట్లుండును ?

వేదార్థములు తెలియని రోజులలో మాంసమును దిన నలవాటుపడిన బ్రాహ్మణు లెవరో వేదవిహితము లను నెపముతో నీ దుష్కృత్యములను యజ్ఞము పేరిట వెలయించి యుందురు.

విచిత్రవిషయ మేమన : మాంసాశనులైన నౌత్తరాహిక బ్రాహ్మణులు (పంచగౌడులు) పశువులను హింసించి యజ్ఞములు చేయువారు అరుదుగ నున్నారు. బొత్తిగ లేరని చెప్పినను అసత్యముకాదు. కాని, మాంసమనిన నేవగించుకొను శుద్ధ ఛాందసులు దాక్షిణాత్యులు (ఆంధ్రులు మున్నగువారు) నోరులేని సాధు జంతువులైన మేకలను జంపి యజ్ఞము లాచరించి కల్పిత స్వర్గమున రంభాసంభోగాదుల కాశపడుట నేటికిని జూచుచున్నాము. ఇది వింతకాక మఱియే మనవలయును ?

యజ్ఞము, యాగము, అధ్వరము నను యజ్ఞవాచకములలో హింసార్థ మెక్కడను గనిపింపదు. పైపెచ్చు అధ్వర శబ్దము హింసారాహిత్యమును బోధించును.

'ధ్వరతిర్ హింసాకర్మ, న ధ్వరతీ త్యధ్వరః'

[ధ్వరతి అనగా హింసా కర్మ, అదిలేనిది అధ్వరము] అని వైదిక శబ్దములను నిర్వచించుచు యాస్కాచార్యుడు స్పష్టముగా వ్రాసి యున్నాడు. కావున యజ్ఞమున పశుహింస నొనర్చువారు వైదికులుకారు. వారికి వేదార్థము తెలియదనియే చెప్పవలయును.

ఈ విషయమున మహాభారతమున గల యొక ప్రసంగము నిట పొందుపఱచుట యనుచితముకాదు. అనుశాసన పర్వము: భీష్ముడు యుధిష్ఠిరునితో ననుచున్నాడు.

'ధ్రువం ప్రాణివధో యజ్ఞే నాస్తి యజ్ఞ స్త్వహింసకః
తతోఽహింసకః కార్యః సదా యజ్ఞో యుధిష్ఠిర !
యూపం ఛిత్వా పశూన్ హత్వా కృత్వా రుధిర కర్దమం
యద్యేవం గమ్యతే స్వర్గం, నరకం కేన గమ్యతే'

మ. భా, అనుశా. పర్వము.

[యజ్ఞమునందు ప్రాణివధలేదు. నిశ్చితము. యజ్ఞము అహింసకము. కావున యుధిష్ఠిర ! యెల్లపుడు యజ్ఞము హింసారహితముగ నొనర్ప వలయును.

యూప (స్తంభము) ము నొకదానిని నెలకొల్పి దానికి పశువును గట్టి చంపి, ఆ రక్తముతో యజ్ఞస్థలిని బురదగా చేసినవాడు స్వర్గమున. కేగునెడల ఇక నరకమున కెవదేగును ?]

మహాభారతము శాంతిపర్వమున గల భీష్మ యుధిష్ఠిరుల సంవాద మింకొకటి చూడుడు.

యుధి :- యదా భాగవతోఽత్యర్థ మాసీద్ రాజా మహాన్ వసుః
కిమర్థం స పరిభ్రష్టో వివేశ వివరం భువః ?

భీష్మ :- అత్రా ప్యుదాహరంతీమ మితిహాసం పురాతనమ్
ఋషీణాం చైవ సంవాదం త్రిదశానాం చ భారత !
అజేన యష్టవ్య మితి ప్రాహుర్ దేవా ద్విజోత్తమాన్
స చ ఛాగో ప్యజో జ్ఞేయో నాన్యః పశు రితి స్థితిః.

ఋష :- బీజైర్ యజ్ఞేషు యష్టవ్య మితి వై వైదికీ శ్రుతిః
అజసంజ్ఞాని బీజాని, ఛాగం నో హంతు మర్హథ.

నైవ ధర్మః సతాం దేవా, యత్ర వధ్యేత వై పశుః
ఇదం కృతయుగం శ్రేష్ఠం కథం వధ్యేత వై పశుః.

భీ :- తేషాం సంవదతా మేవమ్ ఋషీణాం విబుధైః సహ
మార్గాగతో నృపశ్రేష్ఠ స్తం దేశం ప్రాప్తవాన్ వసుః.
అంతరిక్షచరః శ్రీమాన్ సమగ్ర బలవాహనః
తం దృష్ట్వా సహసాయాంతం, వసుం తే త్వంతరిక్షగం.
ఊచుర్ ద్విజాతయో దేవా నేష ఛేత్స్యతి సంశయం
యజ్వా దానపతిః, శ్రేష్ఠః, సర్వభూత హితప్రియః.
కథం స్వి దన్యథా బ్రూయా దేష వాక్యం మహాన్ వసుః
ఏవం తే సంవిదం కృత్వా, విబుధా ఋషయ స్తథా.
అపృచ్ఛన్ సహితాఽభ్యేత్య వసుం రాజాన మంతికాత్
భో రాజన్ ! కేన యష్టవ్యం, అజే నాహోస్వి దౌషధైః.
ఏత న్నః సంశయం ఛింధి, ప్రమాణం నో భవాన్ మతః
స తాన్ కృతాంజలిర్ భూత్వా, పరి పప్రచ్ఛ వై వసుః.
కస్య వై కో మతః కామో బ్రూత సత్యం ద్విజోత్తమాః

ఋషయ ఊచుః } ధాన్యై ర్యష్టవ్య మిత్యేవ పక్షోఽస్మాకం నరాధిప !
దేవానాం తు పశుః పక్షో మతో రాజన్ వదస్వ నః.

భీ :- దేవానాం తు మతం జ్ఞాత్వా వసునా పక్షసంశ్రయాత్,
ఛాగే నాజేన యష్టవ్య మేవ ముక్తం వసుం తదా
కుపితా స్తే తతః సర్వే మునయః సూర్యవర్చసః.
ఊచుర్ వసుం విమానస్థం దేవపక్షార్థవాదినం
సురపక్షో గృహీత స్త్వం యస్మా త్తస్మా ద్దివః పత.

అద్య ప్రభృతి తే రాజన్ ఆకాశే విహతా గతిః
అస్మ చ్ఛాపాభిఘాతేన మహీం భిత్వా ప్రవేక్ష్యతి,
తత స్తస్మిన్ ముహూ ర్తేఽథ రాజోపరిచర స్తదా
అథో వై సంబభూ వాశు, భూమే ర్వివరగో నృప ।
అజై ర్ యజ్ఞేషు యష్టవ్య మితి వై వైదికీ శ్రుతిః
అజసంజ్ఞాని బీజాని ఛాగం నో హంతు మర్హథ.
అవ్యవస్థిత మర్యాదై ర్విమూఢై ర్ నా స్తికై ర్నరైః
సంశయాత్మభి రవ్యక్తైః హింసా సమనువర్ణితా.

మ. భా. శాం. ప. 366. అ.

'ఐశ్వర్యవంతుడైన వసురాజు ఎందువలన భ్రష్టుడై భూవివరమున ప్రవేశింపవలసి వచ్చినది' అని యుధిష్ఠిరుడు భీష్ముని ప్రశ్నింపగా నత డిట్లు చెప్పెను.

యుధిష్ఠిర ! ఈ విషయమును దెలుపుటకు పూర్వపు గాధ నొకదాని నిట్లు చెప్పుదురు. దేవతలకు మహర్షులకు నొక సంవాదము జరిగినది. దేవతలు మహర్షులకు అజతో యజ్ఞముచేయు డనియు, అజ యన మేకయే కాని మఱియొక పశువు కాదనియు చెప్పిరి. అంతట మహర్షులు 'బీజములతో యజ్ఞ మొనర్పవలయునని వేదము చెప్పుచున్నది. ఆ బీజములు 'అజ' నామముగలిగి యుండవలయును.' కావున పశువును జంపరాదు. దేవతలార! యజ్ఞమున బశువును జంపుట సత్పురుషుల ధర్మముకాదు. ఇయ్యది శ్రేష్ఠమైన కృతయుగము. పశుహింస నేయుటెట్లు ?' అని దేవతలతో వివరించిరి. ఆ సమయమున నృపశ్రేష్ఠుడైన వసు వా మార్గమున నేగుచు నట కరుదెంచెను. ఆతడు అంతరిక్షగామి, శ్రీమంతుడు, సమగ్ర బలవాహనములు గలవాడు. వసురా జచటికివచ్చి వెంటనే తిరిగివెళ్ళ నుంకించు

చుండగా మహర్షులు దేవతలతో నిట్లనిరి. 'ఈ వసురాజు యాగములు చేసినవాడు, దాత, శ్రేష్ఠుడు, సర్వ భూతములకు హిత మొనర్చినవాడు. కావున నితడు మన సంశయము దీర్పగలడు. ఇతడు, గొప్పవాడు. విపరీతము చెప్పడు' అని యిట్లు మహర్షులయిన యా బ్రాహ్మణులు దేవతలు నిర్ణయించుకొని యుభయులు వసురాజు చెంతకు జని 'ఓరాజా! దేనితో యజ్ఞ మొనరింపవలయును? అజ(మేక)తోనా లేక ఓషధులతోనా?' అని మాలో సంశయము కలిగినది. 'నీవే సంశయమును దీర్పగలవని నిన్ను మేము ప్రమాణముగా నంగీకరించుచున్నాము' అనిరి. అప్పుడా వసురాజు దేవబ్రాహ్మణుల కిరువురకు బ్రణమిల్లి 'మీ యిరుపక్షములవారిలో నెవరి దేమతమో సత్యము చెప్పు' దని ప్రశ్నించెను. అంతట నా ఋషులు 'ధాన్యములతో యజ్ఞమొనరింప వలయు ననునది మాపక్షము, పశువును జంపి యజ్ఞము చేయవలయు ననునది దేవతల పక్షము.' అని నుడివి యిందేది యుచితమో చెప్పవలయుననిరి. వసువు దేవతలయెడ గల పక్షపాత బుద్ధితో పశువుం జంపి యజ్ఞ మొనరింపవలయునని నుడివెను. అది విని ఋషులు కుపితులై పక్షపాత బుద్ధితో దేవతల పక్షము నంగీకరించిన వసువును విమానమున నున్నవానిని 'నీవు దివమునుండి పడిపోవుదువుగాక!' అని శపించిరి. ఓ రాజా! 'నేటినుండి నీ కాకాశగమనము శక్యముకాదు. మా శాపకారణమున భూవివరమును బ్రవేశింతువుగాక!' అనుటయే తడవుగా ఉపరిచర వసువు ఆకాశము నుండి క్రిందబడి భూమిలో బ్రవేశించెను.

కావున నో యుధిష్ఠిర అజనామక బీజములతోనే యజ్ఞ మొనరింప వలయునని యెఱుగుము. పశువులం జంపి యజ్ఞము చేయరాదు.

మర్యాదలు విడిచి మూఢులు, సంశయాత్ములు, నాస్తికులు నైన వారు యజ్ఞములందు హింసను వర్ణించినారు. వారు అవ్యక్తులు.

మ. భా. శాం. ప. 366. అ.

మహాభారతములోని యీ ప్రసంగమునుబట్టి చూచినను వేదము హింసాయుత యజ్ఞమును విధింపదనియు మధ్యకాలములో నెవరో ధూర్తులే హింసాత్మక యజ్ఞములను వేదము పేరిట నడపిరనియు బోధపడుచున్నది.)

సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్ట కామధుక్. 2

పురా - సృష్టి కారంభమున, ప్రజాపతిః - పరమాత్మ, సహయజ్ఞాః- యజ్ఞముతోబాటు, ప్రజాః సృష్ట్వా - ప్రజలను సృష్టించి, ఉవాచ - చెప్పెను. అనేన - దీనితో, ప్రసవిష్యధ్వం - వృద్ధిబొందుడు, ఏషః - ఇది, వః ఇష్టకామధుక్ - మీ వాంఛితముల నిచ్చునది, అస్తు - అగుగాక !

తా : పరమేశ్వరుడు సృష్టి నొనర్చు నపుడు ప్రథమమున - మానవులను సృజించునపుడే యజ్ఞ భావనతో వారిని సృష్టించియున్నాడు. వారికి వేదము మూలమున 'యజ్ఞము నొనర్చి యభివృద్ధి నందుడు, కోరికలం దీర్చుకొనుడు, ఇది మీకు కామధేనువు వంటిది.' అని యుపదేశించి యున్నాడు.

(జీవులు మోక్షానందము నందుట కుత్సహింపవలయుననియు, వారొనర్చు కర్మలకు ఫలములను సక్రమముగ బడయవలయు ననియు నెంచి, పరమేశ్వరుడు ప్రాణిహితభావనతో సృష్టి నొనర్చియున్నాడు. ఇట్టి పరోపకార భావనకు జన్మ నొసంగుటయే సర్గారంభమున యజ్ఞము నుత్పన్నము చేయుట యని యెంచవలయును. అందువలననే యీ ప్రకరణమున లోకహితమును సంపాదించు యజ్ఞమునే యజ్ఞమని వర్ణించియున్నాడు. ప్రాణులకన్నింటికి హితము నొనర్చు దేవయజ్ఞము నీ ప్రకరణమున నుదాహరణముగ గ్రహించుటచే నీ భావము స్పష్టమగుచున్నది.)

దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః
పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథ. 3

అనేన - ఈ యజ్ఞముతో, దేవాన్ భావయత - వాయ్వాది దేవతలను సంస్కరింపుము, తే దేవాః - శుద్ధములైన ఆ దేవతలు, వః - మిమ్ము లను, భావయంతు - సమృద్ధుల నొనర్చుగాక । పరస్పరం భావయంతః - పరస్పరము శుద్ధివృద్ధులను జేసికొనుచు, పరం శ్రేయః - ఉత్తమ శుభమును అవాప్స్యథ - పొందుడు.

తా : మానవులార ! యజ్ఞముతో ! మీరు దేవతలను భావింపుడు - సంస్కరింపుడు. అప్పు డా దేవతలు మిమ్ముల నాదరింతురు - మిమ్ముల నారోగ్యవంతులం జేయుదురు. ఇట్లు దేవతలు, మానవులు మీరు పరస్పరము భావించుకొనుచు, ఆదర సత్కారములను బొందుచు పరమశ్రేయస్సు ననుభ వింతురుగాక ! అని వేదమూలమున నీశ్వరుడు మానవుల కుపదేశించినాడని భావము.

(ఈ ప్రకరణమున దేవత లన నెవరో వారిని యజ్ఞముతో నెట్లు మానవులు భావింపగలరో తెలిసికొన వలసియున్నది.

మానవులలో విద్వాంసులు, జ్ఞానులు, ధార్మికులు నైనవారు దేవత లనబడుదురు. "విద్వాగ్ంసో వై దేవాః" అని శతపథ బ్రాహ్మణము వ్యాఖ్యానించినది. వైదిక శబ్దములను నిర్వచించుచు యాస్కమహర్షి.

'దేవః కస్మాత్' దేవుడు, దేవత యననేల యని ప్రశ్నించుకొని' 'దేవో దానాద్ వా', ద్యోతనాద్ వా, దీపనాద్ వా, అథ ద్యుస్థానాద్ వా' 'దానము చేయుట, ప్రకాశించుట, ప్రకాశింప జేయుట, ద్యుస్థానమున నుండుట' అను గుణములు గల భూమ్యాది పంచభూతములు,

సూర్యచంద్రులు, విద్యుత్తు మున్నగు పదార్థములు శాస్త్రములందు దేవతలని వ్యవహరింపబడు ననెను. కావుననే

'భూమిర్ దేవతా' 'అగ్నిర్ దేవతా' మున్నగు వాక్యములు వేదములందు జూడనగును.

భూమ్యాది పంచభూతముల వలనను, సూర్యాది గోళములవలనను ప్రాణులకు వలయు నన్నవస్త్రాదులు, ప్రకాశము, వేడి మున్నగు జీవనోపయుక్తములగు పదార్థములన్నియు లభించుచుండును. కావున నవి యన్నియు దేవతలే. ఈ దివ్యపదార్థముల నన్నింటిని మానవులు నిరతముపయోగించుకొని యపవిత్రము చేయుదురు. జలమును ద్రావి మూత్రముగను, అన్నము దిని మలముగను జేయుట నెల్లరెఱిగినదియే. ప్రాణవాయువును ప్రతిక్షణము గ్రహించి దానిని కలుషితముచేసి విడుచుచుందురు. ఈ పదార్థములన్నియు ప్రాణుల జీవితమున కాధారములు. కాని ప్రాణులు వాని, నపవిత్ర మొనర్చును. ఈ యపవిత్ర పదార్థములను ప్రాణులు మరల నుపయోగించిన నవి హానికారకములగును. కావున వానిని బవిత్రము చేసికొని వాడుకొనవలయును. పవిత్రము చేసికొనవలసిన బాధ్యత మానవ ప్రాణులకే యున్నది

అగ్నియందు నేయి, ఓషధులు ఆహుతిగా నుంచి చేయు యజ్ఞము వలన నపవిత్రమైన వాయు జలాదులు పరిశుద్ధములు పుష్టికరములు నగును. పరిశుద్ధ వాయు జలాదులను ఉపయోగించుకొని ప్రాణులు ఆరోగ్యమును బొందును; పరిపుష్టము లగును.

అగ్నియం దాహుతి యొనర్చు పదార్థములు వ్యర్థము లగునని పామరులకు దోచును. కాని పదార్థవిద్య నెఱిగిన వారికి అవి వ్యర్థములు కాకపోగా సూక్ష్మములయి వాయువునందు జేరి, యా వాయువు నాఘ్రాణించు నసంఖ్యప్రాణుల శరీరములందు బ్రవేశించి యారోగ్యమును బలమును

జేకూర్చునని బోధపడును. ఈ విషయమును బాగుగా నెఱిగిన వారగుట వలన మహర్షులు - వేదమంత్రార్థద్రష్టలు యజ్ఞప్రక్రియల నేర్పఱిచి వానియందు ఘృతము ఓషధులు మున్నగు నుత్తమ పదార్థముల నాహుతి జేయుడని బోధించి యున్నారు. వస్తువులను విభజించి సూక్ష్మములజేసి వాయువునందు జేర్చుశక్తి అగ్నికే గలదు. ఇతర పదార్థములకు లేదు. కావుననే మహర్షులు 'అగ్నిర్వై దేవానాం ముఖమ్' 'అగ్నియే దేవతలకు నోరు' అని యన్నారు. నోటియందుంచిన వస్తువు శరీరమునం దంతటను చేరునుకదా! అగ్నిలో నాలుగు ఎండిన మిరపకాయలు వేసిచూడుడు, వెంటనే సమీపముననున్న వారికెల్లరకు తుమ్ములు వచ్చునుగదా! కారణ మేమి? అగ్నిలోవేసిన మిరపకాయలు సూక్ష్మరూపమున వాయువునందుజేరి యా వాయువు నాఘ్రాణించిన వారికి తుమ్ములు వచ్చునట్లుచేయును. అట్లే అగ్నిదగ్ధ వస్తువులు సూక్ష్మరూపమున నంతటను వ్యాపించును. కావున యజ్ఞము మిక్కిలి ఉపకారక కార్యము.)

(ఈ ప్రక్రియ నంతటిని బాగుగ నెఱింగినవా డగుటవలన కృష్ణ దర్జునునకు పై శ్లోకమునందు దేవతలను మనుజులు భావించుటవలన, నామనుజులను దేవతలు భావించుననియు పరస్పర భావనవలన మిక్కిలి శ్రేయస్సు కలుగుననియు వేదార్థమును పురస్కరించుకొని యిట్లు బోధించి యున్నాడు. ఇయ్యది పాఠకులు గుర్తింపదగిన విషయము.)

ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః
తైర్ దత్తా నప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః. 4

యజ్ఞభావితాః - యజ్ఞమువలన శుద్ధముచేయబడిన. దేవాః - దేవతలు, వః ఇష్టాన్ భోగాన్ దాస్యంతే - మీ కిష్ట భోగముల నిచ్చెను, తైః దత్తాన్ - వానిచే నీయబడిన వానిని, ఏభ్యః - వీనికి, అప్రదాయ - యజ్ఞము మూలమున నీయక, యః భుంక్తే - ఎవడు తినునో, సః స్తేనః ఏవ హి - వాడు దొంగయే.

తా : యజ్ఞమువలన భావింప (సంస్కరింప) బడిన భూమ్యాది దేవతలు మానవుల కిష్టములగు భోగముల నిచ్చును. కావున నా దేవతలచే నీయబడిన పదార్థములను వాని కర్పింపక భుజించుట మానవులకు శ్రేయస్కరము కాదు. అట్లు భుజించువాడు చౌర్యమొనర్చిన వా డగును.

యజ్ఞశిష్టాశినః సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః
భుంజతే తే త్వఘం పాపా యే పచం త్యాత్మకారణాత్. 5

యజ్ఞశిష్టాశినః - యజ్ఞానంతరము మిగిలిన దానిని తినువారు, సంతః - అగుచు, సర్వకిల్బిషైః - సర్వపాపములనుండి, ముచ్యంతే - విడువబడుదురు. యే ఆత్మకారణాత్ పచంతి - ఎవరు తమకొఱకే అన్నాదులను పక్వము చేసికొందురో, తే పాపాః తు - ఆ పాపులయితే, అఘం - పాపమును, భుంజతే - తిందురు.

తా : దేవతల నుండి తమకు లభించిన పదార్థములలో మేలైన ఘృతము, ఓషధులు, ధాన్యములు మున్నగు వానిని అగ్నిముఖమున నా దేవతల కర్పించి తదుపరి మిగిలిన పదార్థములను (యజ్ఞ శేషమును) భుజించువారు పాపములనుండి ముక్తులగుదురు. అట్లుచేయక తమ యుదరపోషణకే వంటకముల నొనర్చువారు పాపమును భుజించువా రగుదురు.

(పశువులు, పక్షులు, క్రిములు, కీటకములు నన్నియు తమ యుదరముల నింపుకొని యాత్మపోషణ చేసికొనుచునే యుండును. మానవుడు కూడ స్వార్జితముతో తన యుదరమునే నింపుకొని యితర ప్రాణుల పోషణార్థము స్వార్జితమున గొంతయైన నుపయోగింపని పక్షమున నతడు చోరుడు కాక సజ్జనుడెట్లగును ?)

అన్నాద్ భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః
యజ్ఞాద్ భవతి పర్జన్యో యజ్ఞః కర్మ సముద్భవః. 6

అన్నాత్ భూతాని భవంతి - అన్నమువలన ప్రాణులు జీవించును. పర్జన్యాత్ అన్నసంభవః - మేఘమువలన నన్న ముత్పన్న మగును. యజ్ఞాత్ పర్జన్యః భవతి - యజ్ఞమువలన మేఘ ముదయించును. యజ్ఞః కర్మ సముద్భవః - యజ్ఞము కర్మ సిద్ధమగును.

తా : ప్రాణు లాహారము (అన్నము) వలన బ్రతుకును. కావుననే 'అన్నం వై ప్రాణినాం ప్రాణాః' 'అన్నమే ప్రాణులకు ప్రాణములు' అని శిష్టు లందురు. ఆ యన్నము-ధాన్యాదులు మేఘము వర్షించుట వలన నుత్పన్నములగును. నిత్యము మానవులు యజ్ఞము చేయుటవలన మేఘములు సకాలమున నేర్పడి వర్షములు సంభవించును. అట్టి యజ్ఞము కర్మ నొనర్చుట వలన సంపన్నమగును.

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవం
తస్మాత్ సర్వగతం బ్రహ్మ, నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్. 7

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి - కర్మము వేదమువలన తెలియనగునని యెఱుగుము. బ్రహ్మ అక్షర సముద్భవం - వేదము నాశరహితమగు పరమేశ్వరునివలన ప్రకటింపబడినది. తస్మాత్ - కావున, సర్వగతమ్ - సర్వమునందుండు, బ్రహ్మ - వేదజ్ఞానము, యజ్ఞే - యజ్ఞవిషయమున, నిత్యం - ఎల్లప్పుడును, ప్రతిష్ఠితమ్ - మాన్యమగుచున్నది. వేద విహిత యజ్ఞముల నాచరింపనగునని భావము.

తా : యజ్ఞాది కర్మలు వేదవిహితములు. మానవులు యజ్ఞాదుల నొనర్చి యిష్టములను సాధింప గలుగుదురని

వేదములం దుపదేశింప బడినది. వే ద ము లు నిత్యమైన పరబ్రహ్మముచే అగ్ని, వాయువు, రవి, అంగిరసుడు నను పవిత్రాంతఃకరణులైన మహర్షులకు భాసింప జేయబడినవి. కావున యజ్ఞాది వేదవిహిత శుభకార్యములందు వేదమునకు-జ్ఞానమునకు మాన్యత యొసగబడుచున్నది. వేదబోధిత విధుల ననుసరించి యజ్ఞాదికర్మ లొనర్పబడుచున్నవని భావము.

ఏవం ప్రవ ర్తితం చక్రం నానువ ర్తయ తీహ యః
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ స జీవతి. 8

పార్థ ! - అర్జున ! ఏవం ప్రవ ర్తితం చక్రం - ఇట్లు నడుపబడిన యీ చక్రమును, యః - ఎవడు, ఇహ - ఇక్కడ, న అనువ ర్తయతి - నడుపడో, అఘాయుః - పాపమయ జీవనధారియు, ఇంద్రియారామః - ఇంద్రియరతుడు నగు, సః - అతడు, మోఘం జీవతి - వ్యర్థముగా జీవించును.

తా : అర్జున ! ఈ లోకచక్ర మిట్లు నడుపబడుచున్నది. క ర్తవ్యకర్మల నొనర్పకున్న ప్రాణుల జీవితము సుఖమయము కాజాలదు. మానవులు వేద విధుల ననుసరించి క ర్తవ్య కర్మ లాచరింపక యింద్రియ లోలురై జీవితము గడపునెడల వారి జీవితము వ్యర్థమగును. జీవిత ఫలములను బొందజాలరని భావము.

షష్ఠాధ్యాయము సమాప్తము.



# శ్రీమద్భగవద్గీత

## సప్తమాధ్యాయము

# కర్మయోగము

(జ్ఞానికిని కర్మ మావశ్యకమే)

సారము - సంగతి :

సంపూర్ణ ఫలత్యాగము నొనర్పలేనివానికి, జ్ఞాని కానివానికిని లోక హిత భావనతో కర్మల నాచరించుట యుక్తమని యీ యధ్యాయమున జెప్పబడినది. కాని, ఆత్మస్వరూపమును దెలిసికొని, భగవత్ సాక్షాత్కార మును బొంది, యాత్మ తృప్తుడై యుండు పురుషునకు చేయవలసినదేమియు నుండదు. అతనికి ప్రాప్తవ్యముకూడ నుండదు. అట్టి జ్ఞానియు కర్మము నాచరింపవలసినదేనా ?

ఈ ప్రశ్నకు సమాధానము కృష్ణుడిట్లు చెప్పుచున్నాడు : అవును, చేయవలసినదే. అతడాసక్తిని విడిచి కర్మము నాచరింపవలయును. అనాసక్తితో జేసిన కర్మము బంధనహేతువు కాదు. జనకాది జ్ఞానులు జీవన్ముక్తులయిన మీదట గూడ కర్మలను విడువలేదు. వారి మార్గమున నొకింత బాధయు కలుగలేదు.

జ్ఞానులు కానివారిని కర్మలయందు లగ్నులగునట్లు జేయుటకుగాను జ్ఞానులు కర్మలు చేయవలసినదే. నిష్కామకర్మ మొనర్చుటవలన జ్ఞానికి హాని కలుగదు. కాని, యతడు కర్మత్యాగ మొనర్చిన నజ్ఞానియు నతనిని జూచి కర్మల నాచరించుట విడుచును. అతడు వ్యర్థుడగును. జ్ఞాని కావుం దున నతడు కర్మలను విడిచి సన్మార్గమున నడువజాలడు. జ్ఞాని కర్మల నాచరించు పక్షమున నజ్ఞానియు స్వభావానుగుణ కర్మల నాసక్తుడై చేయు చుండును. కాని, కుకర్మలను చేయడు. అకర్మియుకాడు. అతని స్వభావము

నందు క్రమక్రమముగ కర్మల మూలముననే పరివర్తనము గలుగజేయవలసి యుండును. కర్మాచరణమునుండి యతనిని దొలగించుట యెన్నటికిని మంచిదికాదు.

జ్ఞానియు నొకనాడు తన స్వభావమును మార్చుకొనియేకదా, కర్మల యందు తనకుగల యాసక్తిని విడువగలుగును ? అర్జునః జ్ఞానినైకూడ నేను ఆసక్తిని విడిచి కర్మల నాచరించుచునేయున్నానుగదా ! జ్ఞానికూడ కర్మల నాచరించుట ఆవశ్యకమని యిప్పుడు నీకు తెలిసియుండవచ్చును.

యస్త్వాత్మరతి రేవ స్యాద్ ఆత్మతృప్తశ్చ మానవః
ఆత్మ న్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే. 1

తు-కాని, యః మానవః - ఏ మనుజుడు, ఆత్మరతిః - ఆత్మయందే ఆసక్తుడో, ఆత్మతృప్తః - ఆత్మయందే తృప్తుడో, చ-మఱియు, ఆత్మని ఏవ సంతుష్టః-ఆత్మలోనే సంతుష్టుడో, తస్య-అతనికి, కార్యం న విద్యతే - కర్తవ్య మేమియు లేదు.

తా : మానవుడు చిత్తైకాగ్రతను సంపాదించి జ్ఞానియై తనలో దాను రమించుచు తృప్తిననుభవించుచు సంతుష్టుడై యుండగలిగిన నాడు అతనికి బాహ్యప్రపంచమున నాచరింప దగిన కార్యము లంతగా నుండవు.

నైవ తస్య కృతే నార్థో నాకృతే నేహ కశ్చన
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థ వ్యపాశ్రయః. 2

తస్య - అతనికి, ఇహ - ఇక్కడ, కృతేన - చేసిన కర్మతోకాని, అకృతేన-చేయబడని కర్మతోకాని, కశ్చన అర్థః నఏవ-ఏ ప్రయోజనమును లేనేలేదు, చ - మఱియు, అస్య - ఇతనికి, సర్వభూతేషు - సమస్తభూతము లందును, కశ్చిత్ అర్థవ్యపాశ్రయః న - ఏ ప్రయోజనాధారమును లేదు.

తా : ఆత్మనెఱిగిన మానవుడు తా జేసిన కర్తవ్య కర్మమునకు ఫలము నభిలషింపడు. ఫలము నభిలషించుచు వేఱొక కర్మ జేయగోరడు. కావున నట్టి జ్ఞానికి కర్మలతో ప్రయోజన మేమి యుండును? మఱియు లోకమునగల ప్రాణుల వలన నతడెట్టి ప్రయోజనము నభిలషింపడు. కావున నతనికి కర్మలు చేయవలసిన యావశ్యకత యుండదు.

తస్మా దసక్తః సతతం కార్యం కర్మ సమాచర
అసక్తో హ్యాచరవ్ కర్మ పర మాప్నోతి పూరుషః. 3

తస్మాత్ - ప్రయోజనము లేకున్నను జ్ఞానికి నియత కర్మ మాచరింపవలసి యున్నందున, అసక్తః - ఆసక్తిని విడిచి, సతతం - నిరంతరము, కార్యం కర్మ సమాచర - చేయదగిన కర్మ నాచరింపుము, హి - కారణ మేమన, పూరుషః - మానవుడు, అసక్తః కర్మ ఆచరన్ - ఆసక్తి విడిచి కర్మ చేయుచు, పరం ఆప్నోతి - పరమాత్మను బొందును.

తా : కావున నో యర్జున! ఫలాపేక్ష విడిచి నీవు కర్తవ్య కర్మల నెల్లపుడు చేయుదువుగాక! ఫలాపేక్ష లేక కర్మల నాచరించు పురుషుడు పరమశ్రేయస్సును బొందును.

కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః
లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి. 4

హి జనకాదయః - జనకాదులు, కర్మణా ఏవ సంసిద్ధిం ఆస్థితాః - కర్మచేతనే సిద్ధిని బొందిరి కావున, లోకసంగ్రహం ఏవ అపి - లోకులను నీతో నుంచుకొనుటకైనను, సంపశ్యన్ - ధ్యానమున నుంచుకొనుచు, కర్తుం అర్హసి - కర్మచేయుటయే నీకు దగును.

తా : కర్మసన్న్యాసము వలన జనులు సిద్ధి బొందుదు రను నియమమును లేదు. కర్మప్రవృత్తి గలిగి యుండియు సిద్ధి బొందినవారు లోకమున నెందఱో యున్నారు. జనకాదు లిట్టివారే కదా ? ఇతరులు నిన్ననుసరింతు రను దృష్టితో నైనను నీవు కర్మలలో బ్రవృత్తుడవు కావలయును.

యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః
స యత్ ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే. 5

శ్రేష్ఠః - శ్రేష్ఠుడు, యత్‌యత్ ఆచరతి - ఏది ఏది చేయునో, ఇతరః జనః - సామాన్య మనుజుడు, తత్‌తత్ ఏవ - అయ్యదియే యాచరించును, సః యత్ ప్రమాణం కురుతే - అతడెంత చేయునో, లోకఃతత్ అనువర్తతే - లోకులును అతని ననుసరించి యంతే చేయుదురు.

తా : లోకమునందు మానవులలో శ్రేష్ఠులైన వారు చేయునట్లే యితరులును జేయుదురు. నీవు సంఘమున గల పెద్దలలో నొకడవుగ నెంచబడుచున్నావు. కావున నితరులు నిన్ననుసరింతురు. పెద్దలు దేనిని బ్రమాణముగ నంగీకరింతురో దానినే యితరులును బ్రమాణమందురు. కావున నీవు కర్తవ్య కర్మలను విడువరాదు.

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి. 6

పార్థ - అర్జునః, మే - నాకు, త్రిషు లోకేషు-ముల్లోకములందును, కించన కర్తవ్యం న అస్తి - కొంచెక కర్తవ్యములేదు. అనవాప్తం, పొందవిదికాని, అవాప్తవ్యం - పొందవలసినది కాని, న - లేదు, అయి నను, కర్మణి వర్తే ఏవ - కర్మలందు వర్తించుచునే యున్నాను.

తా : ఇంతయేల? నన్ను జూచి యైనను నీవు నీకర్తవ్యమును గుర్తింపజాలవా ? నాకీ ముల్లోకములందు గావలసిన దేమున్నది ? నేను యోగసిద్ధుడను, జ్ఞానిని. నాకు లభించనిది కాని, లభింపవలసినది కాని యేమియు లేదు. అయినను కర్మలను విడువక చేయుచునే యున్నాను గదా ?

యది హ్యహం న వర్తేయం జాతు కర్మ ణ్యతంద్రితః
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః 7

యది జాతు - ఒకవేళ, అహం - నేను, అతంద్రితః - ప్రమత్తుడనై, కర్మణి నవర్తేయం - పనిలో లగ్నుడను కానేని, మనుష్యాః - మానవులు, సర్వశః - అందఱు, మమ వర్త్మ అనువర్తంతే - నా మార్గమును అనుసరింతురు.

తా : అలసుడనై చేయవలసిన దేమియు లేదుకదా యని నేను కర్తవ్యకర్మల నాచరింపనేని యీ జనులెల్లరు నా మార్గమునే యనుసరింతురు.

ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చే దహమ్
సంకరస్య చ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః. 8

అహం - నేను, కర్మ న కుర్యాం చేత్ - కర్మ చేయనియెడల, ఇమే లోకాః - ఈ జనులు, ఉత్సీదేయుః - నశింతురు, అందువలన నేను, సంకరస్య కర్తా స్యామ్ - కర్మ సాంకర్యమునకు కర్తనగుదును, చ - మఱియు, ఇమాః ప్రజాః ఉపహన్యామ్ - ఈ ప్రజలను నాశము చేయుదును.

తా : లోకమున నేను జ్ఞాని ననిపించుకొని, శ్రేష్ఠుడనుగా నెంచబడి కర్తవ్య కర్మముల నాచరింపని పక్షమున

ఈ జనులెల్లరు నన్ననుకరించి కర్మల నాచరింపక జీవనయాత్రను నిర్వహింపలేక నశింతురు. వర్ణాశ్రమ ధర్మములను విడిచి దురితములకు లోనగుదురు. ఇట్లు కర్మసాంకర్యమునకు లోక నాశమునకు నేను కారణభూతుడ నగుదును.

సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత :
కుర్యా ద్విద్వాం స్తథాఽసక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్. 9

భారత : - అర్జున ! అవిద్వాంసః - అజ్ఞానులు, యథా - ఎట్లు, కర్మల నాచరింతురో, విద్వాన్ - జ్ఞాని, తథా - అట్లే, అసక్తః - సక్తుడు కాక, రాగము విడిచి, లోక సంగ్రహం చికీర్షుః - లోకులను తనతోబాటు కర్మల నాచరించునట్లు చేయగోరుచు, కుర్యాత్ - కర్మ చేయును

తా : కావున భరతవంశోద్భవ ! అవిద్వాంసులు ఫలాపేక్షతో నెట్లు తమతమ కర్మల నాచరింతురో యట్లే జ్ఞానియైన వాడు ఫలాపేక్ష విడిచి కర్తవ్య కర్మల నాచరింపవలయును. అతడు చేయునది తన కొఱకు కాదు, లోకసంగ్రహము కొఱకు. జ్ఞాని కర్తవ్య కర్మల నాచరింపకున్న మూఢు లతని ననుసరించి కర్తవ్య కర్మలను గూడ నాచరింపరు. అందువలన వారికి జీవనము గడచుటయు కష్టమగును. కావున జ్ఞాని లోకసంగ్రహార్థము కర్తవ్య కర్మలు ఫలాపేక్ష విడిచి చేయవలయును.

న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్
జోషయేత్ సర్వకర్మాణి విద్వాన్ యుక్తః సమాచరన్. 10

విద్వాన్ - జ్ఞానియైన వ్యక్తి, కర్మ సంగినాం - కర్మలయందు సక్తులైయుండు, అజ్ఞానాం - అజ్ఞానులకు, బుద్ధిభేదం - సంశయమును, న జనయేత్ - కలిగింపరాదు, అంతేకాక, యుక్తః - కర్మలో లగ్నుడై,

సర్వ కర్మాణి - సర్వ కర్మలు, సమాచరన్ - ఆచరించుచు, జోషయేత్ - కర్మల నాచరింపజేయ దగును.

తా : ఆసక్తులై కర్తవ్య కర్మల నాచరించు జనులను కర్మవిముఖులం జేయరాదు. విద్వాంసుడైనవాడు తాను ఫలాపేక్షలేకయే కర్మల నాచరించుచు నితరు లట్టి కర్మల నాచరించునట్లు నడుచుకొనుట యుక్తము.

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహంకార విమూఢాత్మా, కర్తాహ మితి మన్యతే. 11

సర్వశః కర్మాణి - సర్వకర్మలు, ప్రకృతేః గుణైః - స్వాభావిక గుణముల మూలమున, క్రియమాణాని - చేయబడుచున్నవి. అహంకార విమూఢాత్మా - అహంకారముచే భ్రాంతుడైనవాడు, అహం కర్తా ఇతి మన్యతే - నేను కర్తను అని యెంచుచున్నాడు

తా : ప్రాకృతిక గుణములయిన సత్వరజస్తమస్సులు కారణములుగా నొనరింపబడు కర్మలకు అహంకారముచే భ్రాంతుడైనవాడు తానే కర్తనని యెంచును.

తత్త్వవిత్తు మహాబాహో, గుణకర్మ విభాగయోః
గుణాగుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే. 12

మహాబాహో ! - అర్జున ! గుణకర్మ విభాగయోః - స్వాభావిక గుణ కర్మల భేదముయొక్క, తత్త్వవిత్ తు - తత్త్వము నెఱుంగువ్యక్తి, గుణాః - గుణములు, గుణేషు - అంతఃకరణమునకు చెందిన సత్వము, రజస్సు, తమస్సు అను గుణములలో, సజ్జంతే - లగ్నములగుచున్నవి. ఇతి మత్వా - అని యెంచి, న సజ్జతే - ఆసక్తుడు కాడు.

తా : ఓదీర్ఘ బాహూ ! అర్జున ! సత్వరజ స్తమో గుణములయు కర్మలయు తత్త్వము నెఱిగిన మనుజుడు గుణములు గుణములలో వర్తించు చున్నవని వానియం దాసక్తుడు కాడు. గుణములన నిట ప్రాకృతిక పదార్థములు. వాని కొఱకు జీవుడు తన ప్రాకృతికములగు నంగములతో ప్రవర్తించియు తాను వానియందు లగ్నుడై సుఖదుఃఖములకు వశుడుకాడని భావము.

ప్రకృతేర్ గుణ సంమూఢా సజ్జంతే గుణకర్మసు
తా నకృత్స్నవిదో మందాన్ కృత్స్నవి న్నవిచాలయేత్. 13

ప్రకృతేః - అంతఃకరణమనెడి ప్రకృతియొక్క, గుణసంమూఢాః - గుణములవలన భ్రాంతులైనవారు, గుణకర్మసు - సత్వాది గుణయుక్త కర్మలలో, సజ్జంతే - ఆసక్తులగుచున్నారు, తాన్ అకృత్స్నవిదఃమందాన్ - ఆ పూర్ణజ్ఞానులుకాని మందబుద్ధులను, కృత్స్నవిత్ - పూర్ణజ్ఞాని, న విచాల యేత్ - విచలితులం జేయరాదు.

తా : మనుజులు తమ యంతఃకరణము లందలి సత్వాది గుణాధిక్యము కారణముగా నా యా కార్యములందు ప్రవర్తించుచుందురు. సత్వగుణ మధికముగా నుండువారు సాత్వికకర్మలందును, రజోగుణ మధికముగా నుండువారు రాజసిక కర్మములందును, తమోగుణ మధికముగా నుండువారు తామసిక కర్మలందును ప్రవర్తింతురని భావము. అట్టివారి నా యా కర్మలందు ప్రవర్తింపకుండునట్లు జ్ఞానులు చేయరాదు.

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్ జ్ఞానవా నపి
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి. 14

జ్ఞానవాన్ అపి - జ్ఞానికూడ, స్వస్యాః ప్రకృతేః - నిజ స్వభావమునకు, సదృశం చేష్టతే - అనుకూలముగ నడుచుకొనును, భూతాని - ప్రాణులు, ప్రకృతిం - స్వభావమును, యాంతి - అనుసరించును, నిగ్రహః కిం కరిష్యతి - దమన మేమి చేయగలదు ?

తా : జ్ఞానియైన వాని స్వభావముకూడ అతని యంతఃకరణము నందలి సత్త్వాది గుణాధిక్యమున కనుగుణముగానే యుండును. అందువలన నతఁడును తన స్వభావమున కనురూపమైన కర్మయే చేయును. ప్రాణులు స్వభావానుగుణముగ ప్రవర్తించును. కావున నిగ్రహ మేమి చేయగలదు ?

ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ
తయోర్ న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపంథినౌ. 15

ఇంద్రియస్య ఇంద్రియస్య అర్థే - ప్రతి ఇంద్రియార్థము నందును, రాగద్వేషౌ - రాగద్వేషములు, వ్యవస్థితౌ - నిశ్చితములై యున్నవి. తయోః వశః న ఆగచ్ఛేత్ - వానికి వశపడకూడదు, హి - కారణ మేమన, తౌ - ఆ రాగద్వేషములు, అస్య - జ్ఞానికి, పరిపంథినౌ - శత్రువులు.

తా : ఇంద్రియములచే గ్రహింపబడు శబ్దాది విషయములు రాగద్వేషములు గలిగింప కారణములగును. మనుజుడు బుద్ధిమంతు డగునెడల రాగద్వేషములకు వశుడు కాడు. అవి వానికి శత్రువులు. వానికి వశుడైనవాడు చెడుగుల నాశ్రయించి దుఃఖముల పాలగును.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః. 16

సు అనుష్ఠితాత్ - సులభముగా జేయదగు, పరధర్మాత్ - ఇతర ధర్మముకంటె, (పరస్వభావానుకూలమై స్వస్వభావానుకూలము కాని కర్మ కంటె) విగుణః స్వధర్మః - విలక్షణ గుణములుగల నిజస్వభావానుకూల మగు కర్మ, శ్రేయః - శ్రేష్ఠము, స్వధర్మే నిధనం శ్రేయః - స్వస్వభావానుకూల కర్మల నాచరించుచు మరణించుట శ్రేయస్కరము. (తన స్వభావమున కనుగుణమగు కర్మల నాచరించుచు నెట్టి సంకటముల నైనను నెదుర్కొనవలయును: కాని వానిని విడువరాదని భావము.) పరధర్మః భయావహః - పరుని స్వభావానుకూలమగు కర్మము భయంకరము.

(పదునొకండవ శ్లోకమునుండి స్వభావానుకూలమగు కర్మనుగూర్చి చెప్పబడుటచేత మే మీ ప్రకరణమున స్వధర్మమునకు స్వభావానుకూల కర్మ మని యర్థము వ్రాసితిమి అంతఃకరణమునగల సత్వరజస్తమో రూపగుణముల యనుపాతము ననుసరించి మనుష్యుని స్వభావమేర్పడు చున్నది. ఆ స్వభావము ననుసరించియే యతడు కర్మల నాచరించును. ఆ స్వభావమే యిట ప్రకృతి యనబడినది.)

తా : బాగుగ నిర్వర్తింపబడు పరస్వభావానుగుణమగు ధర్మము - సత్కార్యము కంటె స్వధర్మము - స్వస్వభావానుగుణమగు కార్యము విలక్షణమైనను శ్రేష్ఠమే యగును. స్వధర్మము - స్వస్వభావానుగుణమగు కార్యము నాచరించుచు మరణపర్యంతము జీవించుటయే శ్రేష్ఠమగును. కాని పరస్వభావమున కనువగు కార్యము నవలంబించుట మంచిది కాదు. అది యతనికి శుభంకరము కాదు.

(స్వధర్మము నిట కొందఱు స్వస్వభావానుగుణ కార్యముగా నెంచక యది కులవృత్తియని చెప్పుచు నెవరి కులవృత్తులను వారు విడువరాదనియు, నావృత్తులెంత చెడ్డవియైనను నాచరింపవలసినదే యనియు

చెప్పుదురు. కులవృత్తి చెడ్డదియైన దానిని విడిచి యుత్తమవృత్తి చేయరాదని వారిభావము. తమ భావమును బలపఱచు కొనుటకు ధర్మవ్యాధుని కథను ఉదాహరింతురు. అది సమంజసముకాదు. ధర్మవ్యాధుడు కసాయివాడు అతని కులవృత్తి మాంసము నమ్మి దానితో జీవించుట యనియు, అయినను నతడు గొప్ప తత్త్వవేత్త యైనాడనియు చెప్పి కులవృత్తి దుర్వృత్తియైనను దాని నాచరించుటయే శ్రేష్ఠమని బోధింతురు.

కాని, ధర్మవ్యాధుడు మాంసము నమ్ముటవలన తత్త్వవేత్తయైనట్లు చెప్పుట యుక్తముకాదు. ధర్మవ్యాధుని కథ యతడు తల్లిదండ్రులకు సేవ యొనర్చి తత్త్వవేత్తయైనట్లు చెప్పుటకు కల్పింపబడినదియేకాని, మాంస విక్రయమువలన తత్త్వవేత్త యైనట్లుకాని, ఆవృత్తిధర్మమనికాని చెప్పుటకు వ్రాయబడినదికాదు. పరంపరగా వచ్చుచున్న కులవృత్తి యెంతచెడ్డదియైనను దానిని విడువక యాచరించుచు మరణించుట ధర్మమని చెప్పుట శాస్త్రవిరుద్ధము; బుద్ధివిరుద్ధము కూడ.

పైశ్లోకమున స్వధర్మశబ్దములోని ధర్మపదము గమనింపదగినది. మాంసవిక్రయాది దుర్వృత్తులు ధర్మపదముచే గ్రహింపబడవు.

అనుమంతా విశసితా నిహంతా క్రయవిక్రయీ
సంస్కర్తా చోపహర్తా చ ఖాదక శ్చేతి ఘాతుకాః.
మను. 5 అ. 51 శ్లో.

అను నీ మనుధర్మశాస్త్ర వచనమును బట్టి మాంసవిక్రయముకూడ హింసాకర్మలో చేరుటచే నది ధర్మముకాదు. ధర్మపదము చెడ్డవృత్తిని బోధింపదు. కావున కులవృత్తిగా నెంచబడు చెడుపనిని విడిచి యెవడును మంచివృత్తి నవలంబింపరాదని యెంచుటకాని, అట్లు బోధించుటకాని ధర్మశాస్త్ర సమ్మతము కాదు. చెడ్డవృత్తిలో నుండువారికి మంచిబుద్ధి కలిగించి మంచివృత్తిలో బ్రవేశింప జేయరాదని యీ శ్లోకాభిప్రాయము కూడ కాదు.

28)

"న బుద్ధి భేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్" [కర్మాసక్తులగు నజ్ఞానులకు బుద్ధిభేదము కలిగింపరాదు] అను గీతావాక్యమును గూడ నిక్లే యపార్థము చేయుదురు. చెడుపనిచేయు మూర్ఖునకు జ్ఞానియైన వాడు మంచిబుద్ధి నిచ్చి యా చెడువృత్తినుండి తొలగింపరాదు. అని యీ వాక్యాభిప్రాయముగా వా రెంచుచుందురు. ఈ వాక్యమునందలి కర్మ పదము చెడుపనికి వర్తింపదని వారెఱుగరు. కర్మ యనగా శాస్త్రవిహిత కర్మయే కాని దుష్కర్మకాదు. కావున అజ్ఞాని శాస్త్రవిహితమైన కర్మయందు ఫలాపేక్షతో వర్తించునపుడు వానికి బుద్ధిభేదము కలిగించి యట్టి పనినుండి విముఖుని జేయరాదనియే పై వాక్యాభిప్రాయముకాని వేఱుకాదు.)

సప్తమాధ్యాయము సమాప్తము



# శ్రీమద్భగవద్గీత

## అష్టమాధ్యాయము

# కర్మయోగము

(ప్రవృత్తికి ముఖ్యకారణము )

సారము - సంగతి :

సప్తమాధ్యాయమున కృష్ణుడు ప్రకృతి గుణములు మనుజుని ప్రవృత్తికి ముఖ్యకారణమని చెప్పియున్నాడు. అర్జును డీ యధ్యాయమున నా గుణముల నామముల నెఱుగ నభిలాష ప్రకటించెను. అర్జును డిట్లు ప్రశ్నించియున్నాడు. 'మనుజుని కోరికకు విపరీతముగ నతనిని పాపమున బ్రవర్తింపజేయు గుణ మెయ్యది ?' కృష్ణు డీప్రశ్నకు సమాధానముగ రజోగుణమును వర్ణించియున్నాడు. కామము, క్రోధము రజోగుణమున కంగములనియు, నవి ప్రవృత్తికి ప్రధానకారణములనియు నుడివి, యందును కామము ప్రధానముగ జెప్పినాడు. ఆ కామము తృప్తిజెందని యగ్ని యని కృష్ణుడు వర్ణించి చివరకు దానిని త్యజింప నుపదేశించి యున్నాడు.

అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ ! బలాదివ నియోజితః. 1

వార్ష్ణేయ ! - కృష్ణ ! అథ అయం పూరుషః - ఈ మనుజుడు, అనిచ్ఛన్ అపి - కోరకయు, బలాత్ నియోజితః ఇవ - బలవంతముగ నియోగింపబడిన వానివలె, కేన ప్రయుక్తః - ఎవనిచే ప్రేరితుడై, పాపం చరతి - పాపము చేయుచున్నాడు ?

తా : 'వృష్ణికుల సంభూత, కృష్ణ ! మానవుడు పాపము చేయును; కాని ప్రతివాడును బుద్ధిపూర్వకముగ పాపము

సేయదు. పాప మొనరింప గోరకయే కొందఱు తమ్మెవరో బలపూర్వకముగ ప్రేరణచేయుచున్న ట్లందులకు బూను కొందురు. వారి కీ ప్రేరణ యెట్లు, ఎవరివలన గలుగుచున్నది? అని కృష్ణుని అర్జును డడిగెను. అందులకు కృష్ణు డీ క్రిందివిధమున సమాధానము చెప్పుచున్నాడు.

కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్. 2

రజోగుణ సముద్భవః - రజోగుణమువలన నుత్పన్నమై, మహాశనః - తిండిపోతై. మహాపాప్మా - మిక్కిలి పాపియునైనది, ఏషకామః- ఈ కామము, ఏష క్రోధః - ఈ క్రోధమును, ఇహ - ఈ కార్యక్షేత్రమునందు, ఏనం - దీనిని, వైరిణం - శత్రువుగా, విద్ధి - తెలిసికొనుము.

తా : అర్జున ! మానవున కిరువురు శత్రువులున్నారు. ఆ యిరువురిలో నొకరు కామము, మఱియొకరు క్రోధము. కామక్రోధములు రెండును రజోగుణమువలన జనించును. అందు కామమునకు తృప్తియుండదు. మహాపాపముల కదియే కారణము. ఇయ్యది నీవు తెలిసికొనుము.

ధూమే నావ్రియతే వహ్నిర్ యథాదర్శో మలేన చ
యథోల్బే నావృతో గర్భ స్తథా తే నేద మావృతమ్. 3

యథా ధూమేన వహ్నిః - ఎట్లు పొగతో నిప్పు, యథా మలేన ఆదర్శః చ - ఎట్లు దుమ్ముతో అద్దమును, ఆవ్రియతే - ఆవరింపబడుచున్నదో, యథా ఉల్బేన గర్భః - ఎట్లు మాయచే గర్భము, ఆవృతః - కప్పబడి యుండునో, తథా - అట్లే, తేన - ఆకామముచే, ఇదమ్ - ఈ జ్ఞానము, ఆవృతం - కప్పబడి యున్నది.

తా : అర్జున ! నిప్పుపొగతోను, అద్దము దుమ్ముతోను, పిండము జరాయువు - మాయతోను కప్పబడి యుండునట్లు, మనుజుడు కామముతో నావరింపబడి యున్నాడు.

ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా
కామరూపేణ కౌంతేయ దుష్పూరే ణానలేన చ. 4

కౌంతేయ : - అర్జున ! జ్ఞానినః నిత్యవైరిణా - జ్ఞానికి నిత్యశత్రువైన, దుష్పూరేణ - పూర్ణమొనర్ప సులభముకాని, ఏతేన కామరూపేణ అనలేన - ఈకామ మనెడి యగ్నిచే, జ్ఞానం - జ్ఞానము, ఆవృతం - కప్పబడి యున్నది.

తా : కుంతీపుత్ర ! ఈ కామమునకు పూర్ణత యనునది లేదు. అది యెల్లపుడు వృద్ధియగుచుండును. జ్ఞానికి కామాగ్ని నిత్యశత్రువని యెంచుము. ఈకామము జ్ఞానము నావరించి యుండి దానిని ప్రకాశింప నీయదు.

ఇంద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే,
ఏతైర్ విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్. 5

ఇంద్రియాణి - ఇంద్రియములు, మనః - మనస్సు, బుద్ధిః - బుద్ధి, అస్య - ఈ కామమునకు, అధిష్ఠానం ఉచ్యతే - ఆధార మనబడును, ఏషః - ఇది, జ్ఞానం ఆవృత్య - జ్ఞానమును కప్పియుంచి, ఏతైః - ఇంద్రియాదుల మూలమున, దేహినం - ప్రాణిని, విమోహయతి - మోహింపజేయును.

తా : ఈ కామము నేత్రాది జ్ఞానేంద్రియములను, మనస్సును, బుద్ధిని ఆశ్రయించి యుండును. ఇంద్రియాదుల మూలమున జ్ఞానమును గప్పి మనుజుని భ్రమింపజేయును; చెడుపనులలో బ్రివర్తింపజేయును.

తస్మాత్ త్వ మింద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞాన విజ్ఞాన నాశనమ్. 6

భరతర్షభ ! - భరతశ్రేష్ఠ !, తస్మాత్ - కావున, త్వమ్ - నీవు, ఆదౌ - మొదట, ఇంద్రియాణి - ఇంద్రియములను, నియమ్య - నిరోధించి, జ్ఞాన విజ్ఞాన నాశనమ్ - జ్ఞానమును, విజ్ఞానమును నశింపజేయు, ఏనం పాప్మానం - ఈ పాపిని, ప్రజహి - చంపుము.

తా : కావున నో భరతశ్రేష్ఠ ! నీ వింద్రియములను నియమించి వశములో నుంచుకొని, పాపియగు నీ కామమును విడువుము. ఇయ్యది జ్ఞాన విజ్ఞానములను నశింప జేయును.

ఇంద్రియాణి పరా ణ్యాహు రింద్రియేభ్యః పరం మనః
మనస స్తు పరా బుద్ధిర్ యో బుద్ధేః పరత స్తు సః. 7

ఇంద్రియాణి - ఇంద్రియములు, పరాణి ఆహుః - సూక్ష్మములనిరి, ఇంద్రియేభ్యః - ఇంద్రియములకంటె, మనః - మనస్సు, పరం - సూక్ష్మము, మనసః - మనస్సుకంటె, బుద్ధిః - బుద్ధి, పరా - సూక్ష్మము, యః - ఎవడు, బుద్ధేః - బుద్ధికంటె, పరతః - పరమైనవాడో, సః - వాడు, ఆత్మ - పురుషుడు.

తా : కాని, అర్జున! ఈ యింద్రియములు సూక్ష్మములు. వాని కంటెను మనస్సు సూక్ష్మము. దానికంటెను బుద్ధి సూక్ష్మము. అంతకంటెను ఆత్మ-జీవుడు మిక్కిలి సూక్ష్మము.

(కన్ను, ముక్కు, చెవులు మున్నగు నింద్రియములు కనబడుచున్నవికదా, అవి యెట్లు సూక్ష్మములు అందురేమో ; ఈ కనబడు నేత్రాదులు ఇంద్రియ గోళకములేకాని యింద్రియములు కావు. వీనిలో నింద్రియములు సూక్ష్మములై యుండును. రూపము, గంధము మున్నగు

విషయములను గ్రహించినపు డవి యున్నట్లు మన మూహింతుము. రూపాదులను గ్రహింపని కన్నులు చెవులు ఇంద్రియములుకావు. మనస్సు నేత్రాదీంద్రియముల కంటెను ఎక్కువ సూక్ష్మము. అది సంకల్పాదుల వలన దెలియబడును. మనస్సుకంటె బుద్ధి సూక్ష్మము. అది నిశ్చయాత్మ కము. దానికంటె ఆత్మ - జీవుడు మిక్కిలి సూక్ష్మము. అహం పదవాచ్య మయి కర్తృత్వభోక్తృత్వాదుల వలన అందఱకు నాత్మ దెలియబడుచునే యుండును.)

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్. 8

ఏవం - ఇట్లు, బుద్ధేః పరం బుద్ధ్వా - బుద్ధికంటె సూక్ష్మడని యెఱిగి, ఆత్మానం ఆత్మనా సంస్తభ్య - తనను తానే సంబాళించుకొని, మహాబాహో ! - అర్జున, కామరూపం దురాసదం శత్రుం - కామమనెడి కఠిన శత్రువును, జహి - చంపుము.

తా : కావున అర్జున ! పైన జెప్పినట్లు ఆత్మ సూక్ష్మ తను క్రమముగా గుర్తించి మనస్సును వశపఱచుకొనవలయును. దాని మూలమున నింద్రియములను లోబఱచుకొని, కామ మును జయింపుము.

(కామమును జయించుట సులభముకాదు. దానిని జయింపని మనుజుడే తాను కోరకున్నను కామ ప్రేరితుడై దుష్కార్యములను జేయును. పాపముల నాచరించును. అవి నెఱవేఱనినాడు క్రోధవశుడై యితరుల కపకారము చేయును.

అష్టమాధ్యాయము సమాప్తము

★

# శ్రీమద్భగవద్గీత

నవమాధ్యాయము

# కర్మయోగము

(కర్మసన్న్యాసమునకు సాధనము కర్మయే)

సారము - సంగతి :

కృష్ణుడు పంచమాధ్యాయమున కర్మ సన్న్యాస మశక్యమని చెప్పి యున్నాడు. తరువాత మూడధ్యాయములలోను, కర్మాచరణావశ్యకతను బలపఱచుచు కర్మాచరణకు ప్రధాన కారణము ప్రవృత్తియే యని యర్జునుని ప్రశ్నకు సమాధానము చెప్పియున్నాడు. అందువలన నిపుడు కర్మత్యాగము చేసి కర్మ సన్న్యాసము చేయజాలని పక్షమున నందులకు వేఱొండు ఉపాయము కలదా ! లేదా ? యని ప్రశ్నముదయించును. ఈ ప్రశ్నకు సమాధాన మీ యధ్యాయమున చెప్పబడినది.

కర్మకు అకర్మకు సంబంధించిన విషయము మిక్కిలి సూక్ష్మము. వానిలోగల భేదమును గుర్తించుట కఠినము. వాస్తవమున కర్మయే స్వయముగ కర్మ సన్న్యాసరూపమును ధరించును. కర్మనుండి ఫలాకాంక్షను, ఫలసంకల్పమునుకూడ వేఱుచేసినపుడే కర్మ కర్మసన్న్యాసమగును. కర్మ సన్న్యాసమున కింతకంటె నుత్తమవిధి మఱియొండులేదు. ఈ విధానము ననుష్ఠించుటవలన కర్మబీజము దగ్ధమగును. అందువలన నది ఫల మొసంగు యోగ్యతను కోలుపోవును. అందువలననే కర్మ చేయబడియు అకర్మ యనిపించుకొనును. ఈ విధానమున శారీరిక కర్మలను త్యజించి యా కర్మలకు సంబంధించిన భావనలను మనస్సున చింతించుట యను పాపము చేయవలసిన యావశ్యకతకూడ గలుగదు. ఇంతేకాక లోకహిత బుద్ధితో జేసిన కర్మయు అకర్మయే యగును. ఇందునను

కర్త తా నొనర్చు కర్మకు ఫలము నపేక్షింపదు, అని కృష్ణుడు పై ప్రశ్నకు సమాధానము చెప్పియున్నాడు.

కిం కర్మ కి మకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. 1

కర్మ కిమ్ - కర్మ ఏది ?, అకర్మ కిమ్ - అకర్మ ఏది ?, ఇతి అత్ర - ఈ విషయమున, కవయః అపి - విద్వాంసులుకూడ, మోహితాః- భ్రాంతులైరి, యత్ జ్ఞాత్వా - ఏది తెలిసికొని, అశుభాత్ మోక్ష్యసే - పాపమునుండి ముక్తుడ వగుదువో, తత్ కర్మ తే ప్రవక్ష్యామి - ఆ కర్మ నీకు చెప్పుదును.

తా : అర్జున ! కర్మ, అకర్మ అననేమో తెలిసికొనజాలక విద్వాంసులును భ్రమపడుదురు. కావున నీకు కర్మను గూర్చి చెప్పెదను. అది తెలిసికొని నీవు చెడుగునుండి విడివడ గలవు. శుభమాచరింప గలవు.

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః
అకర్మణ శ్చ బోద్ధవ్యం, గహనా కర్మణో గతిః. 2

హి - నిశ్చితముగ, కర్మణః అపి బోద్ధవ్యం - కర్మయోగసారము కూడ నెఱుగవలయును, వికర్మణః చ బోద్ధవ్యం - విరుద్ధ కర్మసారముకూడ నెఱుగవలయును, అకర్మణః చ అపి బోద్ధవ్యం-కర్మసన్న్యాస సారముకూడ తెలిసికొనవలసినదే. (కారణమేమన) కర్మణః గతిః గహనా - కర్మకు సంబంధించిన జ్ఞానము గంభీరమైనది.

తా : కర్మ, వికర్మ అకర్మ అని కర్మ ముత్త్రివిధములు. దాని జ్ఞానము సులభము కాదు.

కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః
స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్. 3

యః - ఎవడు, కర్మణి అకర్మ - కర్మయోగమున కర్మ సన్న్యాసమును, యః - ఎవడు, అకర్మణి చ కర్మ - కర్మసన్న్యాసమున కర్మయోగమును, పశ్యేత్-చూచునో, మనుష్యేషు-మనుజులలో, సః - వాడు, యుక్తః - యోగి, సః బుద్ధిమాన్ - వాడు బుద్ధిమంతుడు, సః కృత్స్న కర్మకృత్ - అతడు సంపూర్ణ కర్మల నొనర్చువాడు.

తా : కర్మలో అకర్మను, అకర్మలో కర్మను నెఱిగినవాడు మనుజులలో బుద్ధిమంతుడు. అతడే యోగమార్గము నెఱిగినవాడు, సమస్త కర్మలు చేయువాడు నగును.

యస్య సర్వే సమారంభాః కామసంకల్ప వర్జితాః
జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం త మాహుః పండితం బుధాః. 4

యస్య సర్వే సమారంభాః - ఎవనిసమస్త ప్రయత్నములు, కామ సంకల్ప వర్జితాః - ఫలాకాంక్ష రహితములో, ఫలసంకల్ప రహితములో తం - అతనిని, బుధాః - విద్వాంసులు, జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం - జ్ఞానమనెడి యగ్నిలో 'కర్మలను దహించినట్టి; పండితం - పండితునిగ, ఆహుః - చెప్పుదురు.

తా : తా జేయు పనుల (కర్మల) నన్నింటిని ఫలము నభిలషింపక చేయువాడు జ్ఞానమనెడి యగ్నిలో వానిని దహింపజేసినవా డగును.

(సాధారణముగ మనుజుడు కర్మలను ఫలాపేక్షతో జేయును. అతడు వానికి కర్తయై తా నొనర్చిన కర్మలకు లభించు ఫలముల ననుభవించుటకు జన్మమనెడి బంధనమున బడును. ఇది యెఱిగిన జ్ఞాని ఫలములను

గోరక కర్తవ్య కర్మలు చేయును. ఫలముల నతడపేక్షింపడు. కావున వాని ననుభవించుటకు శరీరబంధన మతనికి గలుగదు. కాబట్టి ఫలాపేక్షలేక చేయు కర్మలు తమ వలన గలుగు ఫలముల ననుభవింపనందున నిరర్థకము లగును. అట్టి కర్మలే జ్ఞానాగ్నిచే దహింపబడిన ట్లెంచబడును.

భగవద్ గీతయందును, వేదానుకూలముగ వ్రాయబడిన యితర గ్రంథముల యందును వాడబడిన కర్మశబ్దము వేదవిహిత కర్మను దెలుపును. వేదములలో చేయరానిదిగా నిషేధింపబడిన కర్మ వికర్మ అనబడును. చేయవలసిన పని చేయకుండుట అకర్మ అనబడును. అదియే కర్మాభావము.

ఈ యధ్యాయమున ఫలము కోరక చేసిన కర్మ అకర్మగా వ్యవహరింపబడినది. ఫలము నభిలషింపక చేసిన కర్మ యది చేయబడనట్లే - అకర్మగా ఎంచుటలో దోషము లేదుగదా ? అందువలననే మూడవ శ్లోకమునందు కర్మలో అకర్మ, అకర్మలో కర్మ అని యెఱుగుటగా వర్ణింపబడినది.)

త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మ ణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్ కరోతి సః. 5

కర్మఫలాసంగం - కర్మఫలాసక్తిని, త్యక్త్వా - విడిచి, నిత్యతృప్తః - సదా ప్రసన్నుడై, నిరాశ్రయః - కామనల కాశ్రయుడు కాకయుండునో, సః - వాడు, కర్మణి అభిప్రవృత్తః అపి - కర్మయందు లగ్నుడయ్యు, కించిత్ న ఏవ కరోతి - ఏమియుచేయనివాడే యగును. ఇదియే కర్మసన్న్యాసము.

తా : అర్జున! కర్మఫలాపేక్ష విడిచి, యెల్లపుడు ప్రసన్నుడుగా నుండి, కామమునకు లోనీయక కర్తవ్యకర్మలను జేయువాడు ఏమియు జేయనివాడే యగును.

నిరాశీర్ యతచిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్. 6

నిరాశీః - ఫలాపేక్షను విడిచినవాడును, యతచిత్తాత్మా - చిత్తమును ఆత్మను నియమించువాడును, త్యక్త సర్వపరిగ్రహః - సర్వసంబంధములను విడుచువాడునునగు మనుజుడు. కేవలమ్ శారీరం కర్మ కుర్వన్ - కేవల కాయిక కర్మ నాచరించుచు, కిల్బిషం న అప్నోతి - పాపమును బొందడు.

తా : కావున, ఫలాపేక్ష విడిచి చిత్తవృత్తుల నరికట్టి తన కుపయుక్తములగు పదార్థములను గూడ నెక్కుడుగా సేకరింపక జీవన నిర్వాహార్థము కర్తవ్యముల నాచరించువాడు పాపమును బొందడు.

యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః
సమః సిద్ధా వసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే. 7

యదృచ్ఛాలాభసంతుష్టః - లభించినదానితో సంతుష్టుడై, ద్వంద్వాతీతః - హర్షశోకాది ద్వంద్వములను తరించినవాడై, విమత్సరః - మాత్సర్యమును, అసూయను, విడిచినవాడునై, సిద్ధౌ అసిద్ధౌ చ సమః - కార్యము సిద్ధించినను, సిద్ధింపకున్నను నిర్వికారుడై యుండువాడు, కృత్వా అపి న నిబధ్యతే - చేసియు బద్ధుడు కాడు.

తా : ఇట్లు కర్మల నొనర్చుచు అనపేక్షితముగాలభించిన దానితో తృప్తుడు కావలయును. మఱియు అసూయవిడిచి, హర్షశోకములు, సుఖదుఃఖములు, హానిలాభములు, శీతోష్ణములు, మానావమానములు మున్నగు ద్వంద్వములకు

లోబడక, తాజేయు కర్తవ్యకర్మలు ఫలించినను ఫలింపకున్నను నిర్వికారుడై సమచిత్తముతో జీవితము గడపువాడు కర్మల నాచరించియు బంధనమున బడడు. జన్మమరణముల నుండి విడివడునని భావము.

గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః
యజ్ఞా యాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే. 8

గతసంగస్య - ఫలాసక్తిలేక, జ్ఞానావస్థితచేతసః - జ్ఞానమునందు స్థిరమైన చిత్తముగలవాడు, యజ్ఞాయ ఆచరతః - లోకహితముకొఱకు చేయువాడును, ముక్తస్య - ముక్తుడును నగువాని, సమగ్రం కర్మ-సమస్త కర్మము, ప్రవిలీయతే - ఫలము నొసంగదు, లోపించును.

తా : అర్జున ! ఫలాపేక్ష విడిచి జ్ఞానముతో చిత్తస్థైర్యమును సంపాదించినవాడు ముక్తుడగును. అతడు చేయు కర్మ యజ్ఞార్థమగును. లోక సంగ్రహార్థము చేసిన ట్లగునని భావము. కావున నట్టి కర్మలు ఫలము నియ్యక యకర్మలే యగును. అయ్యవి నశించిన ట్లగును. బంధన హేతువులు కావు; మోక్షప్రాప్తికి తోడ్పడును.

నవమాధ్యాయము సమాప్తము



# శ్రీమద్భగవద్గీత

దశమాధ్యాయము

## కర్మయోగము

(యజ్ఞ జ్ఞానయజ్ఞముల శ్రేష్ఠత)

సారము - సంగతి :

అజువయధ్యాయమున యజ్ఞముకొఱకు కర్మచేయుట తప్పదని చెప్పబడినది. ప్రసంగవశమున నవమాధ్యాయాంతమునను నది చర్చింప బడినది. ఈ యధ్యాయమున యజ్ఞభేదములను చెప్పుచు వానిలో జ్ఞాన యజ్ఞము శ్రేష్ఠమని చెప్పబడినది. ఇందు ద్రవ్యయజ్ఞము, తపోయజ్ఞము యోగయజ్ఞము, జ్ఞానయజ్ఞము నని యజ్ఞము నాలుగువిధముల విభజింప బడినది. కర్మకాండమంతయు ద్రవ్యయజ్ఞములోనే లెక్కింపబడినది. బ్రహ్మోపాసన, ఇంద్రియ సంయమము తపోయజ్ఞ మనబడినది. ప్రాణా యామము, నియతాహారాది యోగక్రియలు యోగయజ్ఞము. సంశయము లన్నియు విడిచి, బుద్ధి నొకనిర్ణయమున స్థిరపఱచుట జ్ఞానయజ్ఞము. ఈ జ్ఞానము శ్రద్ధాయుక్తమగునెడల మనుష్యుడు వెంటనే ధ్యేయమును పొందును. జ్ఞానములేకున్న నిహపరములు రెండును సిద్ధింపవు. కర్మయో గముతోబాటు సంశయచ్ఛేదిజ్ఞానము చేరిన సువర్ణమునకు సుగంధమబ్బినట్లే. ఇట్లు జ్ఞానమహిమచెప్పి, సంశయమును దూరమొనర్చి అర్జునుని సంగ్రామ. రూప కర్మయోగమున లగ్నుడగునట్లు కృష్ణుడు ప్రేరేపించెను.

దైవ మే వాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞేనై వోపజుహ్వతి. 1

అపరే యోగినః - కొందఱు యోగులు, దైవం యజ్ఞం ఏవ - అగ్ని వాయువు మున్నగు దేవతల నిమిత్తము (ద్రవ్య) యజ్ఞమునే.

ఉపాసతే - ఉపాసింతురు, ఆచరింతురు, అపరే - ఇతరులు, బ్రహ్మాగ్నౌ- బ్రహ్మరూపమగు నగ్నియందు, యజ్ఞం - యజ్ఞమును - ఆత్మ, మనస్సు బుద్ధి యనెడి జ్ఞానయజ్ఞ సామగ్రిని, యజ్ఞేన ఏవ - యజ్ఞముతో - ధారణ, ధ్యానము, సమాధియను క్రియలతో, ఉపజుహ్వతి - హోమ మొనర్తురు.

తా : కర్మయోగులలో కొందఱు దైవయజ్ఞము చేయు చుందురు. మఱికొందఱు బ్రహ్మయజ్ఞము నాచరింతురు.

(భూమి, జలము, అగ్ని, వాయువు మున్నగు పదార్థములను పవిత్రముచేసి సంస్కరించుటకు జేయు హోమము దైవయజ్ఞ మనబడును. సంధ్యోపాసనాదులు బ్రహ్మయజ్ఞ మనబడును.)

శ్రోత్రాదీ నీంద్రియా ణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి
శబ్దాదీన్ విషయా నన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి. 2

అన్యే - కొందఱు, శ్రోత్రాదీని ఇంద్రియాణి - చెవి మున్నగు ఇంద్రియములను, సంయమాగ్నిషు - సంయమ మనెడి యగ్నులలో, జుహ్వతి- హోమము చేయుదురు. అన్యే - ఇంక కొందఱు, శబ్దాదీన్ విషయాన్ - శబ్దము మున్నగు విషయములను, ఇంద్రియాగ్నిషు - ఇంద్రియము లనెడి యగ్నులలో, జుహ్వతి - హోమము చేయుదురు.

తా : వేఱొక కొందఱు యోగు లింద్రియ శక్తులను దుర్వ్యయోగము సేయక, వశమున నుంచుకొని సత్కార్యముల నొనర్చుచుందురు. ఇదియు నొక యజ్ఞమే ఇంక గొందఱు ఇంద్రియములను విషయముల వెంట బరువిడనీయక నియమములో నుంచుచుందురు. విషయ వాసనలందు దగులొకనరు. ఇదియు యజ్ఞమే.

సర్వాణీంద్రియ కర్మాణి ప్రాణకర్మాణి చాపరే
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే. 3

అపరే - వేఱొక కొందఱు, సర్వాణి ఇంద్రియ కర్మాణి - సమస్త ఇంద్రియ కర్మలను, ప్రాణ కర్మాణి చ - ప్రాణ కర్మలను, జ్ఞానదీపితే - జ్ఞానమువలన ప్రజ్వలితమైన, ఆత్మ సంయమయోగాగ్నౌ - చిత్తైకాగ్రత యనెడి యోగాగ్నిలో, జుహ్వతి - ఆహుతి చేయుదురు.

తా : కొందఱు ఇంద్రియముల నరికట్టి ప్రాణవృత్తులను స్వాధీన మొనర్చుకొని, చిత్తము నేకాగ్రము సేయుటకు ప్రయత్నించుచుందురు. అందువలన జ్ఞానము వర్ధిల్లును. ఇది ఆత్మసంయమ యజ్ఞము.

అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాపరే
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః. 4

అపరే - ఇతరులు, ప్రాణాపానగతీరుద్ధ్వా - ఉచ్ఛ్వాస నిశ్వాసల గతిని ఆపి, ప్రాణాయామ పరాయణాః - ప్రాణాయామమున తత్పరు లగుచు, అపానే ప్రాణం - అపాన వాయువున ప్రాణవాయువును, ప్రాణే అపానం - ప్రాణమున నపానమును, జుహ్వతి - ఆహుతి చేయుదురు.

తా : ఇతరులు ఉచ్ఛ్వాస నిఃశ్వాసములను స్వాధీనము చేసికొని ప్రాణాయామ మొనర్చుచు చిత్తశుద్ధికొఱకు యత్నింతురు.

అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపిత కల్మషాః. 5

నియతాహారాః - నియమితాహారమును తీసికొనువారు, అపరే - కొందఱు, ప్రాణాన్ ప్రాణేషు - ప్రాణములను ప్రాణములలో, జుహ్వతి -

వ్రేల్చుచున్నారు. ఏతే సర్వే అపి - వీరందఱును, యజ్ఞవిదః - యజ్ఞము నెఱిగినవారే, యజ్ఞక్షపితకల్మషాః - యజ్ఞము మూలమున పాపములను తొలగించుకొనినవారే.

(అపానమున ప్రాణమును, ప్రాణమున అపానమును ఆహుతినిచ్చు విధమియ్యది ప్రాణాయామము నభ్యసింపగోరు మనుజుడు ముందు రెండువిధములగు నుపాయముల ననుష్ఠింపవలయును. ప్రాణమును అపానముతో కలుపుట ఒక యుపాయము. అట్లే అపానమును ప్రాణముతో కలుపుట రెండవ యుపాయము. మనుజుడు తనలోని వాయువును బయటికి తీసి విడిచిపెట్టుచుండును. ఆ వాయువే అపానమనబడును - నిఃశ్వాసము. వెలుపలినుండి లోపలికి పీల్చుకొనువాయువు ప్రాణమనబడును - ఉచ్ఛ్వాసము. దేనిని అపానము నిశ్వాసము అనుచున్నామో ఆ వాయువుకూడ మొదట, శరీరమున ఊపిరితిత్తులలో చేరకముందు ప్రాణముగానే యుండెను. అందులో ననేక గుణములుండెను. అది ఉచ్ఛ్వాసము ద్వారమున ఊపిరి తిత్తులలో చేరి యట చేరియుండిన మలినరక్తముతో కలిసి దూషితమై అపానము పేర వెలికి విడువదగినది అగును. అందువలన నది నిఃశ్వాసము ద్వారమున వెలుపలికి విడిచిపెట్టబడును. ఊపిరితిత్తులలో నిండియుండు గాలియంతయు బయటికి పోవుట అంత సులభముకాదు. వానిలో నే కొంచెము మిగిలియున్నను అది దూషితమగుటచే ఊపిరి తిత్తులను చెడగొట్టును.

కాబట్టి ప్రాణమును అపానమునం దాహుతినొసంగు విధానము చెప్ప బడినది. వెలుపలనుండు ప్రాణము నధికమాత్రలో గ్రహించి యూపిరి తిత్తులు నింపబడును. ఈ క్రియ నెమ్మది నెమ్మదిగా చేయవలయును. అట్లు చేయక వేగముగ గ్రహించు పక్షమున నొకప్పుడు ప్రాణతంతువులకు హాని కలుగవచ్చును. అధికమాత్రలో లోపలికి తీసికొనబడిన ప్రాణము ఊపిరితిత్తులలోని ప్రతి భాగమునందును జేరి యెట నేని అపానభాగము

మిగిలియున్న దానిని కూడ శుద్ధి చేయును, ఇయ్యదియే యపానమున ప్రాణము నాహూతి యొనర్చుట యనబడును. ఇట్లు ఊపిరితిత్తులలో నింపిన ప్రాణము చాల తడవు అటనే యుంచబడును. ఇట్లు నిలుపుట వలన రెండు లాభములు కల్గును. ప్రాణము లోపలనున్న యపానమునందు కలిసి దానితోబాటు శ్వాసకోశమునకు చెందిన యా భాగమునుకూడ శుద్ధిచేయును. ఇది యొకలాభము. ప్రాణము చాల తడవు శ్వాసాశయము లందుండుట వలన దాని యాకర్షణమువలన శరీరము నందంతటను వ్యాపించియున్న ప్రాణముకూడ హృదయము వంకకు మరల నారంభించును. ప్రాణధారణ వలన చిత్తముకూడ నేకాగ్రము కావొడగును. ఇది రెండవ లాభము.

ఇక ప్రాణమున నపానము నాహూతి యొనర్చుట ప్రాణాయామమున రెండవ ప్రకారము. శరీరమునకు వెలుపలనుండు వాయువు ప్రాణమనబడును. శ్వాసకోశములనుండి యపానమంతయు వెలుపలికి విడువబడును. అపానము ప్రాణమున నాహూతి యొనర్చుట యన నిదియే. అట్లుచేసి శ్వాసకోశములను కాళీచేసి యట్లే కొంతతడవు వానినుంచవలయును. ఇట్లు చేయుటవలనను శరీరమునం దితరావయవములలో వ్యాపించియున్న ప్రాణము హృదయమువంక కాకర్షింపబడును. అట్లుకాగా మనస్సు ఏకాగ్ర మగును.

ప్రాణమున ప్రాణము నాహూతి యొనర్చుట మూడవరకపు ప్రాణాయామము. ఇందు ప్రాణమున నపానముకాని, అపానమున ప్రాణముకాని ఆహూతి యొనర్పబడదు. ప్రాణ మెక్కడిదక్కడనే యుండునట్లు - ఉచ్ఛ్వాసనిఃశ్వాసములు కలుగకుండునట్లు ప్రాణాపానములగతి నిలిపి వేయబడును. ఇదియే ప్రాణమున ప్రాణము నాహూతి చేయుట యగును. దీనివలనను మనస్సు ఏకాగ్రము కాగలుగును. ప్రాణాయామమున నిది యొక విధము. ధ్యానయోగము మూలముగను ప్రాణాయామము జరుగును. అది రెండవ విధము.

ఈ విధి ననుసరించి యీ గీతాశ్లోకముల భావము క్రింద వ్రాయబడు చున్నది. ఈ విధియందు హృదయము నారంభించి బ్రహ్మరంధ్రము వఱకుగల ప్రాణమంతయు ప్రాణ మనబడును. హృదయమునుండి క్రింది భాగమున పాదములవఱకు నుండు ప్రాణము అపానమనబడును. ఈ విధియందు భ్రుకుటి మధ్యలో గాని బ్రహ్మరంధ్రమునగాని మన స్సేకాగ్రము చేయబడును. మనస్సునుండి వృత్తులను తొలగించి పైరెండు స్థానములలో నొకచోట మనస్సు నిలుపబడునని యభిప్రాయము. మనస్సు ఎటుపోయిన నటు ప్రాణముకూడ పో నారంభించును. మనస్సు మస్తిష్క మున నెటనేని ఏకాగ్రమయినపుడు హృదయమునకు పై భాగమునను క్రిందిభాగమునను నుండు ప్రాణమంతయు మస్తిష్కముపైపున కేగ ప్రారంభించును. హృదయమునకు క్రిందనున్న ప్రాణము దానికి పైన నున్న ప్రాణముతో కలిసినపుడు అవి రెండును పరస్పరము ఒకదానియం దింకొకటి యాహుతియైన ట్లెంచబడును. హృదయమునకు పైననుండు ప్రాణము మస్తిష్కమునసుండు ప్రాణముతో చేరినపుడు ప్రాణమున ప్రాణమాహుతియైనట్లు తెలిసికొనవలయును. మస్తిష్కమున ప్రాణాపానము లేకమైనపుడు సమాధి యేర్పడును.

ప్రాణాయామమునకు భోజన నియమ మావశ్యకము. ఆహారము మితముగా నుండవలయును. సాత్వికమై యుండవలయును )

ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాపరే
స్వాధ్యాయ జ్ఞానయ జ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః 6

సంశితవ్రతాః - పైనజెప్పిన శ్రేష్ఠవ్రతముల నాచరించు, యతయః- యతులు, దేవయజ్ఞ మొనర్చువారు, ద్రవ్యయజ్ఞాః- ద్రవ్యముతో యజ్ఞము నొనర్తురు. బ్రహ్మాగ్నియందు ఆత్మను, సంయమాగ్నియందు ఇంద్రి యములను ఆహుతి నొనర్చువారు, తపోయజ్ఞాః - తపోయజ్ఞము నొనర్తురు.

ప్రాణమున నపానమును, నపానమున ప్రాణమును, ప్రాణమున ప్రాణమును నాహుతి జేయువారు, యోగయజ్ఞాః - యోగయజ్ఞమును జేయుదురు. ఇంద్రియ క్రియలను, ప్రాణక్రియలను జ్ఞానాగ్నియం దాహుతి చేయువారు- ఫలాసక్తిలేని నిష్కామకర్మలను బాగుగ నెఱింగి ఇంద్రియములతో క్రియల నొనర్చువారు, స్వాధ్యాయజ్ఞానయజ్ఞాః - ధర్మము, నీతియు ననెడు స్వాధ్యాయము మూలమున జ్ఞానయజ్ఞము చేయువా రగుదురు.

తా : ఇట్లు కర్మయోగులు ద్రవ్యయజ్ఞములు, తపో యజ్ఞములు, యోగయజ్ఞములు, స్వాధ్యాయ యజ్ఞములు, జ్ఞాన యజ్ఞములు చేయుచుందురు. వారు వ్రతులు; యతులు.

యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ ! 7

యజ్ఞశిష్టామృత భుజః - యజ్ఞశేషమనెడి యమృతమును భుజించు వారు, సనాతనం బ్రహ్మ - అనాది బ్రహ్మను, యాంతి - పొందుదురు, కురుసత్తమ ! - కురుశ్రేష్ఠ !, అయజ్ఞస్య - యజ్ఞముచేయని వానికి, ఆయం లోకః నాస్తి - ఈలోకములేదు. అన్యః కుతః - పరలోక మెట్లు సిద్ధించును ! (ఇహపరములు రెండును చెడును.)

తా : ఇట్లు యజ్ఞముల నాచరించి యజ్ఞశేషమును నమృతమును సేవించువారికి బ్రహ్మపదము లభించును. వారు మోక్షానందము ననుభవింతురు. పైన జెప్పబడిన యజ్ఞముల నాచరింపని వారికి ఈ జన్మమే సఫలము కాదు. ఇక పరజన్మ మెట్లు సఫల మగును !

ఏవం బహువిధా యజ్ఞా వితతాం బ్రహ్మణో ముఖే
కర్మజాన్ విద్ధి తాన్ సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే. 8

ఏవం - ఇట్లు, బ్రహ్మణః ముఖే - వేదవాణి మూలమున, బహు విధాః - అనేకవిధములైన, యజ్ఞాః - యజ్ఞములు, వితతాః - వ్యాపించి నవి, తాన్ సర్వాన్ - వాని నన్నింటిని, కర్మజాన్ విద్ధి - కర్మలవలన నేర్పడునవిగా నెఱుంగుము, ఏవం జ్ఞాత్వా - ఇట్లు తెలిసికొని, విమో క్ష్యసే - విడువబడుదువు.

తా : పైన వర్ణించిన యజ్ఞములవంటి సత్కార్యములు వేదమున నెన్నియో మానవులకు కర్తవ్యములుగా విధింపబడి యున్నవి. అవి యన్నియు కర్మల నాచరించుట చేతనే సిద్ధించును. ఈ విషయము నెఱిగి మోక్షోపాయమును గుర్తిం తువు గాక! కర్మ విముఖులకు సుఖశాంతులు లభింపవు.

శ్రేయాన్ ద్రవ్యమయాద్ యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప :
సర్వం కర్మాఖిలం పార్థ ! జ్ఞానే పరిసమాప్యతే. 9

పరంతప ! శత్రుతాపక ! అర్జునా, ద్రవ్యమయాత్ యజ్ఞాత్ - ద్రవ్యముతోనగు యజ్ఞముకంటె, జ్ఞానయజ్ఞః - జ్ఞానయజ్ఞము, శ్రేయాన్ - శ్రేష్ఠము, పార్థ ! - అర్జునా!, సర్వం - అంతయు, అఖిలం కర్మ-సమస్త కర్మలు, జ్ఞానే - జ్ఞానము కలిగినమీదట, పరిసమాప్యతే - సంపూర్ణమగును,

తా : ద్రవ్యములతో నాచరించు యజ్ఞము కంటె జ్ఞాన యజ్ఞము శ్రేష్ఠము. కర్మలన్నియు జ్ఞానమునందు సమాప్తి నొందును. జ్ఞానము వర్ధిల్లజేయు కర్మలు శ్రేష్ఠములని భావము.

న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే
తత్ స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విందతి. 10

ఇహ - ఈ లోకమున, జ్ఞానేన - జ్ఞానముతో, సదృశం - సమానమై, పవిత్రం - శుభమైనది, న హి విద్యతే - లేనేలేదు. తత్ - దానిని, యోగసంసిద్ధః - యోగమున సిద్ధుడైనవాడు, స్వయం - తనకుతానే, కాలేన - కొంతకాలమునకు, ఆత్మని - తనలోనే, విందతి - పొందును.

తా : లోకమున జ్ఞానమువంటి పవిత్రమైన వస్తువు మఱియొందులేదు. కర్మయోగమున సిద్ధిబొందిన నాడు మానవుడు తనలోనే తానట్టి జ్ఞానము పొందును.

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరే ణాధిగచ్ఛతి. 11

శ్రద్ధావాన్ - శ్రద్ధగలవాడు, సంయతేంద్రియః - జితేంద్రియుడు, తత్పరః - జ్ఞానమార్గమున లగ్నమైనవాడు, జ్ఞానం లభతే - జ్ఞానమును బొందును, జ్ఞానం లబ్ధ్వా - జ్ఞానముపొంది, అచిరేణ - త్వరలో, పరాం శాంతిం - పరమ శాంతిని, అధిగచ్ఛతి - పొందును.

తా : జ్ఞానసంపాదనకు గడంగువాడు ఇంద్రియములను వశమున నుంచుకొనవలయును. జితేంద్రియుడు సత్యాచరణముతో జ్ఞానము పొందును. జ్ఞానికి శాంతి లభించుటలో విలంబ ముండదు.

అజ్ఞ శ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః. 12

అజ్ఞః చ అశ్రద్దధానః - జ్ఞానము, శ్రద్ధలేనివాడు: సంశయాత్మా - సందేహించువాడు, వినశ్యతి - నశించును, సంశయాత్మనః - సంశయము గలవానికి, అయం లోకః న - ఈ లోకములేదు, పరః న - పరలోకము

లేదు, ఇహపరములు రెండును సిద్ధింపవని భావము, సుఖం న అస్తి - సుఖముకూడ లేదు.

తా : శ్రద్ధావంతుడు - సత్యాచరణుడు కాక, జ్ఞానము పొందక, ఆత్మ, పరమాత్మలనెడి తత్త్వము లున్నవో లేవో యను సంశయముతో గూడిన వాడు నశించును. అతని జీవితము వ్యర్థమగును. అతనికి దృశ్యమాన జడప్రపంచము తక్క మఱియొండు లేదు. అట్టి వానికి సుఖము లభింపనేరదు.

యోగ సంన్యస్త కర్మాణం జ్ఞాన సంఛిన్న సంశయమ్
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ ॥ 13

యోగ సంన్యస్త కర్మాణం - యోగము - కర్మఫలత్యాగము మూలమున కర్మలను త్యజించిన వానిని, జ్ఞాన సంఛిన్న సంశయం - జ్ఞానము ద్వారమున సంశయమును ఛేదించిన వానిని. ఆత్మవంతం - ఆత్మజ్ఞానిని, కర్మాణి న నిబధ్నంతి - కర్మలు బంధింపవు.

తా : కర్మయోగము ననుసరించి సమస్త కర్మలను విడిచినవాడై - ఫలాపేక్షను విడిచి సమస్తకర్మ లాచరించుచు తన్మూలమున లభించిన జ్ఞానముతో సంశయమును బోనాడి చిత్తస్థైర్యముతో నాత్మజ్ఞానియైన వానికి నాతడొనర్చు కర్మలు జన్మబంధము కలిగింపవు.

తస్మా దజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానా స్తి నాత్మనః
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత ॥ 14

తస్మాత్ - కావున, అజ్ఞాన సంభూతం - అజ్ఞానము వలన జనించిన, హృత్ స్థం - హృదయమున నున్న, ఆత్మనః ఏనం సంశయం -

నీ యీ సందేహమును, జ్ఞానాసినా - జ్ఞాన ఖడ్గముతో, ఛిత్త్వా - ఖండించి, యోగం ఆతిష్ఠ - యోగము నాశ్రయింపుము, పరంతప ! - అర్జున !, ఉత్తిష్ఠ - లెమ్ము.

తా : భారత ! ఆత్మజ్ఞానము లేనందున నేర్పడిన హృదయములోని సంశయమును నా యీ ప్రబోధముచే గలిగిన జ్ఞానఖడ్గముతో ఛేదించి కర్మయోగమునకు బూనుకొనుము. లేచి నిలబడుము. ధర్మస్థాపనకై ప్రాప్తించిన యుద్ధమును ఫలాపేక్షవిడిచి కర్తవ్య కర్మగా నెంచి యాచరింపుము.

దశమాధ్యాయము సమాప్తము



# శ్రీమద్భగవద్గీత

## ఏకాదశాధ్యాయము

# కర్మయోగము

## (కర్మసంన్యాసముకంటె కర్మయోగము శ్రేష్ఠము)

సారము - సంగతి :

దశమాధ్యాయమున కృష్ణుడు యోగము (కర్మఫల సంన్యాసము) నకే కర్మసంన్యాసరూపము నిచ్చియున్నాడు. అందువలననే యర్జును డీ యధ్యాయమునందు మున్ముందుగా 'నీవు కర్మయోగమును కర్మసంన్యాసమును కలిపి చెప్పుచున్నావు. కాని, నే నీరెంటిలో నేది శ్రేష్ఠమో తెలియ గోరు చున్నాను. తెలిసికొని శ్రేష్ఠము నాచరింపగలుగుదును. కావున శ్రేష్ఠమేదియో నిర్ణయించి చెప్పుదువుగాక !' యని కృష్ణుని ప్రశ్నించి యున్నాడు.

కృష్ణుడందుల కిట్లు చెప్పెను. 'అర్జున ! అవి రెండును కల్యాణ కారకములే. కాని, యా రెంటియందును కర్మయోగమే శ్రేష్ఠము. ఫల దృష్టితో సాంఖ్యము యోగము సమానమే యైనను, ఈ రెంటిలో నొక దానిని సిద్ధింపజేయువాడు రెంటి ఫలమును బొందును. కాని, అనుష్ఠాన దృష్టితో చూచిన కర్మయోగమే శ్రేష్ఠము. కారణమేమన ! ఫలాకాంక్ష విడువక కర్మలు విడువవు. యోగి యనుష్ఠాన మీ విధముననే యారంభ మగును. దీనికి విపరీతముగ సంన్యాసికి మొదటనే కర్మత్యాగము చేయ వలసి యుండును. ఈ స్థితిలో కర్మ త్యజించినను మనస్సున ఫలాకాంక్ష, సంకల్పము నట్లే యుండును. అవియే బంధమునకు కారణములు. ఒకవేళ సంన్యాసియు మొదట ఫలకామన - సంకల్పము విడిచి, పిమ్మట కర్మలను త్యజియించునేని ముందు కర్మయోగము నతడును చేసినవాడే యగును.

ఫలత్యాగమువలన కర్మలు ఫలజనకములు కానపుడు కర్మలను ప్రత్యేక ముగ త్యజియింప నావశ్యకమేముండును ? అందువలన ఫలాకాంక్ష సంకల్పము విడచినవాడే కర్మయోగి: కర్మ సంన్యాసి, కర్మలు విడుచువాడు మాత్రము కాడు.

సంన్యాసం కర్మణాం కృష్ణ ! పున ర్యోగం చ శంససి
యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్. 1

అర్జును డిట్లనెను : కృష్ణ ! కర్మణాం సంన్యాసం - కర్మల సంన్యాసము, పునః యోగం చ శంససి - మరల కర్మయోగమును ఉపదేశించు చున్నావు, ఏతయోః - ఈ రెంటిలో, యత్ ఏకం శ్రేయః - ఏ యొకటి శుభదాయకమో, తత్ మే సునిశ్చితం బ్రూహి - అది నాకు నిశ్చితముగ జెప్పుము.

తా : కృష్ణ ! కర్మ సంన్యాసము కర్మయోగము నను రెండు విషయములు వర్ణించితివి. ఈ రెంటి యందును నేది మిక్కిలి శ్రేయస్కరమో యదియే నాకు నిశ్చిత మొనర్చి చెప్పుము.

సంన్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరా వుభౌ
తయో స్తు కర్మసంన్యాసాత్ కర్మయోగో విశిష్యతే. 2

కృష్ణుని సమాధానము: సంన్యాసః కర్మయోగః చ - సంన్యాసము, కర్మయోగమును, ఉభౌ నిశ్శ్రేయసకరౌ - రెండును శుభదాయకములే, తు - కాని, తయోః - ఆ రెంటిలో, కర్మ సంన్యాసాత్ - కర్మత్యాగము కంటె, కర్మయోగః - ఫలాకాంక్ష సంకల్పము విడిచి కర్మల నాచరించుట, విశిష్యతే - శ్రేష్ఠ మగుచున్నది.

తా : అర్జున ! సంన్యాసము - కర్మయోగము రెండును శుభంకరములే - మోక్షదాయకములే. కాని, ఆ రెండింటి లోను కర్మ సంన్యాసముకంటె కర్మయోగమే గొప్పది.

జ్ఞేయః స నిత్యసంన్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి
నిర్ద్వంద్వో హి మహాబాహో ! సుఖం బంధాత్ ప్రముచ్యతే. 3

మహాబాహో !- అర్జున ! యః న ద్వేష్టి - ఎవడు ద్వేషింపడో, యః న కాంక్షతి - ఎవడు కాంక్షింపడో, సః నిత్యసంన్యాసీ - అత డెల్లప్పుడు సంన్యాసియే, జ్ఞేయః - (అని) తెలియదగును, హి-కారణమేమన, నిర్ద్వంద్వః - రాగద్వేషాది ద్వంద్వములకు లోబడనివాడు, బంధాత్ - బంధనమునుండి, సుఖం ప్రముచ్యతే - సుఖముగ విడివడును

తా : వాస్తవమున రాగద్వేషములు లేనివాడే నిత్య సంన్యాసి, అర్జున ! ద్వంద్వములను జయించినవాడు జన్మ బంధము నుండి సుఖముగా విడివడగలడు.

సాంఖ్యయోగౌ పృథగ్ బాలాః ప్రవదంతి న పండితాః
ఏకమ ప్యాస్థితః సమ్య గుభయోర్ విందతే ఫలమ్. 4

సాంఖ్యయోగౌ - సాంఖ్యమును, యోగమును, బాలాః- అజ్ఞానులు, పృథక్ ప్రవదంతి - వేఱనిచెప్పుదురు. పండితాః న - విద్వాంసులు చెప్పరు. ఏకమ్ అపి సమ్యక్ ఆస్థితః - ఒకదాని యందైనను బాగుగ నారూఢుడైన వాడు, ఉభయోః ఫలం విందతే - రెంటిఫలమును బొందును.

తా : సాంఖ్యము, యోగము - జ్ఞానము, కర్మ అను నీరెండింటిని అజ్ఞులైనవారు వేఱువేఱుగ జెప్పుదురు. పండితులు అట్లు చెప్పరు. జ్ఞానకర్మలలో నేదియొకదానిని బాగుగ సాధించి నను రెండిటి ఫలము లభించును. కాని, జ్ఞాని కానివాడు

ఫలాపేక్షవిడిచి కర్మల నాచరింపనేరడు. ఫలాపేక్షవిడిచి కర్మల నొనర్చువాడు జ్ఞానియే యగును. కావున జ్ఞానము, కర్మయోగము రెండును పరస్పర సంబద్ధములై యొకే ఫలమును జేకూర్చును.

యత్ సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్ యోగైరపి గమ్యతే
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి. 5

యత్ స్థానం - ఏ స్థానము, సాంఖ్యైః - కర్మసంన్యాసులచే, ప్రాప్యతే - పొందబడునో, తత్ - అది, యోగైః అపి - యోగులచేతను, గమ్యతే - పొందబడును. యః - ఎవడు, సాంఖ్యం చ యోగం చ - సాంఖ్యమును యోగమును, ఏకం పశ్యతి - ఒకటిగ నెఱుగునో, సః పశ్యతి - వాడే యెఱిగినవాడు.

తా : జ్ఞానులుపొందు స్థానమునే యోగులును బొందుదురు. ఇరువురును మోక్షానందము ననుభవింతురు. కావున సాంఖ్యయోగముల నొక్కటిగా నెంచువాడే జ్ఞానియగును.

సంన్యాసస్తు మహాబాహో దుఃఖ మాప్తు మయోగతః
యోగయుక్తో మునిర్ బ్రహ్మ అచిరేణాధిగచ్ఛతి. 6

మహాబాహో ! - మహాభుజ ! అర్జున ! అయోగతః - కర్మయోగ మొనర్పక, సంన్యాసః తు - సంన్యాసము, ఆప్తుం దుఃఖమ్ - పొందుట కష్టము, యోగయుక్తః - కర్మయోగమున లగ్నుడైన, మునిః - ముని, అచిరేణ - శీఘ్రముగనే, బ్రహ్మ - బ్రహ్మమును, అధిగచ్ఛతి - ప్రాప్తించును - పొందును.

తా : అర్జున ! కర్మయోగము ననుసరింపని వాఁడు సంన్యాసి కానేరఁడు. యోగయుక్తుఁడగు మనుజుఁడు బ్రహ్మమును స్వల్పకాలముననే పొందును.

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః
సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి న లిప్యతే. 7

విశుద్ధాత్మా - శుద్ధాత్మయు, జితేంద్రియః - జితేంద్రియుఁడు, విజితాత్మా - తనను జయించినవాఁడు, సర్వభూతాత్మభూతాత్మా - సర్వప్రాణులకు సమానమైన ఆత్మగలవాఁడు - అందఱి ఆత్మను తన ఆత్మతో సమానమని యెంచువాఁడు, యోగయుక్తః - కర్మయోగియు నగు మనుజుఁడు, కుర్వన్ అపి - కర్మల నాచరించుచున్ను, న లిప్యతే - లిప్తుఁడు కాఁడు.

తా : కర్మయోగి చిత్తమును శుద్ధ మొనర్చుకొనును. ఇంద్రియములను జయించును. అట్టి యోగి సమస్త ప్రాణులందును, పదార్థములందును సమముగా వ్యాపించియుండి, యన్నింటికి నాత్మగానుండు పరమాత్మను దనలో గుర్తించుచు కర్మల నాచరించియు వానిచే బద్ధుఁడుకాఁడు – లిప్తుఁడుకాఁడు.

నైవ కించిత్ కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్
స్వపన్ శ్వసన్. 8

ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ ఉన్మిష న్నిమిష న్నపి
ఇంద్రియా ణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్. 9

పశ్యన్ - చూచుచు, శృణ్వన్ - వినుచు, స్పృశన్ - స్పృశించుచు-తాకుచు, జిఘ్రన్ - వాసన చూచుచు, అశ్నన్ - తినుచు, గచ్ఛన్ - నడుచుచు, స్వపన్ - నిద్రించుచు, శ్వసన్ - శ్వాసించుచు, ప్రలపన్ -

మాటాడుచు, విసృజన్ - విడుచుచు, గృహ్ణన్ - గ్రహించుచు, ఉన్మిషన్ నిమిషన్ - కనుతెప్పలు తెఱచుచు, మూయుచుకూడ, తత్త్వవిత్ - తత్త్వ జ్ఞాని, యుక్తః - కర్మయోగి, ఇంద్రియాణి ఇంద్రియార్థేషు - ఇంద్రియ ములు శబ్దస్పర్శాది విషయములందు. వర్తంత ఇతి ధారయన్ - లగ్న ములై యున్నవని యెంచుచు, కించిత్ న ఏవ కరోమి - నేను ఏమియు చేయుటలేదు, ఇతి మన్యేత - అని యెంచును.

తా : తత్త్వము నెఱిగిన కర్మయోగి కర్తవ్య నిరతు డయ్యు దానేమియు జేయుచున్నట్లెంచడు అతడు చూచును. వినును. వస్తువులను తాకును. ఆఘ్రాణించును. తినును. నడచును. ఉచ్ఛ్వాస నిఃశ్వాసముల నొనర్చును. నిద్రించును. సంభాషించును. కావలసిన వస్తువులను గ్రహించును. అక్కఱ లేనివి విడుచును. కంటి ఱెప్పలు మూయును. విప్పును. ఇట్టి పనులు చేయుచుండియు నత డింద్రియములను విషయములందు వర్తించు స్వభావముగల వానినిగా నెంచి వానియం దాసక్తుడు కాడు.

బ్రహ్మ ణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః
లిప్యతే న స పాపేన పద్మపత్ర మివాంభసా. 10

యః - ఎవడు, సంగం త్యక్త్వా - ఆసక్తివిడిచి, బ్రహ్మణిఆధాయ - బ్రహ్మకర్పించి, కర్మాణి కరోతి - కర్మలను చేయునో, సః - అతడు, అంభసా - నీటిచే, పద్మపత్రమివ - తామరాకువలె, పాపేన - పాపముతో, లిప్యతే న - లిప్తుడు కాడు.

తా : ఫలాపేక్ష విడిచి కర్తవ్య కర్మలఫలము నీశ్వరున కర్పించి, ఈశ్వర ప్రణిధానబుద్ధితో మెలగువాడు పాపముల

వంక బోదు. కావున నతనికి పాపము లంటవు. తామ రాకునకు నీటిలో నున్నను నీ రంటదు కదా !

ఫలాసక్తుడు దుష్కర్మల నాచరించి పాపి యగుట కవకాశ ముండును. కాని ఫలము గోరనివాడు దుష్కర్మల నేల యాచరించును ? కావున ఫలాపేక్ష విడిచి పాపములు చేసినను నవి యతని నంటవని యెంచరాదు.

కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే. 11

యోగినః - యోగులు. సంగం త్యక్త్వా - ఆసక్తి విడిచి, ఆత్మ శుద్ధయే - ఆత్మశుద్ధికొఱకు, మనసా, వాచా, కాయేన - మనోవాక్కాయము లతో, కేవలైః ఇంద్రియైః అపి - కేవల ఇంద్రియములతోను, కర్మ కుర్వంతి - కర్మలు చేయుదురు.

తా : కర్మయోగులు ఫలాపేక్ష విడిచి మనోవాక్కాయ ములతోను, బుద్ధితోను, రాగద్వేషరహితములైన యింద్రి యములతోను కర్తవ్యకర్మల నాచరింతురు. వారి కందువలన చిత్తశుద్ధి కలుగును.

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీమ్,
అయుక్తః కామకారేణః ఫలే సక్తో నిబధ్యతే. 12

యుక్తః - కర్మయోగి, కర్మఫలం త్యక్త్వా - కర్మఫలమునువిడిచి, నైష్ఠికీం శాంతిం ఆప్నోతి - స్థిరశాంతిని పొందును. అయుక్తః - కర్మ యోగి కానివాడు, కామకారేణ - కామించుటచేత, ఫలే సక్తః ఫలమునం దాసక్తుడై, నిబధ్యతే - బంధింపబడును.

తా : కర్మయోగి కర్మఫలముల నపేక్షింప నందున శాశ్వత సుఖము బొందును; నిత్యశాంతి కర్హుడగును: అయుక్తుడు - కర్మయోగి కానివాడు నానావిధ కర్మలు ఫలాపేక్షతో జేసి జన్మమరణాది బంధన దుఃఖముల ననుభవించును.

అనాశ్రితః కర్మఫలం, కార్యం కర్మ కరోతి యః
స సంన్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్ న చాక్రియః. 13

యః - ఎవడు, కర్మఫలం - కర్మఫలమును, అనాశ్రితః - ఆశ్రయింపక, కార్యం కర్మ కరోతి - చేయదగినపని చేయునో, సః - అతడు, సంన్యాసీ చ యోగీ చ - సంన్యాసియు, యోగియును నిరగ్నిః న - అగ్నిహోత్రము చేయనివాడు కాడు. అక్రియః చ న - కర్మనాచరింపనివాడును కాడు. అగ్నిహోత్రము, కర్మలు నాచరింపనివాడు సంన్యాసికాని, యోగి కాని కాడని భావము.

తా : కర్మఫలము నాసింపక కర్తవ్యముల నాచరించువాడు సంన్యాసియు, యోగియు ననబడును. అగ్నిహోత్రాది నిత్యకర్మలను, నితర వర్ణాశ్రమ విహితకర్మలను విడిచినవాడు సంన్యాసి యనబడడు. యోగి యంతకంటెను కాడు.

(నేటి సంన్యాసులలో పెక్కురు కర్మలు చేయకుండుటయే సంన్యాసమని యెంచి కాషాయాంబరధారులై కష్టజీవులకు భారభూతులై బ్రతుకుచున్నారు. వారు సంన్యాసు లెన్నడును కారు.)

యం సన్యాస మితి ప్రాహుర్ యోగం తం విద్ధి పాండవ :
న హ్యసంన్యస్తసంకల్పో, యోగీ భవతి కశ్చన. 14

పాండవ ! - అర్జున ! - యం సంన్యాసం ఇతి ప్రాహుః - దేనిని సంన్యాసమని యందురో, తం యోగం విద్ధి - దానిని యోగమని తెలియుము. హి - కారణ మేమన, అసంన్య స్తసంకల్పః - సంకల్పమును విడువనివాడు, కశ్చన యోగీ న భవతి - ఎవడును యోగికాడు. కావున ఫలత్యాగము వలననే సంన్యాసియు, యోగియు నగును.

తా : పాండుకుమార ! కాబట్టి సంన్యాసమే యోగమని యెంచుము. ఫలాసక్తి విడువనివాడు యోగికాడు.

ఆరురుక్షోర్ మునేర్ యోగం కర్మ కారణ ముచ్యతే
యోగారూఢస్య తస్యైవ, శమః కారణ ముచ్యతే. 15

ఫలాసక్తి లేకున్నను కర్మలలో ప్రవృత్తి కలుగును. యోగం ఆరురుక్షోః - కర్మయోగమున నారూఢుడు కాదలచు, మునేః - మునికి, కర్మయందు లగ్నుడగుటకు, కర్మ కారణం ఉచ్యతే - కర్మకారణమని చెప్పబడును. (జీవుడు చిరకాలమునుండి కర్మల నాచరింప నలవాటు పడియున్నాడు. కావున ఫలాసక్తి లేకున్నను నతనికి కర్మయందు ప్రవృత్తి కలుగును.) యోగారూఢస్య - యోగమునందు స్థిరుడైన, తస్యైవ - అతనికే, శమః-శమము, - ప్రజ్ఞాస్థితి చేతను, ఫలాకాంక్ష విడిచినందునను ఏర్పడిన చిత్తశాంతి, కర్తవ్య కర్మ నాచరింపజేయుటలో, కారణం ఉచ్యతే- కారణ మనబడుచున్నది.

తా : యోగి కావలయునని యెంచువాడు ఫలము నభిలషింపక కర్మల నాచరింపవలయును. అట్టి యాచరణలో స్థిరపడిన వానికి మనఃస్థైర్య మేర్పడును

యదా హి నేంద్రియార్థేషు న కర్మ స్వనుషజ్యతే,
సర్వ సంకల్ప సంన్యాసీ యోగారూఢ స్తదోచ్యతే. 6

హి - కారణ మేమన, యదా - ఎప్పుడు, ఇంద్రియార్థేషు - శబ్దాది విషయములందు, న - ఆసక్తుడు కాడో, కర్మసు - కర్మలందు. న అనుషజ్యతే - ఆసక్తుడు కాడో, సర్వ సంకల్ప సంన్యాసీ - సర్వ సంకల్పములను విడిచినవాడై. ఫలాసక్తి లేనందున శాంతచిత్తుడై కర్మలను కూడ నాసక్తిలేక చేయుచు, తదా - అప్పుడు, యోగారూఢః - యోగమునందు స్థిరుడైన వాడుగా, ఉచ్యతే - చెప్పబడును.

తా : శబ్ద స్పర్శాదులనబడు నింద్రియార్థము లందు - విషయములందును, ఫలముతో గూడిన కర్మలందును ఆసక్తుడు కాక, ఫలమునకు సంబంధించిన సమస్త సంకల్పములను విడిచిన వాడు యోగమునం దారూఢు డగును.

ఏకాదశాధ్యాయము సమాప్తము

*

# శ్రీమద్భగవద్గీత

## ద్వాదశాధ్యాయము

# ధ్యానయోగము

(సామ్యబుద్ధి - దాని సాధనము ధ్యానయోగము)

సారము - సంగతి :

పదునొకండవ యధ్యాయమున కర్మయోగము కర్మసంన్యాసము కంటె శ్రేష్ఠమని చెప్పబడినది. అందులకు కారణము, కర్మయోగము ననుష్ఠింపక కర్మసంన్యాసము సంభవింపదు. కర్మయోగము సిద్ధించిన మీదట కర్మసంన్యాసముచేయునావశ్యకమే యుండదు. కాని కర్మయోగాను ష్ఠానముకూడ సులభముకాదు. ఫలమును కామింపక మనుజు డొక కార్యము నెట్లు చేయగలడు ? ప్రయోజనము నుద్దేశింపక మనుజుడు ముందుకు నడవడు కావున, నీ సమస్యనే యీ యధ్యాయము పరిష్క రించును. నిష్కామకర్మ ననుష్ఠించుటకు దగిన యోగ్యతను సంపాదింప మనుజుడు ఆత్మోద్ధారము చేసికొనవలసి యున్నది. కామనలనెడి బురదలో పడకుండుటకై బుద్ధియందు సమతాబలమును వికసింపజేసికొనవలయును. తననుతాను వశములో నుంచుకొన యత్నింపనివాడు తనకుతానే శత్రు వగును. తన్నుతాను వశపఱచుకొనుటకు ఉపాయములు - జ్ఞానము, విజ్ఞా నము, ధ్యానయోగము మూలమున తనలో సామ్యబుద్ధి నేర్పఱచుకొనుటయు నని యెఱుంగవలయును. జ్ఞాన విజ్ఞానముల నిరూపణము ముందు చేయ బడును. ధ్యానయోగపద్ధతి యీ యధ్యాయముననే చెప్పబడినది. యోగి ధ్యాన యోగ మొనర్చుచు తన్ను వశపఱచుకొని, సామ్యబుద్ధిని పొందుననియు నిందు చెప్పబడినది. ఈ సాధన వలననే బ్రహ్మానంద ప్రాప్తియు కలుగును. ఇట్లు ఫలకామన విడిచి కర్మలందు ప్రవృత్తి కలుగుటకు

ఉపాయము చెప్పబడినది. సామ్యబుద్ధి ప్రాప్తిని గూర్చియు వర్ణింపబడినది ధ్యానయోగమువలన మనోనిరోధము సామ్యబుద్ధికి సాధనమనియు చెప్ప. బడినది. ఇది విని యర్జునుడు మరల నిట్లు ప్రశ్నించెను: "కృష్ణ ! మనస్సు మిక్కిలి చంచలము. దానిని నిరోధించుట వాయువును నిరోధించుటకంటె దుష్కరము ధ్యానయోగముతో దీనిని నిరోధించుట ఎట్లు పొసగును?"

అందులకు కృష్ణుడు, "అభ్యాసము, వైరాగ్యము ననువానితో మనస్సును నిరోధింపవచ్చును" అని సమాధానము చెప్పెను. అర్జునుడు మరల నిట్లు ప్రశ్నించెను. 'శ్రద్ధతో ధ్యానయోగ మొనర్చుచు సామ్యబుద్ధిని సంపాదించి కర్మయోగమున సఫలుడైన వానికి మీరు చెప్పినట్లు ఇహ పరములు రెండును సిద్ధించును. కాని, అందఱు నట్లు సిద్ధిపొందగలరని చెప్ప నలవికాదు గదా ! కావున, సిద్ధిపొందక మధ్యలోనే మార్గవిచలితు డైన వాని గతియేమి? దయతో చెప్పుమువుగాక! అట్టివాడు ఉభయభ్రష్టుడు కాడుగదా !' అర్జునుడు తన దౌర్బల్యమును గుర్తించుచు నీ ప్రశ్నమును చేసియున్నాడు. కృష్ణుడు దానిని గుర్తించి యర్జుననకు ఉత్సాహము కలిగించు సమాధాన మిట్లు చెప్పెను. 'సంయమమార్గమున నడచు కొన నారంభించి యొక క్రోసు నడచి మార్గమునుండి విచలితుడగునేని మరుజన్మమున నటనుండి ముందుకు నడచును. అతడు చేసిన పరిశ్రమ మెన్నడును వ్యర్థముకాదు. మరుజన్మమున నతనికా మార్గమున నడుచుటకు వలయు సాధనములును పూర్వజన్మమున లభించిన వానికంటె శ్రేష్ఠము లైనవియే లభించును ఇట్లు క్రమముగా నభివృద్ధి నందుచునే యేదో యొక జన్మమున సఫలత నందును." ఇట్లు చెప్పి కృష్ణుడు అంతమున ధ్యాన యోగమును ప్రశంసించి తన సమాధానమును ముగించెను.

ఉద్ధరే దాత్మ నాత్మానం నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః. 1

ఆత్మనా, ఆత్మానమ్ ఉద్ధరేత్ - ఆత్మబలముతో ఆత్మను, తనను ఉద్ధరించుకొనవలయును. ఆత్మానం న అవసాదయేత్ - తనను (తానే) పతనము చేసికొనరాదు, హి - కారణమేమన, ఆత్మనః ఆత్మా ఏవ బంధుః- ఆత్మకు ఆత్మయే బంధువు, ఆత్మనః ఆత్మా ఏవ రిపుః - ఆత్మకు ఆత్మయే శత్రువు.

(ఈ శ్లోకమున నాత్మతో నాత్మ నుద్ధరించుకొనవలయునని చెప్పబడినది. ఉద్ధరింపబడు వస్తువుకంటె ఉద్ధరించుటకు తోడ్పడు సాధనము వేఱుగ నుండును. కాని, ఇట రెంటి నామము ఆత్మగా పేర్కొనబడినది.

నామ మొక్కటియైనను ఇక్కడకూడ సాధ్యసాధనములు రెండును భిన్నములే. ఉద్ధరింపబడునది జీవాత్మ, ఉద్ధరించుటకు సాధనము ఆత్మ - అంతఃకరణము, జ్ఞానేంద్రియములు వీని సముదాయము. అంతఃకరణము దూషితమైన నాత్మయందును దోషములు కలుగును. ఆ దోషములను దూర మొనర్చుటయే ఆత్మోద్ధార మనబడును. ఇంద్రియక్రియలు ధర్మానుకూలము కానంతవఱకు అంతఃకరణములోని మలములు దూరము కావు; ఆత్మయు ఉన్నతము కాజాలదు. కాబట్టి యాత్మోద్ధరణమున కివి యన్నియు సాధనములగును. అంతఃకరణాదుల నన్నిటిని సంస్కరించుట ఆత్మసంస్కారమున కుపకారకమగును. కావున నీ యుద్ధారక సముదాయమున నాత్మయే ప్రధానమగుచున్నది. అందువలననే సాధనపక్షమునందును నాత్మ గ్రహింపబడినది. అంతఃకరణాది సముదాయదోషములచే దూషితమై ఆత్మ తనకు తాను శత్రువగుచున్నది వాని సంస్కారము మూలమున శుద్ధమై తనకు తాను బంధు వగుచున్నది.)

బంధు రాత్మాత్మన స్తస్య యేనాత్మై వాత్మనా జితః
అనాత్మన స్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్. 2

యేన ఆత్మా ఆత్మనా ఏవ జితః - ఎవనిచే ఆత్మబలము ద్వారమున ఆత్మ జయింపబడినదో, తస్య ఆత్మనః ఆత్మా బంధుః - అతని ఆత్మకు ఆత్మయే బంధువు, అనాత్మనః - మనస్సు ఇంద్రియాది అనాత్మలు, శత్రుత్వే - శత్రువులయినపుడు, ఆత్మా ఏవ శత్రువత్ వర్తేత - అవికాక తనకు తానే శత్రువువలె వర్తించిన ట్లగును.

తా : (1-2 శ్లో) అంతఃకరణముతో తన్ను తానే యుద్ధరించుకొనవలయును. పతితుడు కారాదు. దుష్కర్మలొనర్చి చిత్తము మలినము చేసికొనువాడు పతితు డగును. అప్పుడు తనకు దానే శత్రువగును. సత్కర్మలుచేసి అంతఃకరణము పవిత్రము చేసికొనువాడు తనకు దాబంధువగును.

మనస్సు పవిత్రము చేసికొని దానిని నిగ్రహించినవాడు తనకు దా బంధువగును. మనస్సు స్వాధీనము చేసికొననివాడు తనకు దానే శత్రువై వర్తించును.

జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః
శీతోష్ణ సుఖదుఃఖేషు తథా మానావమానయోః 3

జితాత్మనః - ఆత్మను జయించు, ప్రశాంతస్య - శాంతిశీలుడగు పురుషునకు, పరమాత్మా - శ్రేష్ఠాత్మ, శీతోష్ణ సుఖదుఃఖేషు - శీతోష్ణ సుఖదుఃఖములలోను, తథా - అట్లే, మానావమానయోః - మానావమానములందు, సమాహితః - సమదర్శి యగును. ఇట్లు ఆత్మోద్ధరణము వలన నతనికి సామ్యబుద్ధి కలుగును.

తా : మనస్సు వశములో నుంచుకొనినవాడు శాంతు డగును. అతని చిత్తము సమాహిత మగును - స్థిరపడును - వృత్తులు లేనిదగును. శీతోష్ణములు, సుఖదుఃఖములు, మానావ

మానములు నను ద్వంద్వములు కలిగినపుడు అట్టివాడు వికారములను బొందడు. సమముగా నన్నింటి ననుభవించును.

జ్ఞానవిజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మ కాంచనః. 4

జ్ఞాన విజ్ఞానతృప్తాత్మా - జ్ఞాన విజ్ఞానములతో నాత్మను తృప్తి పఱచువాడు, కూటస్థః - వికారరహితుడు, విజితేంద్రియః - జితేంద్రియుడు, సమలోష్టాశ్మ కాంచనః - మట్టిగడ్డ, రాయి, కాంచనము నను వాని నన్నింటిని సమానభావముతో నెంచువాడును నగు, యోగీ - యోగి, యుక్తః ఇతి ఉచ్యతే - యుక్తుడనబడును. యోగసంపన్నుడని భావము.

తా : జ్ఞానవిజ్ఞానములతో తృప్తుడై, వికారములు పొందక, ఇంద్రియములను విషయముల వెంట బరువిడనీక, మట్టిగడ్డలను, రత్నములను, బంగారమును సమముగా జూచు మనుజుడు యోగమార్గము నవలంబించిన యోగి యనబడును.

సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్యబంధుషు
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే. 5

సుహృ....బంధుషు - మంచి హృదయము కలవాడు, మిత్రుడు, శత్రువు, ఉదాసీనుడు, మధ్యస్థుడు, వైరి, హితైషి అనువారిలో, సాధుషు- సజ్జనులలోను, చ పాపేషు అపి - మఱియు పాపులయందును, సమబుద్ధిః - సామ్యబుద్ధి నుందువాడు, విశిష్యతే - శ్రేష్ఠుడగును.

తా : అట్టియోగి మంచిహృదయముగలవారి యెడలను మిత్రులు, శత్రువులు, ఉదాసీనులు, మధ్యస్థులు, బంధువులు.

సాధువులు, పాపులు ననబడు నెల్లజనుల యెడలను సమముగా వర్తించును. ఒకరియెడ ననురాగము కాని, మఱియొకరి యెడ వైరభావము కాని చూపడు. అట్టివాడే లోకమున శ్రేష్ఠుడు.

యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః. 6

ఏకాకీ - ఒంటరిగ; రహసి స్థితః - ఏకాంతముగ నున్నవాడై, యతచిత్తాత్మా - చిత్తమును ఆత్మను సంయమ మొనర్చుచు, నిరాశీః - ఆశారహితుడై, అపరిగ్రహః - సంగ్రహింపనివాడై, యోగీ - యోగి, సతతం - ఎల్లప్పుడు, ఆత్మానం - ఆత్మను. యుంజీత - ధ్యానమునందు లగ్నము చేయవలయును.

తా : కర్మయోగి యొంటరిగ నేకాంతమున చిత్తము స్వాధీనము చేసికొన నెల్లపుడు యత్నించును. అందుల కతడు చిత్తవృత్తుల నరికట్టును. ఆశలను త్యజించును. జీవననిర్వాహణమునకు వలసిన దానికంటె నెక్కుడుగ నన్యాయపద్ధతులతో పదార్థ సేకరణకు గడంగడు. న్యాయమార్గమున స్వార్జితముతో తృప్తుడగును.

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరమ్, 7
తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః
ఉపవిశ్యాసనే యుంజ్యాద్ యోగ మాత్మవిశుద్ధయే. 8
సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశ శ్చానవలోకయన్. 9

న అతిఉచ్ఛ్రితం - ఎక్కువ ఉన్నతము కాని, న అతినీచం - ఎక్కువ నిమ్నమును కాని, చేలాజిన కుశోత్తరం - వస్త్రము, మృగ చర్మము దర్భలు వరుసగా నొకదానికంటె మఱియొకటి క్రిందనుండునట్లు, స్థిరం ఆసనం - స్థిరమయిన ఆసనమును, ఆత్మనః - తనకు, శుచౌ దేశే- శుద్ధప్రదేశమున, ప్రతిష్ఠాప్య - ఏర్పఱచుకొని, తత్ర ఆసనే ఉపవిశ్య - ఆ ఆసనముపై కూర్చుండి, మనః ఏకాగ్రం కృత్వా - మనస్సును ఒకే నిలకడ గలదిగ జేసి, యత చిత్తేంద్రియ క్రియః - నియమింపబడిన చిత్తేంద్రియ క్రియలు కలవాడై, నిష్క్రియుడై, స్థిరః - నిశ్చలుడై, కాయశిరోగ్రీవం - మెడక్రింది శరీరభాగమును, శిరస్సును, కంఠమును, అచలం సమం ధారయన్ - స్థిరముగాను, సమానముగాను నుండునట్లుచేసి, స్వం నాసికాగ్రం సంప్రేక్ష్య - తన నాసికాగ్రమును బాగుగచూచి, దిశః అనవలోకయన్ - దిక్కులు చూడక, ఆత్మ విశుద్ధయే - ఆత్మశుద్ధికొఱకు యోగం యుంజ్యాత్ - యోగానుష్ఠానము చేయవలయును.

తా : ఎగుడుదిగుడులు లేని శుద్ధ సమతల ప్రదేశము నందు కదలని ఆసనము నొకదానిని యోగి తాను కూర్చుండుట కేర్పఱచుకొనును. దర్భలతో కాని, తుంగతో కాని నిర్మింప బడిన చాప నొకదానిని భూమిపై బఱచి, దానిమీద నొక మృగచర్మమునో లేక కంబళినో పఱచును. దానిమీద నొక వస్త్రమును వేసికొనును. ఇది ఆసనము నేర్పఱచుకొను పద్ధతి. యోగి కిట్టి యాసనము దీర్ఘకాలము ధ్యానమగ్నుడై కూర్చుండుట కుపకరించును. దర్భలకు చెదపురుగు పట్టదు. మృగ చర్మము స్వాయముగా చచ్చిన లేడిదై యుండవలయును. అట్టివి లభింపనపుడు కంబళి వాడుకొనవలయును.

ఇట్లు సిద్ధము చేసికొనిన ఆసనముపై గూర్చుండి (సిద్ధాసనము, పద్మాసనము అభ్యాసమునకు ఉపయుక్తములు.) ఇంద్రియక్రియలను, చిత్తవృత్తులను నరికట్టి, మనస్సు నేకాగ్రము చేసికొని చిత్తశుద్ధికొఱకు నిత్యము యోగము నభ్యసింపవలయును. (నాభి, హృదయము, కంఠకూపము, నాసికాగ్రము, భ్రుకుటి, మూర్ధ్న చిత్తైకాగ్రతకు పనికివచ్చు స్థానములు.)

యోగి కూర్చుండి యభ్యాస మొనర్చునపుడు, తల, మెడ, దానిక్రింది భాగము (కాయము) సమముగా నుండునట్లు చూచుకొనవలయును. వెన్నెముక తిన్నగా వంపు లేకుండునట్లు యత్నింపవలయును. అభ్యాసకాలమున నవయవములలో చలన ముండరాదు. మనస్సు చలింపనిచో నవయవములు చలింపవు. ఆపైన దిక్కులను జూడక తన నాసికాగ్రమును బాగుగ జూడ నారంభింపవలయును. ఇయ్యది మనస్సు వశము చేసికొనుటకొక యుపాయము.

(చిత్తైకాగ్రతను సాధించుటకు తన యెదుట బొమ్మలనో, లేక యితరవస్తువులనో పెట్టుకొని వానిని బూజించుటయో, చూచుటయో పనికిరాదని దీనింబట్టి తెలియుచున్నది. దేవాలయములు, విగ్రహారాధన చిత్తమును స్థిరపఱచుకొనుట కేర్పఱుపబడిన వనుట నత్యము కాదనియు గుర్తింపనగును. చిత్తైకాగ్రతకు యత్నించు వారికి బాహ్యసాధనములు పనికిరావని కృష్ణుని అభిప్రాయము.)

సంకల్పప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వా నశేషతః
మనసై వేంద్రియగ్రామం వినియమ్య సమంతతః. 10

శనైః శనై రుపరమేత్ బుద్ధ్యా ధృతిగృహీతయా
ఆత్మ సంస్థం మనః కృత్వా న కించి దపి చింతయేత్. 11

సంకల్పప్రభవాన్ - సంకల్పమువలన కలిగిన. సర్వాన్ కామాన్- సమస్త కామములను, అశేషతః - త్యక్త్వా - విడిచి, ఇంద్రియగ్రామం - ఇంద్రియ సముదాయమును, మనసా ఏవ - మనస్సుతోనే, సమంతతః - అన్నివైపులనుండి, వినియమ్య - నియమించి, ధృతిగృహీతయా - ధైర్యముతో స్థిరపఱపబడిన, బుద్ధ్యా - బుద్ధితో, మనః ఆత్మసంస్థం కృత్వా - మనస్సును ఆత్మయందు నిలిపి, శనైః శనైః - నెమ్మది నెమ్మదిగ, ఉపరమేత్ - శాంతుడు కావలయును, కించిత్ అపి - కొంచెము కూడ (ఏమియు), న చింతయేత్ - ఆలోచింపరాదు.

తా : మనస్సు నిట్లు నాసికాగ్రమున నిల్పి, యింద్రియ వ్యాపారములను గట్టిపెట్టి, మానసిక సంకల్పముల నన్నిటిని విడువవలయును.

స్థిరమైన బుద్ధితో బాహ్యావృత్తుల నన్నిటిని నెమ్మది నెమ్మదిగా తొలగించి మనస్సును తనలోనే యుండునట్లు చేసికొనవలయును. ఆ సమయములో మనస్సున నెట్టి యాలోచనలును రాకుండునట్లు యత్నింపవలయును.

యతో యతో నిశ్చరతి మన శ్చంచల మస్థిరమ్
తత స్తతో నియ మ్యైతద్ ఆత్మ న్యేవ వశం నయేత్. 12

చంచలం - చలించునట్టి, అస్థిరమ్ - స్థిరముకాని, మనః - మనస్సు, యతః యతః - ఏ యే ద్వారములనుండి, నిశ్చరతి - బయటికి పోవునో, తతః తతః - ఆ యా ద్వారములనుండి, ఏతద్ నియమ్య - దీనిని నియమించి, ఆత్మని ఏవ - తనలోనే, వశం నయేత్-వశపఱచుకొనవలయును.

తా : ఈ విధమున ప్రయత్నించు యోగియొక్క మనస్సు చంచలమగుటచే ప్రథమమున స్థిరపడక యా యా యింద్రియముల ద్వారమున వెలుపలికిబోవ యత్నించును. కాని, దానినట్లు బోనీయక తనయందే యుండునట్లు నియమింప వలయును.

యుంజ న్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యంతం సుఖ మశ్నుతే. 13

విగత కల్మషః - పాపరహితుడై, యోగీ ఏవం ఆత్మానం - యోగి యిట్లు ఆత్మను, సదా యుంజన్ - యోగమున నెల్లప్పుడు లగ్నముచేయుచు, సుఖేన - సుఖముగ, బ్రహ్మసంస్పర్శం - బ్రహ్మ సంబంధము వలన కలిగెడి, అత్యంతం సుఖం - అమిత సుఖమును, మోక్షమును, అశ్నుతే- అనుభవించును. ఇది ధ్యానయోగమునకు ప్రథమ ఫలము.

తా : నిత్యము నిట్లు మనస్సు స్వాధీనము చేసికొన యత్నించు యోగి తన చిత్తమునందలి మాలిన్యములను దొలగించుకొనును. చిత్తము ప్రసన్నమై బాహ్యవృత్తులు లేనిదై నపుడు జీవునకు సుఖముగా బ్రహ్మసంస్పర్శము కలుగును. బ్రహ్మానుభూతి యేర్పడును. అప్పు డతనికి అత్యంతసుఖము - అప్రాకృతిక సుఖము—ఆనందము లభించును.

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. 14

యోగయుక్తాత్మా-యోగసంపన్న పురుషుడు, సర్వత్ర సమదర్శనః - అన్నిట సమదర్శియై, ఆత్మానం - ఆత్మను, సర్వభూతస్థం-సర్వప్రాణులం దున్నట్లును, సర్వభూతాని చ - సర్వప్రాణులను, ఆత్మని - ఆత్మయందును,

ఈక్షతే - చూచును, (ఇట నాత్మశబ్దము పరమాత్మ వాచకముగా నెంచుట యుక్తము) ఇయ్యది ధ్యానయోగమునకు రెండవ ఫలము.

తా : యోగాభ్యాసము వలన స్థిరచిత్తుడైన జీవుడు సర్వప్రాణులందును, సర్వ పదార్థములందును నిమిడియున్న పరమాత్మను, అట్లే పరమాత్మయందు వర్తించు పదార్థములను దెలిసికొనును. అంతటను సమముగా వ్యాపించియున్న పరమాత్మను జూచును- సాక్షాత్కారము చేసికొనును. ఇయ్యదియే సమదర్శత. సమదర్శత యనగా భిన్నవస్తువుల నభిన్నముగాజూచుట కాదు, భిన్నవస్తువులలో నన్నిటియందును సమముగా- న్యూనాతిశయములు లేక యొకటిగా నుండునట్టి పరతత్త్వము నెఱుంగుట యని గుర్తింపవలయును.

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః. 15

అర్జున ! యః - ఎవడు, సుఖం యది వా దుఃఖం - సుఖముకాని, లేక దుఃఖముకాని, ఆత్మౌపమ్యేన - తనతో సమానముగ, సర్వత్ర - అంతట, సమం పశ్యతి - సమానమని తెలియునో, సః - అతడు, పరమః యోగీ మతః - ఉత్తమయోగిగ నెంచబడెను.

తా : అర్జున ! ఉత్తముడైన యోగి యందఱి సుఖ దుఃఖములను తన సుఖదుఃఖములతో బోల్చి చూచుకొనును. తన కెట్లు సుఖదుఃఖములు కల్గునో యితరుల కట్లే యగునని గుర్తించును.

యోఽయం యోగ స్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన ।
ఏత స్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్. 16

అర్జును డనెను: మధుసూదన ! కృష్ణ ! త్వయా - నీవు, యః అయం యోగః - ఏ యీ యోగము. సామ్యేన ప్రోక్తః - సామ్యబుద్ధితో చెప్పితివో, అహం - నేను, చంచలత్వాత్ - మనస్సు చంచలమగుటవలన, ఏతస్య - ఈ యోగముయొక్క, స్థితిం - స్థితిని, స్థిరాం న పశ్యామి - స్థిరమని తెలియకున్నాను.

తా : కృష్ణుడు బోధించిన కర్మయోగమును విని యర్జును డిట్లనుచున్నాడు. కృష్ణ ! సామ్యబుద్ధితో కర్మల నాచరింపవలసినదని నీవు బోధించిన కర్మయోగము వినిన పిదప కూడ చాంచల్యము వలన నీ యోగముయొక్క స్థిరస్థితిని దెలిసికొనజాలకున్నాను.

చంచలం హి మనః కృష్ణ ! ప్రమాథి బలవద్ దృఢమ్
తస్యాహం నిగ్రహం మన్యే వాయో రివ సుదుష్కరమ్. 17

కృష్ణ ! మనః - మనస్సు, చంచలం, ప్రమాథి, బలవత్, దృఢమ్ - చంచలము, కష్టపెట్టునది, బలముగలది, దృఢమైనది. తస్య నిగ్రహం - దాని నణచుట, అహం - నేను, వాయోః ఇవ - వాయువును నిగ్రహించునట్లు,సుదుష్కరం - అతికఠినమని, మన్యే - తలంచుచున్నాను.

తా : 'కృష్ణ! మనస్సు మిక్కిలి చంచలమైనది. ఇంద్రియములను మథించి విషయములలో వానిని ప్రవర్తింపజేయును. బలమై, దృఢమైన యీ మనస్సును నిగ్రహించుట వాయువును నిగ్రహించుటవలె నతికష్టమని తోచెడిని.

అసంశయం మహాబాహో ! మనో దుర్నిగ్రహం చలమ్
అభ్యాసేన తు కౌంతేయ! వైరాగ్యేణ చ గృహ్యతే. 18

కృష్ణు డనెను : మహాబాహో : - మహాభుజ : - అర్జున :, అసంశయం - నిశ్చయముగ, మనః - మనస్సు, దుర్నిగ్రహమ్ - కష్ట ముగ వశపఱచుకొన తగినది, చలమ్ - చంచలమైనది. తు - కాని, అభ్యాసేన - అభ్యాసముచేతను, వైరాగ్యేణ చ - వైరాగ్యము చేతను, గృహ్యతే - వశము చేసికొనబడును.

తా : మనశ్చాంచల్యమును గూర్చి యర్జును డాడిన పలుకులు విని కృష్ణుడు పలుకుచున్నాడు. 'కుంతీపుత్ర ! నీవు చెప్పిన దానిలో సందియ మొకింతయులేదు. మనస్సును నిగ్ర హించుట సులభము కాదు. అది అతిచంచలమైనదియే; కాని, అభ్యాస వైరాగ్యములతో దానిని వశపఱచు కొనవచ్చును.

(పతంజలి మహర్షి తన యోగదర్శనమునందు మనస్సును వశము చేసికొనుటకు అభ్యాసవైరాగ్యములే సాధనములుగా జెప్పియున్నాడు.

"సూ : అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః" యోగ, ద.

అభ్యాస వైరాగ్యములతో మనస్సు నిరోధింపవచ్చును.

"సూ : తత్ర స్థితౌ యత్నోఽభ్యాసః' యోగ. ద.

మనస్సును స్థిరము చేయుటకు జేయు యత్నము అభ్యాసము.

"సూ : దృష్టానుశ్రవిక విషయ వితృష్ణస్య వశీకార
సంజ్ఞా వైరాగ్యమ్" యో. ద.

దృష్టములు, అను శ్రవికములు నను విషయములవంక మనస్సును బోనీయకుండుట వైరాగ్యము.

చిత్తమనెడి నది రెండువిధముల ప్రవహించును. వివేకమనెడి మార్గమున కైవల్యాభిముఖముగా బ్రవహించుట యొకవిధము. అవివేక మనెడి మార్గమున సంసారాభిముఖముగ బ్రవహించుట రెండవవిధము.

విషయ వితృష్ణ వైరాగ్యమని యింతకు బూర్వమున జెప్పియుంటిమి. ఆ విషయములు దృష్టములు, ఆనుశ్రవికములు నని రెండు విధములు. స్త్రీ, పశు, పుత్ర, ధనధాన్యాదులు దృష్టములు, అనుశ్రవమున వేదము, దానిమూలమున దెలియబడు జన్మాంతర సుఖములకు సంబంధించిన విషయములు ఆనుశ్రవికములు. యోగి యీ ద్వివిధములైన విషయము లందును ఆశను విడిచి చిత్తమును వశమందుంచుకొనును. ఇయ్యదియే వివేకమార్గము. ఈ మార్గమునందుండి చిత్తవృత్తులను నిరోధించుటయే వైరాగ్యము. అట్లు నిరోధించిన చిత్తమును స్థిరముగా నుంచుకొనుటకై సత్యాహింసాదులయిన యమములను, శౌచాదులయిన నియమములను పాలింప నుత్సహించుచుండ వలయును. ఈ యుత్సాహమే యభ్యాస మన బడును ఈ యభ్యాస వైరాగ్యములే చిత్తమును వశపఱచుకొనుట కనువైన సాధనములని పైశ్లోకమున కృష్ణు డర్జునునకు దెలిపెను.)

అసంయుతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః. 19

అసంయతాత్మనా - సంయముడు కానివానిచే, యోగః - యోగము, దుష్ప్రాపః-లభింపబడుట కష్టము. ఇతి మే మతిః-అని నా యభిప్రాయము, తు - కాని, యతతా-యత్నించునట్టి, వశ్యాత్మనా-సంయమిచే, ఉపాయతః- ఉపాయమువలన, అవాప్తుం - పొందబడుటకు, శక్యః - సాధ్యమే.

తా : చిత్తమును వశపఱచుకోనని వానికి కర్మయోగము లభ్యముకాదు. మనస్సును నిగ్రహించు వాని కది సులభము.

(కృష్ణు డర్జునునకు మనస్సును వశ మొనర్చు సాధనములను వివరించి, కర్మయోగి యగుట మానవునకు దుర్ఘటము కాదని బోధింపగా నర్జును డిట్లు మరల నడుగుచున్నాడు.)

అయతిః శ్రద్ధయోపేతో యోగా చ్చలితమానసః
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ ! గచ్ఛతి. 20

కృష్ణ !, అయతిః - యతికానివాడు, యోగాత్ చలితమానసః - యోగమునుండి చలించిన మనస్సుగలవాడు, (కాని), శ్రద్ధయా ఉపేతః - శ్రద్ధతోకూడినవా డగునేని, కాం గతిం గచ్ఛతి ?- ఏగతిని పొందును?

తా : 'కృష్ణ! ఒకానొక మానవుడు యమనియమము లను బాటింపక యోగమార్గమునుండి చలించిన మనస్సు గల వాడై శ్రద్ధతో గూడియుండు నెడల యోగమున సిద్ధి బొంద జాలడు గదా ! వాని గతి యేమగును ?

కచ్చి న్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి
అప్రతిష్ఠో మహాబాహో ! విమూఢో బ్రహ్మణః పథి. 21

మహాబాహో ! - కృష్ణ ! విమూఢః - భ్రాంతుడైన యతడు, బ్రహ్మణః పథి - బ్రహ్మమార్గమున, అప్రతిష్ఠః - స్థిరుడు కాక, ఉభయ విభ్రష్టః - ఇహపరముల నుండి. భ్రష్టుడై - పతితుడై, ఛిన్నాభ్రమివ - విడిపోయిన మేఘమువలె, నకచ్చిత్ నశ్యతి ? - నశించిపోడుగదా ?

తా : కృష్ణ! అట్టివాడు బ్రహ్మప్రాప్తి కనువగు యోగ మార్గమున నడువజాలక యిహపరములకు దూరుడై వాయు వశమున ఛిన్నభిన్నమగు మేఘమువలె నెందునకు కొఱగాక నశించునా ? లేక మఱి యేమగును ?

ఏత న్మే సంశయం కృష్ణ ! ఛేత్తు మర్హ స్యశేషతః
త్వ దన్యః సంశయ స్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే. 22

కృష్ణ ! మే ఏతత్ సంశయం - నా యీ సంశయమును, అశేషతః ఛేత్తుం అర్హసి - పూర్ణముగ దొలగింప నర్హుడవు, త్వత్ అన్యః-నీకంటె నితరుడు, అస్య సంశయస్య - ఈ సంశయమును, ఛేత్తా - దూరముచేయ గలవాడు, న హి ఉపపద్యతే - లభింపడు, అని అర్జును డడిగెను.

తా : కృష్ణ ! నాకీ సంశయము కలుగుచున్నది. దీనిని నీవే నిర్మూలము చేయగలవు అన్యులకీ శక్తి లేదు. కావున దయతో నా యీ సందేహము దొలగింతువు గాక !

పార్థ ! నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే
న హి కల్యాణకృత్ కశ్చిద్ దుర్గతిం తాత ! గచ్ఛతి. 23

కృష్ణుని సమాధానము ! పార్థ ! కుంతీపుత్ర ! అర్జున !, తస్య - అతనికి, వినాశః - వినాశము, ఇహ - ఈలోకమున, న ఏవ విద్యతే - లేనేలేదు. అముత్ర - పరలోకమునందు, న విద్యతే - లేదు, తాత ! - ప్రియబంధువుడ !, కల్యాణకృత్ - శుభమొనర్చువాడు, కశ్చిత్-ఎవడును, దుర్గతిం - దుర్గతిని, న హి గచ్ఛతి - పొందనే పొందడు.

తా : కుంతీపుత్ర! యోగమార్గమున నడచుచు మధ్యలో నామార్గము నుండి విచలితుడైన వానికి ఇహపరములలో నెట్టి హానియు గలుగదు. వత్స ! అర్జున ! శుభము నొనర్చు వాడు లోకమున నెవ్వడును దుర్గతిని బొందడు.

ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీః సమాః
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. 24

యోగభ్రష్టః - యోగమున పతితుడైనవాడు, పుణ్యకృతాం లోకాన్ ప్రాప్య - పుణ్యవంతులు పొందు లోకములను, జన్మలను పొంది, శాశ్వతీః

సమాః ఉషిత్వా - చాల సంవత్సరములందుండి, శుచీనాం శ్రీమతాం గేహే-పవిత్రులు సంపన్నులునైనవారి గృహమున, అభిజాయతే - పుట్టును.

తా : ఈ జన్మమున యోగమార్గము నుండి విచలితుడైన వ్యక్తి పుణ్యవంతులుపొందు జన్మమునుబొందియట సుఖించును. బహుకాల మిట్లు పవిత్రులు, సంపన్నులునైన వారి వంశము లందు మానవుడై పుట్టుచుండును.

అథవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్
ఏత ద్ధి దుర్లభతరం లోకే జన్మ య దీదృశమ్. 25

అథవా - లేక, ధీమతాం యోగినామ్ - బుద్ధిమంతులైన యోగుల, కులే ఏవ - కులమునందే, భవతి - జన్మించును, హి - నిశ్చయముగ, ఈదృశమ్ జన్మ - యిట్టి జన్మము- యత్ - ఏదిగలదో, ఏతత్ - ఇది, లోకే దుర్లభతరం - ఈలోకమున లభించుట మిక్కిలి కష్టము.

తా : లేక బుద్ధిమంతులైన యోగుల కులమందైనను జనించును. ఇట్టి జన్మము లభించుట సులభముకాదు. కారణ మేమన :

తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన ! 26

కురునందన !- అర్జున ! తత్ర - అక్కడ, తం పౌర్వదైహికం- ఆ పూర్వదేహమునకు సంబంధించిన, బుద్ధిసంయోగం లభతే-బుద్ధిసంబంధ మును పొందును, చ తతః భూయః - తదనంతరము మరల, సంసిద్ధౌ - శ్రేష్ఠమైన సిద్ధికొఱకు, యతతే - యత్నించును.

తా : యోగుల వంశమున జనించి తాను పూర్వజన్మమున సంపాదించిన జ్ఞానమును బాల్యముననే స్మరించి యట నుండి సిద్ధికొఱకు యత్నించును.

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః
జిజ్ఞాసు రపి యోగస్య శబ్ద బ్రహ్మాతిరిచ్యతే. 27

సః అవశః అపి - అతడు వివశుడై, తేన పూర్వాభ్యాసేన ఏవ - ఆ పూర్వమొనర్చిన అభ్యాసముతోనే, హ్రియతే - (యోగము వంకకు) లాగబడును, యోగస్య జిజ్ఞాసుః - యోగము నెఱుగకోరువాడు, శబ్దబ్రహ్మ అపి - శబ్దజ్ఞానమునుకూడ, అతిరిచ్యతే - దాటిపోవును. (యోగవిషయమున నతడు వినినదానికంటె, చదివినదానికంటె నెక్కువ స్వయముగానే తెలిసి కొనగలడని భావము.)

తా : అర్జున ! అతడు పూర్వము తా జేసిన యభ్యాస సంస్కారబలముచే నీ జన్మమునందును యోగమార్గమున నడుపబడును. పూర్వాభ్యాసమువలన నేర్పడిన సంస్కారము యోగభ్రష్టున కీ జన్మమున దోడ్పడుటయే కాక బలవంతముగా నతనిని యోగము నభ్యసింప ప్రేరేపించును. యోగమార్గమున జీవనయాత్ర నడపి సిద్ధిబొందక పూర్వమే మార్గభ్రష్టుడైనను నతని కేమియు హాని కలుగదు. మఱియు యోగమార్గమున నడవకున్నను ఆ మార్గము నెఱుగగోరువ్యక్తి కేవల బ్రహ్మ విద్యకు సంబంధించిన పుస్తకపఠన మొనర్చువానికంటె శ్రేష్ఠుడగును. బ్రహ్మను గూర్చి నేర్చిన శబ్దజ్ఞానికంటె యోగ మార్గము నెఱుగగోరువాడు శ్రేష్ఠుడుగా నెంచబడునన్న మాట.

ప్రయత్నా ద్యతమాన స్తు యోగీ సంశుద్ధ కిల్బిషః
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్. 28

ప్రయత్నాత్ - ఉపాయముతో, యతమానః - యత్నించుచు, యోగీ - యోగమార్గావలంబి, తు, సంశుద్ధ కిల్బిషః - పాపములనుండి శుద్ధుడై, అనేక జన్మసంసిద్ధః - అనేక జన్మములందు పవిత్రుడై, తతఃపరాం గతిం యాతి - అనంతరమున నుత్తమగతిని - మోక్షమును పొందును.

తా : ఇక ప్రయత్న పూర్వకముగ యోగమార్గమున జీవనము నడుపువాడు క్రమముగా చిత్తమాలిన్యములను దొలగించుకొని, శుద్ధమనస్కుడై యొకజన్మమునందు కాకున్న మఱియొక జన్మమునందైనను పరమపదమును బొందగలడు-ముక్తుడగును.

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మాద్ యోగీ భవార్జున ! 29

అర్జున !, యోగీ-ధ్యానయోగి, తపస్విభ్యః - (శీతోష్ణాది ద్వంద్వములను సహించు) తాపసులకంటె, జ్ఞానిభ్యః-సదాచారులు, సంయములునగు) జ్ఞానులకంటె, కర్మిభ్యః - (సకామ కర్మల నాచరించు) కర్మఠుల కంటె, అధికః మతః - అధికుడుగ నెంచబడును.

తా : ధ్యానశీలుడగు కర్మయోగి, శీతోష్ణాదులను సహించు కేవల తాపసులకంటెను, కేవల శబ్దార్థము నెఱుంగు జ్ఞానుల కంటెను, ఫలాపేక్షతో కర్మల నాచరించు కర్మఠుల కంటెను అధికుడుగా నెంచబడుచున్నాడు. కావున నో యర్జున! నీవును కర్మయోగి వగుము.

ద్వాదశాధ్యాయము సమాప్తము

★

# శ్రీమద్భగవద్గీత

## త్రయోదశాధ్యాయము

# భక్తియోగము

## (భక్తి నిరూపణము)

సారము - సంగతి :

సామ్యబుద్ధిని, ఆనందప్రాప్తిని గలిగించు ధ్యానయోగము పూర్వము వర్ణింపబడినది. ఈ యధ్యాయమున 'ధ్యానయోగమువలన భగవద్దర్శనము కలుగును. కాని, భక్తిరసము ధ్యానముతో మేలవింపవలసి యుండును' అని చెప్పబడినది. ఎవనిని ధ్యానింపవలయును ? ఎవనియందు భక్తియుంచ వలయును? అను ప్రశ్నలకు సమాధానము చెప్పుచు భగవంతుని స్వరూపము ఉపనిషత్ భాషలో వ్యాఖ్యానము చేయబడినది. భగవంతుడు వేదములకు కర్త. అతడు ఆదికవి. అనాది. సమస్త విశ్వమును శాసించువాడు. అతని స్వరూప మింద్రియగమ్యము కాదు. కాని, తమోగుణావరణము తొలగిన పిదప ప్రకాశస్వరూపుడగు భగవంతుని తెలియదగును. గృహ స్థాశ్రమమునుండి వేఱై, వానప్రస్థమునందును, సంన్యాసమునందును భ్రుకుటియందు ప్రాణమును నిరోధించి, తపస్సు నేకాగ్రముచేయుచు ప్రకాశ స్వరూపుడగు భగవంతుని ధ్యానింపవలయును. వేదవిదు లితనినే వ్యాఖ్యా నింతురు. సంయము లితనియందే ప్రవేశింతురు. బ్రహ్మచారు లితనినే కోరుదురు. కాని, ఇత డనన్యభక్తిగలవానికి లభించును. వేదపఠనము, యజ్ఞము, తపస్సు, దానము మున్నగువానిచే లభించు ఫలము భగవత్ ప్రాప్తికి తుల్యముకాదు. అతనిని చేరుమార్గము వీనిని విడిచి యుండదు. భక్తియోగము ధ్యానయోగిని ఉదారహృదయు నొనర్చుచు నతనికి సాహాయ్యము చేయునని వేఱుగ తెలుపవలసిన యావశ్యకత లేదు.

అభ్యాస యోగయుక్తేన చేతసా నాన్యగామినా
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్. 1

నాన్యగామినా - ఇతరమునకు చెందక, అభ్యాస యోగయుక్తేన - ధ్యానయోగమునందు లగ్నమైయుండు, చేతసా - చిత్తముతో, అనుచింతయన్ - భగవానుని ధ్యానించుచు, పార్థ ! - అర్జున, దివ్యం పరమం పురుషం - ప్రకాశ స్వరూపుడు, పరమపురుషుడు నగు భగవానుని, యాతి - పొందును.

తా : ఇతర వస్తువులందు మనస్సు లగ్నము కానీయక ధ్యానయోగము నిత్యము సాధించు కర్మయోగి పరమేశ్వరుని యందు మనస్సు జొప్పించి యా దివ్యతత్త్వమును బొందును. ఆ తత్త్వము మిక్కిలి సూక్ష్మము. బ్రహ్మాండపురమున నంతట నిండి యుండును. అందువలన పురుషు డనబడును.

కవిం పురాణ మనుశాసితార
మణో రణీయాంస మనుస్మరేత్ యః
సర్వస్య ధాతార మచింత్యరూపం
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్. 2

ప్రయాణ కాలే మనసాఽచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ
భ్రువో ర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్
సతం పరం పురుష ముపైతి దివ్యమ్. 3

కవిం - వేదరచయితయు, పురాణం - అనాదియు, అనుశాసితారం - వేదముల నుపదేశించువాడును, అణోః అణీయాంసం - సూక్ష్మముకంటె నతిసూక్ష్మమును, సర్వస్యధాతారం - సర్వధారణకర్తయు, అచింత్య

రూపం - చింతింపదగని రూపముగలవాడును, తమసః పరస్తాత్ - అజ్ఞానమునకు పరమును, ఆదిత్యవర్ణం - ప్రకాశస్వరూపుడునునగు భగవంతుని, యః - ఎవడు, భక్త్యా, యోగబలేనచ యుక్తః - భక్తితోను, ధ్యానయోగము తోను యుక్తుడగునో, ప్రాణం భ్రువోః మధ్యేసమ్యక్ ఆవేశ్య-ప్రాణమును భ్రుకుటిమధ్య బాగుగ నిలిపి, ప్రయాణకాలే - ప్రయాణసమయమున, అచలేన మనసా - స్థిరచిత్తముతో, అనుస్మరేత్ - (భగవంతుని) స్మరించునో, సః - ఆతడు, తం దివ్యం పరమం పురుషం - ఆదివ్య పరమ పురుషుని, యాతి - ప్రాప్తించును.

తా : పరమేశ్వరుడు కవి. ఆదికవి. వేదరచయిత. క్రాంతదర్శి. పదార్థముల యంతర్బాహ్యముల నెఱిగినవాడు. పురాణపురుషుడు. ఆదిలేనివాడు – కారణ రహితుడు. సంఘటక పదార్థముల కలయికచే నేర్పడిన తత్త్వముకాదు. వేద విజ్ఞానము మూలమున మానవులకు ధర్మజ్ఞానము కలిగించువాడు. సూక్ష్మతత్త్వములగు జీవ ప్రకృతులకంటెను మిక్కిలి సూక్ష్ముడు. బ్రహ్మాండమున గల సమస్త పదార్థములకు నాధారము. అతని స్వరూపము – లక్షణము రాగద్వేషాది మలయుక్తమగు సాధారణ మనస్సున కందదు. అజ్ఞానము నంటక జ్ఞానజ్యోతియై వెలుగుచుండును. మరణకాలమున – దేహమును త్యజించునపుడు యోగబలముతో చిత్తము నేకాగ్రము చేసికొని, ప్రాణమును భ్రూమధ్యమున జేర్చి, భక్తితో నాపరతత్త్వమును ధ్యానించువాడు – స్మరియించువాడు పరమేశ్వరుని బొందును. మోక్షానందము ననుభవించును.

యదక్షరం వేదవిదో వదంతి
విశంతి యద్ యత యో వీతరాగాః
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
త త్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే. 4

వేదవిదః - వేదవిదులు, యత్ అక్షరం వదంతి - ఏ నాశరహితుని గూర్చిచెప్పుదురో, యతయః-యతులు, వీతరాగాః - రాగరహితులై, యం విశంతి - ఎవనిలో చేరుదురో, యత్ ఇచ్ఛంతః - ఎవనిని గోరుచు, బ్రహ్మచర్యం చరన్తి - బ్రహ్మచారులగుదురో, తత్పదం - ప్రాప్తింప యోగ్యుడగు నతనినిగూర్చి, తే, సంగ్రహేణ ప్రవక్ష్యే - నీకు సంగ్రహముగ చెప్పుదును.

తా : వేదవిదులే పరమతత్త్వమును అక్షరము-నాశరహితము అని నుడువుదురో, వీతరాగులు - విరక్తులు - విషయాసక్తిని విడిచినవారు ఏ సూక్ష్మతత్త్వమును బొందుదురో, ఏ పరమపదము నభిలషించి యావజ్జీవము బ్రహ్మచర్య వ్రతధారణము చేయుదురో ఆ పరతత్త్వమును గూర్చి అర్జున! నీకు సంక్షేపముగ జెప్పెద వినుము.

పురుషః స పరః పార్థ ! భక్త్యా లభ్య స్త్వనన్యయా
యస్యాంతఃస్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్. 5

పార్థ ! భూతాని యస్య అంతః స్థాని - ప్రాణులు ఎవనియందున్నవో, యేన ఇదం సర్వం తతమ్ - ఎవడు ఈ ప్రపంచము నంతటిని వ్యాపింపజేసెనో - రచియించెనో, సః - అట్టి, పరఃపురుషః - పరమపురుషుడు, అనన్యయా భక్త్యా లభ్యః-అసాధారణ భక్తితోపొందదగినవాడు.

తా : పార్థ! ఆ పరతత్త్వము అనన్యభక్తితో లభించును దానియందే యీసమస్త ప్రాణులు నివసించుచున్నవి. అదియే యీ బ్రహ్మాండము నంతటిని విస్తరింపజేసి యిందు వ్యాపకమై యున్నది.

వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్ పుణ్యఫలం ప్రదిష్టమ్
అత్యేతి తత్ సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్. 6

ఇదం విదిత్వా - ఇది తెలిసికొని, వేదేషు యజ్ఞేషు తపస్సు చ ఏవ దానేషు - వేదపాఠములందును, యజ్ఞములందును తపస్సులందును మఱియు దానములందును, యత్ పుణ్యఫలం ప్రదిష్టం - ఏ పుణ్యఫలము చూపబడినదో, యోగీ - యోగి, తత్ సర్వం అత్యేతి - దానినంతటిని మించిపోవును, చ - మఱియు, ఆద్యం, పరమం, స్థానం, ఉపైతి - ప్రధానము, ఉత్కృష్టము నగు నాభగవంతుని చేరును.

తా : ఆ పరతత్త్వమును సాక్షాత్కారము చేసికొనిన యోగి వేదపాఠము వలన గలుగు ఫలమును, యజ్ఞానుష్ఠానము వలన లభించు పుణ్యమును, తపస్సుతో బొందు శుభమును, దానాదులచే లభించు సుఖమును అన్నింటిని మఱచి యీ పరతత్త్వమునే పొందును. ఇతర మతనికి రుచియింపదు. అన్యమతని నాకర్షింపదు. దానికి మించి యానందము నొసంగున దింకొకటిలేదు. పరతత్త్వప్రాప్తి కలిగిన మీదట సర్వము విస్మరించు నని భావము.

త్రయోదశాధ్యాయము సమాప్తము

*

# శ్రీమద్భగవద్గీత

## చతుర్దశాధ్యాయము

# జ్ఞానయోగము

(జ్ఞానజ్ఞేయముల నిరూపణము)

సారము - సంగతి :

పదుమూడవ యధ్యాయమున నర్జునుడడిగినమీదట కర్మయోగమున సఫలుడుకాని మనుజున కెట్టిగతికలుగునో కృష్ణుడు స్పష్టపఱచియున్నాడు. ఈ యధ్యాయమునందు మనుష్యుడే సాధనముల మూలమున కర్మయోగమున సాఫల్యమును సంపాదింపగలడో చెప్పవలసియున్నది. వానినే యిట నుల్లేఖించి యున్నాడు. కృష్ణు డా సాధనములను జ్ఞాన నామముతో పేర్కొని యున్నాడు. గీతలోని యీ జ్ఞానము దార్శనికుల జ్ఞానము వంటిది కాదు. దార్శనికుల దృష్టిలో వస్తుస్వరూపమును దెలుపునది జ్ఞానము. సత్యాసత్యముల వివేకమునకు తోడ్పడునదియు జ్ఞానమని చెప్పుదురు. దానిని గీత విజ్ఞానమనును. ఈ విజ్ఞాన వర్ణనము పదునైదవ అధ్యాయమున ప్రారంభమగును. దార్శనికు లీ విజ్ఞానమును తత్త్వజ్ఞాన మందురు. గీతయందు జ్ఞాన నామముతో కొన్ని సదాచార నియమములు చెప్పబడినవి. ఇట్టి నియమములనే యోగదర్శనము యమనియమము లనియు, మనుస్మృతి ధర్మమనియు నుడివియున్నది. యోగదర్శనము లోని యమనియమములు తత్త్వజ్ఞానమునకు సాధనములు. గీతలోని జ్ఞానము విజ్ఞానమునకు సాధనము. అందువలననే యీ సదాచార నియమములు విజ్ఞానమునకు పూర్వముననే వర్ణింపబడినవి. విజ్ఞాన సాధనము లగుటవలననే యీ నియమములు జ్ఞాన మనబడినవి. దీనితోపాటు జ్ఞానము విజ్ఞానమునకు సాధనమనియు, ఆ జ్ఞాన విజ్ఞానములు రెండును కర్మయో

గమునకు సాధనములనియు తెలిసికొనుట యావశ్యకము. ఈజ్ఞాననియమము లలో నంతిమ నియమము 'తత్త్వజ్ఞానార్థ దర్శనమ్' యథార్థ జ్ఞానముతో పదార్థము నెఱుగుట. తత్త్వజ్ఞానమువలన నితర పదార్థముల జ్ఞానము కలిగినను, తత్త్వజ్ఞానమునకు ముఖ్యలక్ష్యము భగవత్ స్వరూపము నెఱుగుటయే యగును. అందువలననే యీ యధ్యాయమున జగదీశ్వరుడే జ్ఞేయమని చెప్పబడినాడు. ఈ యంతిమ నియమమునకు సంబంధించిన విషయమును తెలిసికొనుటకే యీ యధ్యాయమున నాజ్ఞేయము నిరూపింప బడవలసియే యుండెను. అందువలననే భగవంతుని స్వరూప వర్ణనము కొంత భక్తియోగ ప్రకరణమునను, మఱికొంత యిక్కడను చేయబడినది. భగవంతుని యునికి ప్రాపంచిక వస్తువులవలె ఇంద్రియ విషయము కాదు. కాని, యది యభావరూపమును కాదు. ఇది యెట్లు సంభవమో ! తెలిసికొనుము. భగవంతుని చేతులు, కాళ్ళు, కన్నులు, ముక్కు. మొగము, చెవులు కనిపింపవు. కాని యీ యింద్రియముల వలన కాదగు కార్యములు ప్రపంచమున నంతటను నగుచున్నవి. నడువక, పట్టుకొనక, చూడక, తెలిసికొనక, ఆజ్ఞా వచనముల నుచ్చరింపక యెవరేని యొక చిన్న కుటుంబమునైనను నడుపగలరా ? నడుపజాలని పక్షమున నింతటి విశాల ప్రపంచ చక్రమును శక్తిలేనివాడు ఎట్లు నడుపగలడు ? ఎన్నడును నడుపజాలడు. కాబట్టి, భగవంతుని యునికి సూక్ష్మమగుటచే నింద్రియ గోచరము కాకున్నను, అతనికి శరీరము లేనందున నింద్రియములు లేకున్నను ఇంద్రియముల మూలమున జేయదగు కార్యముల నన్నిటిని జేయగల శక్తుల కన్నింటికిని నతడు స్వామి యని యంగీకరింపక తప్పదు. అత డసంగుడయ్యు నన్నింటిని ధరించును. నిర్గుణుడయ్యును గుణములను సంభవింపజేయును. మఱియు నంతట నుండును. చలింపడు. వ్యాపకు డగుటచే దూరమునను సమీపమునను నుండును. ఉత్పత్తి, స్థితి, లయములకు అతడు విధాత. సూక్ష్ము డగుటచే నతని నెఱుగుట కఠినము. కాని, తమోగుణావరణము

తొలగిన మీదట జ్ఞానము మూలమున నతని ప్రకాశస్వరూపము నెఱింగి జ్ఞాని యతనిని హృదయముననే ప్రాప్తించును

ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే
జ్ఞానం విజ్ఞాన సహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. 1

అనసూయవే తే - అసూయారహితుడవగు నీకు, ఇదం గుహ్యతమం - ఈ యత్యంత గుప్తమైన, విజ్ఞాన సహితం జ్ఞానం - విజ్ఞానముతో గూడిన జ్ఞానమును, ప్రవక్ష్యామి - చెప్పుదును, యత్ జ్ఞాత్వా - ఏది తెలిసికొని, అశుభాత్ - అశుభమునుండి, మోక్ష్యసే - విడివడగలవో. (అట్టి జ్ఞానము చెప్పుదునని భావము.)

తా : అర్జున ! అసూయారహితుడవగు నీకు మిక్కిలి రహస్యముగానున్న విజ్ఞానముతో గూడిన జ్ఞానము దెలిపెదను; వినుము. దీనివలన నశుభమునుండి విడివడగలవు.

జ్ఞాననిరూపణము :

అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః. 2

అమానిత్వం-నిరభిమానము, అదంభిత్వం-నిష్కపటత, అహింసా-అహింస, క్షాంతిః - సహనము, ఆర్జవం - సరళత, ఆచార్యోపాసనం - ఆచార్యుని గుణముల ననుసరించుట, శౌచం - శరీరము, ఆత్మ, మనస్సు, వీని శుద్ధి, స్థైర్యం - దృఢత, ఆత్మ వినిగ్రహః - ఆత్మ సంయమము.

తా : అభిమానము, కపటము, వైరభావమునను నీ మూడును లేకుండుట, ఋజుత్వము, ఆచార్యుని గుణములు తనలో కల్గియుండుట, శరీరము ఇంద్రియములు మనస్సని మున్నగు వానిని స్నానాదులచేతను రాగద్వేషాదుల విడుచుట

చేతను శుద్ధము - పవిత్రముగా నుంచుకొనుట, దృఢత కలిగి యుండుట, మనస్సును వశమున నుంచుకొనుటయు జ్ఞానమనబడును.

ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖదోషానుదర్శనమ్. 3

ఇంద్రియార్థేషు వైరాగ్యం - విషయములయం దనాసక్తి, చ ఏవ అనహంకారః - అహంకారము లేకుండుట, జన్మ... దర్శనమ్ - ఉత్పత్తి, మరణము, ముసలితనము, రోగము, వీనివలనకలుగు దుఃఖములు చెడుగులు నెఱుగుట.

తా : మఱియు నేత్రాదీంద్రియములచే గ్రహింపబడు రూపరసాది విషయములం దాసక్తి లేకుండుట, అహంకారాభావము, జన్మ, మరణము, ముసలితనము, రోగము మున్నగు వానివలన గలుగు కష్టముల నెల్లపుడు గుర్తించుటయు జ్ఞానమే యగును.

అసక్తి రనభిష్వంగః పుత్రదార గృహాదిషు
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు. 4

అసక్తిః - విషయాసక్తి లేకుండుట, పుత్రదార గృహాదిషు - సంతానము, భార్య, గృహము మున్నగువానియందు, అనభిష్వంగః - విశేషసంబంధము లేకుండుట, చ - మఱియు, ఇష్టానిష్టోపపత్తిషు - తన కోరికకు అనుకూలమైనట్టియు, ప్రతికూలమైనట్టియు వస్తువులు లభించినపుడు, నిత్యం సమచిత్తత్వం - ఎల్లపుడు చిత్తమును నిర్వికారముగ నుంచుట.

తా : ఇంకను, 'ఇది నాది' అనుచు నొక వస్తువునందు ప్రీతిగలిగి యుండకుండుట (అసక్తి), సంతతి భార్య గృహాము

మున్నగునవి తానే యని యెంచి వానియం దత్యంత ప్రేమ కలిగి యుండకుండుట (అనభిష్వంగము), తనకు ఇష్టానిష్టములు కలిగినపుడు చిత్తమున హర్ష శోకాదులు కలుగనీయ కుండు టయు జ్ఞానమే.

అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్
ఏతత్ జ్ఞానమితి ప్రోక్త మజ్ఞానం యదతో౽న్యథా. 5

అధ్యా నిత్యత్వం -అంతరాత్మ జ్ఞానమున తత్పరుడై యుండుట, తత్త్వ. దర్శనమ్ - యథార్థముగ వస్తువుల నెఱుంగుట, ఏతత్ - ఇది యంతయు, జ్ఞానం ఇతి ప్రోక్తం-జ్ఞానమని చెప్పబడినది. యత్ అతః అన్యథా - ఏది దీనికంటె విపరీతమో, (అది) అజ్ఞానం - అజ్ఞానము.

తా : ఇంతేకాక, యెల్లపుడు నాత్మజ్ఞాన సంపాదనార్థము యత్నించుట, లోకమునందలి పదార్థముల యథార్థజ్ఞానము సంపాదించుటయు జ్ఞానమే యగును. పై నాలుగు శ్లోకము లందు జెప్పబడినట్లు వర్తించుట జ్ఞానము కలవాని లక్షణము. దానికి విరుద్ధమైన వర్తనమంతయు అజ్ఞాన మనబడును.

జ్ఞేయ నిరూపణము :

జ్ఞేయం యత్తత్ ప్రవక్ష్యామి, యజ్ జ్ఞాత్వా౽మృతమశ్నుతే
అనాది మత్ పరం బ్రహ్మ న సత్తన్నాస దుచ్యతే. 6

యత్ జ్ఞేయం - ఏది తెలియదగినదో, యత్ జ్ఞాత్వా - ఏది తెలిసి కొని, అమృతం అశ్నుతే - మోక్షము ననుభవించునో, తత్ ప్రవక్ష్యామి - అది చెప్పుదును, అనాదిమత్ పరంబ్రహ్మ - అది ఆదిలేని పరబ్రహ్మము, తత్ - అది, న సత్ - స్థూలప్రపంచమువలె కనుపించునది కాదు, అసత్ న ఉచ్యతే - అభావమనియు చెప్పబడదు.

తా : అర్జున ! ఇంతవఱకు నీకు జ్ఞానము, అజ్ఞానము నను రెండింటిని గూర్చి తెలిపితిని. ఇక నీకు జ్ఞేయము దెలిపెదను. జ్ఞానముచే తెలియదగినది జ్ఞేయమనబడును. జ్ఞేయతత్త్వము నెఱిగి నందున నీవు అమృతత్త్వము బొందగలవు. మోక్షా నందము ననుభవింపగలవు. ఆ తత్త్వమే పరబ్రహ్మము. దానికి కారణము (ఆది) లేదు. సత్, అసత్ అను పదములచే నది వ్యవహరింపబడదు. స్థూలప్రపంచమువలె నది సత్ పదముచే వ్యవహరించుటకుగాని, అది యభావము కాదు కాబట్టి అసత్ పదముచే చెప్పబడుటకు కాని వలను పడదని భావము.

సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షిశిరోముఖమ్
సర్వతః శ్రుతిమల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి. 7

తత్ - ఆ బ్రహ్మము, సర్వతః పాణిపాదం - అంతట హస్తపాదములు గలది, సర్వతః అక్షి శిరోముఖం - అంతట కన్నులు శిరస్సు ముఖములు కలది, సర్వతః శ్రుతిమత్ - అంతటను చెవులు కలది, లోకే- లోకమున, సర్వం అవృత్య తిష్ఠతి - అంతటిని ఆవరించి యుండును. (హస్తపాదాదులచే నగు కార్యమును బ్రహ్మము తన వ్యాపకశక్తిచే చేయు నని భావము.)

తా : ఆ పరమతత్త్వమున కన్ని యెడలను కాలుసేతు లున్నవి. కన్నులు, శిరస్సులు, ముఖములు నుండును. అన్ని దిక్కులందును చెవులున్నవి. సర్వ ప్రపంచము నది యావరించి యుండును.

(అటులయిన నాతత్త్వము మనుజులవలె కరచరణాద్యవయవములు, నేత్రాదీంద్రియములు కలిగి యుండునా ? అట్లుండదు. అయ్యది వ్యాపక తత్త్వమని తెలుపుట కట్లు వర్ణింపబడినది. అందువలననే యీ క్రింది శ్లోకమున నిట్లు స్పష్టపఱచు చున్నాడు )

సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ. 8

ఆ బ్రహ్మము, సర్వేంద్రియ గుణాభాసం - సర్వేంద్రియ గుణ యుక్తము, సర్వేంద్రియ వివర్జితం - సర్వేంద్రియ రహితము, అసక్తం - అసంగము, సర్వభృత్ చ ఏవ - సర్వమును ధరించునదియే, నిర్గుణం - (ప్రకృతి) గుణరహితము, గుణభోక్తృ చ - గుణములను పాలించునదియే. (వానిని కార్యానుకూలముగ జేయునది యని భావము)

తా : ఆ బ్రహ్మతత్త్వమునకు జ్ఞానేంద్రియములు కాని, కర్మేంద్రియములు కాని యేవియు నుండవు. కాని, సర్వేంద్రియ శక్తులు దానియం దుండును.

(ఉపనిషత్తులందు నీతత్త్వమిట్లే వర్ణింపబడినది. "అపాణిపాదం జవనో గ్రహీతా, పశ్యత్యచక్షుః స శృణో త్యకర్ణః' ఆ బ్రహ్మతత్త్వమునకు కాలుచేతులు లేవు. కాని యా యవయవముల శక్తులు జవన గ్రహణములు దాని కుండును. అట్లే కన్నులు లేవు. కాని, యది చూచును. చెవులులేవు. కాని వినును. అట్టి యా బ్రహ్మతత్త్వ మీ బ్రహ్మాండమును ధరించి యున్నది. అన్నింటికి నది యధిష్ఠానము - ఆధారము. కాని యది దేనియందును లగ్నముకాదు. సత్వరజస్తమోగుణము లందుండవు. అవి ప్రకృతి గుణములు, ఆ గుణముల నన్నింటి నది పాలించును - అదుపులో నుంచును. సూక్ష్మప్రకృతిని స్థూలమొనర్చి జీవుల యుపభోగానుకూలముచేయు నని భావము.)

బహి రంతశ్చ భూతానా మచరం చర మేవ చ
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్. 9

తత్ - ఆబ్రహ్మము, భూతానాం - భూతములకు, బహిః అంతః చ - వెలుపల లోపలను ఉన్నది. అచరం చరం ఏవ చ - చలన రహితమై

(ప్రపంచమును) చలింపజేయునదై యున్నది, తత్ - అది, సూక్ష్మత్వాత్ - సూక్ష్మ మగుటవలన, అవిజ్ఞేయం - తెలియబడదు, కాని, తత్ - అది, దూరస్థం - దూరమున నుండును, అంతికే చ - సమీపమున నుండును.

తా : సమస్త పదార్థములకు. సర్వప్రాణులకు లోపల వెలుపల నంతట నాబ్రహ్మతత్త్వ మోతప్రోతమై యుండును. కావుననే యది చలింపదు. అన్నింటిని తన శక్తిచే చలింప జేయును. అది యత్యంత సూక్ష్మమగుటవలనను, ప్రాకృతికములగు రూపాది గుణములు లేనందు వలనను నది యింద్రియములచే గ్రహింపబడదు. దూర సమీప భేదములేక యెల్ల యెడల నుండును.

అవిభక్తం చ భూతేషు విభక్త మివ చ స్థితమ్
భూతభర్తృ చ తజ్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ. 10

తత్ - అది, భూతేషు - భూతములలో, అవిభక్తం - సంయుక్తమై యున్నది, కాని సూక్ష్మ మగుటచే, విభక్తం ఇవ చ స్థితం - సంయుక్తము కావిదిగను ఉన్నది, భూతభర్తృ, ప్రభవిష్ణు - భూతములను పాలించు నదియు, భూతముల నుత్పన్నము చేయునదియు, చ, గ్రసిష్ణు - వానిని ప్రళయము చేయునదియు నని, జ్ఞేయం - తెలియదగును.

తా : పదార్థములం దన్నింటి యందును నఖండితమై యుండి, యజ్ఞులకు మాత్ర మన్నింటి యందును ఖండితమై విభజింపబడి యున్నట్లుండును. ప్రపంచ పదార్థములను బుట్టించి, పోషించి, లయము చేయును.

జ్యోతిషా మపి తజ్ జ్యోతిః తమసః పర ముచ్యతే
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్. 11

తత్ - ఆబ్రహ్మము, జ్యోతిషాం అపి జ్యోతిః - ప్రకాశములకు కూడ ప్రకాశము, తమసః పరమ్ - తమోగుణమునకు పరమైనది. జ్ఞానం - జ్ఞానస్వరూపము, జ్ఞేయం - తెలియ దగినది — జ్ఞాన విషయము. జ్ఞానగమ్యం - జ్ఞానము వలన పొందదగినది. సర్వస్య హృది - అందఱి హృదయమున, విష్ఠితం - విశేషముగ నున్నదనియు, ఉచ్యతే - చెప్పబడును.

తా : బ్రహ్మతత్త్వము ప్రకాశానంతములగు సూర్యాది గోళములకు బ్రకాశము నిచ్చునది. అంధకారమున కదిపరము.

(కావుననే యుపనిషత్తులందు, 'న తత్ర సూర్యో భాతి న చంద్ర తారకం ః నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః' - 'బ్రహ్మప్రకాశము నెదుట సూర్యచంద్ర నక్షత్ర విద్యుదాదుల ప్రకాశ మెందునకు కొఱగాదు. ఇక నగ్ని ప్రకాశమును గూర్చి చెప్పనేల ?' యని వర్ణింపబడినది. జ్ఞానము బ్రహ్మమునకు స్వరూపము - లక్షణము. అది జ్ఞేయము - జ్ఞానమువలననే యెఱుగదగినది. జ్ఞానమే బ్రహ్మసాక్షాత్కారమునకు ముఖ్యసాధనము. కావుననే 'తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి ః నాఽన్యః పంథా విద్యతేఽయనాయ' 'పరమాత్మ జ్ఞానమే మోక్షమునకు - మృత్యుముఖమున బడకుండుటకు సాధనము. మఱియొండుమార్గమే లేదు' అని వేదము పరతత్త్వ జ్ఞానమునకు ప్రాధాన్య మిచ్చుచున్నది. కాని యా పరతత్త్వము నెక్కడ తెలిసికొనవలయు నన : హృదయమునందే తెలియదగును. అని బోధించుటకే కృష్ణ డీ శ్లోకమున పరబ్రహ్మమందఱి హృదయమున బ్రతిష్ఠితమై యున్నదని విశేషించి చెప్పుచున్నాడు.)

చతుర్దశాధ్యాయము సమాప్తము.



# శ్రీమద్భగవద్గీత

## పంచదశాధ్యాయము

# విజ్ఞానయోగము

## (గుణకార్య వివేకము - గుణాతీత లక్షణము)

సారము - సంగతి :

పదునాలుగవ యధ్యాయమున జ్ఞానజ్ఞేయములు నిరూపింపబడినవి. సదాచార నియమములకే జ్ఞానమని నామము. ఆ నియమములను పాలించిన మీదటనే మనుజుడు కర్మయోగమున కధికారి యగును. కర్మయోగము సొంత మొనర్చుటకు గుణములను దాటవలసి యున్నది. గుణాతీతు డగుటకు గుణముల వైశిష్ట్యమును, వాని కార్యములను నెఱుంగవలయును. దీనినే విజ్ఞాన మందురు. కృష్ణు డీ పదునైదవ యధ్యాయమున నీ విషయమునే వివరించియున్నాడు. సత్వరజస్తమోగుణములు సుఖము, ప్రవృత్తి, ప్రమాదము మున్నగు తమ కార్యముల మూలమున మనుజుని సంసారమున బంధించును. సత్వ గుణమునకు ప్రకాశము, రజో గుణమునకు రాగము, తమోగుణమునకు మోహము స్వరూపములు. జ్ఞానము వృద్ధియైన సత్వగుణము, లోభము వర్ధిల్లిన రజోగుణము, ఆలస్య ప్రమాదములు వర్ధిల్లిన తమోగుణము వృద్ధియైన ట్లెంచవలయును. గుణముల ప్రభావమునకు లోబడిన మనుజుడు ఏదో యొక కామనచే గ్రస్తు డగును. కావున కర్మయోగి గుణముల కతీతుడు కాదగును. గుణాతీతుని గుణములు విచలితుని జేయవు. గుణముల కార్యములందు లగ్నుడైనను నతనికి ద్వేషము కలుగదు. కార్యములనుండి తొలగినపు డతనికి అభిలాషయు జనింపదు. అత డుదాసీనునివలె నుండును. సుఖదుఃఖములు కలిగినపు డతనికి హర్ష శోకములును కలుగవు. బంగారమును, మట్టిని నతడు

సమానముగ జూచును. మిత్ర శత్రువులలో నతనికి భేదము కానరాదు. ఏ ప్రవృత్తియు నతని నాకర్షింపదు. అట్టివానినే గుణాతీతు డందురు. గుణాతీతుడే కర్మయోగమును శాంతముగ ననుష్ఠింపగలడు.

గుణకార్య వివేకము :

పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ము త్తమమ్
యజ్ జ్ఞాత్వా మునయః సర్వే పరాం సిద్ధి మితో గతాః 1

పరం - ఉత్ కృష్టము, జ్ఞానానాం ఉత్తమం - జ్ఞానములలో శ్రేష్ఠము నగు, జ్ఞానం భూయః ప్రవక్ష్యామి - జ్ఞానమును మరల చెప్పుదును. యత్ జ్ఞాత్వా - ఏది తెలిసికొని, సర్వే మునయః - సర్వమునులు, ఇతః - ఇక్కడ, పరాం సిద్ధిం గతాః - పరమసిద్ధిని పొందిరో.

(పూర్వాధ్యాయమున కృష్ణు డర్జునునకు జ్ఞానము నెఱిగించి, తన్మూల మున దెలియదగు బ్రహ్మతత్త్వమును నుడివి, యిట విజ్ఞానముం గూర్చి చెప్పుచున్నాడు.)

తా : అర్జున! జ్ఞానములలోనెల్ల ఉత్తమమగు జ్ఞానము నీకు దెలుపుదును. దాని వలననే మును లెల్లరు పరమ సిద్ధిని బొంది మోక్షసుఖము ననుభవించి యున్నారు.

సత్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః
నిబధ్నంతి మహాబాహో ః దేహే దేహిన మవ్యయమ్. 2

మహాబాహో ! - అర్జున !, ప్రకృతి సంభవాః - ప్రకృతి జన్యము లైన, సత్వం రజః తమః ఇతిగుణాః - సత్వరజస్తమస్సు లను గుణ ములు, అవ్యయం దేహినం - వికారరహితమైన జీవుని, దేహే - దేహ మున, నిబధ్నంతి - బంధించును.

తా : అర్జున! సత్వము, రజస్సు, తమస్సు నను నీమూడును ప్రకృతి గుణములు. ఇవి జీవుని దేహమునందు బంధించును.

(ఇయ్యవి పృథివ్యాది పదార్థములలో నుండు రూపరసాది గుణముల వంటి గుణములు కావు. గుణపదము లోకమున రూపాదులకే కాక త్రాడునకు గూడ వాడుదురు. త్రాడు బంధించుట కుపయుక్త మగునట్లు సత్వరజస్తమస్సులను గుణములు కూడ నాశరహితుడైన జీవుని దేహము నందు బంధించి యుంచును. కావుననే ప్రకృతి స్వభావమనదగు నీ సత్వ రజస్తమస్సులు గుణపదముతో వ్యవహరింప బడుచున్నవి.)

తత్ర సత్వం నిర్మలత్వాత్ ప్రకాశక మనామయమ్
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ : 3

అనఘ ! - పాపరహిత ! అర్జున ! తత్ర - వానిలో, నిర్మల త్వాత్ - నిర్మలమగుటవలన, ప్రకాశకం - ప్రకాశమును గలిగించునదియు, అనామయం - రోగరహితము నగు, సత్వం - సత్వగుణము, జ్ఞానసంగేన- ప్రకాశమగుటవలన జ్ఞానముతోను, సుఖసంగేన - రోగరహిత మగుట వలన సుఖముతోను, బధ్నాతి - బంధించును.

తా : అనఘ! అర్జున! ఆసత్వరజస్తమస్సులలో సత్వ గుణము నిర్మలమైనది. లోకమున ప్రకాశించు పదార్థములలోని ప్రకాశమంతయు నీ సత్వగుణమునకు సంబంధించినదియే.

(ఇంద్రియములచే దెలియబడు నీలోక పదార్థము లన్నియు ప్రకృతి నుండి యేర్పడినవి. ప్రకృతి వికారములు - ప్రాకృతికములు. అందువలన ప్రతివస్తువు నందును ప్రాకృతికములైన సత్వరజస్తమోగుణములు మూడు నుండును. కాని దేనియందు సత్వగుణ మెక్కుడుగ నుండునో యది ప్రకాశించును. నిర్మలమై రోగరహితముగ నుండును. అంతఃకరణమునందు

సత్వగుణ మధికముగా నుండువానికి సుఖమెక్కువ కలగును. అతవిలో జ్ఞానము మిక్కిలి యగును. అతడు దుష్కార్యముల నొనర్పక సుఖముల ననుభవించునని భావము.)

రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సంగసముద్భవమ్
త న్నిబధ్నాతి కౌంతేయ : కర్మసంగేన దేహినమ్. 4

కౌంతేయ : రజః - రజోగుణమును, రాగాత్మకం - రాగస్వభావము గలదిగను, తృష్ణాసంగ సముద్భవం - తృష్ణను ఆసక్తిని గలిగించునదిగను, విద్ధి - తెలిసికొనుము, తత్ - అది, దేహినం - జీవుని, కర్మసంగేన - ప్రవృత్తి మూలమున, నిబధ్నాతి - బంధించును.

తా : కౌంతేయ! రజోగుణము రాగాత్మకము. వస్తువు లందనురాగము కలిగించును. ఆశలను పెంచును. కర్మల నొనర్చుటలో జీవునకు ప్రవృత్తి కలిగించును. అంతఃకరణ మున రజోగుణ మధికముగా నుండువాడు నిరంతర మేదో యొక కర్మ చేయ నుద్యుక్తుడగును.

తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్
ప్రమాదాలస్య నిద్రాభి స్తన్నిబధ్నాతి భారత : 5

భారత : తమస్తు - తమోగుణమును, అజ్ఞానజం - అజ్ఞానముచే నుత్పన్నమగు దానినిగా, సర్వదేహినాం మోహనం - సర్వజీవులను మోహింపజేయు దానినిగాను, విద్ధి - ఎఱుగుము, తత్ - అది, ప్రమాదాలస్య నిద్రాభిః - మఱపు, ఆలస్యము, నిద్ర వీనితో, నిబధ్నాతి - బంధించును.

తా : తమోగుణము అజ్ఞాన దాయకము. వస్తువుల యాథార్థ్యమును దెలియనీయక భ్రాంతి నుత్పన్నముచేయును. అంతఃకరణమున తమోగుణ మధికముగా నున్నవాడు

ప్రమాదములకు గుఱియగును. అలసు డగును. నిద్రాళువు సోమరియునై వర్తించును. గుణముల ప్రభావ మిట్టిది.

సత్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత ।
జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సంజయ త్యుత. 9

భారత ః సత్వం - సత్వగుణము, సుఖే - సుఖమునందును, రజః - రజోగుణము, కర్మణి - ప్రవృత్తియందును, తు ఉత తమః - కాని, తమోగుణము, జ్ఞానం ఆవృత్య - జ్ఞానము నావరించి, ప్రమాదే - కర్తవ్యమును మఱపించుటయందును సంజయతి - లగ్నముచేయును.

తా : అర్జున! ఈ సత్వరజస్తమోగుణములు క్రమముగా జీవుని సుఖమగ్నుని, కర్మనిరతుని, ప్రమాదభరితుని జేయును. తమోగుణము ముఖ్యముగా జ్ఞానవిరోధి.

రజ స్తమ శ్చాభిభూయ సత్వం భవతి భారత ।
రజః సత్వం తమశ్చైవ తమః సత్వం రజ స్తథా 7

భారత ః రజః, తమః, చ, అభిభూయ - రజస్తమోగుణములను అణచి, సత్వం - సత్వగుణము, సత్వం తమః చ ఏవ - సత్వతమోగుణములనణచి, రజః - రజోగుణము, తథా - అట్లే, సత్వం, రజః - సత్వరజస్సుల నణచి, తమః - తమోగుణము, భవతి - వర్ధిల్లును.

తా : ఒకప్పుడు రజస్తమస్సుల నణచి సత్వగుణమెక్కుడగును. రజోగుణము తమస్సత్వములను మించియుండును. తమోగుణము రజస్సత్వముల నధిగమించి యుండుటయుకలదు.

సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే
జ్ఞానం యదా తదా విద్యాత్ వివృద్ధం సత్వమి త్యుత. 8

అస్మిన్ దేహే - ఈ దేహమున, యదా - ఎప్పుడు, సర్వద్వారేషు- సర్వద్వారములందు, ప్రకాశః ఉపజాయతే - ప్రకాశ ముదయించునో, తదా - అప్పుడు, సత్వం వివృద్ధం - సత్వగుణము వర్ధిల్లినది. ఇతి ఉత విద్యాత్ - అని తెలిసికొనవలయును.

తా : నేత్రాది శరీరద్వారములందు ప్రకాశము కలిగి జ్ఞాన మెక్కువ యైనపుడు దేహమునందు సత్వగుణ మధికమైన ట్లెంచవలయును.

లోభః ప్రవృత్తి రారంభః కర్మణా మశమః స్పృహా
రజ స్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ ॥ 9

భరతర్షభ ! - భరతశ్రేష్ఠ ! లోభః - లోభము, ప్రవృత్తిః-ప్రవృత్తి, కర్మణాం ఆరంభః - కార్యారంభము, అశమః - అశాంతి, స్పృహా - ప్రబలమైన కోరిక, ఏతాని - ఇవి, రజసి వివృద్ధే - రజోగుణము పెరిగిన, జాయంతే - కల్గును.

తా : అర్జున ! భరతశ్రేష్ఠ! దేహమునందు రజోగుణ మెక్కువ యైనపుడు లోభము, కర్మలందు ప్రవృత్తి, పలు కార్యముల నారంభించుట, చిత్త చాంచల్యము, కోరిక లెక్కువయగుట మున్నగు లక్షణములు చూడనగును.

అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ
తమ స్యేతాని జాయంతే వివృద్ధే కురునందన ॥ 10

కురునందన ! - అర్జునా!, అప్రకాశః - అజ్ఞాన రూపమగు నంధ కారము, అప్రవృత్తిః-కర్మాచరణమునకై యత్నింపకుండుట, ప్రమాదః- మఱపు, మోహః చ - మోహమును - విపరీత జ్ఞానమును, ఏతాని ఏవ -

ఈ లక్షణములే, తమసి వివృద్ధే-తమోగుణము వర్ధిల్లినప్పుడు, జాయంతే-కలుగును.

తా : మనుజుని యంతఃకరణమునందు తమోగుణము మిగిలిన రెండు గుణములను మించి యున్నపుడు ప్రకాశమతని యందుండదు. అంధకార మెక్కుడగును. ప్రవృత్తి యుండదు. పొరపాట్లు, మోహము - భ్రాంతి యెక్కుడగును.

యదా సత్వే ప్రవృద్ధే తు ప్రలయం యాతి దేహభృత్
తదోత్తమవిదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే. 11

యదా - ఎప్పుడు, దేహభృత్ - శరీరధారి, సత్వే ప్రవృద్ధే - సత్వగుణము వృద్ధియైనపుడు, ప్రళయం యాతి - మరణించునో, తదా - అప్పుడు, ఉత్తమవిదాం - ఉత్తమ జ్ఞానులయొక్క, అమలాన్ - నిర్మలమైన, లోకాన్ - లోకములను, ప్రతిపద్యతే - పొందును.

తా : దేహధారియైన జీవుడు సత్వగుణ మెక్కుడైనపుడు మరణించినచో జ్ఞానులకు లభించు జన్మమును బొందును. ఆ జన్మము నిర్మలముగా నుండును.

రజసి ప్రలయం గత్వా కర్మసంగిషు జాయతే
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే. 12

రజసి - రజోగుణము వృద్ధియైనపుడు, ప్రలయం గత్వా - మరణించి, కర్మసంగిషు - కర్మశీలురలో, జాయతే - ఉద్భవించును, తథా - అట్లే, తమసి ప్రలీనః - తమోగుణము వృద్ధియై యున్నపుడు మరణించినవాడు, మూఢయోనిషు - అజ్ఞానులైనవారిలో, జాయతే - జన్మించును.

తా : రజోగుణ మధికమైనపుడు శరీరమును విడుచు వాడు కర్మరతులమధ్య జనించును. తమోగుణము మిక్కిలిగ నున్నపుడు మరణించువాడు మూఢజన్మము పొందును. అజ్ఞాని యగును.

కర్మణః సుకృత స్యాహుః సాత్వికం నిర్మలం ఫలమ్
రజస స్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్. 13

సుకృతస్య కర్మణః - పుణ్యకర్మకు, సాత్వికం నిర్మలం ఫలం - సాత్వికము, నిర్మలమునగు ఫలము, రజసః - రజోగుణయుక్తకర్మకు, దుఃఖం ఫలం - దుఃఖరూపఫలము, తమసః - తమోగుణ యుక్తకర్మకు, అజ్ఞానం ఫలమ్ - అజ్ఞాన రూపఫలము, ఆహుః - చెప్పుదురు.

తా : సుకృతములఁ నొనర్చువానికి సాత్వికము నిర్మలము నగు ఫలము లభించును. రజోగుణఫలము దుఃఖము. తమోగుణఫలము అజ్ఞానము.

సత్వాత్ సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞాన మేవ చ. 14

సత్వాత్ - సత్వమువలన, జ్ఞానం - జ్ఞానము, సంజాయతే - కలుగును. రజసః - రజోగుణమువలన, లోభ ఏవ చ - లోభమే కల్గును, తమసః - తమోగుణమువలన, ప్రమాదమోహౌ - మఱపు విపరీత జ్ఞానము, భవతః - కల్గును. అజ్ఞాన మేవ చ - అజ్ఞానముకూడ కల్గును.

తా : సత్వగుణము వలన జ్ఞానము, రజోగుణమువలన లోభము, తమస్సు వలన ప్రమాదము మోహము అజ్ఞానము గలుగును.

ఊర్ధ్వం గచ్ఛంతి సత్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః
జఘన్య గుణవృ త్తిస్థా అధో గచ్ఛంతి తామసాః. 15

సత్వస్థాః - సత్వగుణమున నుండు మనుజులు, ఊర్ధ్వం గచ్ఛంతి - పైకి పోవుదురు. రాజసాః - రజోగుణము కలవారు, మధ్యే తిష్ఠంతి -

మధ్యలో నుందురు, జఘన్య గుణ వృత్తిస్థాః తామసాః - నీచగుణమున నుండు తమోగుణులు, అధః గచ్ఛంతి - క్రిందికి పోవుదురు.

తా : సత్వగుణము వర్ధిల్లజేసికొనువారు ఉన్నతిని బొందుదురు. రజోగుణము పెంపుచేసికొనువారు మధ్యమస్థితి యందుండురు. నీచగుణమగు తమోగుణ మధికము చేసికొను వారు నీచజన్మలనుబొంది దుఃఖము లనుభవింతురు.

గుణానేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్
జన్మమృత్యు జరాదుఃఖై ర్ విముక్తోఽమృతమశ్నుతే. 16

దేహీ - జీవుడు, దేహ సముద్భవాన్ - దేహమున నుండు, ఏతాన్ త్రీన్ గుణాన్ అతీత్య - ఈ మూడు గుణములను దాటి, జన్మ మృత్యు జరా దుఃఖైః విముక్తః - పుట్టుక, చావు, ముసలితనము ననెడి దుఃఖముల నుండి విడివడి, అమృతం - మోక్షము, అశ్నుతే - అనుభవించును.

తా : జీవుడు తన దేహమునం దేర్పడు నీమూడు గుణములకు లోబడక వీని నతిక్రమించి జన్మ జరామరణాది దుఃఖముల నుండి విముక్తుడై మోక్షానందము ననుభవించును

(సత్వాది గుణములు ప్రకృతికి సంబంధించినవి. బుద్ధి తత్త్వము ముఖ్యముగా నీ గుణముల కధిష్ఠానము. ఆ యాగుణముల స్వభావము నెఱుగక వానిచే ప్రేరితుడై జీవుడు నానావిధ కర్మములందు ప్రవృత్తుడగుచు జన్మజరాది దుఃఖములను దెచ్చుకొనును. వాని స్వభావముల నెఱిగినవాడు వానికి లోబడక వానిని నిర్జించి, ప్రకృతి బద్ధుడు కాక యాత్మస్థితుడగును. కైవల్యమును సంపాదించును.)

(త్రిగుణ విభాగమును, వాని స్వభావమును, వానిచే నేర్పడు గతులను వినిన యర్జునుడు కృష్ణు నిట్లు ప్రశ్నించు చున్నాడు.)

కైర్ లింగై స్త్రీన్ గుణానేతా నతీతో భవతి ప్రభో ।
కిమాచారః కథం చైతాం స్త్రీన్ గుణా నతివర్తతే. 17

అర్జునుని ప్రశ్నము : ప్రభో - స్వామీ ! ఏతాన్ త్రీన్ గుణాన్-ఈ మూడుగుణములను, కైః లింగైః - ఏ చిహ్నములచే, అతీతః భవతి - అతీతుడగును? కిమ్ ఆచారః - ఎట్టి ఆచారవంతుడు, కథం - ఎట్లు, ఏతాన్ త్రీన్ గుణాన్ - ఈ మూడు గుణములను, అతివర్తతే - దాటును ?

తా : ప్రాభవ సంపన్నుడవగు నో కృష్ణ! మనుజు డెట్టి యాచారములు గలవాడై యేవిధముగ నీ గుణముల నతిక్రమింపగలడు ? ఈ గుణముల నతిక్రమించిన వాని దెలిసికొనుటకు గల లక్షణము లెయ్యవి ?

ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహ మేవ చ పాండవ :
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాన్ని కాంక్షతి. 18

కృష్ణుని సమాధానము : పాండవ !, ప్రకాశం చ - సత్వగుణము, ప్రవృత్తిం చ - రజోగుణము, మోహం ఏవ చ - తమోగుణమును, సంప్రవృత్తాని - కార్యలగ్నములై యుండు వీనిని, న ద్వేష్టి - ద్వేషింపడు, నివృత్తాని - కార్యవిముఖములై యున్నపుడు వానిని, న కాంక్షతి - అభిలషింపడు.

తా : పాండవ ! ప్రకాశము, ప్రవృత్తి, మోహము నను నివి గుణలింగములు. మనుజునియం దున్న జ్ఞానాధిక్యమును బట్టి యతనియందు సత్వగుణ మధికముగా నున్నదనియు, కర్మల నొనర్చుటలో విశేషముగా నిమగ్నుడై యుండువానియందు రజోగుణ మెక్కువ యున్నదనియు గుర్తింపనగును. విపరీత జ్ఞానము, అజ్ఞానము నెక్కువగల వానియందు తమోగుణ

మధికమని యెంచవలయును. ఈ గుణములకు లోబడక వీని నతిక్రమించి యుండువ్యక్తి తనలో తానున్నవాడై యా యా కార్యముల నాచరింప ప్రేరించు నీ గుణములను ద్వేషింపడు. అవి తన పనులందు ప్రవర్తింపని వేళలందు కావలయునని వాని నపేక్షింపడు.

గుణాతీతుని లక్షణము :

ఉదాసీనవ దాసీనో గుణైర్ యో న విచాల్యతే
గుణా వర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే. 19

యః - ఎవడు, ఉదాసీనవత్ ఆసీనః-ఉదాసీనునివలెనుండునో, గుణైః గుణములచే, న విచాల్యతే-విచలితుడుకాడో, గుణాః వర్తంతే - గుణములు తమ వ్యాపారములను చేయును, ఇతి ఏవ - అని యెంచును, యః అవ తిష్ఠతి - ఎవడు స్థిరముగా నుండునో, న ఇంగతే - చలింపడో, మఱియు,

తా : ఈగుణముల ప్రేరణకు లోబడని వాడు ఉదాసీనుడై యుండును. అవి వాని స్వభావానుగుణముగ ప్రవర్తింప నుత్సహింప జేసినను వానికి దానేల లోబడవలయునని యెంచి తన స్థితినుండి చలింపడు.

సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాంచనః
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిందాత్మసంస్తుతిః. 20

సమ దుఃఖ సుఖః-సుఖదుఃఖములలో సమానుడు, స్వస్థః-విచలితుడు కానివాడు, సమలోష్టాశ్మకాంచనః - మట్టిగడ్డ, రాయి, కాంచనము లన్నిటి లోను సమానభావము కలవాడు, తుల్య ప్రియాప్రియః - ఇష్టానిష్టములలో సమానుడు, ధీరః - ధీరుడు, తుల్యనిందాత్మ సంస్తుతిః - నిందాస్తుతులలో సమానుడు.

తా : గుణాతీతుడు స్వస్థితుడై యాత్మను గుర్తించి, సుఖదుఃఖములందు, ఇష్టానిష్టములు ప్రాప్తించి నపుడును, నిందాస్తుతులు సంభవించి నపుడును నిర్వికారుడై యుండును. అనుకూలతకు పొంగుటకాని, ప్రతికూలతకు నలమటించుట కాని యతనిలో చూడబడవు. మట్టిగడ్డలు, అమూల్యములగు వజ్రాదులు, సామాన్యుల కత్యంత ప్రియకరమగు కాంచనము నన్నియు నతనికి సమానములే; అన్నియు ప్రకృతి వికారములే; జడములే. అతని కవి యాకర్షకములుకాని, అనాకర్షకములు కాని కావు.

మానాపమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః
సర్వారంభ పరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే. 21

మానాపమానయోః - ఆదరానాదరములలో, తుల్యః - సమానుడు, మిత్రారిపక్షయోః తుల్యః - మిత్ర శత్రుపక్షములలో సమానుడు, సర్వారంభ పరిత్యాగీ - సర్వ ప్రవృత్తులను విడిచినవాడు, సః - అట్టివాడు, గుణాతీతః ఉచ్యతే - గుణాతీతు డనబడును.

తా : ఇంకను నతనికి మానాపమానములు తుల్యము లగును. మిత్రులు, శత్రువులు, నిరువురు నతనికి సమానులే. ఒకరు ప్రియులు ఇంకొక రతనికి అప్రియులుకారు. గుణాతీతుడై నిస్పృహు డగుటవలన ప్రవృత్తుల నన్నింటిని విడిచిపెట్టును. ఫలాపేక్షతో నేకార్యమును జేయడని భావము.

పంచదశాధ్యాయము సమాప్తము.

★

# శ్రీమద్భగవద్గీత

## షోడశాధ్యాయము

# విజ్ఞానయోగము

## (దైవాసుర భావవివేకము)

సారము - సంగతి :

పదునైదవ యధ్యాయమున గుణవివేచన మొనర్చి, గుణాతీతుని స్వరూపము చెప్పబడినది. అర్జును డింకను గుణాతీతునిపదవి కర్హుడుకాడు. కావున కృష్ణు డతనికి సత్వగుణ మహిమను బొందించు దైవసంపత్తి వైపున కతని మరలింపనెంచెను. దానికే యత డధికారియని చెప్పి యీ యధ్యాయమున దైవాసుర సంపదలను వివరించును, నిర్భయత, దమము, యజ్ఞము, అహింస, సత్యము, అక్రోధము, త్యాగము, శాంతి, భూతదయ, లోభత్యాగము, తేజస్సు, క్షమ, ధైర్యము, శుద్ధి, అభిమానత్యాగము మున్నగు జ్ఞానయోగమున వర్ణింపబడిన గుణములే దైవీసంపత్తి గల మనుజుని సంపత్తి. ఇందుకు విపరీతములైన కపటము, అభిమానము క్రోధము, కఠోరత, అజ్ఞానము మున్నగు దుర్గణములు ఆసురీసంపదకు చిహ్నము. ఇట్లు రెండు సంపదలను వర్ణించి కృష్ణు డర్జునునితో, 'అర్జున! చింతింపకుము. నీవు దైవీసంపద కధికారివి. కర్మయోగ మార్గమున నడచుట నీకు కఠినముకాదు' అని బోధించును. తరువాత విపరీతమార్గము నుండి తప్పించుటకుగాను, అర్జునునకు ఆసురీ భూతసృష్టినిగూర్చి విస్తారముగ బోధించును. 'ఆసురీసంపద గలవారు ప్రవృత్తి నివృత్తుల నెఱుగరు. సత్యము, శౌచము, ఆచారము మున్నగునవి వారిదరి జేరవు. వారీశ్వరు నంగీకరింపరు. జగత్సత్యతను ఒప్పుకొనరు. కామవాసనల వలన జగత్తు నిర్మితమైనదని యెంచి ప్రతి కార్యమును కామవాసనతోనే

చేయుదురు. ఈ నికృష్ట భావనలతో ప్రపంచమునకు హానియే కలిగింతురు. లాభమును గలిగింపరు. వారి కామనలెన్నడును పూర్ణములుకావు. అందు వలన నానావిధ చింతలకు వారు గుఱియగుదురు. తమ వాసనల పూర్తి కొఱకు అన్యాయముతో ధనము నార్జింతురు. తమ్ము తా మధికులమని యెంచుదురు. సర్వము తామే యనుకొందురు. వారిలో నెవడేని యజ్ఞ మొనరించిన కపటముతో చేయును. విధి ననుసరింపరు. అర్జున ! తమో గుణ సృష్టములయిన కామక్రోధ లోభములే వీరిచే నీ దుష్కర్మల నన్నింటిని జేయించును. కావున వీనిని త్యజించుము. కర్మయోగ శాస్త్రవిధి విడిచి ఫలము నపేక్షించు మనుజుడు సిద్ధిని బొందడు.

అభయం సత్వ సంశుద్ధిః జ్ఞానయోగ వ్యవస్థితిః
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్. 1

అహింసా సత్య మక్రోధః త్యాగః శాంతి రపైశునమ్
దయాభూతే ష్వలోలు ప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్. 2

తేజః క్షమా ధృతిః శౌచం అద్రోహో నాతిమానితా
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత ! 3

భారత ! అభయం - భయపడకుండుట, అంతఃకరణశుద్ధి, జ్ఞానయోగమున దృఢత, దానము, ఇంద్రియ నిగ్రహము, యజ్ఞము - లోకహిత బుద్ధితో కర్మల నొనర్చుట, ధర్మగ్రంథములను జదువుట, సుఖదుఃఖాది ద్వంద్వములను సహించుట, సరళత.

మనోవాక్కాయములతో నితర ప్రాణులకు కష్టము కలిగింపకుండుట, సత్యము చెప్పుట, కోపింపకుండుట, త్యాగము, శాంతి, చాడీలు చెప్పకుండుట, ప్రాణులయెడ దయ, లోభము లేకుండుట, నమ్రత, సిగ్గు, చాంచల్యము లేకుండుట.

ప్రతాపము, క్షమ - సహనశీలత, ధైర్యము, బాహ్యాంతరశుద్ధి, వైరము లేకుండుట, ఎక్కువ యభిమానము లేకుండుట, అను నివి యన్నియు, దైవీసంపదం అభిజాతస్య - దైవీసంపత్తితో బుట్టిన వానికి, భవంతి - కల్గును.

తా : సులభము.

దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్య మేవ చ
అజ్ఞానం చాభిజాతస్య పార్థ ! సంపద మాసురీమ్. 4

పార్థ ! దంభః - కపటము, దర్పః - గర్వము, అభిమానః చ - అహంకారమును, క్రోధః - క్రోధము, పారుష్యం ఏవ చ - కాఠిన్యమును, అజ్ఞానః - అజ్ఞానము, ఆసురీం సంపదం అభిజాతస్య - ఆసురసంపత్తితో బుట్టిన మనుజుని గుణములు.

తా : కపటము, గర్వము, అహంకారము, క్రోధము, పరుషవాక్యములు, అజ్ఞానమూ నను నివి అసుర సంపదగల వాని గుణములు.

దైవీసంప ద్విమోక్షాయ నిబంధా యాసురీ మతా
మా శుచః సంపదం దైవీం అభిజాతోఽసి పాండవ ! 5

దైవీసంపత్ - దైవీసంపత్తి, విమోక్షాయ - మోక్షముకొఱకగును, ఆసురీ నిబంధాయ మతా - ఆసురీసంపత్తి బంధమునకు కారణమగు నని యంగీకరింపబడినది, పాండవ !, దైవీం సంపదం అభిజాతః, అసి - దైవీ సంపత్తితో బుట్టినవి, (కావున) మా శుచః - చింతింపకుము.

తా : అర్జున ! దైవీసంపద మోక్షదాయకము. అసుర సంపద బంధమునకు హేతువగును. కౌంతేయ ! నీవు దైవీ సంపదగలవాడవే. చింతింపకు.

ద్వౌ భూత సర్గౌ లోకేఽస్మిన్ దైవ అసుర ఏవ చ
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ! మే శృణు. 6

పార్థ! అస్మిన్ లోకే - ఈ లోకమున, దైవః చ ఆసురః ఏవ - దైవము, ఆసురము నని, ద్వౌ భూత సర్గౌ - రెండు విధములగు ప్రాణుల సృష్టి యున్నది, దైవః విస్తరశః ప్రోక్తః-దైవసృష్టి వివరముగ చెప్పబడినది, ఆసురం మే శృణు - ఆసుర సృష్టి నా వలన వినుము.

తా : ఈ లోకమునగల ప్రాణులు దైవాసుర భేదముతో రెండువిధములు. దైవీ సృష్టిని గూర్చి వివరముగ జెప్పితిని. ఇక నాసుర సృష్టినిగూర్చి చెప్పెద వినుము.

ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదు రాసురాః
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే. 7

ఆసురాః జనాః - ఆసుర సంపత్తిగల జనులు, ప్రవృత్తిం చ నివృత్తిం చ - కర్తవ్యాకర్తవ్యములను, న విదుః - ఎఱుగరు, తేషు - వారిలో, న శౌచం - శుద్ధిలేదు, ఆచారః అపి న - ఆచారముకూడ లేదు, సత్యం న విద్యతే - సత్యమును లేదు.

తా : అసుర సంపదగల జనులు ప్రవృత్తి నివృత్తుల నెఱుగరు. కర్తవ్యాకర్తవ్యముల వివేకము వారి కుండదు. అంతర్ బాహ్య శుద్ధియు వారియందు కనిపింపదు. వారు సదాచారులు కారు. సత్యవ్రతు లంతకంటెను గారు.

అసత్య మప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరమ్
అపరస్పర సంభూతం కిమన్యత్ కామహైతుకమ్. 8

తే - వారు, జగత్ - ప్రపంచము, అసత్యం - మిథ్య యనియు, అప్రతిష్ఠం - నిరాధార మనియు, అనీశ్వరం - ఈశ్వరుడు లేకయే యేర్పడిన దనియు, ఆహుః-చెప్పుదురు, (మఱియు నది) అపరస్పర సంభూతమ్-పరస్పర కలయికచే నయినది కాదు, కామ హైతుకమ్ - కామమే కారణముగా గలది, కిమన్యత్ - ఇతర కారణ మేమియులేదు, (కామమువలన జగత్తంతయు నేర్పడినది కావున కామవాసనలతోనే కర్మల నాచరింపవలయునని వారి తాత్పర్యము.)

తా : వారీ జగత్తును సత్యము కాదందురు. దీని యునికి నంగీకరింపరు ఇది యీశ్వర సృష్టియని కాని, దీని కాధార మున్నదని కాని అంగీకరింపరు. పరమాణువు లనేకము లొకదానితో నొకటి చేర్చుటచే నేర్పడిన దనియు నెంచరు. ఇయ్యది కామహేతువు. కావున కామములను దీర్చుకొనుట దక్క వేఱొండు ప్రయోజనము లేదందురు.

ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః
ప్రభవం త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః. 9

నష్టాత్మానః - భ్రాంతులైనవారు, అల్పబుద్ధయః - స్వల్పబుద్ధులు, ఉగ్రకర్మాణః క్రూరకర్మల నొనర్చువారు, జగతః అహితాః - జగత్తునకు కీడుచేయువారు నగు వీరు, ఏతాం దృష్టిం అవష్టభ్య - ఇట్టి మతము నవలంబించి, క్షయాయ భవంతి - సర్వనాశము చేయుదురు.

తా : అసుర సంపదగలవారు పై జెప్పిన దృష్టితో భ్రాంతులై యల్పబుద్ధితో భయంకర కృత్యముల నాచరించుచు జగత్తున కపకారము చేయుదురు. లోక నాశమున కై యత్నింతురు.

కామమాశ్రిత్య దుష్పూరం దంభమాన మదాన్వితాః
మోహాద్ గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః. 10

దంభమానమదాన్వితాః - కపటము, అభిమానము, మదము వీనితో, కూడినవారు, అశుచివ్రతాః-అపవిత్రతయే వ్రతముగా గలవారు, దుష్పూరం కామం ఆశ్రిత్య - అంతులేనియాశతోకూడి, మోహాత్ - భ్రాంతివలన అసద్ గ్రాహాన్ గృహీత్వా - చెడు ఆలోచనలను గ్రహించి, ప్రవర్తంతే- వర్తింతురు.

తా . కపటము, అహంకారము, మదముతో గూడిన వారై యెన్నడును బూర్ణముకాని కామము గలిగి, భ్రాంతితో దురాలోచనలు చేయుచు నుందురు. అసత్యము, చౌర్యము మున్నగు నపవిత్ర కార్యములు వారికి వ్రతములవలె నాచరణీయములు.

చింతా మపరిమేయాం చ ప్రలయాంతా ముపాశ్రితాః
కామోపభోగపరమా ఏతావ దితి నిశ్చితాః. 11

ప్రలయాంతాం - సర్వనాశకరమును, అపరిమేయాం - ఊహింప జాల నట్టిదియును నగు, చింతాం - చింతను, ఉపాశ్రితాః - పొందినవారై, కామోపభోగపరమాః - కామవాసనల ననుభవించుటయే యుత్తమమని యెంచుచు, ఏతావదితి నిశ్చితాః - ఇంతకు మించి, మఱియొండు తత్త్వము లే దనుకొందురు.

తా : ఆసుర ప్రకృతి గలవారు విషయ సుఖముల ననుభవించుటయే పరమావధిగా భావింతురు. అంతకు మించిన శ్రేయస్సు వారికుండదు. ఊహింప నలవికాని నాశకరమగు నాలోచనముతో గూడియుందురు.

ఆశాపాశ శతైర్ బద్ధాః కామక్రోధ పరాయణాః
ఈహంతే కామభోగార్థం అన్యాయే నార్థసంచయాన్. 12

ఆశాపాశ శతైః బద్ధాః - వందలాది ఆశలనెడి త్రాళ్ళతో కట్టబడి, కామక్రోధ పరాయణాః-కామక్రోధములందు తగుల్కొని, కామభోగార్థం - విషయముల ననుభవించుటకు గాను, అన్యాయేన - నీతి రహితముగ, అర్థ సంచయాన్ - ధనరాసులను, ఈహంతే - కోరుదురు.

తా : ఇంకను వా రనేకములగు నాశాపాశములతో బంధింపబడి యుందురు. కామక్రోధములందు లగ్నులై యుందురు. వైషయిక భోగముల ననుభవించుట కన్యాయ మార్గమున నర్థ సంచయము చేయ యత్నింతురు.

ఇద మద్య మయా లబ్ధం ఇదం ప్రాప్స్యే మనోరథం
ఇద మస్తీద మపి మే భవిష్యతి పున ర్ధనమ్. 13

అద్య - నేడు, మయా-నాచేత, ఇదం లబ్ధం - ఇది పొందబడినది, ఇదం మనోరథం ప్రాప్స్యే - ఈ కోరికను పొందుదును, ఇదం అస్తి - ఇది యున్నది, పునః ఇదం ధనం అపి - ఈ ధనముకూడ. మే - నాకు, భవిష్యతి - లభింపగలదు.

తా : 'నే డిది సంపాదించితిని. రేపు దానిని సంపాదింతును. ఇది యున్నది. ఇంకను నది కావలసి యున్నది.' అని స్వార్థచింతన చేయుదురు.

అసౌ మయా హతః శత్రుః హనిష్యే చాపరా నపి
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ. 14

అసౌశత్రుః మయా హతః - ఈ శత్రువు నాచే చంపబడినాడు, అపరాన్ అపి హనిష్యే - ఇతరులను కూడ చంపుదును, అహం ఈశ్వరః-నేనైశ్వర్యవంతుడను, అహం భోగీ - నేనుభోగిని, అహంసిద్ధః బలవాన్ సుఖీ - నేను సిద్ధుడను, బలవంతుడను, సుఖముగలవాడను.

తా : 'ఇదిగో యీశత్రువును జంపితిని. ఇంకను మిగిలిన వారిని జంపుదును. నేనే యీశ్వరుడను. నాకే భోగము లున్నవి. నేను సిద్ధుడను; బలవంతుడను. సుఖములు నాకే కలుగును.' అని వారు తలపోయుచుందురు.

ఆఢ్యోఽభిజనవా నస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇ త్యజ్ఞానవిమోహితాః. 15

ఆఢ్యః అభిజనవాన్ అస్మి - (నేను) ధనవంతుడను కులీనుడను, మయా సదృశః అన్యః కః అస్తి - నాతో సమానుడు ఇంకొకడు ఎవ డున్నాడు? యక్ష్యే దాస్యామి మోదిష్యే - యజ్ఞము చేయుదును, దానమియ్యగలను, ఆనందింపగలను. ఇతి, అజ్ఞాన విమోహితాః - అని యజ్ఞానముచే భ్రాంతులై - మూఢులై.

తా : 'నేను ధనవంతుడను; కులీనుడను. నే నసమానుడను. యజ్ఞముల నాచరింపగలను.' అని యసురుడు జ్ఞానహీనుడై భ్రాంతుడగును.

అనేక చిత్త విభ్రాంతాః మోహజాల సమావృతాః
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ. 16

అనేక చిత్త విభ్రాంతాః - అనేకములైన ఆలోచనములతో భ్రాంతులై, మోహజాల సమావృతాః - భ్రాంతియనెడి వలలో చిక్కుకొని, కామభోగేషు ప్రసక్తాః - విషయ వాసనలలో రతులై, (వీరు) అశుచౌ నరకే పతంతి - అపవిత్రమైన నరకములో బడుదురు.

తా : ఇంతేకాక యాసుర సంపదగలవారు నానావిధములగు నాలోచనలతో భ్రాంతులై కామములను దీర్చుకొనుటలో దత్పరులై దుఃఖముల పాలగుదురు.

ఆత్మసంభావితాః స్తబ్ధాః ధనమానమదాన్వితాః
యజంతే నామయజ్ఞైస్తే దంభే నావిధిపూర్వకమ్. 17

ఆత్మ సంభావితాః - తమ గొప్పతనమును తామే చెప్పుకొనువారు, స్తబ్ధాః - గర్వితులు, ధన మాన మదాన్వితాః - ధనము, అభిమానము మదము ననువానితోకూడినవారునై, తే-వారు, దంభేన - ఆడంబరముతో, కపటముతో, నామయజ్ఞైః - పేరుకుమాత్రము యజ్ఞములనబడు క్రియలతో, అవిధిపూర్వకమ్-విధులు లేకుండగనే, యజంతే - యజ్ఞములు చేయుదురు.

తా : వారు తమ్ము దామే గొప్పవారుగా భావింతురు. గర్వితులై ధనమదముతో నితరులను వచింతురు. పేరుకు యజ్ఞము లనబడు క్రియలను విధిహీనముగ నాచరింతురు.

త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః
కామః క్రోధ స్తథా లోభః తస్మాదేత త్త్రయం త్యజేత్. 18

కామః క్రోధః తథా లోభః - కామము, క్రోధము, లోభమను నీమూడును, నరకస్య - నరకమునకు, త్రివిధం ఇదం ద్వారమ్ - ముప్విధములయిన ద్వారములు, ఆత్మనః నాశనం-తన్ను నశింపజేయునది. తస్మాత్ ఏతత్ త్రయం త్యజేత్ - అందువలన నీమూటిని, త్యజియింపవలయును.

తా : ఆత్మనాశమునకు, దుఃఖములకు మూడు ద్వారములు-కారణములు. 1. కామము 2 క్రోధము 3. లోభము. కావున నీ మూడింటిని వదలవలయును.

ఏతైర్ విముక్తః కౌంతేయ ! తమో ద్వారై స్త్రిభిర్ నరః
ఆచర త్యాత్మనః శ్రేయః తతో యాతి పరాం గతిమ్. 19

కౌంతేయ!, నరః - మనుజుడు, ఏభిః త్రిభిః తమోద్వారైః విముక్తః - ఈ ముప్విధములైన తమోగుణమునకు ద్వారములైన వాని నుండిః విముక్తః - విడివడినవాడై, ఆత్మనః - తనకు, శ్రేయః - మేలు,

ఆచరతి - ఆచరించును, తతః - అంతట, పరాం గతిం - పరమగతిని, యాతి - పొందును

తా : కావున నో కౌంతేయ ! తమోగుణమువలన గలుగు నీ కామక్రోధ లోభములను విడిచి, ఆత్మశ్రేయస్సు కొఱకు యత్నించి మనుజుడు పరమపదము నందును.

యః శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్. 20

యః - ఎవడు, శాస్త్రవిధిం ఉత్సృజ్య - శాస్త్రమున 'చెప్పబడిన విధిని (ఆజ్ఞను) విడిచి, కామకారతః వర్తతే - తన కోరికకు అనుకూలముగ వర్తించునో, సః - అతడు, సిద్ధిం న అవాప్నోతి - సిద్ధిని పొందడు, సుఖం న - సుఖమును బొందడు, పరాం గతిం న - పరమ గతినికూడ బొందడు..

తా : శాస్త్రవిధి విడిచి తన యిష్టము ననుసరించువాడు సిద్ధిని బొందడు. మోక్షసుఖ మతనికి లభింపదు.

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి. 21

తస్మాత్ - కావున, కార్యాకార్య వ్యవస్థితౌ - కర్తవ్యాకర్తవ్య నిర్ణయ విషయమున, తే - నీకు, శాస్త్రం ప్రమాణం-శాస్త్రము ప్రమాణము, జ్ఞాత్వా - ఈ విషయము నెఱిగి, శాస్త్ర విధానోక్తం కర్మ-శాస్త్రమున చెప్పబడిన కర్మ, ఇహ - ఈ లోకమున, కర్తుం అర్హసి - చేయదగియున్నావు.

తా : కాబట్టి అర్జున ! కార్యాకార్యములను నిర్ణయించుటలో శాస్త్రము ప్రమాణముగా నెంచుము. శాస్త్ర విధి నెఱిగి కర్తవ్యము నాచరించుటయే నీకు దగును.

షోడశాధ్యాయము సమాప్తము.



# శ్రీమద్భగవద్గీత

## సప్తదశాధ్యాయము

# విజ్ఞానయోగము

## (గుణ నిష్ఠ)

సారము - సంగతి :

పదునాఱవ యధ్యాయమున కృష్ణుడు అర్జుననకు సత్వగుణ ప్రధానమగు దైవీసంపద కధికారియగు వ్యక్తినిగూర్చి చెప్పుచు దైవీసంపదను, ఆసురీసంపదను వర్ణించియున్నాడు. అర్జునుడు క్షత్రియుడు. అతనియందు రజోగుణము ప్రధానముగ నుండవలసి యుండెను. కాని కృష్ణుడర్జునుని స్థితిని తెలిసికొనెను. రాజ్యమును తృణముగ నెంచి దానిని త్యజించు భావమును ప్రకటించుటయె తడవుగ కృష్ణుడర్జునుని భావమును గ్రహియించెను. అతనిలో సత్వగుణము జ్యోతివలె ప్రకటించుటను జూచెను. రాజ్యలక్ష్మిని కాలదన్నగలవానికి కర్మఫలమును త్యజించుట కఠినము కాదని యతడు గ్రహియించెను. అందువలననే కృష్ణుడర్జునుని దైవీసంపదకు - సత్వనిష్ఠకు అధికారి యని నుడివెను.

ఈ యధ్యాయమున నర్జునుడు కృష్ణుని 'మహారాజ ! శాస్త్రవిధిని విడిచి శ్రద్ధతో యజ్ఞము నొనర్చువానికి సాత్విక, రాజసిక, తామసిక నిష్ఠలలో నెయ్యది కలుగును?' అని యడిగెను. దానికి సమాధానముగ కృష్ణుడర్జునునికి సత్వనిష్ఠ యేర్పడగల మార్గమున నడుచుటకు వీలగునట్లు ఆనిష్ఠకు సంబంధించిన వ్యవహారముల నన్నింటి ప్రదర్శింపజేసినాడు.

'అర్జున! శ్రద్ధ యనునది మనుజుని యంతఃకరణగుణముల నవలంబించి యుండును. పూజ, ఆహారము, యజ్ఞము, తపస్సు, దానమాచరించుట అను వానిని చూచి సులభముగ సాత్వికశ్రద్ధ గుర్తింపనగును.'

సాత్వికులు యజ్ఞముతో దేవతలను, రజోగుణము కలవారు యక్షులను, రాక్షసులను, తమోగుణులు భూతములను, ప్రేతములను బూజింతురు. ఆయువు బలారోగ్యములు సుఖము వృద్ధిజేయునట్టియు, రసవంతము, స్నిగ్ధము, హృదయమునకు హితము కలిగించునదియు, బలము నిచ్చునట్టిదియునగు భోజనము సాత్వికులకు ప్రియకరము. పులుపు, కారము, ఉప్పు, కలిసినట్టియు, మిక్కిలి వేడి గలిగినట్టియు, రూక్షము, తీక్షము, దాహము, దుఃఖము, శోకము కలిగించునట్టియు భోజనము రజోగుణులకు ప్రియమగును. ఎప్పుడో చేసి నిలువయుంచినట్టియు, నీరస మైనట్టియు, పాచిపోయినట్టియు, బుద్ధినాశకము నైన భోజనము తమో గుణులకు ప్రియకరమగును.

ఫలాకాంక్షను విడిచి విధిపూర్వకముగ జేయు యజ్ఞము సాత్విక మగును. విధి ననుసరింపక పాషండముగ జేయు యజ్ఞము రాజసమగును. విధి, దక్షిణ, శ్రద్ధయేమియు లేక చేయునది తామసిక మగును.

దేవతలకు బ్రాహ్మణులకు విద్వాంసులకు గురువులకు సలుపు సత్కారము, బ్రహ్మచర్యము, అహింస యనునవి శారీరిక తపస్సులు. ఉత్తేజమును కలిగింపక ప్రియకరములైన హితమును కలిగించు సత్య వచనములు, స్వాధ్యాయాభ్యాసము వాక్తపస్సు, మానసిక ప్రసన్నత, శాంతి, మితభాషణము, ఆత్మసంయమము, భావసంశుద్ధి మానసికతపస్సు.

ఈ ముప్విధములగు తపస్సుకూడ ఫలము నపేక్షింపక శ్రద్ధతో చేసిన సాత్వికము లగును. సత్కారము పొందుటకు, పూజకొఱకు పాషండముగ చేయబడినచో రాజసికము లగును. ఇతరులకు కష్టము కలిగించుటకో లేక మూర్ఖతవలన తనకే నష్టము కలిగించుటకో విధి ననుసరింపక చేయబడినచో తామసికము లగును.

తన కుపకారము చేయనివానికి దేశకాల పాత్రతలను బాగుగ నెఱింగి శ్రద్ధాభక్తులతో చేయు దానము సాత్వికము. ఫలాపేక్షతో తన

కుపకారము చేయువానికి దుఃఖపడుచు నిచ్చు దానము రాజసికము. దేశ కాల పాత్రతల మంచిని చూడకయే అవమాన పూర్వకముగ జేయు దానము తామసిక మగును.

ఓం, తత్, సత్ అను మూడుపదములు బ్రహ్మమునకు నామములు, కావున ప్రతి శుభకార్యారంభము నందును ఓం ఉచ్చరింపబడును. తత్ పదవాచ్యుడగు భగవానునిచే నిర్దిష్టమైన విధి ననుసరించి, ఫలకామన విడిచి శ్రద్ధతో సత్ బుద్ధితో యజ్ఞము, తపస్సు, దానము మున్నగు శుభ కర్మల నొనరింపవలయును.

యే శాస్త్రవిధి ముత్సృజ్య యజంతే శ్రద్ధయాన్వితాః
తేషాం నిష్ఠా తు కా కృష్ణ ! సత్త్వ మాహో రజ స్తమః. 1

అర్జునుని ప్రశ్న : కృష్ణ ! యే - ఎవరు, శాస్త్రవిధిం ఉత్సృజ్య- శాస్త్రవిధిని విడిచి, శ్రద్ధయా అన్వితాః - శ్రద్ధతో కూడినవారై, యజంతే- యజ్ఞము చేయుదురో, తేషాం - వారి, నిష్ఠా - నిష్ఠ, కా - ఏమగును ? సత్త్వం ఆహో రజః తమః - సత్త్వమా ? లేక రజస్సా ? తమస్సా ?

తా : శాస్త్రవిధి ననుసరింపక శ్రద్ధతో యజ్ఞము నాచరించువారికి సత్త్వరజస్తమస్సులలో దేనియందు నిష్ఠ కలుగునో కృష్ణ ! చెప్పుదువుగాక ! యని అర్జును డడుగగా కృష్ణు డిట్లు చెప్పుచున్నాడు.

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు. 2

కృష్ణుని సమాధానము : దేహినాం - శరీరధారులకు, స్వభావజా - స్వభావమువలన కలిగిన, సా శ్రద్ధా - ఆ శ్రద్ధ, సాత్త్వికీ రాజసీ తామసీ -

సాత్వికము, రాజసము, తామసము అని, త్రివిధా ఏవ భవతి - ముప్విధ ములే కలుగును, తాం శృణు - దానిని వినుము.

తా : అర్జున ! మనుజులలో నుండు శ్రద్ధ సాత్వికము, రాజసికము, తామసికము నని ముప్విధములుగా నుండును.

సత్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత ।
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధః స ఏవ సః. 3

భారత ! అర్జున ! సర్వస్య శ్రద్ధా - అందఱిశ్రద్ధ, సత్వానురూపా భవతి - అంతఃకరణస్థితి ననుసరించియుండును. అయం పురుషః - ఈ మనుజుడు, శ్రద్ధామయః - శ్రద్ధామూర్తి, యః యచ్ఛ్రద్ధః - ఎవడెట్టిశ్రద్ధ గలవాడో, సః సః ఏవ - అత డట్టివాడే.

తా : భారత ! అందఱి యందును శ్రద్ధ యనునది వారి యంతఃకరణమున కనురూపముగ నుండును. జీవుడు శ్రద్ధా మయుడు. సాత్వికరాజసికతామసిక శ్రద్ధలలో నెవడెట్టి శ్రద్ధకలవాడుగ నుండునో యత డట్టివా డగును.

యజంతే సాత్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః
ప్రేతాన్ భూతగణాం శ్చాన్యే యజన్తే తామసా జనాః. 4

సాత్వికాః - సాత్వికులు, దేవాన్ - దేవతలను, రాజసాః - రజో గుణులు, యక్షరక్షాంసి - యక్షులను, రాక్షసులను, యజంతే - పూజింతురు, అన్యే తామసాః జనాః - ఇతర తామసికులైన జనులు, ప్రేతాన్ భూతగణాన్ - ప్రేతలను, భూతగణములను, యజంతే - భజింతురు.

(అంతఃకరణమున సత్వగుణము మిక్కిలిగా నుండువారు విద్వాంసులు జ్ఞానులగుదురు. కావున వారు దేవతలను - జ్ఞానులను, భగవంతుని దివ్యశక్తులను పూజింతురు. రజోగుణ మంతఃకరణమున ప్రధానముగ

గల వారు క్రూరస్వభావము కలిగియుందురు. కావున క్రూరస్వభావముగల ప్రాణులను - యక్షులను - రాక్షసులను సత్కరింతురు. తమోగుణ మంతఃకరణమున నెక్కుడుగ నుండువారు అజ్ఞాను లగుదురు. వారికి చనిపోయిన వారియందు విశ్వాసముండును. కావున వారు (ప్రేతలను, భూతములను (వాస్తవముగ లేనివానిని) విశ్వసింతురు. వానినేపూజింతురు.)

తా : సాత్త్విక శ్రద్ధ గలవారు విద్వాంసులను సేవింతురు. రాజసికులు యక్షులను రాక్షసులను గొలుతురు. తామసిక శ్రద్ధకలవారు ప్రేతలను భూతములను సేవింతురు.

(దేవతలు, రాక్షసులు, యక్షులు, ననువారు మానవులే. విద్వాంసులు, జ్ఞానులు దేవత లనబడుదురు. దుష్కృత్యముల నొనర్చువారు రాక్షసులు గానము, నటన మున్నగు కళలను నేర్చి బ్రతుకువారు యక్షులు. ఇక ప్రేతపదము చనిపోయిన వ్యక్తికి వాడబడును. భూతపదము పృథివ్యాది జడపదార్థములను దెలుపును.)

ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు. 5

సర్వస్య, ఆహారః, తు, అపి - అందఱికి ఆహారముకూడ, త్రివిధః- ముప్విధములయినది, ప్రియః-రుచికరము, భవతి - అగును, తథా- అట్లే, యజ్ఞః తపః దానమ్ - యజ్ఞము, తపస్సు, దానము ప్రియమగును, తేషాం ఇమం భేదం - వాని యీ భేదమును, శృణు - వినుము.

తా : ప్రాణులు భుజించు నాహారముకూడ ముప్విధములుగ నుండును. అట్లే యజ్ఞము, తపస్సు, దానముకూడ ముప్విధముల వ్యవహరింపబడును. వాని భేదములను జెప్పెద వినుము.

ఆయుః సత్వబలారోగ్య సుఖ ప్రీతి వివర్ధనాః
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్విక ప్రియాః. 8

ఆయుః .. వివర్ధనాః - ఆయువు, సత్వగుణము, బలము, నీరోగత, సుఖము, ప్రేమ వీనిని పెంచునట్టియు, రస్యాః - రసవంతములు, స్నిగ్ధాః- తైలయుక్తములు, స్థిరాః - ఎక్కువకాల ముంచిన చెడనివియు, హృద్యాః- హృదయమునకు ఇంపగునవియు. ఆహారాః - ఆహారములు, సాత్విక ప్రియాః - సాత్వికులకు ఇంపగును.

తా : ఆయువు సత్వగుణము బలము ఆరోగ్యము సుఖము ప్రీతి యనువానిని బెంచునట్టివియు, రసవంతములు, తైలయుక్తములు, ఎక్కువకాలము చెడకుండ నుండునట్టివియు, హృదయమున కింపుగొలుపునవియు నగు పదార్థములు సాత్వికులకు బ్రియకరములగును. అట్టివి వారు సేవింతురు.

కట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః
ఆహారా రాజస స్యేష్టా దుఃఖశోకామయప్రదాః. 7

కట్వామ్ల.... విదాహినః - కారము. పులుపు, ఉప్పు, ఎక్కువవేడి, తీక్ష్ణత, రూక్షత గలిగించునట్టియు, కడుపులో మంట గలిగించునట్టియు, దుఃఖ.... ప్రదాః - కష్టము, శోకము, రోగము కల్గించునట్టియు, ఆహారాః- పదార్థములు, రాజస స్యేష్టాః - రజోగుణము కలవారికి ఇంపగును.

తా : కారము పులుపు ఉప్పు గల పదార్థములు, ఎక్కువ వేడిగా నుండు వస్తువులు, తీక్ష్ణముగాను రూక్షము గాను నుండునవియు, ఉదరమున మంట బుట్టించునవియు రాజసికుల కింపుగానుండును. ఇవి వ్యాధికారకములై దుఃఖ దాయకము లగును.

యాతయామం గతరసం పూతిపర్యుషితం చ యత్
ఉచ్ఛిష్ట మపి చామేధ్యం భోజనం తామస ప్రియమ్. 8

యాతయామం - నిల్వయుంచిన, గతరసం - రసరహితము, పూతి పర్యుషితం - దుర్గంధము కూడి పాసిపోయిన, ఉచ్ఛిష్టం - ఎంగిలిచేసిన, అమేధ్యం - అపవిత్రమైన - బుద్ధినాశకమైన, భోజనం - ఆహారము, తామసప్రియమ్ - తమోగుణులకు ప్రియకర మగును.

తా : ఎన్నడో పక్వముచేసి యుంచినట్టివియు, రసము లేనివియు, పాసిపోయి దుర్గంధముతో గూడినవియు, ఎంగిలి పదార్థములు, అపవిత్రములునైన ఆహారవస్తువులు తమో గుణము కలవారికి రుచికరములగును.

అఫలా కాంక్షిభిర్ యజ్ఞో విధి దృష్టో య ఇజ్యతే
యష్టవ్య మే వేతి మనః సమాధాయ స సాత్వికః. 9

అఫలాకాంక్షిభిః - ఫలమును గోరనివారిచే, యష్టవ్యమ్ ఏవ - యజ్ఞము చేయవలసినదే, ఫలము కోరరాదు. ఇతి మనః సమాధాయ - అని మనస్సును ఏకాగ్రము చేసికొని, విధి దృష్టః - విధి ప్రకారము, యః ఇజ్యతే - యే యజ్ఞము చేయబడునో, సః - ఆ యజ్ఞము, సాత్వికః - సాత్విక మగును.

తా : ఫలము నపేక్షింపనివారు విధిపూర్వకముగ కర్తవ్యమని యెంచి చేయు యజ్ఞము సాత్విక యజ్ఞమగును.

అభిసంధాయ తు ఫలం దంభార్థ మపి చైవ యత్
ఇజ్యతే భరతశ్రేష్ఠ ! తం యజ్ఞం విద్ధి రాజసమ్. 10

భరత శ్రేష్ఠ ! - అర్జున!, ఫలం తు అభిసంధాయ - ఫలమును ధ్యానమున నుంచుకొని. దంభార్థం అపి చ ఏవ - దంభం కొఱకే, యత్

ఇజ్యతే - ఏది చేయబడునో, తత్ యజ్ఞం - ఆ యజ్ఞము, రాజసం విద్ధి - రజోగుణము గలిగినదిగా నెంచుము.

తా : అర్జున ! ఫలము నపేక్షించికాని, దంభముకొఱకు గాని చేయుయజ్ఞము రాజసమగును.

విధిహీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణమ్
శ్రద్ధా విరహితం యజ్ఞం తామసం పరిచక్షతే. 11

విధి హీనం - విధి రహితము, అసృష్టాన్నం - అన్నదానము చేయని, మంత్రహీనం - మంత్ర రహితము, అదక్షిణం - దక్షిణలేని, శ్రద్ధా విరహితం - శ్రద్ధ లేనిదియునైన, యజ్ఞం - యజ్ఞము, తామసః - తమోగుణ యుక్తమని, పరిచక్షతే - చెప్పబడును.

తా : శాస్త్రవిధి ననుసరింపక మంత్ర వర్జితముగ నశ్రద్ధతో, అన్నదానము చేయక, దక్షిణ నియ్యక చేయు యజ్ఞము తామసిక యజ్ఞమగును.

దేవద్విజగురు ప్రాజ్ఞపూజనం శౌచ మార్జవమ్
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే. 12

దేవ.... పూజనం - విద్వాంసులు, బ్రాహ్మణులు, గురువులు, బుద్ధిమంతులు నైన వారి సత్కారము, శౌచం - శుద్ధి, ఆర్జవం - సరలత, బ్రహ్మచర్యం, అహింసా చ - బ్రహ్మచర్యము అహింసయు, శారీరం తపః ఉచ్యతే - శరీరమునకు చెందిన తపస్సనబడును.

తా : విద్వాంసులకు, బ్రాహ్మణులకు, గురువులకు, బుద్ధిమంతులకు జేయు పూజనము, శుచిగాను సరళముగాను నుండుట, బ్రహ్మచర్యమును అహింసను పాటించుట ఇవి యన్నియు శారీరిక తపస్సులు.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే. 13

యత్ అనుద్వేగకరం వాక్యం - ఏది భయము కలిగింపనివాక్యమో అదియు, సత్యం ప్రియం హితం చ - యథార్థము ప్రేమయుక్తము హితమును కలిగించునదియు, స్వాధ్యాయాభ్యసనం చ ఏవ - వేదాధ్యయన మభ్యసించుటయు, వాక్మయం తపః ఉచ్యతే - వాక్కునకు చెందిన తప స్సనబడును.

తా : ఇతరులకు కలవరము కలుగకుండునట్లు మాట లాడుట, సత్యముచెప్పుట, ప్రియము హితము కలుగునట్లు పలుకుట, వేదాధ్యయనము సచ్ఛాస్త్రములను పఠించుట, అధ్యాపనము చేయుట యనున వన్నియు వాక్తప స్సగును.

మనః ప్రసాదః సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః
భావసంశుద్ధి రి త్యేత త్తపో మానస ముచ్యతే. 14

మనః ప్రసాదః - మనోనిర్మలత, సౌమ్యత్వం - శాంతి, మౌనం - మితభాషిత, ఆత్మ వినిగ్రహః - ఆత్మసంయమము, భావ సంశుద్ధిః - విచార పవిత్రత, ఇతి ఏతత్ - అనునది యంతయు, మానసం తపః ఉచ్యతే - మానసికతప మనబడును.

తా : మనఃప్రసన్నత, సౌమ్యభావము, మితముగాభాషించుట, మనస్సును వశమున నుంచుకొనుట, శుద్ధభావన గలిగి యుండుట మానసిక తపస్సు.

శ్రద్ధయా పరయా తప్తం తప స్త త్త్రివిధం నరైః
అఫలాకాంక్షిభిర్ యుక్తైః సాత్త్వికం పరిచక్షతే. 15

అఫలాకాంక్షిభిః - ఫలమును కోరనట్టి, యుక్తైః - యోగయుక్తులైన, నరైః-మనుజులచే. పరయా శ్రద్ధయా తప్తం-పరమశ్రద్ధతో చేయబడిన, తత్ త్రివిధం తపః - ఆ ముప్విధములయిన తపస్సు, సాత్వికం పరిచక్షతే - సాత్వికమనబడును.

తా : మిక్కిలి శ్రద్ధతో నొనర్చు తపస్సుకూడ ముప్విధములుగ నుండును. ఫలముగోరక కర్మయోగము నభ్యసించు నరులు చేయుతపస్సు సాత్వికము.

సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్. 18

యత్ తపః - ఏతపస్సు, సత్కారమానపూజార్థం - ఆదరణకొఱకు మర్యాదకొఱకు సత్కారముకొఱకు, దంభేన క్రియతే చ ఏవ - కపటముతోనే చేయబడునో, తత్ ఇహ - ఆతపస్సు ఈలోకమున, రాజసం చలం అధ్రువం - రాజసము నశించునది స్థిరముగానిదిగ చెప్పబడును.

తా : ఆదరణ, మర్యాద, పూజలు పొందుటకు కపటవృత్తితో జేయు నస్థిరతపస్సు రాజసము.

మూఢగ్రాహేణాత్మనో యత్ పీడయా క్రియతే తపః
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్. 17

యత్ తపః - ఏతపస్సు, మూఢగ్రాహేణ - మూర్ఖతతో, ఆత్మనః పీడయా - తనకు దుఃఖముకలిగించు పద్ధతితో, వా పరస్య ఉత్సాదనార్థం - లేక ఇతరుల నాశముకొఱకు, క్రియతే - చేయబడునో, తత్ తామసం ఉదాహృతమ్ - అది తామసిక తప స్సనబడును.

తా : మూర్ఖతతో దన శరీరమునకు బాధకలిగించుకొనుచు జేయునదియు, పరుల నాశముగోరి చేయునదియునైన తపస్సు తామసము.

దాతవ్య మితి యద్దానం దీయతేఽనుపకారిణే
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్వికం స్మృతమ్. 18

యత్ దానం - ఏదానము, అనుపకారిణే - తన కుపకారముచేయని వానికి, దాతవ్యం ఇతి - ఇయ్యదగిన బుద్ధితో, దేశే కాలే పాత్రే చ - దేశకాల పాత్రములను మంచివిగా నెఱిగి, దీయతే - ఇయ్యబడునో, తత్ దానం సాత్వికం స్మృతమ్ - ఆదానము సాత్వికమని చెప్పబడినది.

తా : దేశకాల పాత్రలను గుర్తించి, తన కుపకారము చేయనివానికి ప్రతిఫల మపేక్షింపక చేయుదానము సాత్వికము.

యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్. 19

యత్ తు - ఏ దానము, ప్రత్యుపకారార్థం - ప్రత్యుపకారముకొఱకు కాని, వా ఫలం ఉద్దిశ్య - లేక ఫలముకోరి కాని, పరిక్లిష్టం చ దీయతే - దుఃఖముతో నియ్యబడునో, తత్ దానం రాజసం స్మృతమ్ - ఆదానము రాజస మనబడును.

తా : ప్రతిఫలము గోరుచు, తన కుపకారము చేసిన వానికి ప్రత్యుపకారార్థము కష్టపడుచు నిచ్చు దానము రాజసికమగును.

అదేశకాలే యద్దానం అపాత్రేభ్యశ్చ దీయతే
అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతమ్. 20

యత్ దానం - ఏ దానము, అదేశ కాలే - దేశకాలముల మంచిని చూడక, అపాత్రేభ్యః చ - పాత్రులు కానివారికిని; అసత్కృతం అవజ్ఞాతం - సత్కరింపక తిరస్కరించుచు దీయతే - ఇయ్యబడునో, తత్ తామసం ఉదాహృతమ్ - అది తామస మనబడినది.

తా : దేశకాలములను, పాత్రతను గుర్తింపక సత్కార రహితముగ నయోగ్యులకు తిరస్కారముతో జేయు దానము తామసిక మగును.

ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్ త్రివిధః స్మృతః
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా. 21

ఓం తత్ సత్ ఇతి - ఓమ్ తత్తు సత్తుఅని, బ్రహ్మణః నిర్దేశః - బ్రహ్మనిర్దేశము (బ్రహ్మను చెప్పుటకు తగిన శబ్దములు), త్రివిధః-ముప్విధ ములుగ, స్మృతః - చెప్పబడినది, తేన - ఆ బ్రహ్మముచేత, పురా - సృష్టికి ఆరంభమున, బ్రాహ్మణాః వేదాః యజ్ఞాః చ - బ్రహ్మజ్ఞానులైన ఋషులు, వేదములు, యజ్ఞములు, విహితాః - సృష్టింపబడెను.

తా : 'ఓ౩మ్, తత్, సత్' అను మూడు పదములు బ్రహ్మతత్త్వమును నిర్దేశించుటకు దగినవి. సృష్టికి ఆరంభమున బ్రహ్మముచే బ్రహ్మజ్ఞులైన మునులు, వేదములు, వానియందు తెలియదగిన యజ్ఞములును సృష్టింపబడినవి.

తస్మా దోమిత్యుదాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః
ప్రవర్తంతే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్ 22

తస్మాత్ - కావున, బ్రహ్మవాదినాం - బ్రహ్మవాదుల, విధానోక్తాః- విధిశాస్త్రమున జెప్పబడిన, యజ్ఞ దాన తపఃక్రియాః - యజ్ఞ దాన తపః క్రియలు, ఓమ్ ఇతి ఉదాహృత్య - ఓమ్ అను పదము నుచ్చరించి, సతతం ప్రవర్తంతే - నిరంతరము నడుచును.

తా : కావుననే బ్రహ్మవాదులు చేయు వేదవిహితము లయిన యజ్ఞ దాన తపస్సులనెడి క్రియలన్నియు 'ఓ౩మ్' అను బ్రహ్మవాచకము నుచ్చరించియే ప్రారంభింపబడును.

తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞ తపః క్రియాః
దాన క్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః. 23

మోక్షకాంక్షిభిః - మోక్షము నభిలషించువారిచే, తత్ ఇతి - అది కర్తవ్యమని, ఫలం అనభిసంధాయ - ఫలమును లక్ష్యమున నుంచక, యజ్ఞ తపః క్రియాః - యజ్ఞము తపస్సు, వివిధాః దానక్రియాః చ - వివిధములైన దానక్రియలును, క్రియంతే - చేయబడును.

తా : మోక్షము నభిలషించు నరులు యజ్ఞ దాన తపఃక్రియలు ఫలము నపేక్షింపక తత్ పదమును ప్రారంభమున నుచ్చరించి యెల్లప్పుడు చేయుచుందురు.

సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ ః యుజ్యతే. 24

పార్థ - అర్జునః, సద్భావే సాధుభావే చ - సత్యమునందును, మేలునందును, సత్ ఇతి ఏతత్ ప్రయుజ్యతే - సత్ అను శబ్దము ప్రయోగింపబడును. తథా - అట్లే, ప్రశస్తే కర్మణి - ఉత్తమ కర్మమునందును, సత్ శబ్దః యుజ్యతే - 'సత్' అను శబ్దము జోడింపబడును.

తా : పార్థ ! సత్యవ్రతాదుల నాచరించు నపుడును, శ్రేయస్సును గోరునపుడును, ఉత్తమ కర్మల నాచరించు నపుడును సత్ పదము ప్రథమమున నుచ్చరింపబడును.

యజ్ఞే తపసి దానే చ స్థితిః స దితి చోచ్యతే
కర్మ చైవ తదర్థీయం స దిత్యే వాభిధీయతే. 25

యజ్ఞే తపసి దానే చ - యజ్ఞమునందును, తపోదానములందును, స్థితిః - ఉనికియు, సత్ ఇతి ఉచ్యతే - సత్తని చెప్పబడును, తదర్థీయం -

ఆ యజ్ఞాదులకొఱకు చేయబడు, కర్మ చ ఏవ - కర్మయును, సత్ ఇతి ఏవ - 'సత్' అను నామముతోనే, అభిధీయతే - చెప్పబడును.

తా. యజ్ఞ దాన తపః కర్మలలో నునికి, వానికొఱ కాచరించు కర్మయు సత్ పదముచే జెప్పబడును.

అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతం చ యత్
అసది త్యుచ్యతే పార్థ ! న చ తత్ ప్రేత్యనో ఇహ. 26

పార్థ ! - అర్జున!, అశ్రద్ధయా - శ్రద్ధ లేక, హుతం - వేల్చబడిన ఆహుతి, దత్తం - ఇయ్యబడిన దానము, తప్తం తపః - చేయబడిన తపస్సు, యత్ చ కృతమ్ - చేయబడిన కర్మయు, అసత్ ఇతి ఉచ్యతే - 'అసత్ అని చెప్పబడును, తత్ - అది, ప్రేత్య న చ - చచ్చిన తదుపరి ప్రయోజనకారి కాదు, చ న ఇహ - ఈ జన్మలోను లాభకారి కాదు.

తా : పార్థ ! అశ్రద్ధతో జేసిన యజ్ఞము, దానము, తపస్సు, కర్మలు అన్నియు 'అసత్' పదముచే కీర్తింపబడును. అట్టివి చేసినవానికి ఈ జన్మమునగాని, పరజన్మమునగాని మేలు కలిగింపవు.

సప్తదశాధ్యాయము సమాప్తము



# శ్రీమద్భగవద్గీత

## అష్టాదశాధ్యాయము

# విజ్ఞానయోగము

## (గుణ నిష్ఠ)

సారము - సంగతి :

సంన్యాసము, త్యాగము (కర్మయోగము) పూర్వమం వర్ణింపబడినవి. కర్మత్యాగము సంన్యాసమనియు, ఫలత్యాగమే త్యాగము (కర్మయోగము) అనియు అర్జునునకు బాగుగ వివరింపబడినది. అయినను ఇదియంతయు నెఱిగియు అర్జునుడు మరల నిట యీ విషయమును అడుగుచున్నాడు. అందువలన నిది పునరుక్తిగా దోచినను వాస్తవమున నట్లుకాదు. అర్జునుని ప్రశ్నకు భావము వేఱు. 'తత్త్వ మిచ్ఛామి వేదితుమ్' 'తత్త్వము నెఱుగ గోరుచున్నాను' అను నీ వాక్యము మూలమున నతని భావము స్పష్టమగు చున్నది. ఇది గుణనిష్ఠా ప్రకరణము. కావున నర్జునుడు గుణముల దృష్టితో సంన్యాసమును, యోగమును గూర్చి తెలిసికొన గోరియున్నాడు. తాను స్వయముగ కర్మయోగమున నే యంగమున కధికారియో తెలిసికొన గోరి యట్లు ప్రశ్నించినాడు. కృష్ణుడుకూడ నతని యభిప్రాయమును గుర్తించెను. ఆ దృష్టితోనే యీ యధ్యాయమున నత డర్జునుని ప్రశ్నకు సమాధానము చెప్పియున్నాడు. సంన్యాస, కర్మయోగముల లక్షణములను జెప్పి, తదుపరి యజ్ఞ, దాన, తపస్సులను గూర్చి యితర మహాత్ముల యభిప్రాయములను దెలుపుచు తన మతమును ప్రకటించి యున్నాడు. యజ్ఞ దాన తపస్సులు ఆత్మను పవిత్రము చేయునవి యనియు, వీని నెన్నడు విడువరాదనియు, ఆసక్తిని, ఫలవాంఛను విడిచి వీని నాచరింప వలయుననియు నతడు స్పష్ట శబ్దములతో చెప్పియున్నాడు.

వర్ణాశ్రమ ధర్మములు నియతములు. వాని త్యాగము బొత్తిగా పనికిరాదని కృష్ణుడు చెప్పియున్నాడు. తదుపరి యతడు గుణదృష్టితో త్యాగమును ముప్విధముల విభజించి యర్జునునకు త్యాగరహస్యమును బోధించెను.

"అర్జున ! భ్రాంతివలన నియతకర్మములను త్యజించుట తామస మగును. దుఃఖమని యెంచి, కాయక్లేశ భయముతో నియతకర్మలను విడుచుట రాజసిక మగును. కర్తవ్యములని యెంచి నియతకర్మలను చేయుచు, ఆసక్తిని, ఫలాకాంక్షను విడుచుట సాత్త్విక త్యాగ మగును. దేహధారి సమస్త కర్మల నెట్లు విడువ గలడు ? కావున నీ మూడవ త్యాగమే సత్యమైన త్యాగము. మనుజుడు తా నొక్కడే కర్మలకు కారణము కానందున నతడు వానిని విడువజాలడు. ప్రతి కర్మకు నైదు కారణములు తప్పక యుండును. యుద్ధమున నొక డొకని యురమున శస్త్రప్రహారము చేయు ననుకొనుడు. ఆ కర్మకు ప్రహారమును పొందినవా డొక కారణము. అతడు తనపై ప్రహారము చేయు వీరుని హృదయమును కలతపెట్టకున్న నత డా ప్రహారముల నేల చేయును ? ఈ కారణమును అధిష్ఠానకారణ మందురు. రెండవ కారణము ప్రహారము చేయువాడు. ఈ కారణము కర్త యనబడును. మూడవ కారణము ప్రహారము చేయు వాని యనేక చేష్టలు. ఆ చేష్టల కన్నింటికి కారణ మతని సంస్కారములు. ఆ సంస్కారము లున్నంతవఱకు నత డట్టి చేష్టలు చేయును. ధనుర్బాణాది ప్రహారసాధనములు నాలుగవ కారణము. ఇది కరణ మన బడును. అయిదవ కారణము భాగ్యము - అదృష్టము - దైవము. ఈ కారణములన్నియు నుండగా నొక కర్త తానెట్లు కర్మలను విడువగలడు?"

కృష్ణ డర్జునున కీ మాటలతో నీ క్రింది విషయమును తెలుప దలచినాడు. ఈ యుద్ధకర్మకు అధిష్ఠానకారణము దుర్యోధనుడు. అతడు కూడ పాండవులపై నొనర్చిన యత్యాచారములు కారణముగ నధిష్ఠాన

కారణమయినాడు. కావున నతని యత్యాచారముల చిత్రము అర్జునునికి గోచరింపగానే యతడు వివశుడై యుద్ధము చేయును.

తదుపరి కృష్ణుడు అర్జునునకు నతనియోగ్యత, అధికారము, లక్ష్యము గుర్తింపజేయుటకై గుణదృష్టితో జ్ఞానము, జ్ఞాత, జ్ఞేయము; కర్మ, కరణము, కర్త, బుద్ధి, సుఖము ననువానిని వివేచించి చెప్పెను.

ఈ వివేచనవలన, ప్రపంచములోని ప్రతి పదార్థమును గుణములను విడిచియుండ జాలదనియు ప్రకటించెను. కావుననే ప్రపంచములో ప్రతి కార్యమును మనుజుడు తన యంతఃకరణములోనుండు ప్రధాన గుణ సాహాయ్యముతోనే చేయగలుగును. ఏకార్యము నారంభించినను మనుజుడు తన యంతఃకరణములో ప్రధాన గుణమును - స్వభావమును గుర్తింప వలసినవాడగును. స్వభావ విరుద్ధమైనకర్మ నారంభించువా డెన్నడును నందు సఫలుడు కాడు.

ఈ విషయము నింకను స్పష్టపఱచుటకే కృష్ణుడు తరువాత వర్ణ వ్యవస్థను దిగ్దర్శనము చేసియున్నాడు. వర్ణములు, వాని కర్మలవ్యవస్థయు నతడు స్వభావముపై నాధారపడియున్న ట్లెంచియున్నాడు. ఇది గుణనిష్ఠా ప్రకరణము. అందువలన నిట నంతఃకరణముయొక్క ప్రధానగుణమును స్వభావమని నుడివియున్నాడు. కావుననే "బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రుల కర్మలు స్వభావగుణముల మూలమున విభక్తము చేయ బడినవి." (18-4.)

మనుష్యుడు తన పరిశ్రమమువలన ఈ త్రిగుణములలో నొకదానిని ప్రబలము చేసికొనగలడు. కావున నీ జన్మమున తన స్వభావమును మార్చుకొనగలడు. స్వభావము మాఱినందున వర్ణము మాఱుటలో నభ్యం తరముండదు. 'మనుజుడు నియతకర్మల నెన్నడు విడువజాలడు. కారణ మేమన, వానివ్యవస్థ స్వభావముపై నాధారపడియున్నది. స్వభావ మట్లు

ఉన్నంతవఱకు నత డా కర్మల నెట్లు విడువగలడు ?' అని కృష్ణుడు బాగుగ వివరించినాడు.

మనుజుని జీవనమునకు ప్రధానలక్ష్యము ఈశ్వరప్రాప్తి రూపమగు సిద్ధి. అది భగవానుని యుపాసనవలన లభించును. ఈశ్వరోపాసనకు ఉత్తమోపాయము స్వభావానుకూలమగు కర్తవ్య కర్మానుష్ఠానమే. అర్జున ! నీ స్వభావము క్షత్రియ వర్ణానుకూలము. ఇప్పుడు మోహావరణము నీకు యుద్ధము చేయవలదని పాఠము నేర్పుచున్నది, అది తొలగగానే వివశుడవై స్వభావానుకూలముగ యుద్ధముచేయవలసినవాడ వగుదువు. చివరకు మరల నేను జీవనముయొక్క యా మహోద్దేశ్యము పైపునకే నీ ధ్యానము నాకర్షించుచున్నాను. ప్రపంచచక్రమును నడుపుచు భగవంతుడు ప్రతిప్రాణి హృదయముననునివసించుచున్నాడు. నిజస్వభావానుకూలకర్మలనాచరించుచు పూర్ణముగ నతనినే శరణుజొచ్చుము. అతని కృపవలన నుత్తమశాంతిని, ఉత్తమపదమును పొందుదువు. ఈ యతిరహస్య జ్ఞాన (విజ్ఞాన) మును నీకు వినిపించితిని దీని నాలోచించి నీకు తోచినట్లు చేయుము. అర్జున ! నా మాటల నేకాగ్రచిత్తముతో వింటివా ? నీ భ్రమ దూరమైనదా ? అనికృష్ణుడడుగ-'మహారాజ! కృష్ణ! నీకృపవలన నా మోహము దూరమైనది. నా క్షాత్రధర్మము స్మరణకు వచ్చినది. ఇప్పుడు సంశయము లేదు. ఆజ్ఞను పాలింతును.' అని అర్జునుడు సమాధానము చెప్పెను.

సంన్యాసస్య మహాబాహో ! తత్త్వ మిచ్ఛామి వేదితుమ్
త్యాగస్య చ హృషీకేశ ! పృథక్కేశినిషూదన ! 1

మహాబాహో ! - గొప్ప బాహువులు గలవాడ ! కేశినిషూదన - కేశిని చంపిన కృష్ణ, సంన్యాసస్య త్యాగస్య చ - కర్మత్యాగముయొక్కయు, కర్మఫలత్యాగము యొక్కయు, తత్త్వం - (గుణదృష్టితో) సారమును, పృథక్ - వేఱువేఱుగ, వేదితుం ఇచ్ఛామి - తెలియగోరుచున్నాడ, అని యర్జునుడు ప్రశ్నించెను.

తా : దీర్ఘ బాహువులు గలిగిన కృష్ణ ! సంన్యాసతత్త్వము నెఱుగగోరుచున్నాడ. జితేంద్రియుడవు కేశివినాశకుడవు నగు నోకృష్ణ ! త్యాగమును గూర్చియు వేఱుగ జెప్పుదువుగాక ! అని యర్జునుడర్థింపగాకృష్ణు డీ క్రింది విధమున జెప్పుచున్నాడు.

కామ్యానాం కర్మణాం న్యాసం సంన్యాసం కవయో విదుః
సర్వకర్మ ఫల త్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః. 2

కృష్ణుని సమాధానము : విచక్షణాః కవయః - బుద్ధిమంతులగు విద్వాంసులు, కామ్యానాం కర్మణాం న్యాసం - కామ్యకర్మల త్యాగము, సంన్యాసం విదుః - సంన్యాసమని యందురు. సర్వ కర్మఫల త్యాగం - సమస్త కర్మల ఫలమును త్యజించుట, త్యాగం - త్యాగము - యోగము అని, ప్రాహుః - చెప్పుదురు.

తా : అర్జున ! కామ్యకర్మలు విడుచుటయే సంన్యాసమని విద్వాంసులు నుడువుదురు. ఫలాపేక్షను విడిచి కర్తవ్య కర్మల నన్నింటిని జేయుట త్యాగమని బుద్ధిమంతులందురు.

త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మప్రాహుర్ మనీషిణః
యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్య మితి చాపరే. 3

ఏకే మనీషిణః - కొందఱు బుద్ధిమంతులు, దోషవత్ కర్మ - దోషయుక్తమగు (కామనతో గూడిన) కర్మ, త్యాజ్యం - విడువదగినది. ఇతి ప్రాహుః - అని చెప్పుదురు. అపరే - ఇతర విద్వాంసులు, యజ్ఞ దాన తపః కర్మ - యజ్ఞము దానము తపస్సు అను కర్మలు, న త్యాజ్యమ్ - విడువదగినవి కావు, ఇతి - అని యందురు.

తా : కొందఱు మతిమంతులు దోషముతో గూడిన కర్మ - దుష్టకర్మ త్యజింప దగినది యని నుడువుదురు. మఱి

కొందఱు యజ్ఞము, దానము, తపస్సు నను కర్మలెన్నడును విడువదగినవి కావని యందురు. కర్మ లన్నియు విడుచుట త్యాగమని యెంచుట సరికాదనియు దుష్టకర్మలను త్యజించుటయే త్యాగమని కొందఱు బుద్ధిమంతులు చెప్పుదురు. ఇక సత్కర్మలందును యజ్ఞ దాన తపస్సులు కాక మిగిలిన కర్మలు త్యజించిన త్యజింపవచ్చును. కాని, యజ్ఞము దానము తపస్సు మాత్ర మెవ్వరును ద్యజింపరాదని యితరుల యభిప్రాయము.

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ :
త్యాగో హి పురుషవ్యాఘ్ర ! త్రివిధః సంప్రకీర్తితః. 4

భరతసత్తమ ! - భరతశ్రేష్ఠ ! అర్జున ! తత్ర త్యాగే - ఆ త్యాగ విషయమున, మే నిశ్చయం శృణు - నా నిశ్చయమును వినుము, పురుషవ్యాఘ్ర ! - పురుషశ్రేష్ఠ ! హి - నిశ్చయముగ, త్యాగః త్రివిధః సంప్రకీర్తితః - త్యాగము ముప్విధముల చెప్పబడినది.

తా : ఓ భరతశ్రేష్ఠ! అర్జున! త్యాగవిషయమున నెవ రెట్లు చెప్పినను నానిశ్చయము చెప్పెద వినుము. త్యాగమను నది యొక విధమని చెప్పవలనుపడదు. పురుషశ్రేష్ఠ! అర్జున ! ఆ త్యాగముకూడ ముప్విధములుగ నున్నది.

యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్. 5

యజ్ఞ దాన తపః కర్మ - యజ్ఞము దానము తపస్సు నను కర్మ, న త్యాజ్యం - త్యజింపదగినది కాదు, కార్యమేవ - చేయదగినదే, యజ్ఞః

దానం తపః చ ఏవ - యజ్ఞము దానము తపస్సును, మనీషిణాం పావనాని - బుద్ధిమంతులను పవిత్ర మొనర్చునవి.

తా : యజ్ఞము, దానము, తపస్సు ననుకర్మలు త్యజింపదగినవికావు. అవి యాచరింపదగినవియే యని నా (కృష్ణుని) మతము. ఆ కర్మలు బుద్ధిమంతులను బవిత్రము చేయును. మనీషు లాకర్మలను బవిత్రములుగా నెంచెదరు. ఫలాసక్తిలేక కర్మలాచరించువారిట మనీషు లనబడినట్లు గ్రహింపవలయును. యజ్ఞ దాన తపస్సులు కర్తవ్యములుగా నెంచి చేయువారికి అవి చిత్తశుద్ధిని గలిగించును. కావున నవి పావనములు - పవిత్రము చేయునవిగా వర్ణింపబడినవి.

ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ
కర్తవ్యా నీతి మే పార్థ ః నిశ్చితం మత ముత్తమమ్. 6

పార్థ ః ఏతాని కర్మాణి అపి తు - ఈ యజ్ఞాది కర్మలుకూడ, సంగం ఫలాని చ త్యక్త్వా - ఆసక్తిని, ఫలములను విడిచి, కర్తవ్యాని - చేయదగినవి, ఇతి మే నిశ్చితం ఉత్తమం మతమ్ - అని నా నిశ్చితము, ఉత్తమమునగు మతము.

తా : అర్జున! ఈ యజ్ఞ దాన తపస్సులుకూడ ఫలాసక్తి విడిచి కర్తవ్యబుద్ధితో జేయవలయునని నానిశ్చితాభిప్రాయము, ఇయ్యదియే యుత్తమ త్యాగము.

నియతస్య తు సంన్యాసః కర్మణో నోపపద్యతే
మోహా త్తస్య పరిత్యాగః తామసః పరికీర్తితః. 7

నియతస్య కర్మణః - నియతకర్మయొక్క, సంన్యాసః - త్యాగము, న ఉపపద్యతే - తగదు, మోహాత్ - భ్రాంతివలన, తస్య పరిత్యాగః - దాని త్యాగము, తామసః పరికీర్తితః - తామసమని చెప్పబడినది.

తా : నియతకర్మలు-నిత్యకర్మలు సంధ్యాగ్ని హోత్రాదులు. వానిని సంన్యసించుట తగదు. అవ్వి చిత్తశుద్ధి కలిగించును. కావున భ్రాంతితో వానిని త్యజించుట తామసమగును. అది బుద్ధిమంతుడు చేయుపని కాదని భావము.

దుఃఖ మిత్యేవ యత్ కర్మ కాయక్లేశభయాత్ త్యజేత్
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్. 8

దుఃఖమ్ ఇతి ఏవ - కఠినమని యెంచి, కాయక్లేశ భయాత్ - శరీరమునకు కష్టము కలుగునను భయముతో, యత్కర్మ - ఏ కర్మ, త్యజేత్ - వదలునో, సః - అతడు, రాజసం త్యాగం కృత్వా - రాజస త్యాగముచేసి, త్యాగఫలం న ఏవ లభేత్ - త్యాగఫలమును పొందనే పొందడు.

తా : కొండొక నిత్యకర్మ ఆచరించుట కష్టమని యెంచి భయపడి దానిని విడచు పక్షమున నా త్యాగము రాజసమనబడును. అందువలన త్యాగఫలము కూడ లభింపదు.

కార్య మిత్యేవ యత్ కర్మ నియతం క్రియతేఽర్జున ।
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగః సాత్త్వికో మతః. 9

అర్జున ! సంగం ఫలం చ త్యక్త్వా ఏవ - ఆసక్తిని, ఫలమును వదలి, యత్ నియతం కర్మ - ఏ నియతకర్మ, కార్యం ఇతి ఏవ క్రియతే - చేయదగినదియే యని చేయబడునో, సః త్యాగః - ఆ త్యాగము, సాత్త్వికః మతః - సాత్త్వికమని యెంచబడినది.

తా : ఇయ్యది క_ర్తవ్యము - చేయదగినది యని యెంచి నిత్యకర్మ చేయుచు ఆస_క్తిని, ఫలాపేక్షను విడుచునెడల నా త్యాగము సాత్వికమగును.

న ద్వే ష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే
త్యాగీ సత్వసమావిష్టో మేధావీ ఛిన్న సంశయః. 10

సత్వ సమావిష్టః - సత్వగుణపూర్ణుడై, ఛిన్నసంశయః - సంశయములు లేనివాడై, మేధావీ త్యాగీ - బుద్ధిమంతుడైనత్యాగి, అకుశలం కర్మ-దుఃఖదాయక కర్మను, న ద్వేష్టి - ద్వేషింపడు, కుశలే న అనుషజ్జతే - సుఖకారక కర్మలో అస_క్తుడును కాడు.

తా . సత్వగుణ సంపన్నుడై, సంశయములు లేనివాడై, బుద్ధిమంతుడైన త్యాగి దుఃఖదాయకమగు కర్మను ద్వేషింపడు. నిత్యకర్మలు స్నానసంధ్యాగ్నిహోత్రాదు లొకప్పుడు కష్టదాయకములైనను వానిని ద్వేషింపకయే యాచరించునని భావము. అట్లే సుఖము నొసంగు కర్మలు చేయును; కాని వానియం దాస_క్తుడును కాడు.

న హి దేహభృతా శక్యం త్య_క్తుం కర్మా ణ్యశేషతః
య_స్తు కర్మఫల త్యాగీ స త్యాగీ త్యభిధీయతే. 11

దేహభృతా - మనుజునిచే, అశేషతః కర్మాణి త్య_క్తుం న హి శక్యం - సంపూర్ణముగ కర్మలు త్యజింప శక్యము కాదు, యః తు కర్మ ఫలత్యాగీ - ఎవడు కర్మఫలము త్యజించునో, సః త్యాగీ ఇతి అభిధీయతే - అతడు త్యాగియని యనబడును.

తా : దేహధారియైన వా డెవడును కర్మల నన్నింటిని విడువ శ_క్తుడుకాడు. కావున సత్కర్మలు, నిత్యకర్మలు, నాచ

రించుచు వాని ఫలములను త్యజించువాడే త్యాగియని పిలువ బడును. దానింబట్టి కర్మసంన్యాసము త్యాగము కాదనియు బోధపడుచున్నది.

అనిష్ట మిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్
భవ త్యత్యాగినాం ప్రేత్య న తు సంన్యాసినాం క్వచిత్. 12

కర్మణః - కర్మకు, అనిష్టం ఇష్టం మిశ్రం చ - అనిష్టము ఇష్టము మిశ్రమమునని, త్రివిధం ఫలం - మువ్విధములైన ఫలము కలుగును, (అదియు) ప్రేత్య అత్యాగినాం భవతి - మరణించిన తదుపరి కర్మఫలమును విడువనివారికి కలుగును, సంన్యాసినాం తు క్వచిత్ న - కర్మఫలత్యాగులకు మాత్ర మది కలుగదు.

తా : కర్మఫలము అనిష్టము, ఇష్టము, మిశ్రమము నని మువ్విధములుగా నుండును. అనుభవించుటలో సుఖము నియ్యక తన కింపుగానిది యనిష్టము. సుఖమునిచ్చి యింపైన ఫలము ఇష్ట మనబడును. కొంత యనుకూలించి మఱికొంత యనుకూలింపనిచోనది మిశ్రమత్తు లమగును. మనుజుడు ఫలము నపేక్షించి కర్మలొనరించు నెడల నాకర్మఫలముల నత డనుభవించును. ఈ జన్మమునం దనుభవింపక మిగిలియున్న కర్మ ఫలములను జన్మాంతరమున నత డనుభవింపవలసి యుండును. కర్మఫలములను త్యజించి వాని నభిలషింపని సంన్యాసి యిహ పరములం దాకర్మఫలముల ననుభవింపడు. అనుభవించియు హర్ష శోకములకు లోనుగాక సమచిత్తుడై యుండునని భావము.

పంచైతాని మహాబాహో ! కారణాని నిబోధ మే
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్. 13

మహాబాహో ! - మహాభుజ!, సర్వకర్మణాం సిద్ధయే - సర్వ కర్మలు సిద్ధించుటకు, సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని - సాంఖ్య సిద్ధాంతమున చెప్పబడిన, ఏతాని పంచకారణాని - ఈ యైదుకారణములు, మే - నావలన, నిబోధ - తెలిసికొనుము.

తా : అర్జున ! ప్రతికర్మము సిద్ధించుట కైదు కారణము లావశ్యకములని సాంఖ్యశాస్త్రనిశ్చిత సిద్ధాంతము. ఆ కారణము లను వివరింతును; వినుము.

అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్ విధమ్
వివిధా శ్చ పృథక్ చేష్టా దైవం చైవాత్ర పంచమమ్. 14

అధిష్ఠానం - స్థానము, తథా - అట్లే, కర్తా - కర్మచేయువాఁడు; పృథక్ విధం కారణం-ఇతరసాధనము, చ వివిధాః పృథక్ చేష్టాః - మఱి యితరమగువేఱువేఱుచేష్టలు, అత్రపంచమందైవంచ-ఇట ఐదవదిభాగ్యము.

తా : అధిష్ఠానము - స్థానము ఒక కారణము. కర్త రెండవ కారణము. ఇతర కారణములు మూఁడవ కారణము. వివిధ ములైన చేష్టలు నాల్గవ కారణము. దైవముఅయిదవ కారణము.

(ఎక్కడ కర్మ జరుపబడునో యాస్థానము అధిష్ఠాన మనబడును. కర్మ మేదో యొక స్థానముననే చేయనగును. ఆ కర్మ మొనరించువాఁడు కర్త. అతడు దానిని జేయుటలో స్వతంత్రుడై యుండును. కర్మచేయుట కనేక సాధనము లావశ్యకములగును. అవి యితర కారణములని చెప్పబడి నవి. కర్మ నాచరించి పూర్తిచేయుటలో ననేకములగు పనులు చేయవలసి యుండును. ఇక దైవ మైదవకారణము. దైవమునే అదృష్టమనియు నందురు. మనుజుఁడు తాజేయు కర్మలకు కర్తయగుటచే ఫలమనుభవించును. సాధారణముగ కర్మ వెంటనే నశించును. కాని యది తనవలన పొంద వలసిన ఫలము ననుభవింప జేయుటకు కర్తయొక్క యంతఃకరణమున

నొక సంస్కారమును జన్మింపజేసి నశించును. ఆ సంస్కారము ఫలము ననుభవింపజేసి నశించును. అంతవఱకు నది యదృష్టమనబడును. అదియే యిట దైవ పదముతో కీర్తింపబడినది.)

శరీరవాఙ్ మనోభిర్ యత్ కర్మ ప్రారభతే నరః
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః. 15

శరీర వాఙ్ మనోభిః - శరీరముతో వాణితో మనస్సుతో, నరః - నరుడు, న్యాయ్యం వా విపరీతం వా - న్యాయయుక్తమైన లేక దానికి విరుద్ధమైన, యత్ కర్మ - ఏపనియైనను, ప్రారభతే - ప్రారంభించునో, తస్య - దానికి, ఏతే పంచ హేతవః - ఇవి ఐదు హేతువులు.

తా : మనుజుడు శరీరముతోను, వాక్కుతోను, మనస్సుతోను కర్మలు చేయును. ఆ కర్మలు న్యాయ్యములు కాని, అన్యాయ్యములు కానియగును. ఏవియైనను పైన వివరింపబడిన యైదు కారణములు లేకసిద్ధింపనేరవు. ప్రతికర్మకు అధిష్ఠానాదులైదును కారణములని యెఱుంగునది.

తత్రైవం సతి కర్తారం ఆత్మానం కేవలం తు యః
పశ్య త్యకృత బుద్ధిత్వాత్ న స పశ్యతి దుర్మతిః. 16

తత్ర ఏవం తు సతి - ఈ విషయమిట్లుండ, యః - ఎవడు, అకృత బుద్ధిత్వాత్ - మందబుద్ధి యగుటవలన, కేవలం ఆత్మానం కర్తారం పశ్యతి - కేవలము తననే కర్తగానెంచునో, సః దుర్మతిః - వాడు దుర్మతి, న పశ్యతి - ఏమియు తెలియనివాడు.

తా : ఇట్లు ప్రతికార్యమునకు నైదు సాధనములు ఉపయుక్తము లగుచుండ, మందబుద్ధి కలవాడు అది తెలియక యాకారణములలో నొక కారణముగా కర్త మాత్రమైన

యతడు తాను ఒక్కడే యాకార్యము నొనరించినట్లు ఎంచును. అతడు దుర్మతి, తెలియనివాడు. ఇయ్యదియే యహంకార మగును.

యస్య నాహంకృతో భావో బుద్ధిర్ యస్య న లిప్యతే
హత్వాపి స ఇమాన్ లోకాన్ న హంతి న నిబధ్యతే. 17

యస్య అహంకృతః భావః న - ఎవని కహంకారభావము లేదో, యస్య బుద్ధిః న లిప్యతే - ఎవనిబుద్ధి (ఫలాకాంక్షతో) లిప్తముకాదో, సః ఇమాన్ లోకాన్ - వా డీలోకులను, హత్వాపి - చంపియు, న హంతి - చంపినవాడు కాడు, న నిబధ్యతే - బంధింపబడడు.

తా : ఇట్టి యహంభావము వదలి, ఫలాపేక్ష లేనివాడై కర్తవ్య కర్మ లాచరించుచు, ప్రాణులను సంహరించినను నతడా హింసచే బద్ధుడు కాడు.

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా
కరణం కర్మ కర్తేతి త్రివిధం కర్మసంగ్రహః. 18

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా - జ్ఞానము, జ్ఞేయము (తెలియవగినవస్తువు) తెలిసికొనువాడు, త్రివిధా కర్మచోదనా - ఈ మూడును కర్మలో ప్రవర్తించుటకు కారణములు. కరణం కర్మ కర్తా ఇతి - సాధనము, కర్మ, కర్త అని, కర్మ సంగ్రహః - కర్మ ననుష్ఠించునవి, త్రివిధం - ముప్విధములు.

తా : తెలివి, తెలియదగు వస్తువు, తెలిసికొనువాడు నను నీ మూడును కర్మప్రవృత్తికి కారణములు. ఒక డొక కార్యమునందు ప్రవృత్తుడగుచున్నా డనిన నతడు (కర్మ నొనర్చువాడు) ఉండవలయును. అతడే కర్త. అతనికి ఆకర్మకు సంబంధించిన జ్ఞానము—తెలివి యుండవలయును. కర్మకూడ ఉండక తప్పదు. ఈమూడును ఉన్నపుడే ప్రవృత్తి యనునది సిద్ధించును.

ఇట్లే కర్మ సంగ్రహము - కర్మానుష్ఠానము కూడ కరణము, కర్మ, కర్తయు నను మూడు లేనిది సిద్ధింపదని చెప్పవలయును.

జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావ చ్ఛృణు తాన్యపి. 19

జ్ఞానం కర్మ కర్తా చ - జ్ఞానము, కర్మ, కర్తయు, గుణసంఖ్యానే- గుణములను వివేచించు శాస్త్రమున, గుణభేదతః - గుణభేదమునుబట్టి, త్రిధా ఏవ - ముప్విధములే, ప్రోచ్యతే - చెప్పబడును, తాని అపి - అవి కూడ, యథావత్ శృణు - సరిగా వినుము.

తా : ఈ జ్ఞాన కర్మ కర్తలను కూడ సత్వాదిగుణ భేదమును బట్టి ముప్విధములుగా విభజించి చెప్పనగును. అవియు వినుము.

సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే
అవిభక్తం విభక్తేషు తద్ జ్ఞానం విద్ధి సాత్వికమ్. 20

యేన - ఏ జ్ఞానముచే, విభక్తేషు - విభజింపబడియున్న, సర్వ భూతేషు - సమస్త భూతములలో - ప్రాణములలో, ఏకం అవ్యయం భావం - ఒకే నశింపని తత్త్వము, ఈక్షతే - చూడబడునో, తత్ జ్ఞానం సాత్వికం విద్ధి - ఆ జ్ఞానము సాత్వికమని తెలియుము.

తా : వేఱువేఱుగానున్న సర్వప్రాణులందును,సమముగా నవిభక్తమై-యఖండితమై వ్యాపించియున్న యవ్యయ తత్త్వమును గుర్తించుట సాత్విక జ్ఞాన మనబడును.

పృథ_క్త్వేన తు యత్ జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్
వే_త్తి సర్వేషు భూతేషు తద్ జ్ఞానం విద్ధి రాజసమ్. 21

యత్ జ్ఞానం - ఏ జ్ఞానము, పృథక్ విధాన్ నానాభావాన్ - వేఱు వేఱుగనుండు అనేక ధర్మములను, సర్వేషు భూతేషు - సమ_స్తభూతము లందును, పృథక్ త్వేన - వేఱుగ, వే_త్తి - ఎఱుగునో, తత్ జ్ఞానం రాజసం విద్ధి - ఆ జ్ఞానము రాజసమని తెలియుము.

తా : భిన్న భిన్నములుగ నుండు సర్వప్రాణులయందలి వేఱువేఱు ధర్మములను వేఱుగ నెఱుంగుట రాజసజ్ఞాన మగును. అట్టి జ్ఞానము కలవాడు అన్నిటియందు సమముగా నుండు వ్యాపకత_త్త్వమును గు_ర్తించ డని భావము.

య_త్తు కృత్స్నవ దేకస్మిన్ కార్యే స_క్త మహైతుకమ్
అత_త్త్వార్థవ దల్పం చ త_త్తామస ముదాహృతమ్. 22

య_త్తు - ఏది, అహైతుకమ్ - యు_క్తిరహితమో, ఏకస్మిన్ కార్యే - ఒకే కార్యమున, కృత్స్నవత్ - సంపూర్ణమువలె, స_క్తం - సంబద్ధమగునో, అత_త్త్వార్థవత్ - మిథ్యా విషయముతో కూడినదిగను, అల్పంచ-కొలదిగను నుండునో, తత్ - అది, తామసం ఉదాహృతమ్ - తామసము.

తా : ఏ జ్ఞానము కారణయు_క్తముగా నుండదో, ఒకే వ_స్తువునందు పరత_త్త్వము పూర్ణముగా నిండియున్నదనియు నంతకుమించి లేదనియు తెలుపునో, ఫలాపేక్షతో కూడియుం డునో, యథార్థము కాదో, మఱియు నల్పమో యట్టి జ్ఞానము తామస మనబడును.

నియతం సంగరహిత మరాగ ద్వేషతః కృతమ్
అఫలప్రేప్సునా కర్మ య_త్తత్ సాత్త్విక ముచ్యతే. 23

నియతం - వర్ణాశ్రమానుకూలముగా నిశ్చితమై, సంగరహితం - ఆసక్తి లేనిదై, యత్ కర్మ - ఏ కర్మ, అరాగద్వేషతః - రాగద్వేషములు లేకుండునట్లు, అఫల ప్రేప్సునా - ఫలాకాంక్ష లేనివానిచే, కృతం - చేయ బడినదో, తత్ సాత్వికం ఉచ్యతే - అది సాత్విక మనబడును.

తా : వర్ణాశ్ర మానుకూలముగా నిశ్చయింపబడి, ఫలాపేక్ష లేక రాగ ద్వేషములను విడిచి చేయబడిన కర్మ సాత్విక మనబడును.

యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః
క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్. 24

యత్తు కర్మ - ఏ కర్మ, కామేప్సునా వా సాహంకారేణ - ఫలాపేక్షతో కాని, అహంకారముతో కాని, పునః - మఱియు, బహులాయాసం- మిక్కిలి ప్రయాసపడి, క్రియతే - చేయబడునో, తత్ రాజసం ఉదాహృతం- అది రాజసమని చెప్పబడినది.

తా : ఫలాపేక్షతో గాని, అహంకారముతో గాని, మిక్కిలిగా కష్టపడి చేయుకర్మ రాజసమగును.

అనుబంధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషం
మోహా దారభ్యతే కర్మ యత్ తత్తామస ముచ్యతే. 25

అనుబంధం - పరిణామమును, క్షయం - హానిని. హింసాం - పర పీడనమును, పౌరుషం - కార్యకరణ శక్తిని, అనపేక్ష్య - విచారింపకయే, మోహాత్ - మోహమువలన, యత్ కర్మ ఏ కర్మ, ఆరభ్యతే - చేయ బడునో, తత్ తామసం ఉచ్యతే - అది తామస మనబడును.

తా : పరిణామమును, హానిని, పరపీడనమును కార్య సాధనకు వలయు శక్తిని-పౌరుషమును విచారింపకయే భ్రాంతితో చేయుకర్మ తామస మనబడును.

ముక్త సంగోఽనహం వాదీ ధృత్యుత్సాహ సమన్వితః
సిద్ధ్యసిద్ధ్యోర్ నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే. 26

ముక్త సంగః - ఫలాపేక్ష లేనివాడై, అనహంవాదీ - అహంకార రహితుడై, ధృత్యుత్సాహ సమన్వితః - ధైర్యోత్సాహములతో కూడిన వాడై, సిద్ధ్యసిద్ధ్యోః నిర్వికారః - కార్యము ఫలించినను ఫలింపకున్నను వికారము చెందకుండునట్టి, కర్తా - కర్త, సాత్త్వికః ఉచత్యే - సాత్త్వికు డనబడును.

తా : ఆసక్తి అహంభావము విడిచి, ధైర్యోత్సాహ ములతో గూడినవాడై, తలపెట్టిన కార్యము ఫలించినను ఫలింపకున్నను హర్ష శోకములను బొందకయుండు కర్త సాత్త్విక కర్త యనబడును.

రాగీ కర్మఫల ప్రేప్సుః లుబ్ధో హింసాత్మకో ఽ శుచిః
హర్ష శోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః. 27

రాగీ - రాగయుక్తుడు, కర్మఫల ప్రేప్సుః - కర్మఫలము నపేక్షించు వాడు, లుబ్ధః - లోభి, హింసాత్మకః - హింసక భావము కలవాడు, అశుచిః - అపవిత్రుడు, హర్షశోక సమన్వితః - హర్ష శోకములతో కూడి యుండువాడు నైన, కర్తా రాజసః ఉచ్యతే - కర్త రాజసు డనబడును.

తా : అనురాగము గలిగి, ఫలము కావలయునను కోరికతో గూడి, లోభము వైరభావము అపవిత్రతత గలవాడై కార్య సిద్ధిలో వికారములను బొందువాడు రాజసిక కర్త యగును.

అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః
విషాదీ దీర్ఘ సూత్రీ చ కర్తా తామస ఉచ్యతే. 28

అయుక్తః - కార్యతత్పరుడు కానివాడు, ప్రాకృతః - అజ్ఞాని, స్తబ్ధః - చురుకుతనము లేనివాడు, శఠః - ధూర్తుడు, నైష్కృతికః - కసి తీర్చుకొను స్వభావము కలవాడు, ఆలసః - సోమరి, విషాదీ - దుఃఖించు వాడు, దీర్ఘసూత్రీ చ - నేటి పని రేపటికి విడుచువాడును నగు, కర్తా తామసః ఉచ్యతే - కర్త తామసు డనబడును.

తా : కర్మయోగము ననుసరింపనివాడు, అజ్ఞాని, సోమరి, ధూర్తుడు, వంచకుడు, కసి తీర్చుకొనవలయునను భావము గలవాడు, మనస్సునందు ప్రసన్నత లేక దుఃఖించువాడు, నేటి కార్యము రేపటికి వదలువాడును తామసిక కర్త యనిపించుకొనును.

బుద్ధేర్ భేదం ధృతేశ్చైవ గుణత స్త్రివిధం శృణు
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ ! 29

ధనంజయ !, బుద్ధేః ధృతేః చ ఏవ - బుద్ధియొక్కయు ధృతి యొక్కయు, గుణతః - గుణములనుబట్టి, అశేషేణ ప్రోచ్యమానం - సంపూర్ణముగ చెప్పబడు, త్రివిధం పృథక్త్వేన శృణు - ముప్విధములను వేఱుగ వినుము.

తా : అర్జున! సత్వాది గుణభేదమును బట్టి బుద్ధి, ధృతి యను రెండును ముప్విధములుగ నుండును. వానిని గూర్చి సంపూర్ణముగ జెప్పెద వినుము.

ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిః సా పార్థ ! సాత్వికీ. 30

ప్రవృత్తి నివృత్తులను, కార్యాకార్యములను, భయాభయములను, బంధమోక్షములను ఎఱుగు బుద్ధి సాత్విక మనబడును.

తా : ఏ కార్యము నాచరింపవలయునో దేని నాచరింపరాదో, యేది యారంభింపవలయునో యేది విడువవలయునో, ఏది చేసిన తనకు భయము వాటిల్లునో యేది చేసినందున తనకు భయపడవలసిన స్థితి కలుగదో, బంధమోక్షము లవనేమో యెఱుంగు బుద్ధి సాత్త్విక మగును.

యయా ధర్మ మధర్మంచ కార్యం చాకార్య మేవ చ
అయథావత్ ప్రజానాతి బుద్ధిః సా పార్థ ! రాజసీ. 31

పార్థ ! యయా - ఏ బుద్ధితో, ధర్మం అధర్మం చ - ధర్మమును, అధర్మమును, కార్యం అకార్యం ఏవ చ - కర్తవ్యమును అకర్తవ్యమును గూడ, అయథావత్ విపరీతముగ, విజానాతి - ఎఱుగునో, సా రాజసీ బుద్ధిః - అది రాజసబుద్ధి.

తా : ధర్మాధర్మములు, కార్యాకార్యములు నున్నవి యున్నట్లు గుర్తింపక విపరీతముగ నెఱుంగుట రాజసబుద్ధి యనబడును.

అధర్మం ధర్మ మితి యా మన్యతే తమసావృతా
సర్వార్థాన్ విపరీతాం శ్చ బుద్ధిః సా పార్థ ! తామసీ. 32

పార్థ ! - అర్జున ! యా తమసా ఆవృతా - ఏది తమోగుణముతో గూడినదై, అధర్మం ధర్మం ఇతి - అధర్మమును ధర్మమనియు, సర్వార్థాన్ విపరీతాన్ చ - సమస్త విషయములను విపరీతముగను, మన్యతే - తెలిసికొనునో, సా బుద్ధిః తామసీ-ఆ బుద్ధి తమోగుణము గలదిగ నెఱుగునది.

తా : తమోగుణములో నావరింపబడి యధర్మమును ధర్మముగా గుర్తించుచు, సర్వప్రయోజనములను విపరీతముగ నెఱుంగుబుద్ధి తామస మనబడును.

ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియక్రియాః
యోగే నావ్యభిచారిణ్యా ధృతిః సా పార్థ ! సాత్త్వికీ. 33

పార్థ ! యయా అవ్యభిచారిణ్యా ధృత్యా - ఏ ఏమరని ధారణతోను' యోగేన - ధ్యానయోగముతోను, మనః ప్రాణ ఇంద్రియ క్రియాః - మనస్సును, ప్రాణమును, ఇంద్రియక్రియలను ధారయతే-నిరోధించునో అడ్డగించునో, సా సాత్త్వికీ ధృతిః - అది సాత్త్వికధృతి యగును.

తా : నిరంతరము కర్మయోగము నభ్యసించుచు,మనస్సు, ప్రాణము, ఇంద్రియములు నను వాని చేష్టలను చిక్కబట్టుకొని వశములో నుంచుకొను ధృతి సాత్త్విక ధృతి యగును.

యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున !
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిః సా పార్థ ! రాజసీ. 34

పార్థ ! యయా ధృత్యా - ఏ ధృతితో, ప్రసంగేన ఫలాకాంక్షీ - ప్రసంగవశమున ఫలము నభిలషించునట్టి వ్యక్తి, ధర్మకామార్థాన్ - ధర్మమును, కామమును, అర్థమును, ధారయతే - ధారణ చేయునో, సా ధృతిః రాజసీ - ఆ ధృతి రాజసి (రజోగుణము కలది) యగును.

తా : కార్య తత్పరుడై ఫలము నభిలషించుచు, ధర్మార్థములను కామమును సాధింపబూను ధృతి రాజసిక మగును.

యయా స్వప్నం భయం శోకం విషాదం మద మేవ చ
న విముంచతి దుర్మేధా ధృతిః సా పార్థ ! తామసీ. 35

పార్థ ! దుర్మేధాః-దుర్బుద్ధిగల మనుష్యుడు, యయా - ఏ ధృతితో, స్వప్నం భయం శోకం విషాదం మదం ఏవ చ - నిద్ర, భయము, దుఃఖము, విషాదము, అభిమానము మున్నగువానిని, న విముంచతి - విడువడో, సా తామసీ ధృతిః - అది తామసధృతి యనబడును.

తా : దుర్బుద్ధి కలవాడై, నిద్ర భయము దుఃఖము దిగులు మదము నను దుర్గుణములను విడువజాలని వానినిగా నొనర్చు ధృతి తామస ధృతి యనబడును.

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ ।
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి. 36

భరత ఋషభ ! - భరతశ్రేష్ఠ! ఇదానీం త్రివిధం సుఖం-ఇప్పుడు మువ్విధములయిన సుఖమును, మే శృణు - నావలన వినుము, యత్ర - ఆ సుఖమునందు, (మనుజుడు) అభ్యాసాత్ రమతే-అభ్యాసమువలన ఆనందించును, దుఃఖాంతం చ నిగచ్ఛతి - దుఃఖనాశముగూడ పొందును.

తా : భరతశ్రేష్ఠ! అర్జున! నేను నీ కిపుడు మువ్విధములగు సుఖమును వివరింతును; వినుము. మనుజు డా సుఖమునందు అభ్యాస వశమున రమించుచుండును. దానిని విడువ నొల్లడు. దుఃఖము నెన్నడును బొందడు.

య త్త దగ్రే విషమివ పరిణామే అమృతోపమమ్
తత్సుఖం సాత్వికం ప్రోక్త మాత్మబుద్ధి ప్రసాదజమ్. 37

య త్తత్ - ఏ సుఖము, అగ్రే - మొదట, (సాధించుటలో కష్టము గలుగును కాబట్టి) విషం ఇవ - విషమువలె నుండునో, పరిణామే - అంతమున, అమృతోపమం - అమృత సమానమగునో, ఆత్మబుద్ధి ప్రసాదజం-ఆత్మయొక్కయు, బుద్ధియొక్కయు నిర్మలతవలన గలుగునట్టి, తత్సుఖం - ఆ సుఖము, సాత్వికం ప్రోక్తమ్ - సాత్విక మనబడినది.

తా : మనస్సును వశములో నుంచుకొని, బుద్ధిని పవిత్ర మొనర్చుకొనుటవలన నేర్పడు సుఖము సాత్విక మగును.

ఇయ్యది సాధనమునందు గల కాఠిన్యమువలన - కష్టమువలన ప్రథమమున విషమువలె తోచినను అంతమున నమృతమగును.

విషయేంద్రియ సంయోగాత్ యత్తదగ్రేఽమృతోపమం
పరిణామే విష మివ తత్సుఖం రాజసం స్మృతమ్. 38

యత్తత్ - ఏ సుఖము, విషయేంద్రియ సంయోగాత్ - విషయములతో - శబ్దస్పర్శాదులతో ఇంద్రియములకు సంబంధము కలుగుటవలన నేర్పడునో, అగ్రే అమృతోపమం - మొదట నమృతమువలె నుండునో, పరిణామే విషమివ - అంతమున విషమువలె నగునో, తత్సుఖం రాజసం స్మృతమ్ - ఆ సుఖము రాజస మనబడినది.

తా : శబ్దస్పర్శాది విషయములందు ఇంద్రియములను సంసక్తము జేయుటవలన నేర్పడు సుఖము రాజసమగును. ప్రథమమున నియ్యది యమృతమువలె నుండును. కాని దీని పరిణామము విషమువలె దుఃఖకర మగును.

య దగ్రే చానుబంధే చ సుఖం మోహన మాత్మనః
నిద్రాలస్య ప్రమాదోత్థం త త్తామస ముదాహృతమ్. 39

యత్ సుఖం - ఏ సుఖం, అగ్రేచ అనుబంధే చ - ఆరంభమునను, అంతమునను, ఆత్మనః మోహనం - ఆత్మకు మోహము - విపరీత జ్ఞానము గలిగించునో, నిద్రా ఆలస్య ప్రమాద ఉత్థం - నిద్ర, సోమరితనము, మఱపువలన గలుగునో, తత్ తామసం ఉదాహృతమ్-ఆ సుఖము తామసమని చెప్పబడినది.

తా : కార్యారంభమునందును, పరిణామమునందును భ్రమను గలిగించు సుఖము తామసిక మగును. ఈ తామసిక సుఖము నిద్ర, అలసత, మఱపువలన గలుగుచుండును.

న త ద స్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః
సత్త్వం ప్రకృతిజై ర్ముక్తం య దేభిః స్యా త్త్రిభి ర్గుణైః. 40

యత్ ప్రకృతిజైః ఏభిః త్రిభిః గుణైః ముక్తం స్యాత్ - ఏది ప్రకృతినుండి కలిగిన యీ మూడు (సత్వరజస్తమస్సులను) గుణముల తోను సంబంధములేని దగునో, తత్ సత్వం - అట్టి వస్తువు, పృథివ్యాం- భూమిలోకాని, వా దివి వా పునః దేవేషు - లేక ద్యులోకమున గాని, లేక దేవతలందు కాని, న అస్తి - లేదు. (సత్వరజస్తమో గుణయుక్తము కాని వస్తువు విశ్వమున నెక్కడను నుండదని భావము.)

(ఈ మూడు గుణములలో వ్యత్యాసము గల్గుటవలననే మానవ స్వభావములలో మార్పులు కనబడును. ఈ స్వభావ భేదమును బట్టియే వర్ణాశ్రమ వ్యవస్థ యేర్పడును)

తా: భూమియందు కాని, ద్యులోకమునగాని, సూర్యాది లోకాంతరములందుగాని, ఉన్న పదార్థములన్నియు ప్రాకృతికములే-ప్రకృతినుండి యేర్పడినవియే. ప్రకృతి గుణములైన సత్వరజస్తమోగుణ మయములే. ఆ గుణములతో సంబద్ధములు కాని వస్తువులు లోకమున నుండవు.

బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరంతప !
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవై ర్గుణైః. 41

పరంతప ! - శత్రువులకు దుఃఖము కలిగించు అర్జున!, బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ - బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రుల యొక్క, కర్మాణి - కర్మలు, స్వభావ ప్రభవైః గుణైః - స్వభావమువలన గలుగు గుణములను బట్టి, ప్రవిభక్తాని - విభజింపబడినవి.

తా : శత్రు భయంకర ! అర్జున ! బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు నని వ్యవహరింపబడు మానవులొనర్చు కార్యములు విభజించి చెప్పబడినవి. అవి యన్నియు ప్రకృతి గుణములైన సత్వరజ స్తమస్సుల కనుగుణముగా నుండును. మనుజుల బుద్ధి తత్త్వము - అంతఃకరణము సత్వాది గుణప్రధానముగా నుండును. సత్వాగులతో నేగుణము అంతఃకరణమున నధికముగా నుండునో దానికనుగుణముగా మనుజుని స్వభావ మేర్పడు నని భావము.

శమో దమ స్తపః శౌచం క్షాంతి రార్జవ మేవ చ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్. 42

శాంతి, ఇంద్రియ నిగ్రహము, సుఖదుఃఖాది ద్వంద్వ సహనము, శుద్ధి, క్షమత, సరలత, యమనియమముల పాలనము, సత్వాది గుణములను వేఱుగ గుర్తించి సాత్విక భావములను గ్రహించుట, భగవంతుని యందు శ్రద్ధకలిగియుండుట అనునివి యన్నియు, స్వభావజం-స్వభావానుగుణమైన, బ్రహ్మకర్మ - బ్రాహ్మణకర్మలు.

తా : చిత్తస్థిరత, బాహ్యేంద్రియ నిగ్రహము, సుఖదుఃఖాదులనెడి ద్వంద్వములను సహించుట, బాహ్యాభ్యంతర శుద్ధి, ఓర్పు, సరళత, యమనియమాదులను పాలింపవలయునను జ్ఞానము; సత్వాది గుణవివేక మనెడి విజ్ఞానము, సృష్టిస్థితి లయములకు చేతన నిమిత్త కారణము (కర్త) అయిన వ్యాపక తత్త్వమునందు శ్రద్ధాసక్తులు కలిగి యుండుట యనునివి యన్నియు బ్రాహ్మణునియందు గనబడు నైజగుణములు.

శౌర్యం తేజో ధృ ర్దాక్ష్యం యుద్ధేచా ప్యపలాయనమ్
దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్. 43

వీర్యము, ప్రతాపము, ధైర్యము, చతురత, యుద్ధమునందుకూడ వెన్నుజూపి పరుగిడకుండుట, దానము, ప్రభుత ఇవియన్నియు స్వభావమున కనుగుణమైన క్షత్రియకర్మలు.

కృషి గోరక్ష వాణిజ్యం వైశ్య కర్మ స్వభావజమ్
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్. 44

కృషి, గోపాలనము, వ్యాపారము ఇవి వైశ్యస్వభావానుగుణ కర్మలు, శూద్రస్య అపి - శూద్రునకును, స్వభావజం - స్వభావానుగుణమైన, కర్మ - పని, పరిచర్మాత్మికం - సేవాభావము.

స్వే స్వే కర్మ ణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః
స్వకర్మ నిరతః సిద్ధిం యథా విందతి తచ్ఛృణు. 45

నరః - మనుష్యుడు, స్వే స్వే కర్మణి అభిరతః - తనతనపనిలో లగ్నముకలవాడై, సంసిద్ధిం లభతే - సిద్ధిని బొందును, స్వకర్మనిరతః - తనకర్మలో లగ్నచిత్తుడైన నరుడు, యథా సిద్ధిం విదంతి - ఎట్లు సిద్ధి బొందునో, తత్ శృణు - అది వినుము.

తా : తమ తమ స్వభావానుగుణముగ కర్మల నాచరించుచు మనుజులు వానియందు సిద్ధిని బొందుదురు. అట్లు సిద్ధిని బొందు విధము చెప్పెదను, వినుము.

యతః ప్రవృత్తిర్ భూతానాం యేన సర్వ మిదం తతమ్
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః. 46

మధ్యే - రెండు సేనలమధ్య, రథోత్తమం - శ్రేష్ఠరథమును, స్థాపయిత్వా- నిలబెట్టి.

తా : అని యర్జునుడు చెప్పగా విని కృష్ణుడు రథమును రెండు సేనలకు నడుమ నిలబెట్టి.

భీష్మద్రోణ ప్రముఖతః సర్వేషాం చ మహీక్షితామ్
ఉవాచ, పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూ నితి. 25

భీష్మద్రోణ ప్రముఖతః - భీష్మద్రోణుల కెదురుగ, సర్వేషాం చ మహీక్షితాం - రాజుల కందఱకు నెదుట, ఉవాచ - చెప్పెను. పార్థ ! అర్జున ! పృథాపుత్ర ! ఏతాన్ సమవేతాన్ కురూన్ - ఈ కలిసి యేకముగానున్న కౌరవులను, పశ్య - చూడు.

తా : భీష్ముడు, ద్రోణుడు, ఇతర రాజులు నెల్లరు గనబడునట్లు ఎదురుగా రథమును నిల్పి కృష్ణు డర్జునునితో ననెను: 'ఓయి ! కుంతీపుత్ర ! అర్జున! నీ కెదురుగా నేకమయియున్న యీ కౌరవులను జూడు.

తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄ నథ పితామహాన్
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తథా. 26
శ్వశురాన్ సుహృద శ్చైవ సేనయో రుభయోరపి
తాన్ సమీక్ష్య స కౌంతేయః సర్వాన్ బంధూ నవస్థితాన్. 27

తత్ర - అక్కడ, పార్థః - అర్జునుడు, పితౄన్...సుహృదః చ ఏవ - తండ్రులను, తాతలను, ఆచార్యులను, మేనమామలను, సోదరులను, పుత్రులను, పౌత్రులను, మిత్రులను, మామలను, సుహృత్తులను, సేనయోః ఉభయోః - రెండు సేనలలోను, స్థితాన్ అపశ్యత్ - ఉన్న వారిని చూచెను.

సః కౌంతేయః - ఆకుంతీపుత్రు డర్జునుడు, తాన్ అవస్థితాన్ బంధూన్ సర్వాన్ - ఆ నిలచియున్న బంధువుల నందఱను, సమీక్ష్య - బాగుగచూచి,

తా : అర్జునుడు యుద్ధరంగమున నున్నవారిని తండ్రులను, తాతలను, ఆచార్యులను, మేనమామలను, భ్రాతలను, పుత్ర పౌత్రులను, స్నేహితులను జూచెను.

మఱియు మామలు, సుహృత్తులును వతనికి రెండు సేన లందును గననైరి. ఆ యర్జునుడు అట నున్న బంధువుల నందఱను బాగుగ జూచి-

కృపయా పరయా విష్టో విషీద న్నిద మబ్రవీత్
దృష్ట్వేమం స్వజనం కృష్ణ ! యుయుత్సుం సముపస్థితమ్. 28

పరయా కృపయా - అత్యంత కృపతో, ఆవిష్టః - కూడినవాడై, విషీదన్ - దుఃఖించుచు, ఇదం అబ్రవీత్ - ఇట్లనెను.

కృష్ణ ! యుయుత్సుం - యుద్ధము చేయవలయునను, ఇమం - ఈ సముపస్థితం - వచ్చియున్న, స్వజనం - తన జనమును, దృష్ట్వా - చూచి,

తా : మిక్కిలి దయతో గూడినవాడై దిగులు పడుచు కృష్ణునితో నిట్లనెను. కృష్ణ ! యుద్ధబుద్ధితో వచ్చిన యీ స్వజనులం జూచి,

సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే. 29

మమ - నా, గాత్రాణి - అంగములు, సీదంతి - సడలిపోవుచున్నవి. ముఖం చ పరిశుష్యతి - నోరుకూడ ఎండిపోవుచున్నది. మే - నా,

శరీరే చ - శరీరమునందును, వేపథుః చ రోమహర్షః - కంపము, రోమాంచ మును, జాయతే - కలుగుచున్నది.

తా : నా యంగము లన్నియు సడలిపోవు చున్నవి. నోరెండుచున్నది. నా శరీరము కంపించుచున్నది. రోమములు నిక్కబొడుచుకొని గగుర్పాటు గలుగు చున్నది.

గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్ చైవ పరిదహ్యతే
న చ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః. 30

హస్తాత్ - చేతినుండి, గాండీవం - గాండీవము, స్రంసతే - జారు చున్నది. త్వక్ చ ఏవ పరిదహ్యతే - త్వక్కుకూడ మండుచున్నది. అవ స్థాతుం చ న శక్నోమి - నిలబడుటకును సమర్థుడను కాకున్నాను. మే మనః చ - నా మనస్సుకూడ, భ్రమతీవ - తిరుగుచున్నట్లున్నది.

తా : గాండీవము చేతినుండి జారిపోవుచున్నది. చర్మ మున తాపము గలుగుచున్నది – మండిపోవుచున్నది. నిలుచు టకు శక్తి లేకున్నది. మనస్సు తిరుగుచున్నట్లున్నది.

నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే. 31

కేశవ : విపరీతాని నిమిత్తాని చ - విపరీత లక్షణములుకూడ, పశ్యామి - చూచుచున్నాను. ఆహవే - యుద్ధమునందు, స్వజనం హత్వా - బంధుజనమును చంపి, శ్రేయః న అనుపశ్యామి - మేలు కనకున్నాను.

తా : కృష్ణ ! విపరీతనిమిత్తములు కనబడుచున్నవి. పైగా యుద్ధమున స్వజనులను చంపి పొందు శ్రేయస్సేమియు గనిపింపకున్నది.

న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ
కిం నో రాజ్యేన గోవింద ! కిం భోగైర్ జీవితేన వా. 32

ఓ కృష్ణా ! విజయం, రాజ్యం, సుఖాని చ - విజయము, రాజ్యము, సుఖములును, న కాంక్షే - కోరను. ఓ గోవింద ! నః - మనకు, రాజ్యేన, భోగైః, జీవితేన వా - రాజ్యముతోను, భోగములతోను, జీవితముతోను, కిం - ఏమిలాభము ?

తా : విజయము కలుగునందువా అది నాకక్కఱలేదు. రాజ్యము, సుఖములు నంతకంటెను వలదు. గోవింద ! రాజ్యము, భోగములు, జీవితము ఎందులకు ?

యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగాః సుఖాని చ
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ. 33
ఆచార్యాః పితరః పుత్త్రాః తథైవ చ పితామహాః
మాతులాః శ్వశురాః పౌత్రాః శ్యాలాః సంబంధిన స్తథా. 34

యేషాం అర్థే - ఎవరి కొఱకు, నః - మనకు. రాజ్యం, భోగాః, సుఖాని చ - రాజ్యము, భోగములు, సుఖములును, కాంక్షితం-కావలయునో, తే ఇమే - ఆ యీ, ఆచార్యాః, పితరః, పుత్రాః - ఆచార్యులు, పితరులు, పుత్రులు, చ ఏవ తథా - మఱియు నట్టి, పితామహాః- తాతలు, మాతులాః- మేనమామలు, శ్వశురాః - మామలు, పౌత్రాః - మనుమలు, తథా - అట్లే శ్యాలాః - బావమఱదులు, సంబంధినః - సంబంధము కలవారు. ప్రాణాన్ ధనాని చ త్యక్త్వా - ప్రాణములు, ధనములును విడిచి, యుద్ధే అవస్థితాః - యుద్ధమున నిలబడి యున్నారు.

తా : రాజ్యము, భోగములు, సుఖములు నెవరికొఱకు వలయునో వారెల్లరు ధనములను, ప్రాణములను వదలి

యీ యుద్ధరంగమున నిలబడియున్నారు. వారు నెవరో కాదు-ఆచార్యులు, తండ్రులు, బిడ్డలు, తాతలు, మేనమామలు, మామలు, మనుమలు, బావమఱదులు, వియ్యంకులును. ఇందు శత్రువు లెవరు ?

ఏతా న్న హంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన ।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే. 35

మధుసూదన । - మధుహంతకుడవగు నో కృష్ణ!, ఏతాన్ ఘ్నతః అపి - ఈ చంపువారిని కూడ, త్రైలోక్యరాజ్యస్య హేతోః అపి-ముల్లోక రాజ్య నిమిత్తమైనను, హంతుం - చంపుటకు. న ఇచ్ఛామి - కోరను, మహీకృతే ను కిమ్ - ఇక కేవల భూమికొఱ కెట్లు చంపుదును ?

తా : మధుసూదన ! కృష్ణ ! వీరు నన్ను జంపిన జంపుదురుగాక ! నేను మాత్రము వీరిని జంప గోరను. భూ నభోంత రాళములపై నాధిపత్యము లభించినను వీరిని జంపగోరను. అట్టియెడ గేవల మీ భూమికొఱ కెట్లు చంపుదును !

నిహత్య ధార్తరాష్ట్రాన్ నః కా ప్రీతిః స్యాజ్జనార్దన ।
పాపమే వాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః, 36

జనార్దన । - కృష్ణ । (దుర్జనులకు కష్టముల నిచ్చువాడ।) ధార్తరాష్ట్రాన్ - ధృతరాష్ట్రుని పుత్రులను, నిహత్య - చంపి, నః - మనకు కా ప్రీతిః స్యాత్ - ఏమి ప్రసన్నత కలుగును ? ఏతాన్ ఆతతాయినః - ఈ యపరాధులను, హత్వా - చంపిన, పాపమేవ - పాపమే, అస్మాన్ ఆశ్రయేత్ - మనకు కల్గును.

తా : జనార్దన ! కృష్ణ! ధృతరాష్ట్రుని కుమారులైన దుర్యోధనాదులను జంపిన మనకు గలుగు మేలేమి ? వారు

ఆతతాయులు కావచ్చును. కాని; వారిని జంపినను మనకు పాపమే కలుగును గదా !

(ఆతతాయి లన నెవరు ?

అగ్నిదో గరదశ్చైవ ఖడ్గపాణిర్ ధనాపహః
క్షేత్ర దారాపహారీ చ షడైతే ఆతతాయినః.

నిప్పుతో గృహాదులను దహింపజేయువారు; విషముపెట్టి ప్రాణులం జంపువారు; కత్తులతో నెదురించువారు; ధనమును, పైరును, భార్యను నపహరించువారు- నను నీ యార్గురును ఆతతాయి లనబడుదురు. ఇట్టివారిని విచారింపకయే చంపవలయునని యర్థశాస్త్రము చెప్పును.

గురుం వా బాలవృద్ధౌ వా బ్రాహ్మణం వా గుణాన్వితం
ఆతతాయిన మాయాంతం హన్యాదే వావిచారయః
నాతతాయివధే దోషో హంతు ర్భవతి కశ్చన ;

గురువైనను, బాలుడైనను, వృద్ధుడైనను, గుణవంతుడైన బ్రాహ్మణుడైనను నత డాతతాయి యైనపక్షమున మంచి చెడుగులు విచారింపకయే అతనిని చంపదగును. ఆతతాయిని జంపువాని కెట్టి దోషమును గలుగదు. అను నీ యర్థస్మృతి వాక్యముల ననుసరించి దుర్యోధనుడు నతని పక్షపాతులు భీష్మద్రోణాదులు నెల్లరు నాతతాయులు, కావున వారిని జంపుట వలన బాపము కలుగ దని యున్నను-

"మా హిగ్ంసీః సర్వాభూతాని" అను వేదవాక్యము ననుసరించి యెట్టి ప్రాణిని జంపినను పాపి కాక తప్పదు. అని యర్జునుడెంచి ఆతతాయులైన దుర్యోధనాదులను జంపినను బాపమే కలుగునని కృష్ణునితో నుడివిన ట్లెంచవలయును.

అర్థశాస్త్ర విధానము కంటె ధర్మశాస్త్రమైన వేదవిధి ప్రధానము అధికప్రమాణముగా నెంచవలయును. శృతిస్మృతులలో పరస్పర విరోధము కలిగినపుడు శృతినే యంగీకరింప వలయునని మహర్షు లంగీకరింతురు.

"శృతి స్మృతి విరోధే తు శృతి రేవ గరీయసీ"

తస్మా న్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్
స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవ ౹ 37

తస్మాత్ - కావున, వయం - మనము, స్వబాంధవాన్ ధార్తరాష్ట్రాన్ - మన బంధువులయిన ధృతరాష్ట్రపుత్రులను, హంతుం - చంపుటకు, అర్హాః న - అర్హులముకాము. మాధవ ౹ - కృష్ణ!, స్వజనం - మన బంధువులను. హత్వా - చంపి, కథం సుఖినః స్యామ - ఎట్లు సుఖుల మగుదుము ! (కామని భావము.)

తా : కావున మాధవ ! స్వబాంధవులైన పెత్తండ్రి కొడుకులను మనము చంపరాదు. స్వజనులను జంపి మన మెట్లు సుఖింపగలము !

యద్యప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్. 38

లోభ ఉపహత చేతసః - లోభమువలన చెడియున్న మనస్సుకల వారైన, ఏతే - వీరు, కులక్షయకృతం దోషం - కులనాశముచేసినందున కలుగు దోషమును, మిత్రద్రోహే పాతకం చ - మిత్రులకు ద్రోహము చేసినందున కలుగు పాపమును, యద్యపి న పశ్యంతి - చూడ నప్పటికిని.

తా : కృష్ణ ! దుర్యోధనాదులు లోభదూషిత మనస్కులు. కావున వారికి వంశనాశనము, మిత్రద్రోహము వలన గలిగెడి పాతకము కనిపింప కున్నది.

కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివ ర్తితుం
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్ జనార్దన ! 39

జనార్దన ! - కృష్ణః, కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిః - కుల నాశము చేసినందువలన గలుగు దోషము నెఱుగు, అస్మాభిః - మనచేః అస్మాత్ పాపాత్ - ఈ పాపమునుండి, నివ ర్తితుం - తొలగుటకు, కథం న జ్ఞేయమ్ - ఎట్లు తెలియబడదు ? ఎట్లు ప్రయత్నింపబడదు? అని భావము.

తా : కాని, వంశనాశనమువలన గలుగు దోషమును బాగుగ జూచుచున్న మన మేల యీ పాపమునుండి దూర ముగా నుండరాదు కృష్ణ !

కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాః సనాతనాః
ధర్మే నష్టే కులం కృత్స్నమ్ అధర్మోఽభిభవత్యుత. 40

కులక్షయే - వంశ నాశనమైన మీదట, సనాతనాః కులధర్మాః - సనాతన కులధర్మములు, ప్రణశ్యంతి - నశించును, ఉత - మఱియు, ధర్మే నష్టే - ధర్మము నశించినచో, కృత్స్నం కులం - సంపూర్ణ కులమును, అధర్మః అభిభవతి - అధర్మము అణచివేయును.

తా : మఱియు, కులక్షయ మగుటవలన పరంపరాగతము లైన సనాతన కులధర్మములు - సంధ్యాగ్నిహోత్రములు నశించును. ధర్మనాశమువలన కులమునం దధర్మము పెరుగును.

అధర్మాభిభవాత్ కృష్ణ ! ప్రదుష్యంతి కులస్త్రియః
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ ! జాయతే వర్ణసంకరః. 41

కృష్ణ !, అధర్మాభిభవాత్ - అధర్మముచే కులమణచబడినందున, కులస్త్రియః - కులస్త్రీలు, ప్రదుష్యంతి - దూషితలగుదురు, స్త్రీషు దుష్టాసు-

స్త్రీలు దూషితలయిన మీదట, వార్ష్ణేయ - కృష్ణ ! వర్ణసంకరః - వర్ణసంకరము, జాయతే - కలుగును.

తా : అధర్మము వృద్ధియగుటవలన కులస్త్రీలు దూషితలగుదురు. కుల నాశకులైన పాపుల సాంగత్యమువలననో, లేక పతు లధర్మవర్తను లగుట జూచి స్త్రీలును నధర్మవర్తనకు గడంగుటవలననో వారు దూషిత లగుదురని భావము. అందువలన వర్ణసాంకర్యము గలుగును.

సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః. 42

సంకరః - సాంకర్యము, కులఘ్నానాం కులస్య చ - కులనాశకులకు, కులమునకును, నరకాయ ఏవ - దుఃఖమునకే సాధనమగును, హి - కారణమేమన, ఏషాం పితరః - వీరి వృద్ధులు, లుప్త పిండ ఉదక క్రియాః - అన్నము, జలము, సేవాకర్మలు లోపించినవారై, పతంతి - పతితులగుదురు.

తా : వర్ణసాంకర్యము కులనాశకుల దుఃఖమునకు హేతువగును. కులనాశకుల పితరులును అన్నోదకముల నిచ్చువారు లేనందున దుఃఖమగ్నులగుదురు.

దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః. 43

కులఘ్నానాం వర్ణసంకర కారకైః ఏతైః దోషైః - కులనాశకుల యొక్క వర్ణసాంకర్యము నొనర్చు నీ దోషముల మూలమున, జాతి ధర్మాః - వర్ణధర్మములు, శాశ్వతాః కులధర్మాః - సనాతన ధర్మములు, ఉత్సాద్యంతే - పెరికివేయబడును.

తా : వర్ణసాంకర్యము గలిగించు నిట్టి కులనాశకుల పాపముల - దోషములవలన వర్ణధర్మములు, వంశధర్మములును నశించును.

ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన :
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ. 44

ఓ జనార్దన ! ఉత్సన్నకుల - ధర్మాణాం - కులధర్మములను విడుచు, మనుష్యాణాం - మనుజులకు, నియతం నరకే వాసో భవతి - నిశ్చయముగ దుఃఖదాయక యోనులందు నివాస మేర్పడును, ఇతి శుశ్రుమ - అని వినుచున్నాము.

తా : ఇట్లు వర్ణధర్మములు, వంశధర్మములు, ఆశ్రమధర్మములు నశించినందున మానవులు దుఃఖములపా లగుదురని కృష్ణ ! వినియున్నాము గదా !

అహో బత మహ త్పాపం కర్తుం వ్యవసితా వయమ్
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజన ముద్యతాః. 45

ఆహో బత - ఎంత కష్టము. వయం - మనము, మహత్ పాపం- గొప్ప పాపము, కర్తుం వ్యవసితాః - చేయసాగితిమి, యత్ రాజ్యసుఖలోభేన-ఏకారణమున రాజ్యసుఖాపేక్షతో, స్వజనం హంతుం ఉద్యతాః - స్వజనులను చంపుటకు సిద్ధపడితిమి.

తా : కావున కృష్ణ ! రాజ్య సుఖములందలి లోభబుద్ధితో స్వజనులం జంపుటకు బూనుకొని మహత్ పాపము జేయ నిశ్చయించితిమి. ఇది యెంత కష్టము !

యదిమా మప్రతీకారం అశస్త్రం శస్త్రపాణయః
ధార్తరాష్ట్రా రణే హన్యుః తన్మే క్షేమతరం భవేత్. 46

శస్త్రపాణయః-శస్త్రధారులైన, ధార్తరాష్ట్రాః-ధృతరాష్ట్రి పుత్రులు, అప్రతీకారం - ప్రత్యపకారము చేయని, అశస్త్రం - శస్త్రములు ధరింపని, మాం - నన్ను, రణే - యుద్ధమున, యది హన్యుః - చంపుదురేని, తత్ - అది, మే - నాకు, క్షేమతరం భవేత్ - ఎక్కువ మేలు అగును.

తా : శస్త్రాస్త్రములను విడిచి, ప్రత్యపకారమునకు బూనుకొనని నన్ను శస్త్రపాణులైన దుర్యోధనాదులు యుద్ధమున జంపినను అది నాకెక్కుడు మే లనిపించుచున్నది.

ఏవ ముక్త్వాఽర్జునః సంఖ్యే రథోపస్థ ఉపావిశత్
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః. 47

సంజయు డిట్లు చెప్పుచున్నాడు :

శోక సంవిగ్న మానసః - దుఃఖముచే ఖిన్నుడైన అర్జునుడు, ఏవం ఉక్త్వా - ఇట్లు చెప్పి, సశరం చాపం - బాణ సహితమగు ధనువును, విసృజ్య - విడిచి, రథ ఉపస్థే - రథముమీద, ఉపావిశత్ - కూర్చుండెను.

తా : అని యిట్లుచెప్పి యర్జునుడు విల్లు నమ్ములను విడిచి, దుఃఖాకుల మనస్కుడై రథముమీద కూలబడెను.

తం తథా కృపయావిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్
విషీదంత మిదం వాక్య మువాచ మధుసూదనః. 48

తథా - ఆవిధమున, కృపయా ఆవిష్టం - దయాపూర్ణుడును. అశ్రు పూర్ణ ఆకుల ఈక్షణమ్ - కన్నీటితో నిండి వ్యాకులమగు దృష్టిగల వాడును, విషీదంతం తం - దిగులు చెందుచున్నవాడును నగు నాయర్జునునితో, మధుసూదనః - మధుహంతకుడగు కృష్ణుడు, ఇదం వాక్యం ఉవాచ - ఇట్లు పలికెను.

తా : అంతట పైన వర్ణించిన విధమున కృపాపూర్ణుడై కనులనిండ నీరుగ్రమ్ముచుండ వ్యాకుల దృష్టిగలవాడై చింతించు చున్న అర్జునుని జూచి మధుసూదను డి ట్లనెను.

కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితం
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున. 49

అర్జున ! విషమే - ఈ కఠిన సమయమున, ఇదం - ఈ, అనార్యజుష్టం - అనార్యులకు ప్రియమగు, అస్వర్గ్యం - సుఖము నొసగని, అకీర్తికరం - కీర్తి నొసంగని, కశ్మలం - మాలిన్యము - మోహము, త్వా - నిన్ను, కుతః సముపస్థితమ్ - ఎటనుండి చేరినది ?

తా : అర్జున ! ఈ కఠిన సమయమున నీ మాలిన్యము నిన్నెటనుండి యాక్రమించినది ? ఇయ్యది యార్యులలో నుండ దగినది కాదే ! మఱియు నిది నీకు సుఖమును గాని, కీర్తిని గాని కలిగించునది కాదే !

క్లైబ్యం మాస్మగమః పార్థ ! నైత త్త్వ య్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వో త్తిష్ఠ పరంతప. 50

పార్థ ! కుంతీ పుత్రుడవగు అర్జున ! క్లైబ్యం - నపుంసకతను, మాస్మగమః - పొందకు, ఏతత్ త్వయి న ఉపపద్యతే - ఇది నీయందుండ తగదు, పరంతప - శత్రు తాపక ! క్షుద్రం హృదయ దౌర్బల్యం - తుచ్ఛ మగు హృదయ దుర్బలతను, త్యక్త్వా ఉత్తిష్ఠ - విడిచి నిలబడుము.

తా : కావున నోపార్థ ! కుంతీ పుత్రుడవైన నీవు నపుంసకతను బొందకుము. నీ కిది తగదు. నీవు శత్రుతాపకుడవు. నీచమైన యీ హృదయ దౌర్బల్యమును విడనాడి లేచి నిలబడుము. యుద్ధమునకు సిద్ధపడుము.

(ఈ ప్రకరణమున నర్జునుని మందలించుచు కృష్ణుడు 'ఈ కశ్మలము - మాలిన్యము - నీకెటనుండి కలిగినది. ఇది ఆర్యులలో నుండదగినది కాదు....' అని పలికి యున్నాడు (49 శ్లోకమునందు). కాబట్టి అర్జునుడు ఆర్యుడనియు, అట్లే కృష్ణాదులును అని బోధపడుచున్నది. ప్రస్తుతము భారతీయులు తమ్ముదాము హిందువుల మని చెప్పుకొనుచున్నారు. కావున భారతీయులు హిందువులా ? లేక ఆర్యులా ? అని సందేహము కలుగుట సహజము. ప్రాచీన కాలమున భారతీయులు ఆర్యులని వ్యవహరింపబడి నట్లు (సంస్కృత సాహిత్యమును బరికించిన) కనబడును. ప్రాచీన గ్రంథములలో వేదములందుకాని, ఉపనిషత్తులందుకాని, మనుస్మృత్యాదులందు కాని యెక్కడను 'హిందు' పదము కనిపింపదు. నేటి భారతీయులు హిందువులని యేల పిలువబడుచున్నారు ? ఎప్పటినుండి, యెందుల కీనామము వీరికి సంక్రమింప జేయబడినది ? ఈ పదమున కర్థమేమి ? ఇయ్యది యేభాషకు చెందినది ? అను ప్రశ్నలు చదువరులకు కలుగకమానవు.

భారతదేశమునకు హిందుస్థాన్ అను పేరుగలదనియు అందుండు వారు కావున హిందువులనబడు చున్నారనియు కొందఱు చెప్పుదురు. కాని, భారతదేశమునకు 'హిందుస్థాన్' అను నామమెక్కడిది ? ఎప్పటిది ? హిందుస్థానముననుండు వారు హిందువులగుచో క్రైస్తవులు, మహమ్మదీయులు నీ హిందుస్థానమున నుండియు హిందువులని యేల పిలువబడరు ? మహమ్మదీయులను హిందువులనిన వారేల ఒప్పుకొనరు ? కావున హిందుస్థానమున నుండువారు హిందువులనుట సరికాదని తెలియుచున్నది. హిందుపదము భారతీయభాషలకు జెందినది కాదని నిజ మారసిన దెలియును. ఈ పదము పారసీక భాషకు చెందినది. భారతీయులు స్వాతంత్ర్యమును గోలుపోయి మహమ్మదీయ శాసనమునకు లోబడిన కాలమున మహమ్మదీయులు భారతీయులను హిందుపదముతో వ్యవహరింప నారంభించినట్లు చరిత్ర పరిశోధన వలన తెలియుచున్నది.

భారతదేశము పూర్వము ఆర్యావర్త మన బడెడిది. ఆర్యులు వసించుచోటు- కావున ఇక్కడి ఆర్యులు మహమ్మదీయుల ఆధిపత్య కాలమున ఇస్లామ్ మతమును స్వీకరింపనందున హిందువు లనబడసాగిరి. హిందుపదమున కర్థము 'కాఫిర్' 'గులామ్' అని పారసీక భాషాకోశము లందు వ్రాయబడి యుండుట జూడనగును. కాఫిర్ అనగా పాపి, మతము నందు విశ్వాసము లేనివాడు అని యర్థము. 'గులామ్' అనగా బానిస - అస్వతంత్రుడు. అందువలననే మహమ్మదీయులను హిందు పదముతో వ్యవహరించిన వారంగీకరింపరు. ఈ పదమును భారతీయులు ప్రథమమున నంగీకరింపక పోయినను కాలము గతించిన కొలది మహమ్మదీయ ప్రాభవమునకు లోబడి గత్యంతరములేక మహమ్మదీయ పరిపాలకులచే తమపై రుద్దబడిన హిందుపదమునకు తలలొగ్గి తమ్ముతాము హిందుపదముతో వ్యవహరించుకొన నారంభించినట్లు కనిపించుచున్నది. కావుననే సంస్కృత వాఙ్మయమున ప్రాచీనగ్రంథములలో నెక్కడను నీ హిందుపదము కనిపింపదు. కాబట్టి వాస్తవమున భారతీయులు హిందువులు కారు. వారు ఆర్యులు. మనము ఆర్యులము. ఆర్యులు అనగా పూజ్యులు - శ్రేష్ఠులు - జ్ఞానులు నని అర్థము. అందువలననే కృష్ణు డర్జునుని గుఱించి 'ఈ మాలిన్యము అనార్యులలో నుండదగినది. నీలో నెటనుండి వచ్చినది. దీనిని విడిచి పెట్టు' మని మందలించి యున్నాడు.)

కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన ।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన. 51

అర్జును డనుచున్నాడు :

అరిసూదన : మధుసూదన ! శత్రునాశకుడవు, మధునాశకుడవు నగు నో కృష్ణ ! అహం - నేను, సంఖ్యే - యుద్ధమున, భీష్మం-భీష్ముని. ద్రోణం చ-ద్రోణునికూడ, ఇషుభిః - బాణములతో, కథం ప్రతియోత్స్యామి- ఎట్లెదిరించి యుద్ధము చేయగలను ? పూజార్హౌ - వారు పూజ్యులు కదా ?

తా : శత్రునాశకుడ వగు నోకృష్ణ! పూజింపదగిన భీష్మ ద్రోణుల నెదిరించి ఈ సంగరమున బాణములతో నెట్లు ప్రతి యుద్ధము చేయగలను ?

గురూ నహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష మపీహ లోకే
హ త్వార్థకామాం స్తు గురూ నిహైవ
భుంజీయ భో గాన్ రుధిరప్రదిగ్ధాన్. 52

హి - ఏలయన, మహానుభావాన్ గురూన్ అహత్వా - మహాశయు లగు గురువులను చంపక, ఇహలోకే భైక్షమపి భోక్తుం శ్రేయః - ఈలోక మున భిక్షాన్నమైనను తినుట మంచిది, అర్థకామాన్ గురూన్ - అర్థాపేక్ష గల గురువులను హత్వాతు - చంపిన, ఇహఏవ - ఇక్కడనే, రుధిర ప్రదిగ్ధాన్ భోగాన్ భుంజీయ-రక్తసిక్తములయిన భోగములను భుజింతుము.

తా : మహానుభావులైన గురుజనులను జంపుటకంటె నీ లోకమున భిక్షాన్నము దిని బ్రతుకుట మేలుకదా ! అర్థకాములైన వారిని జంపి వారిరక్తముతో దడుపబడిన భోగముల నెట్లనుభవింతును ?

న చైతద్ విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యదివా నో జయేయుః
యా నేవ హత్వా న జిజీవిషామః
తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః. 53

యద్ వా జయేమ-మనమే జయింతుమో, యది వా నః జయేయుః- వారే మనలను జయింతురో, కతరత్ - ఈ రెంటిలోనేది, నః గరీయః - మనకు శ్రేష్ఠమో, ఏతత్ న చ విద్మః - దీనినికూడ మన మెఱుగము.

విజయము మనకే కలుగుననని యొక విధమున నెంచినను కలుగు నష్టము నూహించి యర్జునుడనుచున్నాడు. యాన్ హత్వా న ఏవ జిజీవిషామః - ఎవరిని చంపి బొత్తిగా జీవింపగోరమో, తే ధార్తరాష్ట్రాః - ఆ ధృతరాష్ట్ర పుత్రులే, ప్రముఖే అవస్థితాః - ఎదుట నిలబడియున్నారు.

వీరిని చంపి తాను జయము పొందుటయు శ్రేయస్కరము కాదని యర్జునుని తాత్పర్యము.

తా : ఇంతేకాక కృష్ణ ! మన యిరుపక్షము లందును నేపక్షము గొప్పదో మనకు దెలియదు. మనలను వారే జయింతురో మనము వారినే జయింతుమో కూడ తెలియదు. ఒకవేళ మనమే వారిని జయింతుమని యెంచినను ఎవరిని జంపి జీవింప నిచ్ఛగింపమో యా ధృతరాష్ట్రపుత్రులు దుర్యోధనాదులే మనయెదుట నిలబడియున్నారు. వారి నెట్లు చంపుదును?

కార్పణ్య దోషోపహత స్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసంమూఢచేతాః
యచ్ఛ్రేయః స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్. 54

కార్పణ్యదోషోపహత స్వభావః - దయ యనెడి దోషముచే నణచి వేయబడిన క్షాత్రస్వభావముగలవాడను, ధర్మసంమూఢ చేతాః - కర్తవ్యాకర్తవ్యములను తెలియని చిత్తముగలవాడనునై, త్వాం పృచ్ఛామి - నిన్నడుగుచున్నాను. యత్ శ్రేయః స్యాత్ - ఏది మంచిదో, తత్ మే నిశ్చితం బ్రూహి - అది నిశ్చయముగ జెప్పుము, అహం తే శిష్యః - నేను నీకు శిష్యుడను, త్వాం ప్రపన్నం మాం - నీ శరణుజొచ్చిన నన్ను, శాధి - ఆదేశింపుము.

తా : కార్పణ్యాదోషముచే నా స్వభావము అణచివేయ బడినది. క్షాత్ర స్వభావము నశించినది. కావున యుద్ధమొనర్చి బంధుబాంధవులను జంపుట ధర్మమో లేక యస్త్ర శస్త్రము లను వదలి, భిక్షాటనముచేసి జీవితము గడపుట ధర్మమో తెలియకున్నది. ఇందేది శ్రేయస్కరమో నీవే నిశ్చయించి చెప్పుము. కృష్ణ ! శిష్యభావముతో నిన్నర్థించుచున్నాను. నన్ను శాసింతువుగాక ! నేను నీశరణు జొచ్చుచున్నాను.

న హి ప్రపశ్యామి మమాపనుద్యాత్
యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణాం
అవాప్య భూమా వసపత్న మృద్ధం
రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్. ౫౫

భూమౌ - పృథివిపై, అసపత్నం ఋద్ధం రాజ్యం - శత్రు రహితము సమృద్ధమునగు రాజ్యమును, సురాణాం చ ఆధిపత్యం అపి-దేవతల యాధిపత్యమును కూడ, అవాప్య - పొందియు, యత్-ఏది, ఇంద్రియాణాం ఉత్శోషణం - ఇంద్రియములను శోషింపజేయు, మమ శోకం - నా దుఃఖమును, అపనుద్యాత్ - దూరమొనర్చునో, అట్టిదానిని, న హి ప్రపశ్యామి - చూడలేకున్నాను.

తా : నాకీ భూమిపై సంపదలతో గూడి శత్రురహితమైన రాజ్యము లభించినను, దేవతలపై ఆధిపత్యము లభించినను, ఇప్పుడు నా యంగము లందు గలుగు శోషణ - పీడ - తొలగు నని యూహింప జాలకున్నాను.

ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః
న యోత్స్య ఇతి గోవిందమ్ ఉక్త్వా తూష్ణీం బభూవ హ. 56

పరంతపః గుడాకేశః - శత్రుతాపకుడు, నిద్రను జయించినవాడు నగు అర్జునుడు, హృషీక ఈశం, గోవిందం - జితేంద్రియుడగు కృష్ణుని(తో), న యోత్స్యే - యుద్ధముచేయను, ఇతి ఉక్త్వా - అని చెప్పి, తూష్ణీం బభూవ హ - మౌనముగా నుండెను.

తా : అని యిట్లు పలువిధముల నర్జునుడు తనకు గలుగుచున్న దుఃఖమునుగూర్చి కృష్ణునకు వెల్లడించి 'నేను యుద్ధము చేయను' అని మౌనము వహించెను.

ప్రథమాధ్యాయము సమాప్తము



# శ్రీమద్భగవద్గీత

## ద్వితీయాధ్యాయము

## సాంఖ్యయోగము

సారము - సంగతి :

అర్జును డిట్లు యుద్ధముచేయనని నుడివి దీనుడై ప్రార్థించుటనువిని, యతడు ధర్మసంకటములో బడియున్నట్లు తెలిసికొని కృష్ణు డతనికి ధర్మ తత్త్వమును దెలుప నారంభించెను.

అర్జునుడు చెప్పిన వాక్యములసారము మూడు సమస్యలుగా నిర్ణయింపనగును.

(1) అనతికాలములో తన వంశీయు లందఱు చనిపోవుదురను శోకము అర్జునునకు కష్టము కలిగించుచున్నది.

(2) తన గురువులను, బంధువులను చంపుట కత డసమర్థుడనని యెంచెను.

(3) క్షాత్రధర్మము ననుసరించి చేయదగు నియతకర్మమైన సంగ్రామమును విడిచి యతని స్వభావము సన్న్యాసమువంకకు మరలెను.

అర్జునునకు గలిగిన సమస్యలు ఈ మూడుమాత్రమే. ఈగీతయందీ మూడు సమస్యలే పరిష్కరింపబడెను. ఈ రెండవ యధ్యాయమునందు సాంఖ్యయోగము - జడచేతన వివేకము - మూలమున అర్జునుని దుఃఖమును దొలగింప యత్నింపబడెను.

జన్మము, మృత్యువు రెండును శరీరధర్మములు, ప్రపంచమునందు లేనివస్తువునకు పుట్టుక కాని ఉనికిగల వస్తువునకు అభావము కాని యెన్నడు నేర్పడదు. కాని, ప్రకృతికి సంబంధించిన వస్తువులు పగటివేషగానివలె ననేక రూపులొందుచుండును. ఈ పరివర్తనలు నీవు శత్రు

ధారివైనను, కాకున్నను జరుగుచునే యుండును. ఇయ్యది శరీరస్థితి. ఇక నీ శరీరమును ధరించు జీవుడు - ఆత్మ అమరుడు. ప్రాతవస్త్రమును విడిచి క్రొత్తవస్త్రము ధరించునట్లా జీవుడొక శరీరమును విడిచి మఱియొక శరీరమును బొందును.

ఆత్మ యుత్పన్నమై నష్టమగునదిగా నెంచెదవేని ఉత్పన్నమగునది యవశ్యము నశించును. కావున ఆత్మయు నశింపక తప్పదు. ఈ దృశ్య ప్రపంచమంతయు మృత్యుబారి నుండి యెన్నడును తప్పించుకొననిదైనపుడు, నీ వెవరికొఱకు శోకించుచున్నావు ?

ఇక నర్జునుని రెండవ సమస్యను 'ఈ సంగ్రామము ధర్మయుక్తము-ధర్మానుకూలము' అని యొక్క మాటతోనే తీర్చివేసెను. అర్జునుడుకూడ యోగిరాజగు కృష్ణుని సంక్షిప్త సమాధానముతోనే తన వాదమెంత దుర్బలమైనదో వెంటనే తెలిసికొనెను. అందువలననే యతడు మరల నీ విషయమును ప్రస్తావింపడయ్యె. వాస్తవమున అర్జునునకు దోడుగానున్న వారి మూలమున సాగింపబడిన ఈ సంగ్రామము ధర్మానుకూలమే యై యుండెను. కౌరవులు పాండవుల కొనర్చిన యన్యాయము, అత్యాచారమే యిందులకు కారణము. వారు మర్యాదనెన్నడో విడిచియుండిరి. కపట ద్యూతమును కల్పించిరి. సతియు, సాధ్వియునగు ద్రౌపదిని నిండు సభలో నవమానించిరి. పాండవు లరణ్యమున కేగునపుడు ఘృణితములు, నవమాన జనకములు నగు మాటలతో వారిని నిందించిరి. లక్క యింటిలో నుంచి వారిని దహింపజేయబూనిరి. వనవాసమొనర్చి వచ్చిన వారికి వారి భాగము నీయక భుజబలముతో హరింపనెంచిరి. ప్రార్థించిన మీదట గూడ సూదిమొన మోపదగినంత స్థలము కూడ యుద్ధమొనర్పక యీయమనిరి. ఇట్టి యన్యాయములను, అత్యాచారములను సహించి పాండవులు అపరాధులను దండింపక విడుతురేని క్షాత్ర ధర్మమునకు తిలాంజలి యిచ్చినట్లే యగును. ఇంతేకాక రానున్న తమ సంతానమునకు తమ యీ యాచరణము మూల

మున 'క్షత్రియుడు తన గ్రాసము నన్యు లపహరించు చుండగా నవమాన మును సహించుచు జీవింపగల, డను నీతిని నేర్పిన వా రగుదురు.

ఈ యాదర్శ మెంతయు మంచిదే కాని, గురుజనులను బంధువులను జంపుటయు పాపమే కదా ? యనవచ్చును. అది ఎన్నటికిని కాదు. రాజ ధర్మము మిక్కిలి కఠోరము. అత్యాచారియగు పుత్రునికాని, తండ్రినికాని మృత్యుదండనకు గురిచేయని క్షత్రియుడు ఘోరపాపమునకు గురియగును. ఈ నగ్న సత్యమును యోగిరాజగు కృష్ణుని యెదుట భీష్మ పితామహుడు స్వయముగ నంగీకరించి యున్నాడు.

సమయత్యాగినో లుబ్ధాన్ గురూ నపి చ కేశవ
నిహన్తి సమరే పాపాన్ క్షత్రియః సహధర్మవిత్.

(మ. భా, శాం. ప. 55-16)

'ఓ కృష్ణ ! లోభులు, నియమభంగము నొనర్చువారు నైన గురువు లను కూడ సంగ్రామమున జంపువాడే ధర్మవిదుడగు క్షత్రియుడు' అని భీష్ముడు కృష్ణునకు చెప్పియుండెను.

ఇట్లే యుధిష్ఠిరునకు గూడ చెప్పెను.

మాతా పితా చ భ్రాతా చ భార్యా చైవ పురోహితః
నా దండ్యో విద్యతే రాజ్ఞో యః స్వధర్మే న తిష్ఠతి.

(మ. భా. శాం. ప. 121-60)

'స్వధర్మమున నుండని మాతకాని, తండ్రికాని, సోదరుడుకాని, పత్నికాని, ఆచార్యుడుకాని, యెవరైనను రాజునకు అదండ్యుడు కాడు.'

'అర్థస్య పురుషో దాసః' 'పురుషుడు ధనమునకు దాసుడు' అను మాటను జెప్పి తాము లోభము కారణముగ సంగ్రామమున జేరినట్లు భీష్ముడు, ద్రోణుడు నిరువురు నంగీకరించిరి. ధనముకొఱకు అన్యాయ

పక్షము నవలంబించుట ధర్మోల్లంఘనమే యగును. కావున కృష్ణుడు యుద్ధమును ధర్మానుకూల మనుటయు నుచితమే. యుద్ధము ధర్మానుకూలమని చెప్పుటవలననే యర్జునుని రెండవ సమస్య పరిష్కరింపబడినది. అతని మూడవసమస్యా పరిష్కారము మూడవ యధ్యాయమున నారంభింపబడును.

తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత
సేనయో రుభయోర్ మధ్యే విషీదంత మిదం వచః. 1

సంజయ వచనము :

భారత ! - భరతపుత్ర ! ధృతరాష్ట్ర ! హృషీకేశః - కృష్ణుడు, ప్రహసన్నివ - నవ్వుచు, ఉభయోః సేనయోః మధ్యే విషీదంతం - రెండు సేనలమధ్య దుఃఖించుచున్న, తం - అర్జునుని (తో), ఉవాచ - పలికెను.

తా : సంజయుడు ధృతరాష్ట్రునితో నిట్లు చెప్పుచున్నాడు. ఓ భారత ! ధృతరాష్ట్ర ! యుద్ధరంగమున నుభయసేనలమధ్య దుఃఖించుచున్న అర్జునుని జూచి కృష్ణుడు నవ్వుచు నిట్లనెను.

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాం శ్చ భాషసే
గతాసూ నగతాసూం శ్చ నానుశోచంతి పండితాః. 2

కృష్ణుని వచనము :

త్వం అశోచ్యాన్ అను అశోచః - నీవు శోకింపదగని వారినిగూర్చి శోకించుచున్నావు, ప్రజ్ఞావాదాన్ చ భాషసే - పండిత వచనములను పలుకుచున్నావు, పండితాః - విద్వాంసులు, ఆత్మజ్ఞులు, గతాసూన్ - అసువులు విడిచినవారిని గూర్చి కాని, అగతాసూన్ చ - ప్రాణములు విడువనివారిని గూర్చి కాని, న అనుశోచంతి - శోకింపరు.

తా : ఓయీ! అర్జున! శోకింప దగని భీష్మద్రోణాదులను గూర్చి నీవు శోకించుచున్నావు. కాని; ప్రాజ్ఞులు -

పండితులు - చెప్పు మాటలను జెప్పుచున్నావు. వాస్తవమున పండితులు - ఆత్మజ్ఞానులు ప్రాణములు పోయినవారిని గూర్చి కాని, ప్రాణములు పోక బ్రతికి యున్నవారిని గూర్చి కాని యెన్నడును దుఃఖింపరు.

(అర్జున ! భీష్మాదులు నీకంటె నన్ని విధముల బెద్దవారు. వారు నిన్ను యుద్ధమున జంపి దుర్యోధనునకు విజయము చేకూర్ప నరువెంచి యున్నారు. పిల్లలను గని, పెంచి పెద్దవారింజేసి, విద్యాబుద్ధుల నేర్పిన పెద్దలే వారిని యుద్ధమున జంప సమకట్టి, శస్త్రాస్త్రములతో సన్నద్ధులయి యుండ వారినిగూర్చి పిన్నలు 'అయ్యో ! ఈ పెద్దలతో మే మెట్లు ప్రతియుద్ధ మొనర్చి యెదుర్కొందుము' అని ఆలోచించుట యుచితమా ? అర్జున ! ఆత్మజ్ఞునివలె మాటలాడుచున్నావే. ఆత్మజ్ఞాని యైన వాడు శరీరములు నశించుననియు, ఆత్మలు నశింపవనియు నెఱుగును. శరీరమున నాత్మ యున్నంతవఱకే సంబంధబుద్ధి (ఇతడు తండ్రి - ఇతడు గురువు అను బుద్ధి) యుండును. కాని, ఆత్మ శరీరమును వదలి వెళ్ళిన తదుపరి యా శరీరమునందు బంధుబుద్ధి కలిగి శోకించుట యజ్ఞతకాదా ? కావున గతించిన వారిని గూర్చి కాని, గతింపనున్న వారింగూర్చి కాని శోకించుట ప్రాజ్ఞుల పనికాదు. బుద్ధిమంతులు 'తమ కర్తవ్యమేమి ?' అని మాత్రము ఆలోచింతురని భావము.)

న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః
న చైవ న భవిష్యామః సర్వే వయ మతః పరమ్. 3

అహం - నేను, జాతు న ఆసం (ఇతి) న తు ఏవ - ఒకప్పుడు లేను అనునది లేదు. న త్వం న ఇమే జనాధిపాః - నీవు కాని, ఈ రాజులు కాని లేరనుట సరికాదు, ఎల్లరు పూర్వముండిరని భావము. వయం సర్వే - మనమందఱము, అతః పరం - దీనికి తదుపరి, న భవిష్యామః ఇతి న ఏవ - ఉండము అనునదియుకాదు. ఈ శరీరములకు

పూర్వమునందును, పరమునందును, వర్తమానమునందును ఎల్లప్పుడు నుందుమని భావము.

(అర్జునునకు గలిగిన వ్యామోహమును - భ్రాంతిని బోనాడ నెంచి కృష్ణుడు 'ఆత్మ శరీరము కంటె భిన్నమనియు, నిత్యమనియు, దెలుప దలచి యిట్లనుచున్నాడు.)

తా : అర్జున ! నేను ఈ శరీర మేర్పడుటకు బూర్వము లేనని యెంచకు. అట్లే నీవును నీ యీ శరీరము లేనపుడు లేవని తలంచకు. మఱియు నీ రాజులుకూడ వారి యీ దేహము లేర్పడుటకు ముందు లేరని తలంచకు. ఇంతేకాక యీ దేహము లున్నంత వఱకే మన మెల్లరము నుందుమనియు, నీ దేహములు నశించిన మఱుక్షణమున నుండము అనియు నెంచ వలదు. మన మెల్లరము భవిష్యత్తునందు - శరీరములు నశించిన తదుపరి కూడ నుందుము.

(యుద్ధ మొనర్చిన నందు శరీరములు నశించు ననుట ఎల్లరెఱిగిన విషయమే. అర్జునునకు 'ఈశరీరమే ఆత్మ, అంతకు మించి - శరీరము కంటె భిన్నమగు నాత్మయను వస్తు వొండులేదు, అను భ్రమకలిగినది.

పృథివ్యాది పంచభూతముల కలయిక వలన నీ శరీర మేర్పడు ననియు, నయ్యది కొంత కాలము లోకమున బనిచేసి, యనంతర మెప్పుడో నశించుననియు, అంతకు మించి యీ శరీరమున పంచభూతాత్మకముకాని ఆత్మయను వస్తువు - ద్రవ్యము - తత్త్వము ఒకటి వేఱుగ నుండుననుట తథ్యము కాదనియు నెంచువారు భారతమున లోకాయతులు, చార్వాకులు, శరీరాత్మవాదులు ననబడుదురు. ఇట్టి వారిని నేటి విద్యావంతులు భౌతిక వాదులనియు నందురు. ఆంగ్లమున వీరినే 'మెటీరియలిస్టు' లందురు వీకి జీవితమునకు లక్ష్యము శారీరిక సుఖమే.

కావుననే 'యావజ్జీవేత్ సుఖం జీవేత్' జీవించినంతకాలము సుఖముగ జీవింపవలయు నందురు. జీవితములో సాధింపవగిన పురుషార్థము కూడ ఐంద్రియిక సౌఖ్యము తక్క మఱియొండు అంగీకరింపరు. అందు వలననే 'అంగనా లింగనా జన్య సుఖమేవ పుమర్థతా' స్త్రీల కౌగిలింతవలన గలుగు సుఖమే పురుషార్థ' మందురు.

ఇక ఆత్మవాదు లట్లుకాక దేహమునందు దానికంటె భిన్నమగు వస్తు వొకటి వేఱుగ నుండుననియు, నయ్యది పృథివ్యాది పంచభూతముల రాసాయనిక సమ్మేళనమువలన నేర్పడునది కాదనియు నందురు. ఆ వస్తువును ఆత్మ, జీవాత్మ, జీవుడు అను నామములతో వ్యవహరింతురు. ఆ వస్తువు పంచభూతముల కంటె విలక్షణమైనది. కాని, పంచభూతముల వలెనే యదియు నొకద్రవ్యమే. దానియందును భూతములందువలె గుణము లుండును. ఆ గుణములు గంధరసాదులవంటివి కావు. విలక్షణములు. వానిని తత్త్వశాస్త్రకారులు గౌతమ కణాదాదులు 'ఇచ్ఛా ద్వేష ప్రయత్న సుఖదుఃఖజ్ఞానములు' అని నుడువుదురు. ముఖ్యముగా జ్ఞానము, కోరిక, ప్రయత్నము ననునీ గుణములు ఆత్మలింగములు. ఆత్మయనున దొక వస్తువనియు నయ్యది భూమ్యాది పదార్థ సమ్మేళనమువలన నేర్పడునది కాదనియు తెలుపుట కివి యాధారములు. మఱియు రాసాయనిక ప్రయోగముల మూలముననే వైజ్ఞానికుడు నేటివఱకును జ్ఞానాది గుణములను నుద్భవింపజేయలేదని యెంచెద. కాగా జ్ఞానాది గుణముల కాశ్రయమై, స్వతఃసిద్ధమై, కారణ ద్రవ్యములచే నేర్పడనందున నాశనములేనిదై నిత్యముగా నుండు నొక వస్తువు ఆత్మ యనబడును. అది శరీరముకాదు. శరీరము కారణ ద్రవ్యములయిన భూమ్యాదులచే నేర్పడును; వృద్ధిక్షయాది వికారములకు లోనగును; నశించును. అట్టి శరీరముకంటె ఆత్మ భిన్నము. ఆ యాత్మయే తెలుగున 'నేను' ఆంగ్లమున 'ఐ' హిందీలో 'మై' సంస్కృతమున 'అహమ్' అను పదములతో వ్యవహరింపబడుచున్నది. కొందఱు

పాశ్చాత్య తత్త్వవేత్తలు నుడువునట్లు అయ్యది కాల్పనికము కాదు. అది ఉనికి (సత్తా) కలిగినది. క్రైస్తవులు, మహమ్మదీయులు చెప్పునట్లు దేవునిచే మట్టిబొమ్మ ముక్కుపుటములలో ఊదబడిన ఊపిరికాదు. ఆత్మ జన్మ మరణములు లేని నిత్యవస్తువు. మిక్కిలి సూక్ష్మము. ఇంద్రియము లకుగాని యంత్రములకుగాని పట్టుపడునదికాదు. ఇట్టి యాత్మలు శరీరమున కొక్కటి వంతున బ్రహ్మాండమున నెన్నియున్నవో తెలియదు. మానవ గణితమున కందవు.

ప్రత్యక్షముగా జూడనగు నీ శరీరమునందు దీనికి భిన్నమైన ఆత్మ వస్తువొంటు కలదనుటకు 'నాశరీరము, నాశిరస్సు, నాబుద్ధి; నేను దేహము కాను; నేను శిరఃపాణ్యాదులుకాను' అను నిట్టి వ్యవహార మొక ప్రమాణము. నాయిల్లు, నాభార్య, నాబిడ్డలు మున్నగు వ్యవహారములందు ఇల్లు, ఆలు, బిడ్డలు తనకంటె వేఱుగా నెట్లు తెలియబడుచున్నవో అట్లే నాదేహాది ప్రయోగములందును 'నేను' దేహముకంటె భిన్నమని తెలియబడుట సుకరమే కదా? కావున దేహాదులు తనకు సంబంధించినవియే. దేహాదులు నశించిన తాను నశింపడు అను విషయము వివేకులకు సులభగ్రాహ్య మగును.)

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా
తథా దేహాంతర ప్రాప్తిర్ ధీర స్తత్ర న ముహ్యతి. 4

దేహినః - శరీరధారియైన జీవికి, అస్మిన్ దేహే - ఈ దేహమున. యథా కౌమారం, యౌవనం, జరా - ఎట్లు బాల్యము, యౌవనము, వృద్ధాప్యము కలుగునో, తథా దేహాంతరప్రాప్తిః - అట్లే మఱియొక దేహము లభించును, తత్ర - ఈ విషయమున, ధీరః - బుద్ధిమంతుడు, న ముహ్యతి- మోహము చెందడు.

తా : ఈ దేహమునందు కౌమార, యౌవన, జరాద్యవస్థలు కలుగుచుండుట లోకవిదితము. జీవు డీ శరీరమునం

దుండగానే దేహమునకే యవస్థలు కలుగుచున్నవి. ఈ యవస్థలను మనము కుమార శరీరము, యువశరీరము, వృద్ధశరీరము నని వ్యవహరింపవచ్చును. అప్పుడు దేహమునందుండు జీవికి యొక జీవితముననే అనేక దేహములు ఒకదాని తరువాత మఱియొకటి కలుగుచున్నవనుట యసత్యముకాదు. దీనిని బట్టి యీ శరీరము నశించిన తదుపరి జీవికి మఱియొక శరీరము లభించునని తెలియుచున్నది. అందువలన జ్ఞానియైనవాడు శరీరనాశమునకు చింతింపడు. తాను నశించినట్లు భ్రాంతిపడడు.

బాల్య, యౌవనాది శరీరములు మాఱినను, ఆ దేహములతో వ్యవహరించు జీవుడు మాత్రము మాఱడు. బాల్యదేహముతో నొకప్పుడు క్రీడలను సలిపిన జీవుడే వృద్ధదేహముతో వ్యవహరించునపుడు 'నేను చిన్ననాడు ఇట స్నేహితులతో నాడితిని' అని స్మరించును. శరీరములతో బాటు జీవుడుకూడా మాఱియుండు పక్షమున నిట్టి స్మరణకు అవకాశ ముండదు. కావున జీవితకాలమున శరీరమునందు వికారములు గలిగి యెప్పటి కప్పుడు దేహము మాఱినను జీవుడు మాత్రము మాఱడని స్పష్టమగుచున్నది. ఒకే ఆత్మ పలుశరీరములతో వ్యవహరించు ననుట సిద్ధమగుచున్నది. ఆత్మలో మార్పు లుండవనియు బోధపడుచున్నది. మార్పులు, వికారములు లేని వస్తువు నిత్య మనబడును. నిత్యమైన జీవునకు పలుదేహములు లభించును. కావున జ్ఞానియైనవాడు దేహనాశమునకు జింతింపక కర్తవ్యము నాచరింప బూనును.)

మాత్రా స్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణ సుఖదుఃఖదాః
ఆగమాపాయినోఽనిత్యాః తాం స్తితిక్షస్వ భారత. 14

కౌంతేయ ! - అర్జున ! - శీతఉష్ణ సుఖదుఃఖదాః - శీతోష్ణములను సుఖదుఃఖములను నిచ్చు, మాత్రాస్పర్శాః తు - తత్త్వసంబంధములు

మాత్రము, ఆగమ అపాయినః - వచ్చిపోవునవి, అనిత్యాః - అందువలన నిత్యములుకావు, భారత ! తాన్ - వానిని, తితిక్షస్వ - ఓర్చుకొనుము.

తా : 'ఆత్మలు నిత్యములై దేహములకంటె భిన్నము లైనను దేహములు నశించుటవలన వానితో నాత్మలకు గల సంబంధము విడిపోవును. దేహసంబంధము కారణముగా బంధుబుద్ధితో వ్యవహరింపబడు భీష్మాదులు నాకు దూరులగు దురు. అందువలన దుఃఖము కలుగును కదా !' అని తలతువేని అర్జున! అట్టి దుఃఖము సహింపక తప్పదు. లోకమున నెల్లపుడు ప్రాణులకు నానావిధ పదార్థములతో సంయోగ వియోగ ములు కలుగుచునే యుండును. వానివలన సుఖదుఃఖములును గలుగును. అయ్యవి నిత్యములుకావు. వచ్చుచు పోవుచు నుండును. వానిని సహింపుము.

యం హి న వ్యథయ న్త్యేతే పురుషం పురుషర్షభ
సమ దుఃఖ సుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే. 6

పురుషఋషభ : - నరపుంగవ, ఏతే - ఈద్వంద్వములు, సమ దుఃఖ సుఖం - సుఖదుఃఖములు సమానముగ నెంచు, యం ధీరం పురుషం- ఏ ధీర పురుషుని, న వ్యథయంతి - కష్టపెట్టవో, సః హి - ఆ ధీరుడే. అమృతత్వాయ కల్పతే - మోక్షమున కర్హుడగును.

తా : మఱియు నీ సుఖదుఃఖములను బొంది వ్యధజెందని వారు, వికారములకు లోనుగానివారు, వానిని సమానముగ ననుభవించువారు జ్ఞానులగుదురు. వారే మోక్షమున కర్హు లగుదురు. నిత్య సుఖశాంతులను బొందుదురు.

నాసతో విద్యతే భావః నాభావో విద్యతే సతః
ఉభయో రపి దృష్టోంతస్ త్వనయో స్తత్వదర్శిభిః. 7

అసతః - లేనిదానికి, భావః - పుట్టుక, న విద్యతే - ఉండదు, సతః - ఉనికిగలదానికి, అభావః - అభావము - లేకునికి, న - కలుగదు, అనయోః ఉభయోః అపి - ఈరెంటి యొక్కయు, అంతః - సిద్ధాంతము, తత్త్వ దర్శిభిః - తత్త్వజ్ఞానులచే, దృష్టః - చూడబడినది.

లోకమున జూడబడు వస్తువులన్నియు నేదోయొక రూపమున నుండునే కాని యపి యెన్నడును నునికిలేనివి కానేరవని తాత్పర్యము.

తా : అర్జున! అసత్తునకు భావముకాని, సత్తునకభావము కాని యుండదు. ఇది తత్త్వజ్ఞులు తెలిపిన నిశ్చిత సిద్ధాంతము.

(ఉనికి (సత్తా) లేని పదార్థము లోకమున నెన్నడు పుట్టదు; వర్ధిల్లదు; వృద్ధిక్షయములను బొందదు;నశింపదు; ఉనికిని బోగొట్టుకొనదు. నశించియు నేదోయొక రూపమున నుండును. కావున ప్రాకృతిక పదార్థములు పుట్టి నశించినంత మాత్రమున నవి యునికి లేనివని యెంచజనదు. నాశమనగా అభావముకాదు. రూపపరివర్తన మని భావము. నశించు వస్తువు తన కారణరూపమును బొందియుండును. వస్త్రములు నశించి తంతురూపము నను, ఘటాదులు నశించి మృత్తికా రూపమునను, కుండలాదులు నశించి బంగారు రూపమునను ఉండును. ప్రస్తుతము స్థూలరూపమున గనబడు పదార్థము లన్నియు ప్రళయకాలమున సూక్ష్మరూపమున నుండును. ఈ సూక్ష్మరూపమునే ప్రకృతి, అవ్యక్తము, మాయ యని యందురు. కాబట్టి ప్రపంచము సత్తారహితము - ఉనికి లేనిది కాదు. జీవులు నిత్యులైనట్లు ప్రకృతియు నిత్యమే. స్థూలములై యింద్రియములకు తెలియనగు రూపములే యనిత్యములు.)

(ఇట్లు ఆత్మ-అనాత్మ (శరీరము) లను గూర్చి వివరించి కృష్ణుడర్జును నకు మఱియొక నిత్యపదార్థమును తెలుపనెంచి యిట్లనుచున్నాడు )

అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి. 8

యేన - ఎవని మూలమున, ఇదం సర్వం - ఈ సర్వ ప్రపంచమును, తతం - విస్తరింప జేయబడినదో, తత్ - ఆ పరమేశ్వర తత్త్వమును, అవినాశి - నశింపని దానినిగా, విద్ధి - తెలిసికొనుము, అస్య అవ్యయస్య వినాశమ్ - ఈ యవినాశి వినాశమును, కశ్చిత్ - ఎవడును, కర్తుం - చేయుటకు, న అర్హతి - శక్తుడు కాడు.

తా : ఈ కనబడుచున్న ప్రపంచము నంతటిని విస్తరింప జేసి యం దేపదార్థము వ్యాపకమై యున్నదో యది యొక నిత్యపదార్థము. అది యెన్నడు నశింపదు.

మన యింద్రియములచే దెలియబడు నీ జడ ప్రపంచ మంతయు నాశనమగునదై యున్నది. ఇందలి పదార్థము లన్నియు నిరంతరము మార్పులు చెందుచుండుట చూచుచున్నాము. మార్పులు చెందు వస్తువు నిత్యము కాదు. అది యనిత్యము; పుట్టి చచ్చునది. పుట్టి చచ్చు వస్తువులు దార్శనిక భాషలో కార్యము లనబడును. కార్యము కారణముల వలన నేర్పడును. ఒక కార్యమేర్పడుటకు అనేక కారణములుండును. అందు ఉపాదాన నిమిత్తకారణములు ముఖ్యములు ఏ కారణ పదార్థము కార్యరూపమున నూఱునో యా కారణము ఉపాదాన మనబడును. ఉపాదాన కారణమును కార్యరూపమున మార్చునది నిమిత్తకారణము. నిమిత్త కారణములలో జ్ఞానవంతమగు చేతనము కర్త యనబడును. అయ్యది చేతన నిమిత్తకారణ మనియు జెప్పబడును.

మట్టి కుండ యగును. కుండ కార్యము. మట్టి ఉపాదానము. మట్టి స్వయముగా కుండ కానేరదు. మట్టిని కుండగా మార్చు చేతన నిమిత్తకారణము (కుమ్మరి) కర్త యగును. అట్లే యీ ప్రపంచము ఒక

కార్యమనుకొనిన దానికి ఉపాదాన కారణము ప్రకృతి. ఆ ప్రకృతిని ప్రపంచముగా స్థూలరూపమున మార్చు చేతన నిమిత్త కారణము సృష్టి కర్త, పరమేశ్వరుడు - దేవుడు - భగవంతుడు నని నానావిధములయిన నామములతో జెప్పబడును.

కార్యము పరిమితమై యుండును. దేశకాలములు దాని కవధులుగా నుండును. కావున నీ ప్రపంచ మనెడి కార్యము కూడ పరిమితమే. మానవ దృష్టికి బ్రహ్మాండ మెంత పెద్దదిగా దోచినను విజ్ఞులదృష్టిలో నియ్యది పరిమితము; వ్యాప్యము. ఇట్టి ప్రపంచమునకు కర్తయగు చేతన నిమిత్త కారణము - పరమేశ్వర తత్త్వము వ్యాపకమై ప్రపంచమునం దంతట నుండుటయే కాక దానిని మించియుండి దానిని సృజించుచుండును. వ్యాపకమై యంతటనుండు నీ పరమతత్త్వము నశింపదు. పరిమితవస్తువే నశించును. అపరిమితము నశింపదు; వికారములకు లోనుకాదు..

ఇంతవఱకు కృష్ణుడు అర్జునునకు ప్రకృతి, జీవులు, పరమేశ్వరుడు నను మూడు స్వయం సత్తాకములై నిత్య సత్యములయిన పదార్థము లున్నట్లు వివరించి యున్నాడు. ఇందు ప్రకృతి మార్పులు చెందు స్వభావ యోగ్యతలుకలది; జడము; క్రియారహితము. పరిణామము నొందుటకు దగిన యోగ్యత దానియందున్నది. కాని స్వయముగా మాఱదు. దానిని మార్చు చేతన వ్యాపక తత్త్వము పరమేశ్వర తత్త్వము. ఇక జీవులు జ్ఞానేచ్ఛాది గుణములుగలిగి, సూక్ష్మములై, నాశనము లేని నిత్యచేతనములు.

(ఇట్లు అర్జునునకు తత్త్వజ్ఞానము గలిగిన కృష్ణుడు కర్తవ్యమును బోధించు చున్నాడు.)

అంతవంత ఇమే దేహా నిత్య స్యోక్తా శ్శరీరిణః
అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత. 9

అనాశినః - నాశముకాని, అప్రమేయస్య - ఇంద్రియ గమ్యము కాని, నిత్యస్య - నిత్యమైన, శరీరిణః - దేహధారికి - జీవునకు, ఇమే

దేహాః - ఈ దేహములు, అంతవంతః - నాశనము గలవిగా, ఉక్తాః - చెప్పబడినవి, తస్మాద్ యుధ్యస్వ - కావున యుద్ధమొనర్పుము. (దేహములు తప్పక నశించును కావున కర్తవ్యము విడువకుము.)

తా : భరత వంశోద్భవ ! అర్జున ! ఇంద్రియములకు గోచరము కాక నిత్యమైయుండు జీవునకు అనిత్యములయిన దేహము లనేకములు లభించుచుండును. కావున దేహనాశనమునకై చింతించి ధర్మస్థాపనార్థము ప్రారంభించిన యుద్ధరూప కార్యమును విడువకుము.

య ఏనం వేత్తి హంతారం, యశ్చైనం మన్యతే హతం
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే, 10

యః ఏనం హంతారం వేత్తి - ఎవడు ఇతనిని చంపువానినిగా నెఱుగునో, యః చ ఏనం హతం మన్యతే-మఱియొక దెవడు ఇతనిని చంపబడిన వానినిగా నెంచునో, తౌ ఉభౌ న విజానీతః - ఆ యిరువురు తెలియని వారు, అయం న హంతి; న హన్యతే - ఈ జీవుడు చంపడు, చంపబడడు.

తా : ఒక జీవు డింకొక జీవుని జంపుననియు, ఒకడు మఱియొకనిచే జంపబడుననియు నెంచు వారిరువురు జ్ఞానులు కారు. జీవుడు చంపబడడు. దేహము నశించును.

న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. 11

* కామక్రోధ వియుక్తానాం యతీనాం యతచేతసామ్,
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్. 26

* స్పర్శా న్కృత్వా బహి ర్బాహ్యాం శ్చక్షు శ్చైవా న్తరే భ్రువోః,
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్య న్తరచారిణౌ. 27

* యతేన్ద్రియమనో బుద్ధి ర్ముని ర్మోక్షపరాయణః,
విగతేచ్ఛాభయ క్రోధో య స్సదా ముక్త ఏవ సః. 28

* భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరమ్,
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తి మృచ్ఛతి. 29

## షష్ఠోఽధ్యాయః

### ఆత్మసంయమయోగః

శ్రీ భగవానువాచ :

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః,
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్ని ర్న చాక్రియః. 1

యం సన్న్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాణ్డవ ।
న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన. 2

ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే,
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే. 3

యదా హి నేన్ద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే,
సర్వసంకల్ప సన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే. 4

ఉద్ధరే దాత్మనాఽఽత్మానం నాత్మాన మవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బన్ధు రాత్మైవ రిపు రాత్మనః. 5

బన్ధురాత్మాఽఽత్మన స్తస్య యేనాత్మై వాత్మనా జితః,
అనాత్మన స్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్. 6

జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః,
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః. 7

జ్ఞానవిజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః,
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః. 8

సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థద్వేష్య బన్ధుషు
సాధు ష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే. 9

యోగీ యుఞ్జీత సతత మాత్మానం రహసి స్థితః,
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః. 10

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః,
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్. 11

తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియ క్రియః,
ఉపవి శ్యాసనే యుఞ్జ్యా ద్యోగ మాత్మ విశుద్ధయే. 12

సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః,
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశ శ్చానవలోకయన్. 13

* ప్రశాన్తాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః,
మన స్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః. 14

* యుఞ్జ న్నేవం సదాఽఽత్మానం యోగీ నియత మానసః,
శాన్తిం నిర్వాణ పరమాం మత్సంస్థా మధిగచ్ఛతి. 15

* నాత్యశ్నత స్తు యోగోఽ స్తి న చైకా న్త మనశ్నతః,
న చాతిస్వప్న శీలస్య జాగ్రతో నైవ చార్జున ! 16

* యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు,
యుక్త స్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా. 17

* యదా వినియతం చిత్త మాత్మన్యే వావతిష్ఠతే,
నిస్స్పృహ స్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా. 18

* యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా,
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః. 19

* యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
యత్ర చైవాత్మనా౽౽త్మానం పశ్య న్నాత్మని తుష్యతి. 20

* సుఖ మాత్యన్తికం యత్త ద్బుద్ధిగ్రాహ్య మతీన్ద్రియమ్,
వేత్తి యత్ర న చైవాయం స్థిత శ్చలతి తత్త్వతః. 21

* యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః,
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణా౽పి విచాల్యతే. 22

* తం విద్యా ద్దుఃఖ సంయోగ వియోగం యోగసంజ్ఞితమ్,
స నిశ్చయేన యోక్తవ్యో యోగో౽నిర్విణ్ణచేతసా. 23

సంకల్ప ప్రభవా న్కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః.
మనసై వేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః. 24

శనై శ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కించి దపి చిన్తయేత్. 25

యతో యతో నిశ్చరతి మన శ్చంచల మస్థిరమ్.
తత స్తతో నియమ్యైత దాత్మ న్యేవ వశం నయేత్. 26

* ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్,
ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూత మకల్మషమ్. 27

యుఞ్జ న్నేవం సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః,
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యన్తం సుఖ మశ్నుతే. 28

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. 29

* యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి. 30

* సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే. 31

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః. 32

అర్జున ఉవాచ :

యోఽయం యోగ స్త్వయా ప్రోక్త స్సామ్యేన మధుసూదన ।
ఏత స్యాహం న పశ్యామి చఞ్చలత్వా త్స్థితిం స్థిరామ్. 33

చఞ్చలం హి మనః కృష్ణ । ప్రమాథి బలవ ద్దృఢమ్,
తస్యాహం నిగ్రహం మన్యే వాయో రివ సుదుష్కరమ్. 34

శ్రీ భగవానువాచ :

అసంశయం మహాబాహో । మనో దుర్నిగ్రహం చలమ్,
అభ్యాసేన తు కౌన్తేయ । వైరాగ్యేణ చ గృహ్యతే. 35

అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః. 36

అర్జున ఉవాచ :

అయతిః శ్రద్ధయోపేతో యోగా చ్చలితమానసః
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ । గచ్ఛతి. 37

కచ్చి న్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి,
అప్రతిష్ఠో మహాబాహో ! విమూఢో బ్రహ్మణః పథి. 38

ఏతం మే సంశయం కృష్ణ ! ఛేత్తు మర్హ స్యశేషతః,
త్వ దన్య స్సంశయ స్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే. 39

శ్రీ భగవానువాచ :

పార్థ ! నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే,
న హి కల్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత ! గచ్ఛతి. 40

ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. 41

అథవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్,
ఏత ద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్. 42

తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్,
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునన్దన ! 43

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః,
జిజ్ఞాసు రపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే. 44

ప్రయత్నా ద్యతమాన స్తు యోగీ సంశుద్ధ కిల్బిషః,
అనేక జన్మ సంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్. 45

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవార్జున ! 46

* యోగినా మపి సర్వేషాం మద్గతే నాన్తరాత్మనా,
శ్రద్ధావా న్భజతే యో మాం స మే యుక్తతమో మతః. 47

# సప్తమోఽధ్యాయః

## విజ్ఞానయోగః

(ఈ అధ్యాయ మంతయు ప్రక్షిప్తము.)

శ్రీ భగవానువాచ :

మ య్యాసక్తమనాః పార్థ ! యోగం యుఞ్జ న్మదాశ్రయః,
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు. 1

జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః,
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్య జ్జ్ఞాతవ్య మవశిష్యతే. 2

మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే,
యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః. 3

భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ,
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా. 4

అప రేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్,
జీవభూతాం మహాబాహో ! యయేదం ధార్యతే జగత్. 5

ఏత ద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ,
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా. 6

మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ !
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ. 7

రసోఽహ మప్సు కౌన్తేయ ! ప్రభాస్మి శశిసూర్యయోః,
ప్రణవ స్సర్వ వేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు. 8

పుణ్యో గన్ధః పృథివ్యాం చ తేజ శ్చాస్మి విభావసౌ,
జీవనం సర్వభూతేషు తప శ్చాస్మి తప స్విషు. 9

బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ ః సనాతనమ్,
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్. 10

బలం బలవతాం చాహం కామరాగ వివర్జితమ్,
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ ః 11

యేచైవ సాత్త్వికా భావా రాజసా స్తామసా శ్చ యే,
మత్త ఏవేతి తా న్విద్ధి న త్వహం తేషు తే మయి. 12

త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వ మిదం జగత్,
మోహితం నాభిజానాతి మా మేభ్యః పర మవ్యయమ్. 13

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మా మేవ యే ప్రపద్య న్తే మాయా మేతాం తర న్తి తే. 14

న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్య న్తే నరాధమాః,
మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః. 15

చతుర్విధా భజ న్తే మాం జనా స్సుకృతినోఽర్జున ః
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ః 16

తేషాం జ్ఞానీ నిత్యయు క్త ఏకభ క్తి ర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః. 17

ఉదారా స్సర్వ ఏవై తే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్,
ఆస్థిత స్స హి యుక్తాత్మా మా మేవాను త్తమాం గతిమ్. 18

బహూనాం జన్మనా మ న్తే జ్ఞానవా న్మాం ప్రపద్యతే,
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః. 19

కామై స్తైస్తైర్హృత జ్ఞానాః ప్రపద్య న్తేఽన్యదేవతాః,
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతా స్స్వయా. 20

